Acc No: 15

# శంకర గ్రంథరత్నావళి

## ఉపదేశసాహస్రి

త్రయోదశ సంపుటము

1990

అనువాదకులు

వ్యాకరణశిరోమణి భాషాప్రవీణ

శ్రీ హరి సాంబశివశాస్త్రి M. A.



ప్రకాశకులు

సాధన గ్రంథమండలి, తెనాలి.

కాపీరైటు :

వెల : రు 35-00

శ్రీ శ్రీ శ్రీ జగద్గురు పుష్పగిరి పీఠాధీశ్వరైః
శ్రీమదభినవోద్దణ్డ విద్యానృసింహభారతీస్వామిభిః
ప్రియాన్తేవాసినః
శ్రీ హరి సాంబశివశాస్త్రిణః కృతే
అనుగ్రహీతా

## ఆశీఃపూర్వక నారాయణస్మరణ పత్రికా

భవద్భి రనూదితః శ్రీ శంకర భగవత్పాద విరచిత 'ఉపదేశ సాహస్రీ' నామక ప్రకరణగ్రంథస్య ఆంధ్రవివరణాత్మకః గ్రంథః అస్మాభి ర్దృష్టః, సాకల్యేన పరిశీలితశ్చ. ప్రస్థానత్రయగత ప్రమేయజాతం అత్ర ప్రకరణగ్రంథే సాధకజనోపయోగార్థం ఏకత్రీకృత మివ ఆభాతి. ప్రమేయబాహుళ్యోపదేశేన అస్య "ఉపదేశ సాహస్రీ" ఇతి నామౌచిత్యం భవద్భిః సమ్యక్ ప్రాదర్శి. శ్రీ సురేశ్వరాచార్య, వాచస్పతి ప్రభృతిభిః పండితప్రకాండైః స్వీయ గ్రంథేషు ఏతత్ప్రకరణ గ్రంథస్థ శ్లోకాః ప్రమాణత్వేన ఉద్ధృతాః – ఇత్యయ మంశః అస్య గ్రన్థస్య ప్రామాణికతాం సమ్యఙ్నిరూపయతి స్మ.

అసంభావనా, విపరీతభావనా నిరాసార్థం ఇతర దార్శనికమతఖండన పూర్వకం శ్రీ శంకరభగవత్పాదైః ప్రకరణ గ్రన్థోఽయం ప్రవర్తితః. అతః, ఇతర ప్రకరణగ్రన్థాపేక్షయా శాస్త్రీయచర్చా విభూషితోఽయం గ్రంథః అతీవ ప్రసన్న గంభీరః. ఏతాదృశ గ్రంథస్య భాషాంతరీకరణం అసిధారావ్రత కల్పమేవ. తథాఽపి ప్రతిభావైదుష్యసంపన్నైః, ఉభయ

భాషావిశారదైః, కూలంకష ప్రజ్ఞాసమలంకృతైః భవద్భిః కృతోఽయ మనువాదః హృదయంగమః, అద్వైత వేదాంత శాస్త్ర సంప్రదాయానుబద్ధః, ముముక్షు జనోపయోగార్థశ్చ. గంభీరోఽపి శాస్త్రీయ విషయః లలిత వాక్యరచనాభిః సమ్యగ్వివేచితః – ఇతి వక్తు మతీవ మోముద్యామహే.

శ్రీ శారదా చంద్రమౌళీశ్వరానుగ్రహేణ ఏతదాంధ్రవివృతికర్తారః భవన్తః, ఏతాదృశ అద్వైత వేదాన్త శాస్త్రగ్రంథ ప్రకాశకాః, సాధనగ్రన్థమండలి వ్యవస్థాపకాః శ్రీ బులుసు సూర్యప్రకాశ శాస్త్రిణశ్చ ఆయు రారోగ్య ఐశ్వర్యాదిభిః వర్ధంతాంతరా మితి ఆశాస్మహే.

ఇతి నారాయణ స్మృతయః

మకాం, తె నా లి,

**1-12-88**

# ఉపదేశసాహస్రి

## పరిచయము.

శ్రీ శంకరులు కవులలో మహాకవి. పండితులలో మహాపండితుడు. మేధావులలో గొప్ప మేధావి. హేతువాదులకు హేతువాది. సర్వతంత్ర స్వతంత్రుడు. వేదవేదాంగవేత్త. మహాయోగి, బ్రహ్మవేత్త. వివిధ సంప్రదాయములకు వేదచోదిత సంప్రదాయానుగుణముగా సమన్వయపఱచిన భారతీయ సంప్రదాయ పరిరక్షకుడు; దార్శనికశిరోమణి.

శ్రీ శంకరులు పండితైకవేద్యము లయిన ప్రస్థానత్రయభాష్యముల రచించి సాధకజనోపయోగార్థమయి పెక్కు ప్రకరణగ్రంథముల రచించిరి. ఇవి ప్రసన్నగంభీరములు. వేదాంతసార సంభృతములు అందు 'ఉపదేశసాహస్రి' యొకటి.

నామౌచిత్యము: ఉపదేశసాహస్రి గద్యపద్యాత్మక భాగద్వయసహితము. గద్యభాగమున మూడు ప్రకరణములు, పద్యభాగమున 19 ప్రకరణములు గలవు.

గద్యభాగమున - వాక్యసంఖ్య 116.
పద్యభాగమున - శ్లోకసంఖ్య 684.
ఉపదేశసాహస్రి ప్రామాణికమైన ప్రకరణగ్రంథము.

శాస్త్రైకదేశవిషయం శాస్త్రకార్యాంతరే స్థితమ్।
ఆహుః ప్రకరణం నామ గ్రంథభేదం మనీషిణః॥

అని యీ విధముగా ప్రకరణగ్రంథలక్షణము నిర్వచింపబడినది. అద్వైత వేదాంతశాస్త్రము బహుముఖము. సాంగోపాంగముగ కర్మ-భక్తి-జ్ఞానయోగస్వరూపములు ప్రస్థానత్రయభాష్యములం దామూలాగ్రముగ చర్చించి నిరూపింపబడినవి. శాస్త్రము గభీర మయిన దగుటచే నెంత వివరించినను సందియములు దొరలుచునే యుండును. జిజ్ఞాసువులగు సాధకుల సందేహముల నివర్తింపజేయుటకై ప్రకరణగ్రంథముల వెలయింప జేయవలసి వచ్చినది. అట్లావిర్భవించిన యీ ప్రకరణగ్రంథము ప్రమేయబాహుళ్యము గలది యగుటజేసి "ఉపదేశసాహస్రి" యను సార్థకనామమువ బరగినది. అంతియే కాని, యిందు సహస్రసంఖ్యాకము లయిన యుపదేశములు వివరింపబడిన వని యర్థము గాదు. పైన వివరించినట్లు యీ గ్రంథము నందలి గద్య-పద్యభాగము లందలి వాక్య-శ్లోకముల సంఖ్య 800 మాత్రమే. అందుచేత ఇట గల "సాహస్రి" యను పదము ప్రమేయబాహుళ్యోపలక్షక మని సంప్రదాయజ్ఞులు చెప్పుదురు.

గ్రంథప్రశస్తి :- ఈప్రకరణగ్రంథశ్లోకములను తరువాతి ఆచార్యులు తమ గ్రంథములలో నుదాహరించుకొనిరి. ఉదా :-

ఉపదేశసాహస్రి - శ్లోకప్రబంధమున షష్ఠప్రకరణము (విశేషాపోహప్రకరణము) నందలి 1 - 2 - 3 - 4 శ్లోకములు సురేశ్వరాచార్యునిచే నైష్కర్మ్యసిద్ధి యను గ్రంథమునందలి చతుర్థాధ్యాయమున పీఠికలో ప్రమాణముగా నుదాహరింపబడినవి.

అట్లే, ఉపదేశసాహస్రి యందలి 15 వ ప్రకరణము (నాన్యదన్యత్ప్రకరణము) న గల....

"దృశ్యత్వా దహ మిత్యేషోఽనాత్మధర్మో ఘటాదివత్
తథాఽన్యే ప్రత్యయా జ్ఞేయా దోషాశ్చాత్మాఽమలోహ్యతః
—16 శ్లో॥

అను నీ శ్లోకము నైష్కర్మ్యసిద్ధియందు 30_వ శ్లోకముగ గ్రహింపబడినది.

ఉపదేశసాహస్రి 18 వ తత్త్వమసిప్రకరణమున గల_ 26, 78, 96, 97, 99, 101, 174, 175, 190, 191, 192, 232, శ్లోకములు నైష్కర్మ్యసిద్ధియందు 43, 20, 22, 23, 24, 25, 34, 35, 31, 32, 33, 65, 66– శ్లోకములుగా గ్రహింపబడినవి.

ఉపదేశసాహస్రి 18 వ ప్రకరణమున గల 121, 174, 175, 176 శ్లోకముల భావము నైష్కర్మ్యసిద్ధి 3 వ అధ్యా. 26, 64 శ్లోకములలో పొందుపఱచబడినది.

అట్లే, బృహదారణ్యకవార్తికమున గూడ నొక శ్లోకము గ్రహింపబడినది. ఈ శ్లోకము విషయమై విచారణీయాంశములు గలవు. ఆ శ్లోక మిది.

"అభిన్నోఽపి హి బుద్ధ్యాత్మా విపర్యాసితదర్శనైః।
గ్రాహ్యగ్రాహక సంవిత్తిభేదవా నివ లక్ష్యతే॥"
—18_తత్త్వమసిప్రకరణ - 142 శ్లో.

ఈ కారిక ద్వితీయపాదమున 'విపర్యాసితబుద్ధిభిః' అను పాఠాంతరముతో బృ. ఉ. వార్తికమున 4-3-476 శ్లోకముగా ఉద్ధృతమైనది. ఆనందజ్ఞానకృత టీక యందు ఈకారిక 'కీర్తి' వాక్యముగా నిర్దేశింపబడినది. కుమారిలభట్టపాదకృత శ్లోకవార్తిక - శూన్యవాద ప్రకరణమున 16 వ కారికా వ్యాఖ్యానమగు న్యాయరత్నాకరము నందును, సర్వదర్శన సంగ్రహమున బౌద్ధదర్శనమునందును ఈ కారిక ఉద్ధృతమైనది. 4-23 యోగసూత్రమును వ్యాఖ్యానించుచు వాచస్పతిమిశ్రుడు తత్త్వవైశారది యందీ కారిక నుదాహరించినాడు. అచటనే వార్తికకారులు - విపర్యాసతి దర్శనే - అను పాఠాంతరముతో నీ కారిక నుద్ధరించిరి.

తత్త్వమసి (18) ప్రకరణము - 143 వ శ్లోకము విషయమై కొంత మీమాంస గలదు. ఆ విషయమును జూతము. ఆ శ్లోక మిది.

"భూతి ర్యేషాం క్రియా సైవ కారకం సైవ చోచ్యతే।"
సత్త్వం నాశిత్వ మస్యా శ్చేత్ సకర్తృత్వం తథేష్యతామ్॥

ఇందు మొదటి పాదము శ్రీశంకరుల రచన గాదు. ఇతరుల వాదము ననువాదము చేయుచు వారి కారికలోని యర్ధభాగమునే గైకొనిరి. ఆ సంపూర్ణకారికను బృ. ఉ. వార్తిక (4-3-494) టీకయందు ఆనందజ్ఞాను లిట్లుదాహరించిరి. ఆ కారిక యెవరిదో నామనిర్దేశము లేదు.

"క్షణికాః సర్వసంస్కారా అస్థిరాణాం కుతః క్రియాః ।
"భూతిర్యేషాం క్రియా సైవ కారకం సైవ చోచ్యతే॥"

ఈ కారిక యందలి రెండవ పాదమునే శ్రీ శంకరులు గ్రహించినట్లు తెలియును. వార్త్తికకారులును (4-3-586శ్లోక) పై కారిక యొక్క ప్రథమపాదమును యథాతథముగ గ్రహించిరి. ఈ కారిక యొక్క ద్వితీయ పాదము వాచస్పతి మిశ్రులు బ్ర.సూ. 2-20 వ్యాఖ్యానించుచు భామతి యందును, 4-20 వ యోగసూత్రమును వ్యాఖ్యానించుచు తత్త్వ వైశారది యందు నుదహరించినాడు. బృ. ఉ. వార్త్తికమున 4-3-753 శ్లోకమున సురేశ్వరాచార్యులు సాక్షాత్తు ధర్మకీర్త్తి యొక్క నామనిర్దేశము చేసినాడు. కారికాప్రథమార్థము తంత్రవార్త్తికము 1-3-10 లో కొలది పాఠభేధముతో నుదాహరింపబడినది. ఈ కారిక సంపూర్ణముగా ప్రజ్ఞాకరకృత బోధిచర్యావతారపంజిక యందుదాహరింపబడినది.

పై కారణముల వలన ధర్మకీర్త్తి కంటె శ్రీ శంకరులర్వాచీను లని కాలక్రమ మాధురీభిక్షువుల యభిప్రాయము.

(చూ. తత్త్వమసిప్రకరణ (18) 143 శ్లోకటిప్పణి)

ఈ యంశ మింకను వివిధకోణముల నుండి పరిశీలింప దగియున్నది. మొత్తము మీద ఉపదేశసాహస్రి ప్రామాణికమయిన ప్రకరణ గ్రంథ మనుట నిర్వివాదము.

**ఉపదేశసాహస్రి - వ్యాఖ్యానములు :**

ఉపదేశసాహస్రికి బోధనిధివిరచిత వ్యాఖ్యయు, ఆనందజ్ఞానవిరచిత వ్యాఖ్యయు, రామతీర్థవిరచిత పదయోజనికా వ్యాఖ్యయు గలవు. అందు బోధనిధివ్యాఖ్య అలభ్యము. ఆనందజ్ఞానవ్యాఖ్య అతిస్వల్పము. మూలగ్రంథగత-అర్థమును

సాకల్యముగ దర్శించుట కుపయుక్తము గాదందురు. అది యిటీవలనే కాశియందు ముద్రితమైనదట. రామతీర్థకృత పదయోజనికా వ్యాఖ్య సాకల్యముగ మూలగ్రంథార్థ దర్శనము చేయించును. ప్రాయికముగ రామతీర్థకృత వ్యాఖ్య నాధారము చేసికొని యీ యాంధ్రవివృతి సాగినది. రామ తీర్థకాలము **1614–1664** A. D.

రామతీర్థకృత రచనలు :

1. మైత్ర్యుపనిషద్దీపికా
2. విద్వన్మనోరంజనీ – వేదాంతసారటీకా
3. అన్వయార్థప్రకాశికా – సంక్షేపశారీరకటీకా
4. పంచీకరణవివరణతత్త్వచంద్రికా
5. మానసోల్లాసవృత్తాన్తః
6. చిదానందలహరీటీకా (అముద్రితము).

ఈ గ్రంథమున గల గద్యభాగమునకు కీ. శే. వేలూరి శివరామశాస్త్రీగారు ఆంధ్రవివరణమును వ్రాసిరి. అంతటితో వారి ఆరోగ్యము వెనుకబట్టుటచే పద్యభాగమునకు ఆంధ్ర వివృతిని వ్రాయు భారము నాపై మోపిరి. వారు సజీవులై యుండగనే ఆంధ్రవివృతిని వ్రాసి వారి యామోదమును పొంద సంకల్పించి వ్రాయ మొదలిడితిని. కాని, నా ప్రయ త్నము పూర్తికాక పూర్వమే కీర్తిశేషు లయిరి. ఇది నాకు తీరని యాశాభంగము కల్పించినది. అయిన నెట్లో యీ బృహత్కార్యమును సద్గురుకృపాబలముచే మిత్రులయొక్కయు

సాధన గ్రంథమండలి వారి యొక్కయు ప్రోత్సాహముతో పూర్తి చేయగలితిని. ఇట్టి యాధ్యాత్మిక గ్రంథములను ప్రకటించి యాధ్యాత్మికౌన్నత్యమును లోకమున ప్రకాశింపజేయు సాధనగ్రంథమండలి వ్యవస్థాపకులు బ్రహ్మశ్రీ బులుసు సూర్యప్రకాశశాస్త్రిగారి కృషి యెంతయు శ్లాఘనీయము. ఈ యాంధ్రవివృతిని వ్రాయుటకు సహకరించుచు, తోడ్పడిన ప్రియమిత్రులు, విద్వాంసులు బ్రహ్మశ్రీ జనస్వామి సుబ్రహ్మణ్యశాస్త్రిగారికి నా హృదయపూర్వకాభినందనలు.

ఇట్లు

తెనాలి
14-1-89

బుధజనవిధేయుడు
హరి సాంబశివశాస్త్రి

శ్రీః

# "ది బుర్రా సూర్యప్రకాశరావు లైబ్రరీ ఆఫ్ శంకర ట్రస్టు"

కీ. శే. బుర్రా వెంకట సుబ్రహ్మణ్యముగారు 1981 సం॥లో తమ తండ్రిగారిపేర దీనిని నెలకొల్పినారు. శ్రీ సుబ్రహ్మణ్యముగారు చిరకాలము ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ అడ్వకేటు జనరలుగా పనిచేసినారు. ఆయన బహుముఖ ప్రజ్ఞాశాలి. న్యాయవాదవృత్తియందేకాక - శంకరాద్వైత వేదాంతమునందు వారికి గల అభిరుచి - అభినివేశము అసాధారణములు. కాని వీరికి శంకరుల మూలగ్రంథములను చదువుకొనుటకు తగినంత సంస్కృత భాషా పరిజ్ఞానము లేదు. అందుచే అధికముగా అనువాదములపై ఆధారపడుచుండువారు. కాని ఎన్నో అనువాద గ్రంథములు సామాన్య వ్యక్తులచే రచింపబడినందున, శంకరాద్వైతమునందు గాఢ పిపాస గల వీరికి తృప్తికి బదులు అసంతృప్తినే కలిగించుచుండెడివి. శంకర వాఙ్మయమునకు మూలానుసారముగా సాగిన అనువాదములు తక్కువ అని వీరు చాల కుందుచుండువారు.

ఈనాడు విశ్వవిద్యాలయముల వంటి పెద్దసంస్థలలో మాత్రమే శంకరవాఙ్మయము సంపూర్ణముగా వివిధానువాద-వ్యాఖ్య - విమర్శగ్రంథములతో ఉపలబ్ధమగుచున్నది. అది అందరకు అందుబాటులో లేదు. సంస్కృత భాషాప్రచారము సన్నగిలినందున క్రమక్రమముగా లోకము ఆదిశంకరుల అద్వైతసిద్ధాంతమునకు దూరమగుచున్నదని గమనించి - శంకరవాఙ్మయము - ఆ వాఙ్మయముపై లెస్సగా సాగిన వ్యాఖ్య-విమర్శ-అనువాద గ్రంథములు-ఏ భాషలోనున్నను

ఒక చోటచేర్చి సురక్షిత మొనర్చి - అద్వైత జ్ఞానపిపాసువులైన పాఠకులు అధ్యయనము చేసికొనుటకు వీలు కల్పించ వలెనని తలంచి శ్రీ వెంకట సుబ్రహ్మణ్యముగారు తమ తండ్రిగారిపేర "ది బుర్రా సూర్యప్రకాశరావు లైబ్రరీ ఆఫ్ శంకరట్రస్టు"ను ఏర్పాటు చేసినారు.

ఆదిశంకరులు రచించిన గ్రంథములనన్నిటిని వానితో భావసామ్యము గల గ్రంథములను, తద్విరుద్ధమైన గ్రంథ ములనుకూడా ఒక గ్రంథాలయముగా అందరకు అందు బాటులో నుంచుటయే ఈ సంస్థలక్ష్యము. ఈ గ్రంథాలయ మును హైదరాబాదులో నెలకొల్పవలె నని తలంపు.

ఇట్టి గ్రంథములను ఈసంస్థకు అందించి, లేదా ఈ గ్రంథములు దొరుకుచోటు తెలిపి సహకరించ వలసినదిగా ఈ లైబ్రరీట్రస్టు అందరను సాంజలిబంధముగ అర్థించుచు ఈ క్రింది చిరునామాకు తెలుపవలసినదిగా కోరుచున్నది.

సాధన గ్రంథ మండలి, తెనాలి వారు శంకర వాఙ్మయ వ్యాప్తికై చేయు అపూర్వ కృషిని ఇంతవరకు ప్రచురించిన సంపుటములను చూచి ప్రభావితమై ప్రస్తుతము తయారగు "ఉపదేశసాహస్రి"కి ఉడతాభక్తిగా సహకరింపగల్గుట భాగ్య విశేషముగా ఈట్రస్టు భావించుచున్నది

1-2-288/1/6
దోమలగూడ
హైదరాబాదు
విభవ కార్తీక బ ౧౦ లు
**1-12-1988**

ఇట్లు
బుర్రా సూర్యప్రకాష్
ట్రస్ట్ ఇన్ మేనేజ్ మెంటు
"ది బుర్రా సూర్యప్రకాశరావు
లైబ్రరీ ఆఫ్ శంకరట్రస్టు

# ఆ మో ద ము

"శ్రుతి స్మృతి పురాణానా మాలయం కరుణాలయం।
నమామి భగవత్పాదశఙ్కరం లోకశఙ్కరమ్॥"

ఆదిశంకరుల అమరకృతులను మూలానువాదముతో ప్రకటించి లోకమున కందీయవలె నను తలంపుతో మా గ్రంథమండలి "శంకరగ్రంథరత్నావళి" పేరుతో నేటివరకు పండ్రెండు సంపుటములను ప్రకటించినది. ఈ 'ఉపదేశసాహస్రి' 13 వ సంపుటము.

శ్రీ శంకరుల ఉపదేశసాహస్రి వారి ప్రకరణగ్రంథము లన్నిటిలో నెన్నదగినది. గద్యముగా - పద్యముగా రెండు విధములుగా నున్న ఈ ఉపదేశసాహస్రి గద్యగ్రంథమును కీ. శే. వేలూరి శివరామశాస్త్రిగారి అనువాదముతో రెండవ సంపుటముగా మే మిదవరకే ప్రచురించియున్నాము.

ఇది శ్రీ ఆదిశంకరులచే శ్లోకరూపమున రచింపబడిన ఉపదేశసాహస్రికి అనువాదగ్రంథము. శంకరుల గ్రంథము లను అనువదించుటకు సాధారణులైన సంస్కృత పండితులు చాలరు. అట్టివారి అనువాదములు అపమార్గమున బడిపోయి పాఠకులను దిఙ్మూఢులను గావించు ప్రమాదమున్నది.

శంకరవాఙ్మయ ప్రచురణకు సమాయత్తమైన మా గ్రంథమండలికి ఉత్తమకోటికి చెందిన పండితులు - సాధకులు - అనువాదకులుగా లభించుట శ్రీశంకరుల కరుణావిశేషముగ భావించుచున్నాము.

శ్రీ నిర్వికల్పానందస్వామివారు, శ్రీ వేలూరి శివరామ శాస్త్రిగారు, శ్రీ హరి సాంబశివశాస్త్రిగారు, శ్రీ సర్వా శివ రామకృష్ణశాస్త్రిగారు, శ్రీ ఈశ్వర సత్యనారాయణశర్మగారు, శ్రీ వేమూరి సీతారామశాస్త్రిగారు, శ్రీ వారణాసి సుబ్ర హ్మణ్యశాస్త్రిగారు, శ్రీ తాడేపల్లి రాఘవనారాయణశాస్త్రి గారు, శ్రీ పోతుకూచి సుబ్రహ్మణ్యశాస్త్రిగారు ఈ విధముగా మహావిద్వాంసులు కోరినంతనే శ్రమయనక శంకరవాఙ్మయ మును అనువదించి యిచ్చుట నిజముగా మా మండలి భాగ్య విశేషము.

ఈ ఉపదేశసాహస్రి అనువాదకులైన బ్ర. శ్రీ. హరి సాంబశివశాస్త్రిగారు "భారతీనిరుక్తి" వంటి మహాగ్రంథ మును రచించిన మహామనీషి. శంకరగ్రంథరత్నావళీ. 3 వ. సంపుటము (అపరోక్షానుభూతి, ప్రబోధసుధాకరము, స్వాత్మ నిరూపణము, శతశ్లోకి, మహావాక్యదర్పణము) శ్రీ శాస్త్రిగారు అనువదించి యిచ్చినదే. శ్రీ శాస్త్రిగారి పాండిత్యము అపా రము. శంకరవాఙ్మయ పాఠకలోకమునకు వారు సుపరిచితులు. ఈ ఉపదేశసాహస్రి నీవిధముగ అనువదించి యిచ్చిన శ్రీ శాస్త్రిగారు, ఉపదేశసాహస్రి - దానిప్రశస్తిని గురించి తమ పరిచయవాక్యములలో విశదీకరించి యున్నారు. వారికి మామండలి హార్దిక ధన్యవాదములు చెప్పుచున్నది.

శంకరవాఙ్మయ ప్రకాశనములో నాకు చేదోడు వాదోడుగా నున్న మిత్రులు, పండితులు నైన శ్రీ జనస్వామి సుబ్రహ్మణ్యశాస్త్రిగారికి మాధన్యవాదములు.

శంకరవాఙ్మయమును ఆదరబుద్ధితో పఠించు పాఠకులకు ఈ గ్రంథము అధికసంతృప్తిని కలిగించగలదనుట నిర్వివాదము.

"ది బుర్రా సూర్యప్రకాశరావు లైబ్రరీ ఆఫ్ శంకర ట్రస్టు" హైదరాబాదు వారు ఈ గ్రంథముద్రణకు తమ ఉదార సహాకారము నందించినారు. వారికి మా మండలి సాదరముగా కృతజ్ఞతలు చెప్పుకొనుచున్నది.

శ్రీ ధవళ శ్రీరామమూర్తిగారు బొంబాయి, శ్రీ వి. గోపాలకృష్ణగారు నల్లజర్ల - ఈ మహానీయులు ఈ గ్రంథ ముద్రణకు యథోచితముగా సహాకరించిరి. వారికి మా కృతజ్ఞతలు.

అనతికాలములో సుందరముగా ముద్రించి యిచ్చిన శ్రీనాథ్ ఆర్ట్ ప్రింటర్స్, తెనాలి వారికి నా కృతజ్ఞతాపూర్వకాభినందనలు. ఎంత జాగ్రత్తగా సరిచూచినను కొన్ని యక్షర స్ఖాలిత్యములు దొరలక మానవు. వానిని సహృదయులగు పాఠకులు మన్నింతురుగాక.

విభవ
హేమంతము
**14-1-1989**

ఇట్లు
బులుసు సూర్యప్రకాశ శాస్త్రి
వ్యవస్థాపకుడు : సాధన గ్రంథ మండలి.

# వి ష య సూ చి

| | | |
|---|---|---|
| 1. | ఉపోద్ఘాత ప్రకరణమ్ | 1 |
| 2. | కర్మసముచ్చయవాదనిరాకరణమ్ | 11 |
| 3. | ఆత్మజ్ఞానోత్పత్తి ప్రకరణమ్ | 24 |
| 4. | ఈశ్వరాత్మ ప్రకరణమ్ | 28 |
| 5. | తత్త్వజ్ఞానస్వభావ ప్రకరణమ్ | 33 |
| 6. | విశేషాపోహ ప్రకరణమ్ | 42 |
| 7. | బుద్ధ్యారూఢ ప్రకరణమ్ | 47 |
| 8. | మతివిలాపన ప్రకరణమ్ | 53 |
| 9, | సూక్ష్మతావ్యాపితా ప్రకరణమ్ | 59 |
| 10. | దృశిస్వరూప పరమార్థదర్శన ప్రకరణమ్ | 70 |
| 11. | ఈక్షితృత్వ ప్రకరణమ్ | 83 |
| 12. | ప్రకాశ ప్రకరణమ్ | 96 |
| 13. | అచాక్షుష్ట్వ ప్రకరణమ్ | 110 |
| 14. | స్వప్నస్మృతి ప్రకరణమ్ | 123 |
| 15. | నాన్యదన్య త్ప్రకరణమ్ | 162 |
| 16. | పార్థివప్రకరణమ్ | 202 |
| 17. | సమ్యఙ్మతి ప్రకరణమ్ | 276 |
| 18. | తత్త్వమసి ప్రకరణమ్ | 320 |
| 19. | భేషజప్రయోగప్రకరణమ్ | 449 |

# స్వరూపానుసన్ధానమ్

దయాలుం గురుం బ్రహ్మనిష్ఠం ప్రశాన్తం
సమారాధ్య భక్త్యా విచార్య స్వరూపమ్ ।
యదాప్నోతి తత్త్వం నిధిధ్యాస్య విద్వాన్
పరం బ్రహ్మ నిత్యం తదేవాహ మస్మి ॥

యదానన్దరూపం ప్రకాశస్వరూపం
నిరస్త ప్రపంచం పరిచ్ఛేదశూన్యం ।
అహం బ్రహ్మవృత్త్యైకగమ్యం తురీయం
పరం బ్రహ్మ నిత్యం తదేవాహ మస్మి ॥

యదజ్ఞానతో భాతి విశ్వం సమస్తం
వినష్టం చ సద్యో యదాత్మప్రబోధే ।
మనోవాగతీతం విశుద్ధం విముక్తం
పరం బ్రహ్మ నిత్యం తదేవాహమస్మి ॥

నిషేధే కృతేనేతి నేతీతివాక్యైః
సమాధిస్థితానాం యదాభాతిపూర్ణమ్ ।
అవస్థాత్రయాతీతమేకం తురీయం
పరం బ్రహ్మ నిత్యం తదేవాహ మస్మి ॥

యదానన్దలేశైః సమానన్దివిశ్వం
యదాభాతిసత్త్వే తదాభాతి సర్వమ్ ।
యదాలోకేన రూప మన్య త్సమస్తం
పరం బ్రహ్మ నిత్యం తదేవాహ మస్మి ॥



శ్రుతి స్మృతి పురాణానా మాలయం కరుణాలయం ।
నమామి భగవత్పాద శఙ్కరం లోకశఙ్కరమ్ ॥

# శంకర గ్రంథరత్నావళి

## ఉపదేశసాహస్రీ

## పద్య ప్రబన్ధః

### ఉపోద్ఘాత ప్రకరణమ్–౧

శ్రీ

శ్లో॥ చైతన్యం సర్వగం సర్వం సర్వభూతగుహాశయమ్।
యత్సర్వవిషయాతీతం తస్మై సర్వవిదే నమః ॥ ౧

తా॥ జ్ఞానస్వరూపుడును, సర్వవ్యాపకుడును, సర్వాత్మకుడును, సర్వప్రాణిగుహావర్తియు, సర్వవిషయాతీతుడు నగుచు ప్రసిద్ధుడైన సర్వజ్ఞమూర్తియగు బ్రహ్మకు నమస్కారము,

విశే॥ సర్వవిత్ = సర్వజ్ఞుడు. సర్వజ్ఞత్వము బ్రహ్మ యొక్క తటస్థలక్షణము. స్వసన్నిధిమాత్రముచేతనే సూర్యుడు లోకమునకు సత్తాస్ఫూర్తులు గలుగజేయునట్లు ఎవని సాన్నిధ్య మాత్రముచేత భూత భవిష్య ద్వర్తమానకాలిక జగత్తునకు సత్తాస్ఫూర్తులు గలుగుచున్నవో యట్టి వాడొకడు సర్వాశ్రయుడు సర్వజ్ఞుడు గలడని తటస్థలక్షణము సిద్ధించుచున్నది.

చైతన్యమ్ = జ్ఞానస్వరూపుడు. ఇది బ్రహ్మయొక్క స్వరూపలక్షణము. ఇందుచే – 'సర్వవిషయ జ్ఞానాశ్రయు

డగుటచే నీశ్వరుడు సర్వజ్ఞుడు' – అని చెప్పెడి వైశేషిక వాదము నిరాకృతము.

సర్వగమ్ = సర్వవ్యాపకుడు, కాన నిష్క్రియుడగుట సూచితము. ఉత్క్రాంత్యాదిధర్మములు లిఙ్గశరీరమునకు సంబంధించినవి కాన బ్రహ్మకు సర్వవ్యాపకత్వము స్వాభావికము.

సర్వమ్=సర్వాత్మకుడు. బ్రహ్మ సర్వజగత్తుకు ఉపాదాన కారణ మగుటచే సర్వాత్మకు డగును. సర్వవ్యాపకుడు, సర్వాత్మకుడు - అని చెప్పుటచే బ్రహ్మ సజాతీయ విజాతీయ స్వగత భేదములు లేని వాడగుట సూచితము.

సర్వభూతగుహాశయమ్ = సర్వప్రాణుల బుద్ధిగుహల యందు సాక్షియై నిర్వికారుడై విరాజిల్లువాడు. 'యో వేద నిహితం గుహాయాం పరమే వ్యోమన్' – తై. ఉ. 2-1: హృద్యన్తర్జ్యోతిః పురుషఃస వా ఏషఆత్మా హృది తస్యైతదేవ నిరుక్తం హృదయ మితి' ఛాం. 8-3-3.

సర్వవిషయాతీతమ్ = అవిద్యను, తత్కార్య మగు విషయజాతము నంతయు అతిక్రమించి వర్తించువాడు. బ్రహ్మ అంతఃకరణాన్తర్వర్తి యయ్యును ఇంద్రియములచేత గాని, అంతఃకరణము చేత గాని ప్రకాశింపజేయబడ డను విషయ మిట సూచితము.

అగ్ని చేత కాష్ఠము ప్రకాశింపజేయబడును, దహింపబడును గాని కాష్ఠముచేత అగ్ని ప్రకాశింపజేయబడదు. దహింపబడదు. అట్లే బ్రహ్మచేత బుద్ధ్యాదీంద్రియములు ప్రకాశింపజేయఁబడును గాని యా బుద్ధ్యాదులచేత బ్రహ్మ ప్రకాశింపజేయ బడదు. కావున బ్రహ్మ సర్వవిషయాతీతుడు.

'యతో వాచో నివర్తన్తే అప్రాప్య మనసా సహ' తై. ఉ. 2.4
'నేతి నేతి' బృ, 2-3-6; నేహ నానాస్తి కించన బృ. 4-4-19

ఇచట సర్వభూత గుహాశయు డను పదముచే అంతఃకరణసాక్షి యగు 'త్వం' పదార్థము చెప్పబడినది, సర్వవిత్ పదముచే 'తత్' పదవాచ్యుడు సర్వజ్ఞుడు నగు బ్రహ్మయు సర్వవిషయాతీత పదముచే తత్ పద లక్ష్య మగు చైతన్యము చెప్పబడినది. మఱియు శ్లోకము నందలి యత్-తత్ శబ్దములచే తత్-త్వం పదములకు సామానాధికరణ్యము చెప్పబడినది. అందువలన వాక్యతాత్పర్యానుగుణముగ తత్-త్వం పదార్థముల కైక్యరూప్య మగు అఖండ చైతన్యరూప వాక్యార్థబోధ ప్రతిపాదిత మగుచున్నది.

మఱియు జీవబ్రహ్మైక్యరూప వాక్యార్థము విషయము అశేషానర్థ నివృత్తిచే నుపలక్షిత మగు నిరతిశయానందస్వరూప బ్రహ్మప్రాప్తియే ప్రయోజనము; అట్టి పరమార్థము నభిలషించు ముముక్షువే అధికారి; చైతన్యంసర్వగం సర్వమిత్యాది విశేషణములు వేదాన్తములయందే ప్రసిద్ధము లగుటచే బ్రహ్మ

కును శాస్త్రమునకును ప్రతిపాద్య ప్రతిపాదక భావ సంబంధము కలదు. ఈ రీతిగా వేదాన్తశాస్త్రీయ విషయాద్యను బంధములు మంగళాచరణ వ్యాజముచే సూచితములైనవి. అందుచే నిది వేదాన్త ప్రకరణ గ్రన్థమనియు విట సూచితము.

అవ. ఇట్లు గ్రంథకారుడు దేవతా నమస్కార వ్యాజముచేత వేదాన్త ప్రతిపాద్యమగు పరదేవతా తత్త్వమును నిరూపించి యిపుడు వేదములు తత్ పరతత్త్వ ప్రతిపాదకములే యని నిరూపించుటకై కర్మకాండ ప్రతిపాదితార్థమును అనువదించి యా కర్మకాండకును జ్ఞానకాండకును గల సంబంధమును చెప్పబూని వేదాన్తము కర్మకాండచే గతార్థము కాదు, ఆ కర్మకాండకు శేషభూతమును గాదని నిరూపించుచున్నాడు,

శ్లో॥ సమాపయ్య క్రియాః సర్వా దారాగ్న్యాధానపూర్వికాః।
బ్రహ్మవిద్యా మథేదానీం వక్తుం వేదః ప్రచక్రమే॥ ౨

తా॥ వేదము అగ్న్యాధానము మున్నగు క్రియలను సమాప్తి నొందించి అనగా కర్మకాండయందు అనుష్ఠేయములగు నిత్య నైమిత్తిక ప్రాయశ్చిత్తో పాసనారూపములగు బ్రహ్మచారి గృహస్థాది సర్వాశ్రమ ప్రయుక్త కర్మలను సమగ్రముగా ప్రతిపాదించి తరువాత సాధనచతుష్టయ సంపన్నుడు, జిజ్ఞాసువునగు ముముక్షువునకు నిపుడు జ్ఞానకాండయందు మోక్షసాధనమగు బ్రహ్మవిద్యను స్వయముగా ప్రతిపాదించుటకు ఉపక్రమించుచున్నది,

వి :– పరమపురుషార్థము నభిలషించుచు పెక్కు యత్నము లొనరించియు ప్రత్యక్షాది ప్రమాణములచేత నది లభింపకపోవుటచే నిర్వేదము చెందు జిజ్ఞాసువులకు మోక్షరూప పరమపురుషార్థము నుపదేశింపనెంచి వేదము ముందు పరమ పురుషార్థసాధనముగా నిత్య నైమిత్తిక ప్రాయశ్చిత్తోపాసనా రూప ధర్మమును కర్మకాండయందు ప్రతిపాదించినది. అందుచే జ్ఞానోత్పత్తి ప్రతిబంధకములగు దురితములను వేదోక్త ధర్మాచరణము చేత నిర్మూలించి చిత్తశుద్ధి నొందగలిగినవారే పరమపురుషార్థమును బొందుటకు ఉత్తమాధికారులు 'ధర్మేణ పాప మపనుదతి' 'అవిద్యయా మృత్యుం తీర్త్వా' ఇత్యాది శ్రుతులును ధర్మాచరణమునకు పరమప్రయోజనము దురిత క్షయ మని కీర్తించినవి. ఆ ధర్మాచరణముచేత లభించు నుత్తమలోకప్రాప్తి మున్నగు ఫలము లానుషంగికములు మాత్రమే "నిత్యేషు శుద్ధిప్రాధాన్యా ద్భోగోఽప్యప్రతిబంధకః భోగం భంగుర మీక్షన్తే బుద్ధి శుద్ధిస్తు రోచతే"–నిత్యకర్మానుష్ఠానముచేత దురితములు నశించి చిత్తశుద్ధి గలుగును. ఇదియే పరమప్రయోజనము. ఈ ధర్మానుష్ఠానము వలన ఆనుషంగికముగా కొన్ని భోగములు సిద్ధించినను అవి చిత్తశుద్ధికి ప్రతిబంధకములు గానేరవు, భోగములు అనిత్యములు గాన చిత్తశుద్ధి రూప ఫలమే అభిలషితము" అని సురేశ్వరాచార్యుడు ధర్మానుష్ఠానమునకు పరమప్రయోజనము చిత్తశుద్ధియే యని స్పష్టముచేసినాడు కావున వేదము చిత్తశుద్ధిఫల ప్రాప్తికై

మొదట కర్మకాండను, తరువాత జ్ఞానకాండను ప్రతిపాదించి ఈ రెంటికి నీవిధముగా హేతు హేతుమద్భావసంబంధమును పౌర్వాపర్య సంబంధమును నిరూపించినది. అందుచే జ్ఞానకాండ కర్మకాండచే గతార్థ మయినదని చెప్పరాదు. ధర్మానుష్ఠానము వలన చిత్తశుద్ధి గలిగి విరక్తుడైన మోక్షార్థికి మాత్రమే సాక్షాత్పరమపురుషార్థ సాధనమగు బ్రహ్మవిద్యను బోధింప జ్ఞానకాండ ప్రవృత్త మగుటచే జ్ఞానకాండ కర్మకాండకు శేష భూతము గూడ కాదు.

అవ :- చాతుర్మాస్యాది కర్మలు కొన్ని అక్షయ్య ఫలజనకములు. వాని నాచరించుటవలననే నిత్యఫలమగు మోక్షము సిద్ధించుచుండుటచే మోక్షప్రాప్తికి బ్రహ్మవిద్య సాధనము గాదు. ఆ విద్యను బడయుటకై జ్ఞానకాండ విచారణ మనావశ్యకము – అనెడి కర్మవాదము నాశంకించి యిట సమాధానము చెప్పబడుచున్నది.

శ్లో॥ కర్మాణి దేహయోగార్థం దేహయోగే ప్రియాప్రియే।
ధ్రువే స్యాతాం తతో రాగో ద్వేషశ్చైవ తతః క్రియాః॥3

తా॥ కర్మానుష్ఠానముచే తత్ఫలమగు భోగము ప్రాప్తించును. కర్మఫలభోగము శరీరసంబంధము లేక యనుభవించుటకు సాధ్యము గాదు గాన భోగఅనుభవమునకై శరీరధారణము అవశ్యము ప్రాప్తమగును. కావున కర్మలు శరీరధారణము కొఱకే, దేహసంబంధము ప్రాప్తము కాగానే ప్రియాప్రియ

ము(సుఖదుఃఖములు) తప్పక కలుగును. తరువాత సుఖ దుఃఖములయందును, తత్సాధనములందును యథాక్రమముగా రాగద్వేషములు సంస్కారరూపములై చిత్తమున నెలకొనును. ఆ రాగద్వేషముల వలననే వాఙ్మనః కాయవ్యాపారములు ప్రవర్తిల్లుచుండును.

శ్లో॥ ధర్మాధర్మౌ తతోఽజ్ఞస్య దేహయోగ స్తథా పునః।
ఏవం నిత్యప్రవృత్తోఽయం సంసార శ్చక్రవద్భృశమ్॥ 8

తా॥ జీవుడు రాగద్వేషవశుడై చేయు విహిత ప్రతిషిద్ధ కర్మాచరణము వలన ధర్మాధర్మములను, తత్ఫలోపభోగార్థమై తిరిగి శరీరధారణమును, తన్మూలమున ప్రియా - ప్రియములను వానివలన రాగద్వేషాదులను కలుగుచుండును. ఇట్లు కర్మా - చరణము కారణముగా అనాదికాలమునుండి యీ జన్మమరణ ప్రవాహరూప సంసారము కులాలచక్రము వలె నిరంతర మావృత్త మగుచున్నది.

వి: - 'న హ వై సశరీరస్య సతః ప్రియాప్రియయో రపహతి ర స్తి' ఛా. 8-12-1. 'సశరీరునకు - అనగా - శరీరతా దాత్మ్యభావన గలవానికి ప్రియాప్రియములు నశింపవు'

'తద్యథేహ కర్మచితో లోకః క్షీయతే ఏవమేవాముత్ర పుణ్యచితో లోకః క్షీయతే' ఛా. 8-1-6, 'లోకమున కర్మ సాధ్యములగు ఘటాదు లనిత్యములై నశించునట్లు పరలోకమున

పుణ్యసముపార్జిత భోగములును నశించును' - ఇట్లు శ్రుతులు కర్మసాధ్య ఫలభోగము లనిత్యములని నిరూపించుటచే 'అక్షయ్యం హ వై చాతుర్మాస్యయాజిన సుకృతమ్' (శత బ్రా. 2.6,3.1,) 'చాతుర్మాస్యక్రియానుష్ఠానముచేయు వానికి అక్షయ్యమగు సుకృతము కలుగును' - ఇత్యాది శ్రుతి వాక్యము లర్థవాదములే యగును కావున కర్మసాధ్యమగు ఫలము నిత్యము గాదు.

అవ;- సంసారము నిత్యప్రవృత్తము కర్మప్రవృత్తికిని తత్ఫలమగు భోగమునకును విచ్ఛేదము లేదు, కర్మనివృత్తిచే మోక్షమెట్లు సిద్ధించును? అను శంకకు సమాధానము చెప్పబడు చున్నది,

శ్లో॥ అజ్ఞానం తస్య మూలం స్యాదితి తద్ధాన మిష్యతే।
బ్రహ్మవిద్యాఽత ఆరబ్ధా తతో నిఃశ్రేయసం భవేత్॥ ౫॥

తా॥ సంసారమునకు మూలము అవిద్య యగుటచే దానిని ప్రయత్నపూర్వకముగా నిర్మూలించుటయే యభిప్రేతము గాన అవిద్యానిర్మూలనహేతువగు బ్రహ్మవిద్య యిచట జ్ఞాన కాండము దారంభింపబడినది. బ్రహ్మవిద్య వలన అవిద్య నశించి నిఃశ్రేయసము (మోక్షము) ప్రాప్తించును.

వి:- అజ్ఞానము సంసారమునకు మూలకారణము. సూర్యోదయానంతరము చీకటులు తొలగునట్లు జ్ఞానోదయ మైనంతనే యవిద్య నశించి కేవలాత్మస్వరూపావస్థానరూపమగు

మోక్షము ప్రాప్తమయినది వలె గన్పట్టునని శ్రుతిస్మృతు లుద్ఘోషించునవి.

'నీహారేణ ప్రావృతా జల్ప్యా చాఽసుతృప ఉక్థశాస శ్చరన్తి'
తై. సం, 4-6-2.

'ఏకః శత్రు ర్నద్వితీయోఽస్తి శత్రు రజ్ఞానతుల్యః పురుషస్య రాజన్। యేనావృతః కురుతే కార్యతేచ ఘోరాణి కర్మాణి
సుదారుణాని' శాం. ప, 3. 3. 28

'తరతి శోక మాత్మవిత్' ఛా. 7, 1. 3.

"యదా చర్మవ దాకాశం వేష్టయిష్యన్తి మానవాః।
తదా దేవ మవిజ్ఞాయ దుఃఖస్యాన్తో భవిష్యతి"॥ శ్వే. ఉ, 6·20,

'జ్ఞానేన తు తదజ్ఞానం యేషాం నాశిత మాత్మనః।
తేషా మాదిత్య వజ్జ్ఞానం ప్రకాశయతి తత్పరమ్॥ భ. గీ. 5.16

శ్లో॥ అవిరోధితయా కర్మ నావిద్యాం వినివర్తయేత్।
విద్యావిద్యాం నిహన్త్యేవ తేజ స్తిమిరసంఘవత్॥ ౩

తా॥ అవిద్యామూలము లగు కర్మలకును అవిద్యకును చీకటివెలుగులకు వలె విరోధము లేదు. కాన కర్మలు అవిద్యను నిర్మూలింపలేవు. విద్యయే అవిద్యానివృత్తిహేతువు. అవిద్య నశించినంతనే తన్మూలమగు సంసారమును నివర్తించును. అజ్ఞానము నశింపనంతవఱకు రాగద్వేషములును అనువృత్తము లగుచుండును. వానికి వినాశముండదు.

శ్లో॥ రాగద్వేషక్షయాభావే కర్మదోషోద్భవం ధ్రువమ్।
తస్మాన్నిఃశ్రేయసార్థాయ విద్యైవాత్ర విధీయతే॥ 2

తా॥ అట్లు రాగద్వేషములు నశింపనందున నా రాగద్వేషములనెడి దోషములవలన తిరిగి వాఙ్మనఃకాయవ్యాపారములు ప్రవర్తిల్లును గాన సంసారపునరావృత్తి దుర్వారమగును. ఆ కారణము వలన మోక్షసిద్ధికి సాధనముగా బ్రహ్మవిద్య యిచ్చట ప్రతిపాదింపబడుచున్నది.

— 0 —

# కర్మసముచ్చయవాద నిరాకరణమ్

శ్లో॥ నను కర్మ తథా నిత్యం కర్తవ్యం జీవనే సతి।
విద్యాయాః సహకారిత్వం మోక్షం ప్రతి హి తద్వ్రజేత్ ॥౧

తా॥ పురుషుడు జీవించియుండునంతవఱకు ప్రకృతిగుణప్రేరితుఁడగుచు నేదియో యొక పనిని జేయక యుండ నేరడు. కాన బ్రహ్మవిద్య యుదయించినను కర్మ యనువర్తించుచుండును. కాన బ్రహ్మవిద్య కర్మసహచరితమయియే యుండును. జ్ఞానకర్మసముచ్చయమే మోక్షమునకు కారణముగాని కేవల జ్ఞానము (బ్రహ్మవిద్య) మోక్షహేతువు కాదు.

బ్రహ్మవిద్యాసంపన్నునకు కర్మలవలన నుపయోగము లేదు గాన నాతడు నిత్యము కర్మల ననుష్ఠింప నక్కఱలేదు. అనియు చెప్పుట పొసగదు, మోక్షసాధనమగు విద్యకు కర్మ సహకారిత్వమును పొందును గాన ముముక్షువు గూడ కర్మల నాచరింపవలెను,

వి :— 'గొడ్డలితో కట్టెలకొట్టవలెను' ఇచట ఛేదన క్రియకు గొడ్డలి కరణము ఎట్లు కొట్టవలెను ? అను ప్రశ్నకు వెంటనే—గొడ్డలిని చేతితో పైకెత్తి వ్రేటువేయుచు కొట్టవలెను, అను సమాధానము వచ్చును. కాన ఛేదనక్రియకును, గొడ్డలిని చేతితో పైకి నెత్తుట వ్రేటువేయుట యనెడి క్రియ

లకును (ఉద్యమన నిపతనాది క్రియలకును) సహకారిత్వము గలదు. ఈ సహకారిత్వమునకు ఇతికర్తవ్యత యని పేరు.

ధర్మాదిక్రియల ననుష్ఠింపవలెనని విధివాక్యము గలదు 'దర్శపూర్ణమాసాభ్యాం స్వర్గకామో యజేత' వీని నెట్లనుష్ఠింపవలెను ? అని యాకాంక్ష కలిగినంతనే "ప్రయాజాద్యంగముల ననుష్ఠించి చేయవలెను." అను సమాధానము వచ్చును. కాన ధర్మాదులకు ప్రయాజాద్యంగములతో సహకారిత్వము గలదు.

అట్లే 'విద్యయాఽమృత మశ్నుతే' 'విద్య చేత' మోక్షము నొందును' ఈ శ్రుతివాక్యమున విద్య కరణము ప్రాప్యము మోక్షము. విద్యచేత మోక్షము నెట్లు పొందవలెను ? అనునాకాంక్ష గలిగినంతనే కర్మలకంటె వేరుసహకారి సామగ్రి లేనందున కర్మలే విద్యకు సహకారులై యుపకరించునని చెప్ప వలెను. ఇట్లు విద్యకు కర్మ సహకారిత్వమును (ఇతికర్తవ్యతను) పొందుచున్నది గాన కర్మసముచ్చితమగు విద్యయే మోక్షసాధనముగాని కేవలవిద్య కాదు. అందుచే ముముక్షువు కూడ కర్మల నాచరింపవలెను.

అవ:– 'కర్మణా బధ్యతే జన్తు ర్విద్యయాఽమృత మశ్నుతే, తస్మాత్కర్మ న కుర్వన్తి యతయః పారదర్శినః' మన్నగు స్మృతిప్రామాణ్యము ననుసరించి జ్ఞానులగు యతులు

బన్ధహేతువగు కర్మల నాచరింప నక్కఱలేదను శంక కిట సమాధానము చెప్పబడుచున్నది.

శ్లో॥ యథా విద్యా తథా కర్మ చోదితత్వావిశేషతః।
ప్రత్యవాయస్మృతేశ్చైవ కార్యం కర్మ ముముక్షుభిః॥ ౯

తా॥ విద్యవలెనే కర్మయు శ్రుతిచోదిత మగుటవలనను, విహితకర్మల నాచరింపనిచో ప్రత్యవాయము గలుగు ననెడి స్మృతి ప్రామాణ్యము వలనను ముముక్షువులు గూడ కర్మల నాచరింపవలెను. (ఇట్లు శ్రుతిస్మృతులతో విరోధము సంభవించుటవలన తస్మాత్కర్మ న కుర్వన్తి యతయః పారదర్శినః" అని పైన పేర్కొన్న స్మృతివచనము కేవల జ్ఞానప్రశంసాపర మని చెప్పవలెను.)

"విద్యాం చావిద్యాం చ యస్తద్వేదోభయఁ సహ।"
(ఈశా. 11)

"అకుర్వన్ విహితం కర్మనిన్దితం సమాచరన్
ప్రసజ్జం శ్చేన్ద్రియార్థేషు నరః పతన మృచ్ఛతి' స్మృతి.

శ్లో॥ నను ధ్రువఫలా విద్యా నాన్యత్కించి దపేక్షతే।
నాగ్నిష్టోమో యథైవాన్య ధ్రువకార్యోఽప్యపేక్షతే॥ ౧౦

తా॥ ఘటాదిజ్ఞానముచే ఘటరూపార్థమువలె బ్రహ్మవిద్యచే అన్యసహాయనిరపేక్షముగనే అపరోక్షాత్మానుభవము (మోక్షము) అవశ్యము గలుగును. కావున ఘటాదిజ్ఞానమువలె

బ్రహ్మవిద్యయు అవశ్యంభావిఫలము గలది యగుటచే అన్య సహాయ మ పేక్షింపదు. (బ్రహ్మవిద్యా - సహకారినిరపేక్షా- ధ్రువఫలత్వాత్: ఘటాదిజ్ఞానవత్) అని చెప్పుదురేని యదియు సరికాదు. బ్రహ్మవిద్యచే మోక్షమువలె జ్యోతిష్టోమయాగముచే స్వర్గరూపఫలముకూడ అవశ్యము సిద్ధించుచున్నది. అయినను జ్యోతిష్టోమము స్వర్గఫలసిద్ధిని కల్గించుటకై ఉద్గీథశస్త్రాదులయొక్కయు, తద్గతదేవతాజ్ఞానముయొక్క యు సహాయము నపేక్షించుచున్నది.

శ్లో॥ తథా ధ్రువఫలా విద్యా కర్మ నిత్య మపేక్షతే।
ఇత్యేవం కేచి దిచ్ఛన్తి, న, కర్మ ప్రతికూలతః॥ ౧౧

తా॥ ఇటు బ్రహ్మవిద్య ధ్రువఫలము కలిగినది యయినను జ్యోతిష్టోమమువలె అన్యకర్మలు సాయమును అపేక్షించును. కాన కర్మసముచ్చిత బ్రహ్మవిద్యయే మోక్షసాధనము గాని కేవలబ్రహ్మవిద్య మోక్షసాధనము గాదని కొందఱు చెప్పుదురు. అది యుక్తము గాదు. వెలుగు వస్తువులు ప్రకాశింపజేయుటకు స్వవిరుద్ధస్వభావముగల చీకటియొక్క సాయమును కోరనట్లు బ్రహ్మవిద్యయు ఆత్మవస్తువును ప్రకాశింపజేయుటకు విరుద్ధస్వభావముగల కర్మయొక్క సాయము నపేక్షింపదు.

శ్లో॥ విద్యాయాః ప్రతికూలం హి కర్మ స్యాత్ సాభిమానతః।
నిర్వికారాత్మబుద్ధిశ్చ విద్యేతీహ ప్రకీర్తితా॥ ౧౨

తా॥ నేను కర్తను గాను, భోక్తను గాను, కూటస్థ బ్రహ్మను' అనెడి నిర్వికార - ఆత్మాకార - అన్తఃకరణవృత్తియే విద్య యని వేదాన్తములయందు కీర్తింపబడినది. కాన వర్ణ ఆశ్రమాద్యభిమానరహితుడగు జ్ఞానియందుండునది విద్య: వర్ణ—ఆశ్రమాద్యభిమానముతో నిండిన పురుషునిచేత నిర్వర్తింపబడునని యాగాదికర్మలు ఇట్లు విద్యాకర్మలు పరస్పర విరుద్ధస్వభావము కలవి యగుటజేసి వానికి తేజస్తిమిరములకు వలె సముచ్చయము సంభవింపదు.

శ్లో॥ అహం కర్తా మమేదం స్యాదితి కర్మ ప్రవర్తతే।
వస్త్వధీనా భవేద్విద్యా కర్త్రధీనో భవేద్విధిః॥ ౧౩

తా॥ నేను కర్తను, ఇది నాది, యనునభిమానమును బురస్కరించుకొని కర్మ ప్రవర్తించును. ఆ క్రియను చేయుటకును, చేయకపోవుటకును, మఱియొకవిధముగా జేయుటకును కర్తకు స్వాతంత్ర్యము గలుగదు, కాన విధి (విధేయము=కర్మ) కర్తయధీనము. జ్ఞానమట్లుకాదు. అది వస్త్వధీనము. కాన జ్ఞానము క్రియవలె కర్తృప్రయత్నసాధ్యము గాదు.

శ్లో॥ కారకాణ్యుపమృద్నాతి విద్యా బుద్ధిమివోషరే।
ఇతి తత్సత్యమాదాయ కర్మ కర్తుం వ్యవస్యతి॥ ౧౪

తా॥ మరుభూమియందు భ్రాన్తివశమున గలిగెడి యుదక బుద్ధిని 'ఇది జలముకాదు మరుభూమియే' యనెడి యథార్థ

జ్ఞానము పోగొట్టునట్లు ఆత్మయందు అవిద్యవలన కల్పింపబడిన కర్తృత్వభోక్తృత్వాదిరూప కారకబుద్ధిని నిర్విశేష ఆత్మాకార అన్తఃకరణవృత్తి (విద్య) పోగొట్టును. విద్యచే నిర్మూలితమైన కారకబుద్ధిని (నేను కర్తను, భోక్తను అనెడి బుద్ధిని) సత్యముగా గ్రహించి జ్ఞాని కర్మల నాచరించుటకు నెట్లు పూనుకొనును? (విద్యచే కర్తృత్వబుద్ధి నశించి కర్తయే లేనప్పుడిక క్రియ యెక్కడిది?)

శ్లో॥ విరుద్ధత్వా దతః శక్యం కర్మ కర్తుం న విద్యయా।
సహైవ విదుషా తస్మాత్కర్మ హేయం ముముక్షుణా॥ ౧౦

తా॥ ఇట్లు విద్యాకర్మలకు పరస్పరవిరోధ ముండుట వలన బ్రహ్మజ్ఞాని విద్యతోపాటు కర్మల జాచరించుటకు శక్యము గాదు. అందుచే ముముక్షువు కర్మల సంన్యసింపవలెను.

శ్లో॥ దేహాద్యై ష్వవిశేషేణ దేహినో గ్రహణం నిజమ్।
ప్రాణినాం తదవిద్యోత్థం తావత్కర్మవిధి ర్భవేత్॥ ౧౧

తా॥ జీవుడు యథార్థముగా కూటస్థ - ఆత్మస్వరూపు డయ్యును, అవిద్యావశు డగుచు, 'నేను దేహేన్ద్రియ మనోబుద్ధి ప్రాణ తద్ధర్మ విశిష్టుడను. ఇదియే నా స్వాభావిక రూపము. ఇది నాకు ఆగంతుకము గాదు,' అని యెంతకాలము దృఢముగా తలపోయుచు దేహ వర్ణాశ్రమాద్యభిమానముచే నుండునో యంతవఱకు నాతడు కర్మకాండయందు వర్ణాశ్రమాద్యధికారము

ననుసరించి విధింపబడి నిత్యనైమిత్తిక కర్మలయం దధికారము కల్గి యుండును. స్వర్గ పశు పుత్రాది కామనాప్రేరితుండగుచు నా యా శ్రుతిచోదితకర్మల నాచరించుచుండును. కాన బ్రహ్మవిద్య యుదయింప నంతవఱకు కర్మకాండ ప్రమాణమె యగును.

నేతి నేతీతి దేహాదీ నపోహ్యాత్మావశేషితః।
అవిశేషాత్మబోధార్థం తేనావిద్యా నివర్తితా॥ ౧౭

తా॥ మిథ్యాదృష్టిచే ఆత్మస్వరూపములుగను, ఆత్మీయ స్వరూపములుగను భావింపబడుచున్న దేహేన్ద్రియాదులను 'ఇదియాత్మకాదు, ఇది యాత్మకాదు (నేతి నేతి) అనుచు శ్రుతి నిషేధించినది. ఇట్లు అసత్యములగు దేహేన్ద్రియాదులు నిషేధింపబడగా తుదకు త్రికాలాబాధిత సత్యస్వరూపుడగు ఆత్మయే మిగిలెను. ఇట్లు నిషేధించుటవలని ప్రయోజనము నిషేధావధిభూతుడగు ఆత్మయొక్క స్వరూపానుభవము గలుగుటయే. అట్లు విద్యచే నిర్విశేషాత్మస్వరూపమగు నంతఃకరణ వృత్తి (విద్య) యుదయించినంతనే అవిద్య తిరోహిత మగును. అవిద్య రూపుమాసినంతనే తన్మూలమగు దేహాద్యభిమానమును, దానివలన నేర్పడు కర్మాధికారమును తొలగిపోవును.

అట్టిస్థితి యందు కర్మకాండ ప్రమాణము గానేరదు.

నివృత్తా సా కథం భూయః ప్రసూయేత ప్రమాణతః।
అసత్యేవావిశేషేఽపి ప్రత్యగాత్మని కేవలే॥ ౧౮

తా॥ రజ్జుసర్పభ్రాన్తి యొకమారు తొలగినను మఱియొక మారు గలుగవచ్చును. అట్లే అవిద్య నశించియు తిరిగి తల యెత్తవచ్చు నను శంకకును తావు లేదు.

అగ్నిచే దహింపబడి మృతిచెందినవారు పునరుజ్జీవితు లగుట యసంభవము. కాన జ్ఞానాగ్నిదగ్ధమై రూపుచెడిన యవిద్య, యే నిమిత్తమువలన తిరిగి తలయెత్తును? ఆత్మయే నిమిత్త మందురా? అట్టిస్థితిలో అసహాయుడు అద్వితీయుడు కూటస్థుడు నగు ఆత్మకు కర్తృత్వమే లేదు. ఆత్మవలన అవిద్య యెట్లుదయించును? నిర్నిమిత్తముగానే యుదయించిన దనుట కూడదు కాన, అవిద్యాన్తర సహాయముతో నాత్మ యీయవిద్యను సృష్టించె నని చెప్పెద మన్నను, నా యవిద్య కేది నిమిత్తము దానికి తిరిగి అవిద్యాన్తరము నిమిత్తమునుగా గల్పించుచు బోయినచో అనవస్థాదోషము ప్రాప్తమగును. అట్లుగాక యనాత్మయే యవిద్యాపునరుత్థానమునకు కారణ మగునని చెప్పెదు రేని అవిద్యాకార్యములగు అనాత్మపదార్థములు అవిద్య కెట్లు కారణము లగును? కాన జ్ఞానాగ్నిదగ్ధమై అవిద్య నిర్మూల మగుటచే దానికి (నిర్వి

శేష(ప్రత్యగాత్మయందు) తిరిగి ఉత్థానము (సత్త) సంభవము గాదు. రజ్జుసర్పభ్రాన్తిస్థలమున అవిద్యాశక్తిభేదమగు సర్పాది విక్షేపోపాదానాంశమునకు మాత్రమే నాశము గలుగును గాని మూలాజ్ఞానము నివర్తింపదు. కావున నచట తిరిగి భ్రాన్తి కలుగుట కవకాశమున్నది.

న చేదూ్యయః ప్రసూయేత కర్తా భోక్తేతి ధీః కథమ్।
సదస్మీతి చ విజ్ఞానే తస్మాద్విద్యాఽసహాయికా॥ ౧౯

తా॥ 'నేను సద్రూపబ్రహ్మను' అని యపరోక్షాత్మాను భవము కలిగినంతనే యవిద్య నశించి తిరిగి యిక పొడసూప నిచో 'నేను కర్తను; భోక్తను' అనెడి కర్మాధికారనిమిత్త మగు బుద్ధి యిట్లుదయించును? కర్తృత్వము అవిద్యాకల్పి తము గాదు; స్వాభావికమే యని యందురేని స్వాభావికమైన కర్తృత్వమున కెన్నడు నాశముండదు. కర్తృత్వము నశింప నిచో మోక్షమెన్నడు ప్రాప్తింపదు. కాన కర్మసముచ్చితము గాని కేవల విద్యయే మోక్షహేతువు.

అత్యరేచయ దిత్యుక్తో న్యాసః శ్రుత్యాఽత ఏవ హి।
కర్మభ్యో మానసాన్తేభ్య ఏతావదితి వాజినామ్॥ ౨౦

అమృతత్వం శ్రుతం యస్మాత్త్యాజ్యం కర్మ ముముక్షుభిః।

తా॥ తైత్తిరీయోపనిషత్తులందు, 'సత్యం పరం పరం సత్య'

మని యుపక్రమించి, 'సత్యం తపః' అని సత్యము మొదలు మానసాన్తములగు కర్మలను శ్రేయస్సాధనములుగా నిర్దేశించి 'తాని వా ఏతా న్యవరాణి తపాంసి' -ఇవి యల్పఫలములని వానిని నిందించి తుదకు 'న్యాస ఇతి బ్రహ్మేత్యుక్తో న్యాస ఏవాత్యరేచయత్' -అని బ్రహ్మజ్ఞానమునకు ముఖ్యసాధనముగా కర్మసన్న్యాసము కీర్తింపబడెను. కాన కర్మసన్న్యాససహితమగు విద్యయే మోక్షసాధనము.

మఱియు బృహదారణ్యకోపనిషత్తునందు, 'ఆత్మని ఖల్వరే దృష్టే శ్రుతే మతే విజ్ఞాత ఇదం సర్వం విదిత' మ్మని యుపక్రమించి అద్వయాత్మతత్త్వమును దుందుభ్యాది దృష్టాంతములతో నిరూపించి 'ఉక్తానుశాసనాఽసి మైత్రేయ్యేతావదరే ఖల్వమృతత్వ' మ్మని విద్యయే యమృతత్వ (మోక్ష) సాధనముగా చెప్పఁబడెను. ఇంకను శ్రుతి 'అమృతత్వస్య తు నాశాస్తి విత్తేన' యని విత్తసాధ్యమగు కర్మ మోక్షసాధనము గాదని తిరస్కరించినది.

అయితే 'విద్యాం చావిద్యాం చ' యని పూర్వ ముదాహరింపబడిన శ్రుతి జ్ఞాన కర్మ సముచ్చయమును బోధించినది గదా! యని యందురేమో! అది దేవతోపాసన రూప జ్ఞానకర్మసముచ్చయపరము కాని విద్యాకర్మసముచ్చయ ప్రతిపాదకము కాదు.

ఇట్లు శ్రుతులు కర్మసన్న్యాసోపలక్షితజ్ఞానమే ముక్తి సాధన మని పెక్కురీతుల కీర్తించుటచే ముముక్షువులు కర్మల సన్న్యసింపవలెను.

అగ్నిష్టోమవదిత్యుక్తం తత్రేద మభిధీయతే॥ ౨౧
నైకకారకసాధ్యత్వా త్ఫలాన్యత్వాచ్చ కర్మణః।
విద్యా తద్విపరీతాఽతో దృష్టాన్తో విషమో భవేత్॥ ౨౨

తా॥ అగ్నిష్టోమాదులు ధ్రువఫలములయ్యును ఉద్గీథ శస్త్రాది క్రియాసహకార మపేక్షించునట్లే బ్రహ్మవిద్యయు కర్మసహకారము నపేక్షించు ననుచు పూర్వము చేసిన యాక్షేపమున కిపుడు సమాధానము చెప్పబడును.

అగ్నిష్టోమాదికర్మల నాచరించుటకు పెక్కుమంది ఋత్విక్కులును, నియతములగు ద్రవ్య - మన్త్ర - తన్త్ర ప్రయోగము లనేకములు నావశ్యకములు. మఱియు 'యదేవ విద్యయా కరోతి శ్రద్ధయోపనిషదా తదేవ వీర్యవత్తరం భవతి' -"ఆత్మస్వరూపము నెఱిగి శ్రద్ధతో జేయబడెడి కర్మ వీర్యవత్తరమగుననుచు శ్రుతి సాధారణ కర్మకంటె విద్య ద్వారా కర్మకు వీర్యవత్తర ఫలవిశేషము ప్రాప్తమగు ననుచు కర్మకు విద్యాసహకారము వలన గలుగు విశేషప్రయోజన మును పేర్కొనినది. కాన కర్మకు సాధారణఫలము, విశేష

ఫలము అని ఫలభేదము కలదు. విద్య, కర్మవలె కర్తృప్రయత్నాధీనమై, అనియతఫలమును గల్పింపదు. అదివస్త్వాధీనము; మోక్షైకఫలము గలది. ఇట్లు విద్య కర్మకంటె విపరీతస్వభావము కలది యగుటచే అగ్నిష్టోమదృష్టాంతము సరిపోదు. అందుచే విద్యకు కర్మసహాకార మపేక్షితము గాదు.

కృష్యాదివత్ఫలార్థత్వా దన్య కర్మోపబృంహణమ్।
అగ్నిష్టోమ స్త్వపేక్షేత; విద్యా ఽన్యత్కిమపేక్షతే॥ ౨౩

తా॥ కృషివాణిజ్యాదులయందు ఫలాతిశయ సిద్ధికై సాధనాంతర కర్మాపేక్ష యున్నట్లు, అగ్నిష్టోమాదులయందును ఫలవిశేషప్రాప్తికై సాధనవిశేషాపేక్ష యుండును. (అగ్నిష్టోమః, సాతిశయః. సాధ్యఫలార్థత్వాత్, కృష్యాదివత్) బ్రహ్మవిద్యచే ప్రాప్తించు మోక్షము సాతిశయము గాదు; అది నిరతిశయము. ఇట్లు నిరతిశయఫలము గలిగిన బ్రహ్మవిద్య సాతిశయఫలములను బోధించెడి కర్మల సహాయము నెట్లు అపేక్షించును?

ప్రత్యవాయ స్తు తస్యైవ యస్యాహఙ్కార ఇష్యతే।
అహఙ్కారఫలార్థిత్వే విద్యేతే నాత్మవేదినః॥ ౨౪

తా॥ నేను కర్తను, భోక్తను అనెడి యహంకారము ఎవనికి స్వాభావికముగ నుండునో అట్టియతడే కర్మలయందు అధికారముగలిగి వర్తించుచుండును. అహంకారవశంవదులగు

కర్మాధికారులకే విహితకర్మల నాచరింపకపోవుట వలని ప్రత్యవాయము గలుగును గాని, నిష్కాముడై అహంకారవర్జితుడగు ఆత్మజ్ఞానికి కర్మాధికార మెక్కడిది? కర్మాధికారమే లేనివానికి, విహితకర్మల ననుష్ఠింపకపోవుటవలన కలిగెడి ప్రత్యవాయ మెక్కడిది?

తస్మా దజ్ఞానహానాయ సంసారవినివృత్తయే।
బ్రహ్మవిద్యావిధానాయ ప్రారబ్ధోపనిషత్త్వియమ్॥ ౨౫

తా॥ క్లేశమూల సంసారమునకు గారణమైన అవిద్యయొక్క వినివృత్తికొఱకై బ్రహ్మవిద్య అపేక్షితమగుచుండుటచే అట్టి బ్రహ్మవిద్యాస్వరూపమును దర్శింపజేయుటకై ఈయుపనిషద్భాగ ముపక్రాన్తమైనది.

సదే రుప నిపూర్వస్య క్విపి చోపనిషద్భవేత్।
మన్దీకరణభావాచ్చ గర్భాదేః శాతనాత్తథా॥ ౨౬

తా॥ 'ఉప-ని' యనెడి ఉపసర్గద్వయ పూర్వకమగు 'షద్ల' విశరణ-గతి-అవసాదనేషు అను ధాతువునకు 'క్విప్' ప్రత్యయాన్తరూపము 'ఉపనిషత్' అగును. దీనికి మూడర్థములు గలవు.

1. 'యే మన్దబ్రహ్మవిదః తేషాం గర్భ జన్మ జరాదికం ఉపనిషాదయతి- శిథిలీకరోతీత్యుపనిషత్' -ఎవరు స్వల్పముగ

నైన బ్రహ్మస్వరూపము నెఱుఁగ జాలుదురో అట్టివారికి గర్భ- జన్మ- జరా- రోగాది కష్టముల శిథిలము చేయుచుండుటచే 'ఉపనిషత్' అని చెప్పబడుచున్నది.

2. 'జిజ్ఞాసోశ్చ ఉప-సమీపే, ని-శ్చయేన బ్రహ్మ గమయతి' జిజ్ఞాసువును నిశ్చయముగా పరబ్రహ్మను పొందింప చేయుచున్నది కనుక 'ఉపనిషత్' అని చెప్పబడుచున్నది.

3. 'తత్త్వవిదాం తు గర్భాది నాశయత్యేవ' -తత్త్వవేత్తలగువారి యొక్క- సంసారకారణమగు అవిద్యాదికమును మిక్కిలి నశింపజేయునది కాన 'ఉపనిషత్' అని చెప్పబడుచున్నది.

కాన ఉపనిషత్తనగా బ్రహ్మవిద్యయే. తదర్థమై ప్రవృత్తములగు గ్రంథములును ఔపచారికముగా ఉపనిషత్తులని పిలువబడుచున్నవి.

ఉపోద్ఘాత ప్రకరణము సమాప్తము

:o:

# ఆత్మజ్ఞానోత్పత్తి ప్రకరణమ్ ౨

ప్రతిషేద్ధు మశక్యత్వా న్నేతి నేతీతి శేషితమ్।
ఇదం నాహ మిదం నాహ మిత్యద్ధా ప్రతిపద్యతే॥ ౧

తా॥ 'నేతి నేతీ'త్యాది వాక్యములచే "ఇది నేను కాను, ఇది నేను కా"ననుచు సకల దృశ్య ప్రతిషేధము చేయబడగా, దృశ్య విలక్షణమై ప్రత్యక్త త్త్వము నిషేధమునకు అవధిభూత మగుటవలనను, నిషేధించువాని స్వరూపమె యగుటవలనను నిషేధమునకు సాక్షీభూత మగుటవలనను నిషేధింపబడుటకు శక్యముగాక శేషించియుండునో, 'దేహేన్ద్రియ ప్రాణ మనో బుద్ధ్యాది విలక్షణ మగుచు వానిని ప్రకాశింపజేయునట్టిదియు, కూటస్థము, సమస్తజగదాధారము, అక్షరస్వరూపము నగు ఆ యాత్మతత్త్వము 'నేను' అను అపరోక్షానుభవము నిస్సంశయముగా కలుగును.. కావున ప్రత్యక్షాది ప్రమాణములు బలవత్తరములై యుండ బ్రహ్మవిద్య యెట్లుదయించు ననెడి శంక కిట తావు లేదు.

అహంధీ రిద మాత్మోత్థా వాచారంభణగోచరా।
నిషిద్ధాత్మోద్భవత్వా త్సా న పున ర్మానతాం వ్రజేత్॥౨

తా॥ అనాత్మలగు దేహాదులయం దుదయించు ఆత్మబుద్ధికి అహంకారము (అహంధీః) అని పేరు. ఈయహంకారము 'ఇది నేను, ఇది నేను' అనెడి దేహాదితాదాత్మ్యభావనావాసనా వాసితాంతఃకరణ రూపమగు 'ఇదమాత్మ' నుండి యుదయించును గనుక అధ్యాసాత్మక మగును.

ఏది వాస్తవముగా లేనిది యయ్యును దృశ్యముగా గోచరించుచు ప్రత్యక్షవ్యవహారమై యుండునో యట్టి అనృత -జడ -అనాత్మరూపము వాచారమ్భణము. అదియే యహంకారము (అహంబుద్ధి) నకు విషయ మగుచు భాసించు చుండును.

మఱియునీయహంకారము, నేతినేతీత్యాది వాక్యములచే నేవి నిషేధింపబడినవో యట్టి నిషిద్ధ దేహేంద్రియాద్యాత్మ భావనామూలమున నుదయించునట్టిది. కాన నిట్టి 'యహం' బుద్ధి బ్రహ్మవిద్య యుదయించువరకు మాత్రమె సకల ప్రమాణభూతమై విరాజిల్లుచునుండి బ్రహ్మవిద్య యుదయించి నంతనే స్వప్నజ్ఞానము వలె వస్తుత్వము గోల్పోయి నామ రూపములు లేకుండ బోవును. కావున నీయహంకారము ఆత్మస్వరూపజ్ఞానాన్తరము ప్రమాణము కాజాలదు.

పూర్వబుద్ధిమబాధిత్వా నోత్తరా జాయతే మతిః।
దృశిరేకః స్వయంసిద్ధః ఫలత్వాత్స న బాధ్యతే॥ 3

తా॥ శుక్తియొక్క అజ్ఞానము వలన గలిగెడి రజత బుద్ధిని బాధింపక శుక్తిజ్ఞా ముదయింపనట్లు పూర్వోత్పన్నమగు కర్తృత్వ భోక్తృత్వాదిరూప బుద్ధిని బాధింపక ఉత్తర కాలికమగు ఆత్మజ్ఞాన ముదయింపదు. కాన కర్తృత్వాది జ్ఞానము బాధ్యము. ఆత్మజ్ఞానము బాధకము; ఈ యాత్మ

జ్ఞానము దేనిచేతను బాధింపబడదు. ఏలయన బ్రహ్మాత్మాకార అన్తఃకరణవృత్తి ప్రతిఫలిత చిత్ప్రకాశమునకు 'దృశి' (ద్రష్ట) యనిపేరు. ద్రష్ట యొకడే. అద్వితీయుడు; స్వయంసిద్ధుడు -అనగాఅన్యనిరపేక్ష సత్తాస్ఫూర్తులు గలవాడు; ఫలరూపుడు అట్టి యీ ద్రష్ట సర్వజ్ఞాన సాధారణు డగుట వలనను, సర్వ వ్యవహారహేతువగు బుద్ధిని ప్రకాశింప చేయువాడగుట వలనను దేనిచేతను బాధింపబడడు.

విశే :— ద్రష్ట నిత్యసిద్ధు డయ్యును విషయాకారవృత్తి యందు చిత్స్వరూపమున నభివ్యక్తు డగుచుండుటం జేసి ఫల రూపుడుగ నిట కీర్తింపబడెను. సాధ్యక్రియాఫలములకు బాధ యుండును గాని నిత్యసిద్ధ ఫలరూపుడగు ఆత్మకు బాధ కలుగ నేరదని భావము.

ఇదం వన మతిక్రమ్య శోకమోహాది దూషితమ్।
వనా ద్గాంధారకో యద్వ త్స్వాత్మానం ప్రతిపద్యతే॥ ౪

తా॥ తస్కరులు కళ్ళకు గంతలు గట్టి గాంధారదేశవాసి యగు పురుషుని బలాత్కారముగా గొనితెచ్చి మహారణ్య మధ్యమున పడవైచి పోయినపు డాతడు బంధమోక్షముల నర్థించుచు, ఆక్రోశించుచు నుండగా నొకానొక మహాత్మునిచే బంధవిముక్తుడయి యాతని యుపదేశము చొప్పున నొక గ్రామమునుండి మఱియొక గ్రామమునకు బోవుచు పండితుడు

మేధావియు నగువాడు తుదకు మహావనమునుండి నిజస్థానమగు గాంధార దేశమునే చేరుకొనును. అటులనే సంసారియగు నీ జీవుని అవిద్యారాగాది తస్కరులు మిథ్యాజ్ఞానపటముచే వివేకదృష్టి నాచ్ఛాదించి స్వరూపప్రచ్యావితుని గావించి స్వదేశమునుండి గొనితెచ్చి శోక-మోహాదిదూషిత మగు నీ దేహారణ్యమున బడవైచినపు డాతడు బంధమోక్షముల నర్థించుచు నాక్రోశించుచుండగా పరమకారుణికుడు బ్రహ్మవేత్తయు నగు నాచార్యుని వలన మిథ్యాదృష్టి బంధముల విడనాడి ఆయనయుపదేశముచే ప్రబోధింపబడి దేహారణ్యమును విడిచి క్రమముగా స్వదేశబ్రహ్మమార్గమున అన్వయ-వ్యతిరేక-దృష్టాంతముల ద్వారా పయనించుచు తుదకు స్వాత్మస్వరూపమును పొందును.

ఆత్మజ్ఞానోత్పత్తి ప్రకరణము సమాప్తము

:o:

## ఈశ్వరాత్మ ప్రకరణమ్ 3

ఈశ్వరశ్చే దనాత్మా స్యా న్నాసా వస్మీతి ధారయేత్ ।
ఆత్మా చే దీశ్వరో ఽస్మీతి విద్యా సాఽన్యనివర్తికా॥ ౧

తా॥ జగత్కారణముగా నుపలక్షితుడును, పర

మాత్మయు, సత్య -జ్ఞాన -అనంత - ఆనందరూపుడును నగు ఈశ్వరుడు ఘటాదివస్తువులవలె ఆత్మభిన్ను డగుచో పరోక్ష వ్యవహారయోగ్యు డగును. అందుచే ముముక్షువు 'ఆ యీశ్వరుడె 'నేను' అను అపరోక్షానుభవము నొందజాలడు. దానివలన తత్త్వమస్యాది వాక్యవిరోధమును, "ఆత్మేతి తూప గచ్ఛన్తి గ్రాహయన్తి చ" (బ్ర. సూ. 4 1-3) యనెడి న్యాయవిరోధమును ప్రసక్తములగును. అట్లుగాక 'ఈశ్వరుడె ఆత్మస్వరూపుడగు 'నేను' అని ముముక్షువు తెలిసికొనినపుడు శ్రుతి-న్యాయవిరోధములు తొలగుటయే గాక, బ్రహ్మవిద్య స్వప్రతికూలమగు నవిద్యను తత్కార్యమగు సంసారముతో పాటు సమూలముగ నశింపజేయును. "బ్రహ్మవేద బ్రహ్మైవ భవతి", "బ్రహ్మైవ సన్ బ్రహ్మాప్యేతి" త్యాది శ్రుతులు బ్రహ్మజ్ఞానమునకు బ్రహ్మభావఫలమునే కీర్తించుటచే శ్రుతులకు 'ఈశ్వరాత్మాభేదమునందె తాత్పర్యము పర్యవసన్నము కాని భేదమునందు కాదు' అని తెలియుచున్నది.

ఆత్మనోఽన్యస్య చే ద్ధర్మా అస్థూలత్వాదయో మతాః।
అజ్ఞేయత్వేఽస్య కిం తైః స్యా దాత్మత్వే
త్వన్యధీహ్నుతిః॥ ౨

తా॥ శ్రుతులయందు "అస్థూల మనణ్వహ్రస్వ మదీర్ఘ మలోహిత మస్నేహ మచ్ఛాయ మతమో ఽవాయ్వనాకాశ

మసజ్గ మరస మగన్ధ మచక్షుష్క మశ్రోత్ర మవాగమనో౽తేజస్క మప్రాణ మముఖ మమాత్ర మన న్తర మబాహ్యం న తదశ్నాతి కిఞ్చన న తదశ్నాతి కశ్చన –”(బృ. 3. 8. 8.) అని యీశ్వరస్వరూప వర్ణనము చేయబడి యున్నది. ఈ వాక్యమునందు పేర్కొనబడిన అస్థూలత్వాదిధర్మములు ఆత్మ కంటె భిన్నుడగు ఈశ్వరునకు సంబంధించినవి యగుచో ఈశ్వరుడును అనాత్మయే యగుటచే జ్ఞేయుడు (ద్రష్టవ్యః) కాకపోవలసివచ్చును. అగుచో నట్టి అజ్ఞేయుడగు ఈశ్వరుని యొక్క అస్థూలత్వాది ధర్మములతో ముముక్షువునకు బని యేమి? ఏలయన, “ఆత్మావా౽రే ద్రష్టవ్యశ్శ్రోతవ్యోమ న్తవ్యో నిదిధ్యాసితవ్యః” యనుచు శ్రుతి ఆత్మస్వరూపమునే జ్ఞేయముగా బేర్కొనినది.

అట్లుగాక ‘అస్థూలత్వాదిధర్మములు గల ఈశ్వరుడను నేనె’ యని ముముక్షువెపుడు తెలిసికొనునో యపుడు, ఈశ్వరుడును ఆత్మస్వరూపుడై యగుటచే జ్ఞేయుడగును. మఱియు నపుడు ముముక్షువు అజ్ఞాన మోహమూలములైన కృశ-స్థూలత్వాది ధర్మములు అనాత్మ దేహాదిధర్మములుగా నెఱుగుటచే వానికి (కృశస్థూలత్వాది ధర్మములకు) బాధ కలుగును.

మిథ్యాధ్యాసనిషేధార్థం తతో౽స్థూలాది గృహ్యతామ్।
పరత్రచే న్నిషేధార్థం శూన్యతావర్ణనం హి తత్॥ 3

తా॥ అందువలన అజ్ఞానమూలమగు మిథ్యాధ్యాసచే తనయందు గల్పింపబడెడి కృశ స్థూలత్వాది ధర్మముల నిషేధించుటకొఱకె అస్థూలత్వాదులు ఈశ్వరాత్మధర్మములుగా శ్రుతులయందు పేర్కొనబడినవని గ్రహించునది. అట్లుగాక అస్థూలత్వాదులు స్వాత్మభిన్నుడగు నీశ్వరునియందు గల స్థూలత్వాది ధర్మముల నిషేధించుటకే శ్రుతులు ప్రవృత్తము లయినవని చెప్పుచో నపుడానిషేధము శూన్యతావర్ణనమో యగును. ఏలయన- ఆత్మకంటె భిన్నమయిన దంతయు జడము. జడమునకు స్థౌల్యాది ధర్మయోగము సహజము. 'ఈశ్వరుడును ఆత్మభిన్నుడని చెప్పితిరి' -కాన జడప్రాయుడు కావలయును. కావున స్థౌల్యధర్మయోగము ఈశ్వరునకు సహజసిద్ధమని యంగీకరింపవలసివచ్చును. అట్టియెడల స్థూలత్వాది ధర్మనిషేధము ఈశ్వరునియెడ ప్రసక్తము కాక వ్యర్థము కావలసివచ్చును. కావున' శ్రుతియందు ఉపక్రమోపసంహారములచే ఈశ్వరుడె యాత్మ యని సిద్ధాంతము చేయుట వలనను, అస్థూలత్వాదిధర్మములు అనాత్మధర్మములని చెప్ప వలనుపడనందువలనను మిథ్యాధ్యాసచే ఆత్మయందు ఆరోపితము లయిన స్థూలత్వాది అనాత్మధర్మములను నిషేధించుట కొఱకె 'అస్థూల మనణు' ఇత్యాది శ్రుతి వాక్యములు ప్రవృత్తము లయినవని చెప్పుట యెంతయు సమంజసము.

బుభుక్షో సర్వది చాన్యత్ర ప్రత్యగాత్మన ఇష్యతే।
అప్రాణో హ్యమనాః శుభ్ర ఇతి చానర్థకం వచః॥ ౮

తా॥ మఱియు ప్రత్యగాత్మకంటె భిన్నుడగు ఈశ్వరుని యందు స్థూలత్వాది ధర్మనిషేధము కొఱకె 'అస్థూల మనణు' ఇత్యాది శ్రుతులు ప్రవృత్తము లయినవని చెప్పుచో అప్రాప్త ప్రతిషేధమను దోషము ప్రాప్తమై "అప్రాణోహ్యమనాః శుభ్రః" ఇత్యాది శ్రుతివాక్యములు ప్రత్యగాత్మ తత్త్వము నెఱుగగోరు ముముక్షువు పట్ల వ్యర్థము లగును. ఏలయన సంసారిత్వాభిమానము గలిగి యాత్మతత్త్వము నెఱుగగోరు ఆత్మ (జీవుని) కంటె భిన్నమగు దేనికిని దేహేంద్రియ మనో బుద్ధులతో గాని తద్ధర్మములతో గాని సంబంధముండదు. ఇట్టి తరి "అప్రాణో హ్యమానాః శుభ్రః" యని శ్రుతి ప్రాణ మన స్తద్ధర్మనిషేధము వేనికి చేయును? కావున నిషేధవాక్యము అనర్థకమును, నిర్విషయమును కావలసివచ్చును. కావున తత్త్వమస్యాది వాక్యములచే 'అస్థూలత్వ, -అప్రాణత్వ- అమనస్త్వాది ధర్మములు గల ఈశ్వరుడను నేను' అని ముము క్షువు తెలిసికొనినపుడు అజ్ఞానమూలకమగు మిథ్యాధ్యాసచే తనయందారోపితము లయిన కృశ-స్థూలత్వాది ధర్మము లను, సప్రాణత్వ సమనస్త్వాది ధర్మములను నిషేధించుట కొఱకె పై నిషేధవాక్యములు ప్రవృత్తములయినవని చెప్పుట శ్రుతి న్యాయసమ్మతము అగును.

అహం(ప్రత్యయబీజం య దహం ప్రత్యయవ త్థ్సితమ్ ।
నాహం(ప్రత్యయదహ్న్యష్టం కథం కర్మ ప్రరోహతి ॥

తా॥ దేహ తాదాత్మ్యాభిమానమును, కర్తృత్వాద్యభిమానమును కలిగినవాడె కర్మయం దధికారి యగును. కాన దేహ తాదాత్మ్యాభిమానముతో నిండిన యహంకారమె కర్మబీజము. అట్టి యహంకార వాసనావాసితమగు నంతఃకరణమున కర్మ సంచితమగుచుండును. అట్టి కర్మజాతము 'నేను కర్తను కాను; భోక్తను కాను; బ్రహ్మమె' యనెడి బ్రహ్మాకారాంతఃకరణ రూప యగు బ్రహ్మవిద్య చే దగ్ధమగుచు (నిర్బీజమగుచు) తిరిగి ఫలోన్ముఖమెట్లు కాగలుగును?

"క్షీయన్తే యస్య కర్మాణి తస్మిన్ దృష్టే
పరావరే" (ము. )

"జ్ఞానాగ్ని స్సర్వకర్మాణి భస్మసాత్కురుతే
తథా" (భ. )

దృష్టవచ్చే త్ప్రరోహః స్యా న్నానన్యకర్మా స ఇష్యతే ।
తన్నిరోధే కథం తత్స్యాత్ పృచ్ఛామో వ
స్తదుచ్యతామ్ ॥

దేహోద్యారమ్భహేమార్థ్యాజ్ఞానం సద్విషయం త్వయి।
అభిభూయ ఫలం కుర్యా త్కర్మాన్తే జ్ఞాన ముద్భవేత్॥ 3

తా॥ కర్మలు జ్ఞానాగ్నిదగ్ధము లయి నిర్బీజము లగునని చెప్పుట యుక్తిసహము కాదు. జ్ఞాని చేయు భిక్షాటనాది కర్మలు ఫలసహితము లయి కన్పట్టుచున్నవి కదా! కాన జ్ఞానిచేయు కర్మలు నిర్బీజములు, నిష్ఫలములును కాక అదృష్ట ఫల-జనకములని చెప్పుట యుక్తిసహ మగును. జ్ఞాని యొనర్చు భిక్షాటనాది కర్మలు జ్ఞానమున కవిరుద్ధము లగుటచే తను, ప్రారబ్ధ కర్మ ఫలభూతమగు దేహమును నిలుపుట కవి యావశ్యకము లగుటచేతను, జ్ఞానికృతము లగునట్టి కర్మలు సఫలములని యంగీకరింప వచ్చును గాని అన్యకర్మలవిషయమున నట్లు చెప్పుట యుక్తము కాదందురేని మఱియొక దోషము ప్రసక్తమగును. అది యెట్లన జ్ఞానముచే నజ్ఞాన నివృత్తియు, అజ్ఞాన నివృత్తిచే తన్మూలమగు నహంకారనివృత్తియు, అహంకార నివృత్తిచే తదాశ్రయములగు కర్మలకును, నివృత్తి కలుగుచుండ జ్ఞానికి ప్రారబ్ధకర్మ యనుగత మగుననియు, తత్ఫలభూత దేహధారణకై భిక్షాటనాది కర్మప్రవృత్తి గలుగుననియు బ్రహ్మవాది చెప్పెడి జీవన్ముక్తుని జీవధారణవిధానము ఎట్లు సంగత మగునో చెప్పవలసియుండును.

పై పూర్వపక్షమునకు సమాధానము

బ్రహ్మవిద్యాసంపన్నునకు విదేహకైవల్యము ప్రాప్తముకాక దేహ మనువృత్త మగుచుండుట జేసి బ్రహ్మవిద్యచే సంచిత ఆగామి కర్మలన్నియు నశించును గాని ప్రారబ్ధకర్మ మాత్రము నశింపదని యంగీకరింపవలయును. కావుననే ప్రారబ్ధకర్మ, ప్రబలవేదాంతవాక్యజనిత బ్రహ్మాత్మవిషయమగు జ్ఞానమును గూడ నెదుర్కొనుచు జ్ఞానిని విదేహకైవల్యరూపమగు ఫలమును పొందకుండ నిరోధించి యాతనికి స్వఫలమగు దేహాభాస-జగదాభాసరూప విక్షేపజ్ఞానమును కలిగించును. దేహధారణకై భిక్షాటనాది కార్యములయందు జ్ఞానిని సైతము ప్రవర్తింపజేయుచుండును. (అయితే జ్ఞాని కర్తృత్వ భోక్తృత్వాద్యభిమానము, రాగద్వేషాదులు లేనివాడు కాన యాతడు చేయు కర్మలు కర్మలు గావు.) ఆ ప్రారబ్ధకర్మ, ఫలభోగానంతరము నశింపగనే జ్ఞానము ప్రతిబంధరహిత మగుచు సహజప్రభలతో నావిర్భవించి అవిద్యాలేశమును గూడ మిగులనీయక విద్వాంసుని (జ్ఞానిని) స్వారాజ్యమున నభిషిక్తుని గావించును.

ఆరబ్ధస్య ఫలే హ్యేతే భోగో జ్ఞానం చ కర్మణః ।
అవిరోధ స్తయో ర్యుక్తో వైధర్మ్యం చేతరస్య తు ॥ ౪

తా॥ జీవన్ముక్తునకు అనారబ్ధకర్మలు, తత్ఫలములును నశించును. కాని యేశరీరము నాశ్రయించి జీవన్ముక్తునకు ఈ

బ్రహ్మాత్మజ్ఞానము సమకూరెనో ఆ శరీరమునకు కారణమగు ప్రారబ్ధకర్మతోగాని, తత్ఫలమగు భోగముతో గాని జ్ఞానమున కెట్టి విరోధము లేదు. కాన జ్ఞానముచే ప్రారబ్ధకర్మ నాశ మొందింపబడదు. ఇతర అనారబ్ధ ఫలములగు సంచిత ఆగామి కర్మలు అకర్తృ ఆత్మతత్త్వజ్ఞానోదయమునకు విరోధహేతువు లగుటచేతను, జ్ఞానికి కర్తృస్వభావము నివృత్తమగుటచేతను వానికి జ్ఞానముతో సహావస్థానము కుదరదు. ఇట్లు జ్ఞానమునకు ప్రారబ్ధకర్మలతో సాధర్మ్యమున్నట్లు అనారబ్ధ ఫలములగు కర్మలతో సాధర్మ్యము లేనందువలన, వైధర్మ్యముగల అనా రబ్ధఫలములగు కర్మలను జ్ఞానము నశింపజేయును గాని తనతో సాధర్మ్యముగల ప్రారబ్ధకర్మను నశింపజేయదు. కనుక దేహ పాతపర్యంతము ఆరబ్ధకర్మఫలములగు భోగ-జ్ఞానముల రెంటిని జీవన్ముక్తుడు ఏకకాలమున అనుభవించుచుండును.

దేహాత్మజ్ఞానవ జ్జ్ఞానం దేహాత్మజ్ఞానబాధకమ్ ।
ఆత్మన్యేవ భవే ద్యస్య స నేచ్ఛన్నపి ముచ్యతే ।
తతః సర్వమిదం సిద్ధం ప్రయోగోఽస్మాభిరీరితః ॥ ౫

తా॥ జ్ఞానికి దేహారంభక కర్మ నిబంధనమగు భోగము కలుగునని యంగీకరించునెడ నాతని కెప్పుడైనను దేహాత్మాభి మానము కలుగుట సంభవము గాన నా యభిమానము వలన కలిగెడి దురితప్రతిబంధము వలన మోక్షమునకు ప్రతిబంధము

కలుగవచ్చు ననెడి శంక కిట సమాధానము చెప్పబడుచున్నది.

అవివేకియొక్క దేహాత్మ జ్ఞానముచే ఆత్మ యాథార్థ్య జ్ఞానము ప్రతిబంధింపబడి మరుగుపడుచున్నది. ఏ జ్ఞానము ప్రబలముగ నుండునో దానిచే దుర్బలమగు జ్ఞానము ప్రతిబంధింపబడుచుండుట లోక-న్యాయ సిద్ధము. తత్త్వజ్ఞానియొక్క ఆత్మ యాథార్థ్యజ్ఞానముచే దేహాద్యాత్మజ్ఞానము ప్రతిబంధింపబడునని యవశ్యము చెప్పవలెను. జ్ఞానముచే దేహాత్మజ్ఞానము ప్రతిబంధింపబడినంతనే జ్ఞానికి దేహాత్మాభిమానము తిరిగి తలయెత్తుటకేమాత్ర మవకాశముండదు. ఇష్టమున్నను లేకున్నను నాతనికి మోక్షము సిద్ధించుటలో ఎట్టి ప్రతిబంధము నుండదు. కావున జీవన్ముక్తుని విషయమున జ్ఞానమునకును, ప్రారబ్ధకర్మకును సహావస్థానముండుటలో నెట్టి విరోధము లేదని చెప్పినదంతయు సోపపత్తికమె యగుచున్నది.

## బుద్ధ్యపరాధప్రకరణమ్ ౫

మూత్రాశజో యథోదజో నాగ్రహీ దమృతం యథా।
కర్మనాశభయా జ్జన్తో రాత్మజ్ఞానాగ్రహ స్తథా॥ ౧

తా॥ ఉదంకుడను మహర్షి చండాలమూత్రమను శంకతో ప్రత్యక్షముగ నుపలబ్ధము, యథార్థము నగు నమృత

మును జూచియు నే నభిలషించిన యమృత మిది కాదని స్వ
జాతినాశభయముచే తిరస్కరించి త్రోసివేసినట్లు, లోకమున
కర్మఠులగు ప్రాణులును కర్మనాశభయముచే ప్రత్యక్షోపలబ్ధము
యథార్థభూతము నగు ఆత్మజ్ఞానామృతమును గ్రహింపక
తిరస్కరించి త్రోసివేయుచుందురు. ఇట్లు పదార్థస్వరూప
అజ్ఞానముచేతను, విపరీత జ్ఞానము చేతను శ్రుతిబోధితమగు
నాత్మస్వరూపమును లోకులు గ్రహింపకయున్నారు.

విశే :- పూర్వము ఉదంకుడను మహర్షి అమృతము
కొరకై తపమొనరించెను. శ్రీమహావిష్ణువు ఆతని తపముచే
ప్రీతుడయి యామహర్షి కమృతము నీయవలసినదని దేవేంద్రుని
యాదేశించెను. ఇంద్రుడా దేవదేవుని యానతి పాలింప సమ
కట్టియు నుదంకున కమృతపానము సిద్ధింపకూడదను
నసూయతో చండాలవేషమును దాల్చి యా యమృత కల
శమును స్వమూత్రాశయ స్థానమున నిలిపి 'ఇదిగో యమృత
కలశము; గైకొను' మని కోరెను. కాని యుదంకుడు 'ఇది
చండాల మూత్రము; దీనిని గ్రహించుచో స్వజాతినాశము
వాటిల్లు' ననెడి శంకతో (విపరీతజ్ఞానముతో) గ్రహింపక తిర
స్కరించెనని యైతిహ్యము కలదు.

బుద్ధిస్థ శ్చలతీవాత్మా 'ధ్యాయతీవ' చ దృశ్యతే।
నౌగతస్య యథా వృక్షా స్తద్వ త్సంసారవిభ్రమః ॥ ౨

నౌస్థస్య ప్రాతిలోమ్యేన నగానాం గమనం యథా ।
ఆత్మనః సంసృతి స్తద్వ ద్ధ్యాయతీ వేతి హి శ్రుతిః ॥ 3

తా॥ జీవుడు యథార్థమగు స్వ స్వరూపమునెఱుగక అవివేకివలె సంసారమున భ్రమించుచుండుట కిచట కారణము చెప్పబడుచున్నది.

జీవుడు అనాద్యవిద్యావశుడయి బుద్ధితాదాత్మ్యాభిమానముతో చరించునపుడు రాగద్వేషాదులతో బుద్ధి చలించినంతనె ఆత్మయు చలించినట్లుగను, ధ్యానించుచు నిశ్చలముగ నున్నపుడు ఆత్మయు నిశ్చలముగ నున్నట్లును భాసించును గాని వాస్తవముగ ఆత్మకు చలనము లేనందున నైశ్చల్యమును లేదు. కాని భ్రాంతిచే బుద్ధిగతధర్మములె ఆత్మయందు నారోపింపబడుచున్నవి. అ న్య ధ ర్మ ము ల నన్యత్ర, యారోపించుటయే అధ్యాస కదా. నావికునకు నావయందు తానునిజముగ పయనముచేయుచున్ననునిశ్చలముగనున్నట్లును, తీరమున నిశ్చలముగ నున్న వృక్షాదులు మఱియొక దిశవైపు, పరుగిడిపోవుచున్నట్లును ప్రత్యక్షముగ కన్పట్టును. అనగా తీరగత వృక్షాదులయొక్క నైశ్చల్యము నావికునియందును నావికునియొక్క చలనాదులు వృక్షములందును ఇట ఆరోపింపబడినవి. అట్లే చిదాభాసుడగు జీవుడు బుద్ధియను నౌకను అధిష్ఠించి పయనముచేయుచు బుద్ధిగత చలన- నైశ్చల్యాదు

లను తనయం దారోపించుకొని ధ్యానించువానివలెను, విలపించువానివలెను కన్పట్టుచుండునని శ్రుతి ప్రతిపాదించినది. "స సమానః స న్నుభౌ లోకా వనుసంచరతి ధ్యాయతీవ లీలాయతీవ"॥ (బృ. 4. 3. 7.)

చైతన్యప్రతిబిమ్బేన వ్యాప్తో బోధో హి జాయతే।
బుద్ధేః శబ్దాదినిర్భాస స్తేన మోముహ్యతే జగత్॥ ౮

తా॥ చైతన్యప్రతిబింబ మనగా చిదాభాసుడు, (జీవుడు) బుద్ధి చైతన్యప్రతిబింబముచే వ్యాప్తము కాగానే ఘటాదివిష యాకారముగా పరిణామము చెందును. అపుడు శబ్దాదివిష యావభాసము గలుగుచుండును. ఇట్లు ఒకే బుద్ధియందు చైతన్యము, దేహాదివిషయములు సంశ్లేషమిథునీభావము నొంది వర్తించుచుండుటచే జనులు చైతన్యమును ఘటాది విషయములకంటె వేఱుగను, దేహాదివిషయములను చైతన్యముకంటె భిన్నముగను తెలిసికొనలేక మోహాపర వశులగుచు అన్యధర్మముల నన్యమునం దారోపించుచు వర్తించుచుందురు. ఈయధ్యాసయే సంసారిత్వవిభ్రమమునకు కారణము. అనగా అసంసారియగు నాత్మకు ఉపాధిసామర్థ్యము వలన సంసారిత్వాదులు ప్రాప్తము లయినట్లు గోచరించు చుండును". తద్గుణ సారత్వాత్తు తద్వ్యపదేశంః; ప్రాజ్ఞవత్" (బ్ర. సూ. 2. 3. 29.)

చైతన్యభాస్యతాఽహమ స్తాదర్థ్యం చ తదస్య యత్।
ఇదమంశ ప్రహాణేన పరః సోఽనుభవో భవేత్॥ ౫౪

తా॥ బుద్ధియందు చైతన్యము, దేహాదిజడవిషయములును మిథునీభావము చెందుచుండును. ఈ సత్యానృత మిథునీకరణమే లోకవ్యవహార మూలమని పైన చెప్పబడినది. సత్యానృతమిథునీభావరూపమే యహంకారము. కావుననే 'అహంకారము చిదచిద్గ్రంథిరూప మ'ని చెప్పుదురు. ఇందలి చిదంశము అహమంశరూపము; జడాత్మకమగు అచిదంశము ఇదమంశాత్మకము. ఇదమంశాత్మకములగు దేహాదులు పర-చైతన్యప్రకాశ్యములు. ఇట్లు అచిదంశము చైతన్యముచే భాసింపజేయఁబడుచు నాచిదాత్మకు ఘటాదివిషయముల సమర్పించుచు (ఆత్మార్థమగుచు) తచ్ఛేషభూతమగుచున్నది. వివేకియగువాడు 'ఇది చిదంశము; ఇదిమిథ్యాభూతమగు అచిదంశము' అని స్పష్టముగ తెలిసికొనినంతనే ఆయహంకార గ్రంథి వీడిపోవును. అనగా ఆయహంకారమునకు చైతన్య భాస్యత్వము, తాదర్థ్యము అను నీరెండును అటిస్థితియందుండవు ఆగ్రంథి వీడుటచే నహంకారము యథాపూర్వముగ ఘటాది విషయములను యథార్థములుగా చిదాత్మకు దర్శింపచేయలేక నిర్వీర్యమగును. అపుడు అహంకారాతిరిక్తుడును,

అహంకారమునకు సాక్షిభూతుడు నగు పరాత్మయొక్క అనుభవము తత్త్వజ్ఞానికి కలుగును.

## విశేషాపోహ ప్రకరణమ్ ౬

ఛిత్వా త్యక్తేన హస్తేన స్వయం నాత్మా విశేష్యతే।
తథా శిష్టేన సర్వేణ యేన యేన విశేష్యతే॥ ౧

తస్మా త్త్యక్తేన హస్తేన తుల్యం సర్వం విశేషణమ్।
అనాత్మత్వేన తస్మాజ్ఞో ముక్తః సర్వైర్విశేషణైః॥ ౨

తా॥ 'నేను కరచరణాదివిశిష్టుడ' ననెడి విశిష్టబుద్ధిలో కరచరణాదులు విశేషణములు, నేను అనునది విశేష్యము. ఇచట విశేషణభూతములైన కరచరణాదులు ఆత్మస్వరూప భూతములగునా? కావా? అనునది ప్రశ్న: విశేషణభూత పదార్థములెపుడును వస్తుస్వరూపభూతములు కావనుట లోక-న్యాయసిద్ధము. ఎట్లనగా :- కాలుసేతులు తెగి యావల పడి యున్నపుడు వానిని గలుపుకొని 'నేను కరచరణాదివిశిష్టుడ' నని యెవడును వ్యవహరింపడు. తెగిపడియున్న, కాలు సేతులను ఆత్మస్వరూప బహిర్భూతములుగనే (అనాత్మలుగనె) దర్శించును. కాన విశేషణభూతములగు హస్త పాదాదులు వస్తురూపభూతములు కావనుట నిస్సంశయము.

అట్లే 'నేను దేహేంద్రియాదివిశిష్టుడను; మనుష్యత్వ- గృహస్థత్వాది ధర్మవిశిష్టుడ' ననెడి విశిష్టబుద్ధిలో 'నేను' (ఆత్మ) విశేష్యము; దేహేంద్రియాదులు, మనుష్యత్వ- గృహస్థత్వాదులు విశేషణములు. విశేషణభూతములగు భిన్నహస్త పాదాదులు ఆత్మస్వరూపమున చేరని యట్లే, జ్ఞానఖడ్గముచే భిన్నములయిన దేహేంద్రియాదులుగాని,మనుష్యత్వ-గృహస్థత్వాదులు గాని ఆత్మస్వరూప బహిర్భూతములే (అనాత్మలె) యగును గాని ఆత్మస్వరూపమున జేరవు. తత్త్వజ్ఞాని 'నేను దేహేంద్రియాది విశిష్టుడను; మనుష్యుడను; గృహస్థుడను అనెడి విశిష్ట (సవికల్ప) బుద్ధులకు లోనుగాక 'అహం బ్రహ్మాస్మి' యని మాత్రమే యనుకొనును. కాన ఆత్మ సర్వ విశేషణవిముక్తుడు.

విశేషణమిదం సర్వం సాధ్వలఙ్కరణం యథా।
అవిద్యాధ్యాసతః సర్వం జ్ఞాత ఆత్మన్యసద్భవేత్॥ 3

తా॥ పైన చూపిన న్యాయము ననుసరించి 'విశేషణములనాత్మభూతము లయినను ఆత్మకు వానితో వియోగము ఎన్నడు సంభవింపదు' అనియు ననరాదు. అంగుళీయకాద్యలంకారములతో దేహమునకు సంబంధమున్నను వానితో తాదాత్మ్యముగాని, తద్ధర్మాపన్నతగాని యుండదు. అవి యొకపుడు ఉండవచ్చును; మఱియొకపుడు పోవచ్చును. కాన

అలంకారాదులతో దేహమునకు నిత్యసంబంధము లేనట్లే ఆత్మకును దేహాదులతో నిత్యసంబంధము లేదు. ఈ సంబంధము అవిద్యచే అధ్యాసవశమున కల్పిత మయినదని తత్త్వజ్ఞాని యెఱుగును. ఇట్లు సంబంధము అవిద్యా- అధ్యాస- అధీనమగుటచేఆత్మస్వరూపము తెలియబడగనే 'త్రికాలాబాధ్యమగు సత్యము ఆత్మయే; తద్భిన్నము అసద్రూపము; బాధితము' అను నిశ్చయజ్ఞానము కలుగును. కాన యాత్మ సర్వవిశేషణ విముక్తుడు.

> జ్ఞాతైవాత్మా సదా గ్రాహ్యో జ్ఞేయ ముత్సృజ్య కేవలః।
> అహమిత్యపి యద్గ్రాహ్యం వ్యపేతాఙ్గసమం హి తత్॥ ౮

తా॥ పైన 'జ్ఞాతే ఆత్మని' అని ఆత్మ జ్ఞేయునుగా పేర్కొనబడెను. అట్లగుచో 'ఘటాదులయందు వలె ఆత్మయందును 'జ్ఞేయత్వ' మను ధర్మ మాపతిత మగుచున్నది. జ్ఞేయత్వము సంగీకరించనిచో విశేషణాదులకు వలె ఆత్మకును అనాత్మత్వము చెప్పవలసియుండును' అని యందురేని యట్లు కాదు. తత్త్వజ్ఞాని 'జ్ఞేయస్వరూపము సర్వము మిథ్య యని చక్కగ తెలిసికొని ఆ జ్ఞేయమును ప్రకాశింపజేయువాడును, దర్శించువాడును -అనగా జ్ఞాత ఆత్మయే యనియు, జ్ఞేయ విలక్షణ కేవలాత్మస్వరూపము (జ్ఞాతయగు ఆత్మ) నేనే' యనియు నెఱుగును. మఱియు జాగ్రత్స్వప్నసుషుప్తులయందు

అనుస్యూతముగ నుండునది ఆత్మస్వరూపము గాని యహంకారము గాదు. సుషుప్తియం దహంకారము ఛిన్నమై తిరోహిత మగుచుండుటచే ఛిన్నహస్తాది విశేషణములవలె అది అనాత్మయే యగును కాని ఆత్మస్వరూపభూతము కాదు. అహంకారము 'అహం'శబ్దవాచ్య మయ్యును ఛిన్నాంగసదృశ మగుటచే ఆత్మస్వరూప బహిర్భూతమే యగును. కాన, 'అహం' శబ్దవాచ్యమగు అహంకారము జ్ఞేయము, దృశ్యము; 'అహం' పదోపలక్షితుడగు ఆత్మ జ్ఞాత- అని యిట్లు జ్ఞాతృ-జ్ఞేయస్వరూపవివేచనము చక్కగ చేసికొనినచో 'ఆత్మ జ్ఞాతయే గాని, జ్ఞేయము కాదు' అను విషయము నిర్వివాదాంశమగును.

ద్యూవానాన్య దిదమంశో యః స స్వతోఽన్యో
విశేషణమ్।
విశేషప్రత్యయో యత్ర సిద్ధో జ్ఞ శ్చిత్రగు ర్యథా॥ ౫

తా॥ పైన చెప్పినట్లు 'ఆత్మ చక్షురాదులకు విషయము గాక 'అహం' ప్రత్యయ గోచరుడును కాకపోయినచో నిక ఆత్మస్వరూపము దేనికి గోచరమగును అనగా ఆత్మసిద్ధి యెట్లు అని సందేహింపబనిలేదు. విశేషణము లనాత్మలయ్యును విశేష్యమును స్ఫురింపజేయుచుండుట యనుభవసిద్ధము. ఎట్లన :- 'చిత్రగుః దేవదత్తః'. చిత్రములగు గోవులు గల

వాడు దేవదత్తుడని యర్థము. ఇచట చిత్రగోవులు విశేషణము. తద్విశిష్టుడగు దేవదత్తుడు విశేష్యము. ఇట దేవదత్తుడు చిత్రములగు గోవులకంటె అన్యుడు. చిత్రగోవులతో సంబంధము కలుగకపూర్వము గూడ నున్నాడు. అనగా అతని యునికి చిత్రగోసంబంధాధీనము కాదు. కాన దేవదత్తుడు స్వయంసిద్ధుడు. దేవదత్తుడు తన యునికికి (స్వసిద్ధికి) చిత్రగోసంబంధము నపేక్షింపని యట్లే అహంకారాదివిశిష్టుడగు నాత్మయు తన యునికికై అహంకారాదిసంబంధము నపేక్షింపక ఆ యహంకారాది సంబంధము కలుగుటకు పూర్వమే స్వయంసిద్ధుడయి వెలుగొందుచున్నాడని యంగీకరింపవలెను. కాన, చైతన్యభాస్యమును, 'ఇద'మంశరూపమును నగు అహంకారరూపవిశేషణముకంటె పరుడయి, స్వయంసిద్ధుడయి, నిర్విశేషచిన్మాత్రరూపుడయి ఆత్మ సర్వదా భాసించుచుండును. కనుక ఆత్మసిద్ధి యన్యాధీనము కాదని శ్రుతులు బోధించుచున్నవి.

ఇదమంశో ఽహ మిత్యత్ర త్యాజ్యో నాత్మేతి పణ్డితైః।
అహం బ్రహ్మేతి శిష్టాంశో భూతపూర్వగతే ర్భవేత్॥ ౨

తా॥ అహంశబ్దవాచ్యము అహంకారమే యగుచో 'అహం బ్రహ్మాస్మి' యతి తాదాత్మ్యమును బోధించు శ్రుతి యెట్లు ఉపపన్న మగునని యందురేని, అహంకారము చిదచిద్గ్రంథిరూపమని చెప్పబడినది గదా. అందు అచిదంశ

రూపము దృశ్యము, జడము నగుటవలన ఆత్మ కాదని నిశ్చయించి యాయంశమును పండితులు (జ్ఞానులు) పరిత్యజింతురు. అందలి చిదంశము మాత్రమే ఆత్మ యనియు, అది బ్రహ్మాభిన్న మనియు శాస్త్రముచే నెఱిగి, కేవలము 'అహం' ప్రత్యయ గోచరమగు నా చిదంశమును మాత్రమే పురస్కరించుకొని భూతపూర్వగతి నాశ్రయించి 'అహం బ్రహ్మాఽస్మి' యని వ్యవహరింతురు. అట్టిచో అహంప్రత్యయ గోచరమగు చిదంశమునకును, బ్రహ్మకును తాదాత్మ్య మాపన్న మగుచున్నది గాన 'అహం బ్రహ్మాఽస్మి' యను వాక్యార్థము న్యాయయుక్తిసమ్మతమయి నిర్వివాద మగుచున్నది.

## బుద్ధ్యారూఢ ప్రకరణమ్ ౭

అవ :— అన్వయ- వ్యతిరేక దృష్టాన్తములచే పదార్థతత్త్వమును పరిశోధించినవానికి అహం బ్రహ్మాస్మీత్యాది వాక్యముల వలననే బ్రహ్మాత్మైకత్వరూప- వాక్యార్థజ్ఞానము కలుగు నని యుపపత్తిపూర్వకముగ నిర్ధారిత మయిన విషయమును స్వానుభవ ప్రమాణబలముచేత స్పష్టీకరించుట కయి ఈ ప్రకరణము ఆరంభింపబడుచున్నది.

బుద్ధ్యారూఢం సదా సర్వం దృశ్యతే యత్ర తత్పునః।
మయా తస్మాత్పరం బ్రహ్మ సర్వజ్ఞశ్చాస్మి సర్వగః॥ ౧

తా॥ ప్రత్యక్షాది ప్రమాణముల చేతను, శాస్త్రము వలనను, జాగ్రద్దశయందు గాని స్వప్నావస్థయందుగాని, యిహ పర లోకముల యందు గాని అధ్యాత్మ, అధిభూత, అధిదైవ లక్షణాత్మక మయి ఏది ఉపలభ్యమాన మగుచున్నదో, అది యంతయు నాకు సర్వదా బుద్ధివృత్త్యారూఢ మయి కనపట్టు చున్నది. ఇట్లు, బుద్ధివృత్తియందు గోచరించెడి దంతయు దశ్యము గాన ద్రష్టయై సర్వదృశ్య విలక్షణుడును, ప్రపంచా తీతుడును నగు పరబ్రహ్మను నేను. సర్వార్థములను ప్రకాశింప జేయువాడ నగుటచే సర్వజ్ఞుడను; సర్వమును వ్యాపించి యున్నవాడ నగుటచే సర్వగుడను. (అపరిచ్ఛిన్నుడను.)

యథాఽఽత్మబుద్ధిచారాణాం సాక్షీ తద్వ త్పరేష్వపి।
నైవాపోఢుం నచాదాతుం శక్య స్తస్మాత్పరో
హ్యహమ్। ౨

తా॥ ప్రతిపురుషునకును, పురుషాన్తరబుద్ధి గోచరము లగు పదార్థములు అప్రత్యక్షములు గదా. అట్లగుచో నెవ నికిని సర్వార్థ ప్రకాశకత్వరూప సర్వజ్ఞత్వము సిద్ధింపదు. కాన, 'నేను సర్వజ్ఞుడను, సర్వవ్యాపకుడ' ననెడి యనుభవ మెట్లు సంగత మగును? అను సందియము కొందఱకు గలుగవచ్చును. కాని యది సరికాదు.

ఉపాధులగు బుద్ధులు భిన్నములు కాని యా బుద

లను (అధ్యాత్మ, అధిదైవ, స్థూల, సూక్ష్మదేహాత్మకాది బుద్ధివృత్తులను) ప్రేరేపించి భాసింపజేయు సాక్షి యొకడె. "మయ్యేవ సకలం జాతం మయి సర్వం ప్రతిష్ఠితమ్ మయి సర్వం లయం యాతి తద్బ్రహ్మాఽద్వయ మస్మ్యహమ్॥" అని యీరీతిగా శ్రుతి సాక్షినానాత్వమును నిరాకరించుటచే సర్వప్రమాతృ-తద్బుద్ధివృత్తి గోచర మగు ప్రపంచ మంతయు నొకే యొక సాక్షియందు కల్పింపబడిన దని యంగీకరింపవలెను. కాన నేను ఆత్మబుద్ధివృత్తి ప్రకాశకుడ నయినటుల సర్వబుద్ధివృత్తి ప్రకాశకుడ నగుచు సర్వసాక్షినగుదును. ఇట్లు సర్వాధిష్ఠాన-సర్వసాక్షిరూపుడ నగుటచే నా యీ సర్వజ్ఞత్వమును, విభుత్వము నెవడును తీసివేయ జాలడు; బలాత్కారముగా గ్రహింపజాలడు. ఇట్లు గ్రాహ్య గ్రాహకాది ప్రపంచవిలక్షణుడ నగుటచే 'పరమాత్మను నేన' యనుట నిర్వివాదాంశము.

వికారిత్వ మశుద్ధత్వం భౌతికత్వం న చాత్మనః।
అశేషబుద్ధిసాక్షిత్వా ద్బుద్ధివ న్నాల్పవేదనా॥ 3

తా॥ క్షేత్రజ్ఞుడు (సాక్షి) బుద్ధ్యారూఢమగు సర్వమును ప్రకాశింపజేయువాడని చెప్పుచో నాతనికి దర్శనక్రియా కర్తృత్వము ప్రాప్తించుటచే వికారిత్వాది దోషములు

కలుగును. అందుచే నాతనికి అనాత్మత్వ దోషము ప్రసక్త మగుమన్న దని చెప్పరాదు లేని యది సరికాదు. ఏలయన—

లోకమున సావయవ పదార్థములకే వికారిత్వము కన్పట్టుచున్నది. బుద్ధి సావయవమయి పరిణామము చెందు స్వభావము కలది గాన వికారిత్వదోషము దానికి నుండ వచ్చును. ఆత్మ నిరవయవుడు. కాన పరిణామ రహితుడు. అట్టి యాత్మకు వికారిత్వ మెక్కడిది? ఆత్మ సర్వవికారాస్పదము లగు బుద్ధివృత్తులకు సాక్షిభూతు డగుటచే నాతనికి క్రియా-గుణ యోగిత్వరూప మగు అశుద్ధత్వ మెన్నడును సంక్రమింపదు. రూపాది హీను డగుటచే ఆత్మకు, ఘటాదులకు వలె గుణక్రియాదియోగము గాని, భౌతికత్వము గాని లేదు. బుద్ధులు పరిచ్ఛిన్నము లగుటచే తద్వ్యాప్తిగోచరము లగు విషయములును పరిమితములే యగుటచే బుద్ధులకు అల్పజ్ఞత్వమే గాని సర్వజ్ఞత్వము లేదు. సర్వబుద్ధి స్వరూపములకును, తద్వికారాదులకును సాక్షిభూతుడ నగుటచే నాకు (ఆత్మకు) సర్వజ్ఞత్వము నిరుపహతము.

మణౌ ప్రకాశ్యతే యద్వ ద్రక్తాద్యాకారతాఽఽతపే।
మయి సంద్రృశ్యతే సర్వ మాతపేనేవ తన్మయా॥ ౭

తా॥ నిర్వికారత్వమును, సర్వార్థప్రకాశత్వమును పరస్పర వ్యాఘాతకములు కాన నిర్వికారుడయిన ఆత్మ

సర్వార్థప్రకాశకు డగుచున్నా డనుట యెట్లు పొసగును? అని యనరాదు.

ఏలయన-స్ఫటికాదిమణులు జపాకుసుమాదుల యొక్క అరుణిమాద్యాకారములను సూర్యాలోక మున్నయపుడే పొందగలవు గాని రాత్రులయందు పొంద లేవు. అట్లే బుద్ధియు ఆత్మసంనిధానముగనే తత్తద్విషయాకారముల బొందును. ఇట వికారము పొందినది స్ఫటికము; సూర్యాలోకము కాదు. అట్లే తత్తద్విషయాకారముల దాల్చి వికారము బొందునది బుద్ధి గాని యాత్మకాదు. స్ఫటికగత వికారములను దర్శింపజేసినది సూర్యాలోకము గాని స్ఫటికము కాదు. అటులనే బుద్ధిగోచర సర్వార్థములను ప్రకాశింపజేయునది యాత్మ గాని బుద్ధి కాదు. ఇట్లు తత్తదర్థ ప్రకాశక మగుచునే సూర్యాలోకము నిర్వికారముగ నున్నట్లే, సర్వబుద్ధిగోచర సర్వార్థ ప్రకాశకు డగుచు ఆత్మ నిర్వికారుడుగనే యుండును.

బుద్ధా దృశ్యం భవే ద్బుద్ధా సత్యాం నాస్తి విపర్యయే।
ద్రష్టా యస్మాత్సదా ద్రష్టా తస్మాద్ద్వైతం న విద్యతే॥ 28

తా॥ జాగ్రత్స్వప్నదశలయందు బుద్ధి ప్రబుద్ధ మయి యున్న యపుడే తన యవిద్యచే బుద్ధియం దధ్యస్త మగుచు, తనకంటె వేఱుగ దృశ్యప్రపంచ మొకటి యున్నటుల ఎపుడు భాసించునో యపుడే ద్వైత ముద్భూత మగుచుండును. అట్లు

బుద్ధి ప్రబుద్ధముగానట్టి సుషుప్తిదశయందు ద్వైతప్రసక్తియె లేనటులగూడ యనుభూత మగుచుండును. ఈ మూడవ స్థలయందును ఆత్మ యనుగతు డగుచు, సాక్షియై యెప్పుడు ద్రష్టగనే సర్వదా విరాజిల్లుచుండును. కాన, జ్ఞాత యయి సర్వావస్థలయం దనుగతు డగుచుండుటచే ఆత్మయే సత్యము. దృశ్యము బుద్ధిసత్తాధీనమగుచు సర్వావస్థానుగతము కాకపోవు చుండుటచే నది యసత్యము. అసత్య మగు దృశ్యముచే సత్య స్వరూపు డగు ఆత్మకు అద్వయత్వహాని లేదు. కాన, ప్రత్య గాత్మ నిత్యశుద్ధుడు, అద్వితీయుడు. ద్వైతము పారమార్థికము కాదు.

అవివేకా త్పరాభావం యథా బుద్ధి రవై త్తథా।
వివేకాత్తు పరా దన్యః స్వయం చాపి న విద్యతే॥ ౬

తా॥ ద్వైతము లేకపోవుటచే ద్వైతసంసర్గ కృత మగు నశుద్ధత్వము ఆత్మకు లేకపోయినను, విద్యా౽విద్యల సంబంధము వలన ఆత్మ నిత్యశుద్ధుడు కాకపోవలసివచ్చు ననియు కొంద అందురు. అది సంగతము కాదు. విద్యయనగా, సమ్యగ్జ్ఞానము. అవిద్య యనగా భ్రాన్తిజ్ఞానము. ఇవి రెండును బుద్ధివృత్తి ములు గాని ఆత్మవృత్తిములు గావు. కావుననే, దేహాత్మ బుద్ధిరూప విపర్యయజ్ఞానముచే –అనగా అవివేకముచే దేహాది విలక్షణుడును, సర్వసాక్షియు, అసంసారియు, పరుడు నగు

ఆత్మను బుద్ధి తెలిసికొనలేనటులే వివేకోదయానన్తరము దేహాద్యనాత్మలకంటె విలక్షణుడును, సర్వసాక్షియు, అసంసారియు నగు పరమాత్మకంటె అన్యుడును, సంసారియు నగు జీవుడు లేడనియు తెలిసికొన గలుగుచున్నది. తెలిసికొనిన యనన్తరము ఉపాదానకారణ మగు నవిద్యతోపాటు తానును (బుద్ధియు) సురిగిపోవుచున్నది. ఇట్లు, విద్యావిద్యలు బుద్ధితన్త్రిము లగుటచే తత్సంపర్కము వలన ప్రత్యగాత్మ నిత్యశుద్ధుడు కాక పోవలసివచ్చు ననుశంక నిరాశ్రయ మగుచున్నది,

బుద్ధ్యారూఢ ప్రకరమ్ సమాప్తము

## మతివిలాపన ప్రకరణమ్ ౧౮

అవ :- సాంఖ్యులు, 'బుద్ధియే పురుషుని యపవర్గము కొఱకును భోగము కొఱకును, జ్ఞానాజ్ఞానరూపముల దాల్చి విరాజిల్లుచుండునని బుద్ధియే (ప్రకృతియె) సర్వస్వతంత్రము' అని చెప్పుదురు. విద్యావిద్యలు బుద్ధితన్త్రిము లని చెప్పినచో సాంఖ్య సిద్ధాన్తము నంగీకరించుటయే యగును గదా యను నాక్షేపమును పరిహరించుటకయి పూర్వము నిరూపింపబడిన యర్థమునే ఆత్మబుద్ధిసంవాద రూపమున ప్రకారాన్తరముగ నిరూపించుటకయి యీ ప్రకరణ మారంభింపబడుచున్నది.

చితిః స్వరూపం స్వత ఏవ మే మతే
రసాదియోగ స్తవ మోహకారితః।
అతో న కిఞ్చి త్తవ చేష్టితేన మే
ఫలం భవే త్సర్వవిశేషహానతః॥ ౧

తా॥ ఓయి అన్తఃకరణమా! చైతన్యస్వరూపము నాకు (ఆత్మకు) సహజసిద్ధము. నీకు రాగద్వేషాదిమూలకమగు భోక్తృత్వాదిసంబంధము మోహముచే కల్పిత మగుచుండును. చైతన్యరూపుడనయి, సర్వవిశేషరహితుడ నగుటచే నీచేష్టలవలన నాకు కలుగు లాభముగాని, నష్టముగాని లేదు. అనగా లోకమున, సుగంధ ద్రవ్యాదులచే జలము లందుం దతిశయము (విశేషము) 'సంభవించునటుల బుద్ధిగత చేష్టలచే ఆత్మయందెట్టి యతిశయమును సంప్రాప్తము కాదు.

విముచ్య మాయామయ కార్యతా మిహ
ప్రశాన్తి మాయాహ్యసదీహితా త్సదా।
అహం పరబ్రహ్మ సదా విముక్తిమ-
త్తథాఽజ మేకం ద్వయవర్జితం యతః॥ ౨

తా॥ ఓమనసా! నీ యీ చేష్టల వలన నాకు లాభము గాని, నష్టముగాని లేనియపుడు, నీ యీ మిథ్యాచేష్టితము వలన నీకొఱిగెడిదేమి? అందుచే నీవు ఈ మిథ్యాచేష్టితముల విడిచి నిరర్థకప్రయాసలను జెందక, నిత్యశుద్ధ బుద్ధ-ముక్త

స్వభావుడను, జన్మాదివికారరహితుడను, సజాతీయ-విజాతీయ స్వగతభేదరహితుడను నగు నాయందు (ఆత్మయందు) విశ్రాన్తిగొనుము.

ఈశ్లోకమునకు మఱియొకవిధముగను అన్వయము చెప్పనగును.

ఓమనసా! నాకుగాని నీ యీ చేష్టలవలన ప్రయోజన మేమి? స్వతః స్వరూపశూన్యములయి, యసద్రూపములగు దేహేంద్రియాదివిషయములయందలి ప్రగాఢవాంఛను వీడి, జాగ్రద్దశయందు సైతము నిర్వ్యాపారత్వము బూని ప్రశాన్తరాలవుగమ్ము. బుద్ధిరూపకార్యాత్మతను విడిచి కారణస్వరూపయగు (మూలప్రకృతియగు) మాయయొక్క-స్వరూపమును భజింపుము. (కార్యతాం విముచ్య మాయాం అయ) మూలప్రకృతిస్వరూపిణివి యయి (విద్యాస్వరూపిణివయి) నన్ను జేరుము-కార్యకారణస్వరూపమును విడిచి ఆత్మస్వరూపిణివి కమ్ము.

సదా చ భూతేషు సమోఽస్మి కేవలో
యథా చ ఖం సర్వగ మక్షరం శివమ్।
నిరన్తరం నిష్కల మక్రియం పరం
తతో న మేఽస్తీహ ఫలం తవేహితైః॥ 3

తా॥ ఓమనసా! సర్వప్రాణిదేహాదులయం దనుగతుడనయి యుండు నాకు నిర్విశేషబ్రహ్మస్వరూప మెట్లని శంకింతు

వేమో, వినుము. నేను ఆకాశమువలె సర్వవ్యాపకుడను; అవినాశిస్వభావుడను; మంగళస్వరూపుడను; నిరన్తరుడను; నిరవయవుడను; అక్రియుడను; అవిద్యా తత్కార్యరూప విశేషణరహితుడను కాన కేవలుడను; సర్వభూతసముడనగు పరబ్రహ్మను. అట్టి నాకు, నీ యీ చేష్టల వలన వచ్చెడిది పోవునది యేమి? కాన, నీ యీ చేష్ట లుడిగి, నన్ను జేరి శాన్తినొందుము.

అహం మమైకో న మదన్య దిష్యతే
తథా న కస్యాప్యహ మస్మ్యసఙ్గతః ।
అసఙ్గరూపోఽహ మతో న మే త్వయా
కృతేన కార్యం తవ చాద్వయత్వతః ॥ ౮

తా॥ "బ్రహ్మభావాపన్నుడవయిన నీకు, నా (బుద్ధి యొక్క) చేష్టితముల వలన ఫలము లేకపోయినను నీకు సంబంధించి నిన్నాశ్రయించినవారు గాని, నీకంటె ఘనులయి యుండువారుగాని యుండవచ్చును గదా! వారి కయి నా యీ విలాసములు, నా శ్రమ వ్యర్థము కాదనియెద వేమో!" ఓ మనసా! అది కేవలము భ్రమ. చైతన్యరూపుడనయి సజాతీయ - విజాతీయ - స్వగతభేదములు లేక అద్వితీయుడనయి వెలుగొందు నాకు సంబంధించి, నన్నాశ్రయించినవారు (గుణభూతులు) గాని, నన్ను నియమించునట్టి ఘనులుగాని లేరు. నీ చేష్టాప్రభావములు నాయందు లేశమును ప్రసరింపక

నిర్విశేషరూపుడనయి విలసిల్లుచుండువాడనగుటజేసి యసంగ రూపుడను. మఱియు నేను అద్వయరూపుడనని చెప్పితిని గదా ! అద్వయరూపుడ నవగా నాకంటె భిన్నమయి, స్వతన్త్ర మయిన యునికిగల వస్తుతత్త్వము వేఱొకటి లేదని యర్థము. ఇట్లు చెప్పుటచే దృశ్యముగ గోచరించు జగత్తంతయు నధిష్ఠాన సత్తారూపుడనగు నాకంటె భిన్నమయినది కాదని స్పష్ట మయినది. అట్టి మిథ్యాజగత్తులో చేరినదానివే నీవును. ఆత్మస్వరూపాజ్ఞాన పరికల్పిత స్వరూపముతో విలసిల్లెడి నీవు, నన్నగాదని స్వతన్త్రముగ మనలేవుగదా ! అట్టి నీతో నాకు బనియేమి ? నీ యీ మిథ్యాచేష్టిత ప్రయాసల వలన నీకు సిద్ధించెడిదేమి ? కావున వ్యర్థవ్యాపారము లుజ్జగించి, నన్ను జేరి శాన్తిని గనుము.

ఫలే చ హేతౌ చ జనో విషక్తవా -
నితి ప్రచిన్త్యాహ మతో విమోక్షణే ।
జనస్య సంవాద మిమం ప్రక్లప్తవా -
న్స్వరూప తత్త్వార్థ విబోధ కారణమ్ ॥ ౫

అవ : — ఆత్మబుద్ధి సంవాదము నీరీతిగా కూర్చుటకు గలకారణము నాచార్యు డిట పొందుపరచుచున్నాడు.

తా॥ జనులు సాధారణముగా నేదియో యొక నిమిత్తము, ఫలమును నుద్దేశించి, తన్మయులయి ప్రవర్తించుచుందురు. జనుల యీ స్వభావమును తలపోసి, హేతుఫలాత్మక సంసారమునుండి విముక్తి బడయు మార్గమును చూపుటకయి యధ్యాత్మసంవాదరూపమగు నీ ప్రకరణమును కూర్చితిని. ఈ సంవాదము బాగుగ మననము చేసినచో నిత్యచైతన్య స్వభావుడగు నాత్మయొక్క యథార్థరూపము తేటతెల్లమగును. ఇట్లు, జనులకు నాత్మస్వరూపము నెఱుకపరచుటయే ఈ సంవాదరచనకు ప్రయోజనము గాని ఖ్యాతిసంపాదనము కాదు. కృతార్థుడను, నిష్కాముడను నగు నాకు (ఆచార్యునకు) వానితో బనియేమి ?

సంవాద మేతం యది చిన్తయే న్నరో
విముచ్య తేఽజ్ఞానమహాభయాగమాత్ ।
విముక్తకామశ్చ తథా జనః సదా
చర త్యశోకః సమ ఆత్మవిత్సుఖీ ॥

తా॥ ఈ సంవాదము నెవడు చక్కగా మననము చేయునో, అతడు భయహేతువగు నజ్ఞానమునుండి విముక్తిని బొంది, నిష్కాముడయి, అసంసారియయి, ఆత్మజ్ఞానియయి, సర్వసముడయి, ఆనన్దస్వరూపుడయి సర్వదా విరాజిల్లును.

మతివిలాపన ప్రకరణమ్ సమాప్తం.

# సూక్ష్మతావ్యాపితా ప్రకరణమ్ ౯

సూక్ష్మతావ్యాపితే జ్ఞేయే గన్ధాదే రుత్తరోత్తరమ్ ।
ప్రత్యగాత్మావసానేషు పూర్వపూర్వప్రహాణతః ॥ ౧

తా॥ పృథివి కంటె జలము, జలము కంటె తేజస్సు, తేజస్సు కంటె వాయువు, వాయువు కంటె నాకాశము, ఆకాశము కంటె నాత్మయు నిట్లు ప్రత్యగాత్మపర్యంతము క్రమముగ ఉత్తరోత్తరము సూక్ష్మము లనియు, వ్యాపకము లనియు కార్యకారణ - అన్వయవ్యతిరేక - పర్యాలోచనవలన కార్యాకార ప్రవిలాపనము చేసి తెలిసికొన నగును.

విశే :- కారణముకంటె కార్యము వేఱుగాదు. మృత్తు (కారణము) కంటె ఘటము (కార్యము) భిన్నము కాదు. అందుచే ఘటము కార్యము కారణము గూడనగును. అయితే ఘటమును కార్యముగనే లోకము గ్రహించు చుండుటచే కార్యత్వముచే కారణత్వ మిచట తిరోహిత మగు చున్నది. ఇట్లు ఆయా వస్తువు లన్నిటియందు కారణత్వము తిరోహితమగుచు నభివ్యక్తము కాకపోవుచుండుటచే కారణము సూక్ష్మమనియు, కార్యము స్థూల మనియు వ్యవహార మేర్పడి నది. కాగా, స్థూలమయి యభివ్యక్త మగునది కార్యము అట్లభివ్యక్తము కానిది కారణము, సూక్ష్మము అని తేలినది. అందుచే ఘటరూప కార్యము స్థూలము, ఉపాదాన కారణ

మగు మృత్తు సూక్ష్మము అయినది. స్థూలసూక్ష్మ వ్యవహారమునందు మాత్రమే భేదము గాని, కార్య కారణముల పరిమాణములయందు భేద మేమియు లేదు. కాన, స్థూల సూక్ష్మ వ్యవహారభేదము కార్యకారణ పరిమాణ భేదకృతము గాదు.

మఱియు, కార్యరూపము లయిన సకల వికారముల యందును, నేది యనుగతమయి యుండునో అదియె యుపాదాన కారణము గాన కార్యము కంటె కారణము అధిక దేశములం దుండునట్టిది యని తేలుచున్నది. ఇట్లధికదేశ వృత్తిత్వము కలది యగుటచే కారణము, కార్యము కంటె వ్యాపకము కూడ నగుచున్నది. లోకసిద్ధమయిన ఈ కార్య కారణభావమును అన్వయ- వ్యతిరేక ముఖమున నీరీతిగ బరిలించినచో కార్యములగు ఘట - వృక్ష - పర్వతాదులకంటె తదుపాదానకారణమగు పృథివి సర్వాన్తరము, సూక్ష్మము, వ్యాపకము నగుచున్నది. అట్లే పృథివి కంటె జలమును, జలము కంటె తేజస్సును, తేజస్సు కంటె వాయువును, వాయువు కంటె నాకాశమును - ఒకదానికంటె నొకటి సర్వాన్తరము, సూక్ష్మము, వ్యాపకము నగుచున్నది. ఈ పంచ భూతములకు, సత్తాస్ఫూర్తుల గలిగించుచు, వాసిని వ్యాపించి, వానికి ఉపాదానకారణముగ ననుభూతు డగుచుండెడి యాత్మ పంచభూతాత్మకమగు జగత్తుకంటె సర్వాన్తరుడు, సూక్ష్మ

రూపుడు, వ్యాపకుడు నగుచున్నాడు. సచ్చిద్రూపుడగు నాత్మకు ఉపాదానకారణము మఱియొకటి లేదు కాన, ఆత్మయే సర్వాన్తరతముడు, పరమ సూక్ష్మవ్యాపకరూపుడు నయి విలసిల్లును. 'అట్టి యాత్మస్వరూపుడను (కార్యవివిక్త కారణ స్వరూపుడను) నేను' అని పై రీతిగ మనన - నిధి ధ్యాసలద్వారా భావన చేయవలెను.

శారీరా పృథివీ తావ ద్యావ ద్బాహ్యా ప్రమాణతః
అబ్ధ్వాదీని చ తత్త్వాని తావ జ్జ్ఞేయాని కృత్స్నశః ॥

తా॥ ఇట్లు అధిభౌతికములగు పృథివ్యాదులకు ఉత్తరోత్తరము, సూక్ష్మతావ్యాపిత్వములు నిరూపించి ప్రత్యగాత్మ తత్త్వమును నిర్ధారణచేసినను అధి భౌతికము లగువానికంటె భిన్నములుగా అధ్యాత్మ-అధిదైవత రూపములగు పృథివ్యాది తత్త్వములు కలవుగదా ! వాని పరిమాణము భౌతికములగు వాని పరిమాణముకంటె భిన్నము. అందుచే కార్యపరిమాణము కంటె కారణపరిమాణము వేఱగుచున్నది. ఇట్లుండుచో ఆత్మకును పాంచభౌతికమగు జగత్తునకును కార్యకారణభావ మెట్లు పొసగును ? అని యనరాదు.

పృథివ్యాదులు అధ్యాత్మ - ఆధిభౌతిక - ఆధిదైవిక రూపములుగ ప్రవిభక్తము లయినను, బాహ్యపృథివి కెంత పరిమాణమో శారీరమగు (అధ్యాత్మ) పృథివికి నంతియే పరిమాణము.

అట్లే జలాది చతుర్విధ భూతగ్రామము నందును పరిమాణ భేదము లేదని గుర్తించినచో పంచభూతములకు బాహ్యాభ్యంతరము లందు పరిమాణ మేకవిధమె యని స్పష్టమగును. త్రివిధ భేదములతో నొప్పు పృథివ్యాదులు అజ్ఞాన విజృంభితము లగుటచే వానిని ఏకప్రయత్నము చేతనే కారణ స్వరూపము న ప్రవిలాపనము చేయనగును. అనగా పైనజెప్పిన రీతిని కార్యకారణ భావమును అన్వయ వ్యతిరేక ముఖముగ బరిశీలించి కార్యములు కారణముల కంటె భిన్నములు కాక పోవుట వలన వానియందు ఉత్తరోత్తరము "కార్య" మను బుద్ధిని వీడి "కారణ" మను బుద్ధినే తుదకు నిలుపనగును. ఇవి "కార్యము" లను బుద్ధి తొలగుటయే ప్రవిలాపనము. అపుడు బాహ్య - ఆధ్యాత్మికాది భేదస్ఫూర్తి కవకాశము లేనందున సర్వాన్తరు డగు ఆత్మయే సర్వకారణ స్వరూపమున తుదకు భాసిల్లును.

వాయ్వాదీనాం యథోత్పత్తేః పూర్వం ఖం సర్వగం తథా।
అహ మేకః సదా శుద్ధ శ్చిన్మాత్రః సర్వగోఽద్వయః॥ 3

తా॥ ఆత్మకంటె భిన్నమయిన దేదియు యథార్థముగ లేదు (కారణ స్వరూపము కంటె వ్యతిరిక్తముగ కార్య మనునది లేదు) అని చెప్పుచో ఆత్మకు ప్రత్యక్త్వ వ్యవహారము (సర్వాన్తరత్వ వ్యవహారము) ఎట్లు పొసగును?

బాహ్య పదార్థములే లేనియపుడు తుద కాత్మయే కారణస్వరూపమున నిలుచునని చెప్పుటయు నెట్లు సంగత మగును ? అను శంక సాధారణముగా కలుగును. కాని యది సంగతము కాదు.

పంచభూతములలో నాకాశము, తదితర వాయ్వాది భూతములకు కారణము, సర్వవ్యాపకమని చెప్పుదురు గదా ! వాయువు మున్నగు భూతముల యుత్పత్తికి పూర్వమే ఆకాశము సర్వవ్యాపక మగునా? కాదా? ఉత్పత్తికి పూర్వము సర్వవ్యాపకము కానిది, ఉత్పత్త్యనన్తరము సర్వవ్యాపక మెట్లగును ? ఆకాశ మెప్పుడును సర్వవ్యాపకమే. దాని సర్వవ్యాపకత్వ మెన్నడు నన్యాధీనము గాదు. వాయువు మున్నగువాని యుత్పత్తికిపూర్వము ఆకాశమెట్లు సర్వవ్యాపకమో. ఆత్మయు నట్లు సర్వవ్యాపకుడు. అనగా ఆత్మయొక్క సర్వవ్యాపకత్వము (సర్వాన్తరత్వము) అన్యాధీనము కాదు. అయ్యును, కార్య రూపములుగా గోచరములగు పంచభూతములచే వ్యవహారదశ యందు కారణరూపమున లక్షితు డగుచుండుటచే ఆత్మకు ప్రత్యక్త్వవ్యవహారము వ్యవహారసిద్ధ మగుచున్నది. కాని యది పారమార్థికము కాదు. కావున నేను (ఆత్మ) నిత్య శుద్ధ - బుద్ధ - ముక్త స్వ భా వు డ ను; సర్వవ్యాపకుడనయ్యును అద్వయుడను.

బ్రహ్మాద్యాః స్థావరాన్తా యే ప్రాణినో మమ పూః స్మృతాః।
కామక్రోధాదయో దోషా జాయేర న్మే కుతోఽన్యతః॥ 3

తా॥ బ్రహ్మాది స్థావరాన్త భేదముచే ననేక రూపములతో నొప్పు ప్రాణులందఱు నాకు శరీరము. (అనగా వివిధ ప్రాణిశరీరములతో భాసిల్లునది చైతన్య స్వరూపుడగు నాత్మ యొకడె.) ఇట్లు బ్రహ్మాది స్థావరాన్తమగు బ్రహ్మాండమంతయు నాశరీరమే యయినపుడు నా యీ బ్రహ్మాండశరీరము కంటె భిన్నముగ నేదికలదు? దేనిని జూచి నాకు కామక్రోధాది దోషము లుదయించును?

భూతదోషైః సదాఽస్పృష్టం సర్వభూతస్థ మీశ్వరమ్।
నీలం వ్యోమ యథా బాలో దుష్టం మాం
వీక్షతే జనః ౪

తా॥ ఆకాశము రూపరహితమయ్యును అవివేకులు ఆకాశమును నీలముగ నున్నట్లు భావించుకొనిన, భూతదోషములతో నెపుడు నెట్టి సంపర్కము లేక సర్వభూతాంతరాత్మనై సర్వనియామక-ఈశ్వరరూపుడనై యుండు నన్ను అవివేకులు సంసారదోషదూషితునిగా తలచుచుందురు.

మచ్చైతన్యావభాస్యత్వా త్సర్వప్రాణిధియాం సదా।
పూర్మమ ప్రాణినః సర్వే సర్వజ్ఞస్య విపాప్మనః॥ ౫

తా॥ సర్వపదార్థావభాసకుడ నగుటచే సర్వజ్ఞుడను; దృశ్యదోషసంసర్గరహితుడ నగుటచే నిత్యశుద్ధుడను; మఱియు చైతన్యజ్యోతిస్సుచే సర్వప్రాణిబుద్ధివృత్తులను ప్రేరేపించుచు సర్వబుద్ధిగుహాన్తర్వర్తినై సర్వసాక్షినై ప్రత్యగాత్మరూపమున వెలుగొందుచుందును. బిమ్బరూపుడగు సూర్యునకును జలాదులందు దోచు సూర్యప్రతిబిమ్బములకును ఉపాధి కల్పిత భేదము దక్క వాస్తవముగ భేదము లేనియట్లు బిమ్బరూపుడ నగునాకును (ప్రత్యగాత్మకును) బుద్ధితత్ప్రతిఫలితచైతన్య ప్రతి బిమ్బ రూపములకును (చిదాభాసులగు జీవులకును) ఆభాస కల్పితభేదము దక్క పారమార్థిక భేదము లేనందున-ప్రత్య గాత్మరూపుడనగు నాకంటె జీవులు భిన్నులు కానందున-సర్వ భూతములు నా శరీరమె యగుచున్నవి.

"యోఽయం విజ్ఞానమయః ప్రాణేషు హృద్యన్తర్జ్యోతిః పురుషః।" (బృ. 4. 3. 7; 4. 4. 22.)

"పూః ప్రాణినః సర్వ ఏవ గుహాశయస్యాహన్యమానస్య వికల్మషస్య" (ఆప. ధ. సూ 1. 8. 4.)

"యస్య సర్వాణి భూతాని శరీరం, యః సర్వాణి భూతా న్యన్తరో యమయతి, ఏష త ఆత్మాఽన్తర్యామ్యమృతః॥" (బృ. 3. 7. 15.)

జనిమజ్జ్ఞానవిజ్ఞేయం స్వప్నజ్ఞానవదిష్యతే।
నిత్యం నిర్విషయం జ్ఞానం తస్మాద్ద్వైతం న విద్యతే॥ ౭

తా॥ ఏది పుట్టుక కలిగి జ్ఞానముచే (బుద్ధివృత్తిచే) తెలియబడుచున్నదో, అట్టి జడమగు కార్యము మిథ్య యగుట శాస్త్రసమ్మతము. కాన జ్ఞేయమై జాగ్రద్దశయందు దృశ్య మగుచుండు కార్యజాత మంతయు స్వప్న-జ్ఞానమువలె మిథ్య యగుటచే ద్వైతము (జ్ఞేయము) ఎప్పుడును లేదు. ఇట్లు, జాగ్రదాద్యవస్థ లన్నిటియందును పరమార్థసత్తా కలిగిన జ్ఞేయమే లేనందున జ్ఞాన మెపుడును నిర్విషయమే. అది సర్వ వినాశసాక్షిభూత మగుటచే అవినాశి (నిత్యము). అధ్యారోపిత రజతాదుల చేత శుక్తికాదులకు సద్వితీయత్వము లేనట్లు, అధ్యారోపిత ద్వైతము చేత (జగత్తుచే) జ్ఞానస్వరూపుడగు నాత్మకు సద్వితీయత్వము లేనందున జ్ఞానము (ఆత్మ) ఎపుడును నిర్విషయము అద్వయమునై భాసిల్లును.

జ్ఞాతు ర్జ్ఞాతిర్హి నిత్యోక్తా సుషుప్తే త్వన్యశూన్యతః।
జాగ్రజ్జ్ఞాతి స్త్వవిద్యాఽత స్తద్గ్రాహ్యం
చాసదిష్యతామ్॥ ౮

తా॥ సుషుప్తియందు స్వభిన్నమై, జ్ఞేయ మయిన పదార్థ మేమియు భాసింపనియపుడుకూడ జ్ఞాత యగు ఆత్మ

యొక్క స్వరూపభూత మగుజ్ఞానము లోపింపక నిర్విషయము గనే ప్రకాశించుచుండుట సర్వానుభవసిద్ధమగుట నిరూపించుచు జ్ఞానము నిత్యమని శ్రుతి ప్రతిపాదించినది. ఇట్లు ఆత్మ స్వరూపమగు జ్ఞానము నిత్యము, నిర్విషయము అని నిరూపిత మగుటజేసి జాగ్రద్దశయందలి ఘటాదివిషయమగు జ్ఞానము (సవిషయజ్ఞానము) ఆత్మస్వరూపజ్ఞానము కంటె భిన్న మయిన దనియు, అది అవిద్యా-భ్రాన్తికల్పిత మనియు చెప్పవలసి యుండును. ఆత్మ నిర్వికారుడగుట శ్రుతి-న్యాయసిద్ధ మగుట జేసి ఆత్మకు జ్ఞాన-క్రియాకర్తృత్వ మెట్లు? అట్లే అన్తః కరణము జడ మగుటచే జ్ఞాన క్రియాకర్తృత్వము బుద్ధికి ఆపాదించు టెట్లు? కాన, సవిషయజ్ఞానము అధ్యస్త మనియు, ఆ జ్ఞానముచే తెలియబడు ఘటాదివిషయజాతము 'అసత్' (మిథ్య) అనియు అవశ్య మంగీకరింపవలయును.

మఱియు, జాగ్రదాద్యవస్థలయందు విషయాకారబుద్ధి వృత్తులు భిన్నము లయి, యా వృత్తిజ్ఞానములు ఒకదాని కొకటి సంబన్ధము లేనియట్లు కన్పట్టునపుడు ఆ యా బుద్ధి వృత్తుల ననుసన్ధానము జేయుచు, సర్వబుద్ధివృత్తులకు సాక్షియై యొప్పుచుండు చైతన్యము ఏకము-అనియు నంగీకరింపవలసి యుండుటజేసి జాగ్రద్దశయందును బుద్ధివృత్తిజ్ఞానము (సవిషయ జ్ఞానము) అనిత్యము; దానిని భాసింపజేయు ఆత్మస్వరూప మగు జ్ఞానము నిర్విషయ మగుటజేసి నిత్యమే యగును.

ఘటాదివిషయములు బుద్ధివృత్తినమసత్తాకములు మాత్రమే యగుటజేసి, తత్తదాకారవృత్తి యున్నపుడె, తత్తద్విషయక స్ఫూర్తి సాక్షిచైతన్యానుగృహీతమై కలుగుచుండుటచే జ్ఞాన నిరూప్యములు విషయము లగునుగాని విషయనిరూప్యము జ్ఞానము కాదు. అని యంగీకరింపవలయును. అందుచేతను కూడ వృత్తిజ్ఞానము సవిషయము, యాత్మజ్ఞానము నిర్విషయము—అని సిద్ధమగుచున్నదని గ్రహింపవలయును.

"యద్వై తన్న పశ్యతి పశ్యన్వై తన్న పశ్యతి నహి ద్రష్టు ర్దృష్టే ర్విపరిలోపో విద్యతేఽవినాశిత్వాత్। నతు తద్ద్వితీయ మస్తి తతోఽన్య ద్విభక్తం యత్పశ్యేత్॥"

(బృ. 4. (3). 23.)

రూపవత్త్వా ద్యసత్త్వా న్న దృష్ట్యాదేః కర్మతా యథా।
ఏవం విజ్ఞానకర్మత్వం భూమ్నో నాస్తీతి గమ్యతే॥ ౯

తా॥ "ఆత్మావాఽరే ద్రష్టవ్యః శ్రోతవ్యో మన్తవ్యో నిదిధ్యాసితవ్యః॥" (బృ. 2. 4. 5.) అనుచు శ్రుతియే శ్రవణ మనన, నిదిధ్యాసల ద్వారా ఆత్మ ద్రష్టవ్యుడు (జ్ఞేయుడు) అని విధించుటచే ఆత్మజ్ఞేయుడు, దృశ్యుడు నగుచో, దృశ్య జగత్తువలె ఆత్మయు మిథ్య కావలసివచ్చును. అని యాక్షేపము చేయుదురు. అది యుక్తము కాదు.

ఉపక్రమోపసంహారాది తాత్పర్య గ్రాహకలింగ ప్రమాణములచే శ్రుత్యర్థనిర్ణయము చేయవలసియుండును. "అశబ్ద మస్పర్శ మరూప మవ్యయం తథాఽరసం నిత్య మగన్ధవచ్చ యత్॥" (కఠ. 1.3.15.) "న చక్షుషా గృహ్యతే నాపి వాచా నాన్యై ర్దేవై స్తపసా కర్మణా వా॥" (ముణ్డక. 3. 1. 8.) అని యీరీతిగ శ్రుతులు ఆత్మరూపాదిరహితుడు మనోవాచామగోచరుడు, కర్మలచే నసాధ్యుడని నిరూపించుటచే, రూపాదిరహితుడగు ఆత్మ ద్రష్టవ్యు డెట్లగును? ఘటాదిపదార్థములు రూపాదులు కలిగి యుండుటచే గోచరములగుచున్నవి గాని నీరూపములగు నాకాశాదులు గోచరములగుట లేదు కదా. కాన, ఇట్లుఆత్మ నీరూపుడని బోధించు శ్రుతులతో విరోధ మేర్పడుటజేసి 'ఆత్మ ద్రష్టవ్య'డను శ్రుతి విధిచ్ఛాయారూపము కాని విధిపరము కాదని తెలియుచున్నది అందుచే నా వాక్యమునకు (ద్రష్టుంయోగ్యః=ద్రష్టవ్యః) జ్ఞేయుడు అని విధిముఖముగ నర్థముచెప్పక, (ద్రష్టుం అర్హతీతి ద్రష్టవ్యః, అర్హార్థే తవ్య ప్రత్యయం) దర్శనార్హుడని 'ద్రష్టవ్య' పదమును దర్శనా ద్యర్హత్వోపదేశముఖముగ వ్యాఖ్యానింపవలెను. అనగా నత్యంతప్రసిద్ధుడగుటచే నాత్మను దెలిసికొమ్మని శ్రుతులు విధించుటలేదు. ఆత్మయందారోపించుకొనిన నామరూపాద్యనాత్మపదార్థారోపణమును బోగొట్టుకొను మనియే శ్రుతులు చెప్పుచున్నవని యర్థము. కావున,

ఇట్లు శ్రుతివాక్యసమన్వయము చేసికొనినచో ఆత్మకు దర్శన క్రియాకర్మత్వము లేదని తెలియును.

అట్లే "యత్ర నాన్యత్పశ్యతి నాన్యచ్ఛృణోతి నాన్య ద్విజానాతి స భూమా!" (ఛా. 7. 24. 1.) 'ఆత్మకంటె భిన్నమయిన దానిని దేనినిగూడ ఎచట దర్శింపడో, వినడో, తెలిసికొనడో-అది భూమాఖ్య బ్రహ్మము'అని యన్యజ్ఞాన నిషేధపూర్వకముగ ఆత్మస్వరూపజ్ఞానమును శ్రుతి ప్రతిపాదించుటచే, "యత్రాన్య న్నపశ్యతి ఆత్మాన మేవ పశ్యతి।" అని యీరీతిగ శ్రుతివాక్యములను స్వాత్మదర్శనవిధిపరములుగా వ్యాఖ్యానింప శక్యము కానందున భూమరూపుడగు నాత్మకు విజ్ఞానకర్మత్వము (జ్ఞేయత్వము) లేదని నిశ్చితమగుచున్నది.

సూక్ష్మతవ్యాపితా ప్రకరణమ్ సమాప్తము

:×:

# దృశిస్వరూప పరమార్థదర్శన ప్రకరణమ్ ౧౦

దృశిస్వరూపం గగనోపమం పరం
సకృద్విభాతం త్వజమేక మక్షరమ్।
అలేపకం సర్వగతం యదద్వయం
తదేవ చాహం సతతం విముక్త ఓమ్॥ ౧

అవ :— పూర్వప్రకరణమున యుక్తితో నిరూపింప బడిన ఆత్మయొక్క నిర్విషయజ్ఞానస్వభావమును స్వానుభవ నిరూపణము ద్వారా వివరించుటకయి యీ ప్రకరణ మారం భింపబడుచున్నది.

తా॥ సర్వదా స్పష్టముగ చైతన్యరూపమున భాసించు నట్టియు, అజుడును, అద్వితీయుడును, అక్షరుడును, ఆకాశము వలె నిర్లిప్తుడును, సర్వవ్యాపకుడును, నిత్యముక్తుడును, (ఆచార్యాద్యుపదేశముచే) అపరోక్షముగ నొక్కమారు భాసించెడి దృక్స్వరూపుడును నగు ఆత్మను నేను.

విశే :— పైన చెప్పబడిన ఆత్మస్వరూపము ఓంకారము ద్వారా ముముక్షువు యొక్క బుద్ధియందభివ్యక్త మగునని సూచించుటకయి శ్లోకము చివర 'ఓంకార' నిర్దేశము చేయ బడెను.

దృశిస్తు శుద్ధోఽహ మవిక్రియాత్మకో
న మేఽస్తి కశ్చిద్విషయః స్వభావతః।
పురస్తిరశ్చోర్ధ్వ మధశ్చ సర్వతః
సంపూర్ణభూమా త్వజ ఆత్మని స్థితః॥ ౨

తా॥ నేను జ్ఞానస్వరూపుడనగు ద్రష్టను, కావున, నిత్య శుద్ధుడను, వికారాత్మకములగు ప్రాణాదులకంటె విలక్షణుడ నగుటచే నిర్వికారుడను. పరమార్థమున నాకెట్టి విషయముల

తోను సంసర్గము లేక పోవుటచేత నవిషయుడను గాన అవి క్రియుడను. పూర్వ-అపరాది భేదములచేతను, ఊర్ధ్వాధో భేదముల చేతను. అంతట నుపలభ్యమాన మగునదంతయు నేనె యగుటజేసి, అట్టి నా కంటె పరమార్థమున నేదియు లేక పోవుటచేతను ప్రత్యగాత్మ రూపుడగు 'సంపూర్ణ భూమ'ను నేనె. ఉత్పత్తిరహితుడ నగుటచే నిత్యము ఆత్మస్వరూపమున ప్రతిష్ఠితుడనై యుందును.

"అప్రాణో హ్యమనాః శుభ్రః।" (ముణ్డక. 2. 1. 2.)
"అస్థూల మనణ్వహ్రస్వ మదీర్ఘం।" (బృ. 3. 8. 8.)
"స భగవః కస్మిన్ ప్రతిష్ఠిత ఇతి, స్వే మహిమ్ని...."
(ఛా. 7. 24. 2.)

అజోఽమరశ్చైవ తథాఽజరోఽమృతః
స్వయంప్రభః సర్వగతోఽహ మద్వయః।
న కారణం కార్య మతీవ నిర్మలః
సదైవ తృప్తశ్చ తతో విముక్త ఓమ్॥ 3

తా॥ ఆత్మయొక్క కూటస్థ అద్వయ స్వభావమును ప్రతిపాదించు శ్రుతులు యథాతథముగను, తదర్థరూపముగను ఇచట పఠింపబడినవి.

నేను అజుడను, అమరుడను కాన, జరామరణరహితుడను; స్వయంజ్యోతీరూపుడను; సర్వగతుడను; అద్వయుడను;

కార్యకారణవిలక్షణుడను; నిరంజనుడను; నిరంతరము అద్వితీయమగు నాత్మానందము చేతనే తృప్తినొందుచుండువాడను గాన ఏకతృప్తుడను; ఆత్మానందస్వరూప ప్రతిష్ఠితులగువారికి భయము నుండి విముక్తి సిద్ధమగును గాన నిత్యముక్తుడను. ఓమ్ అనునది పూర్వము వలెనె అభ్యనుజ్ఞార్థకము.

"అజో నిత్యః శాశ్వతోఽయం పురాణః"।

(కఠ. 2. 28.)

"స వా ఏష మహా నజ ఆత్మా" (బృ. ఉ. 2. 4. 22)

"అజరోఽమరోఽమృతోఽభయో బ్రహ్మ।"

(బృ. 4. 4. 25.)

"అత్రాయం పురుషః స్వయంజ్యోతిః।" (బృ. 4. 3. 9.)

"తచ్ఛుభ్రం జ్యోతిషాం జ్యోతిః, (ముం. ఉ. 1. 1. 6.)

"ఏకో దేవః సర్వభూతేషు గూఢః సర్వవ్యాపీ
సర్వభూతాన్తరాత్మా", (శ్వేతాశ్వతర. 6. 11.)

"తదేతద్బ్రహ్మ పూర్వ మనపర మనన్తర మబాహ్యమ్."

(బృ. 2. 5, 19)

"ఏకమేవాఽద్వితీయం।" (ఛా. 6, 2. 1.)

"నిరఞ్జనః పరమం సామ్య ముపైతి."

(ముం. ఉ. 3. 1. 3.)

"ఆనన్దం బ్రహ్మణో విద్వాన్ న బిభేతి కుతశ్చన।"
(తై. 2. 9.)

"ఆనన్దరూప మమృతం యద్విభాతి।"
(ముం. ఉ. 2. 2. 7.)

సుషుప్తజాగ్రత్స్వపతశ్చ దర్శనం
న మేఽస్తి కిఞ్చిత్తు మతేశ్చ మోహనమ్
స్వతశ్చ తేషాం పరతోఽప్యసత్త్వత-
స్తురీయ ఏవాస్మి సదా దృగద్వయః॥ ౪

తా॥ జాగ్రత్స్వప్న సుషుప్త్యవస్థలు మూడింటియందును నేను దర్శించుచున్న దేదియును లేదు. ఈ యవస్థాత్రయదర్శన మనునది బుద్ధిపరికల్పిత మోహవిభ్రమము మాత్రమే. ఏలయన - జాగ్రత్స్వప్న సుషుప్తులయందు దర్శింపబడు విషయజాతము వస్తుసత్తగలవి కాకపోవుట జేసి, రజ్జుసర్పాదుల వలె అధ్యారోపితములని నిశ్చితము లగుటచేత నవి స్వయంసత్తాకములు (అన్యనిరపేక్షముగ స్వయముగ నుండజాలినవి) కావు. అట్లే యవి పరసత్తాకములును గావు. సద్రూపమగు చైతన్యము (ఆత్మ) ప్రత్యగ్రూపము, ఘటాది విషయములు పరాగ్రూపములు. ప్రత్యక్-పరాగ్రూపములు (సదసద్రూపములు) రెండును పరస్పరవిరుద్ధములు గాన నీరెంటికి తాదాత్మ్యము పపన్నము కాదు. కావున, పరమగు

చైతన్యము చేతన ఘటాదివిషయములకు వస్తుసత్త సిద్ధింపదు. అందుచే విషయజాతమునకు భ్రాన్తిచే ననిర్వచనీయసత్తయే కల్పిత మగుచుండును. కావున జాగ్రదాదిదశలయందు అనుభూత మర్యాదిదర్శనము బుద్ధిమోహవిలసితమే. మఱియు జాగ్రత్స్వప్న-సుషుప్త్యవస్థలయందు భాసించెడి విశ్వ-తైజస-ప్రాజ్ఞులకంటె విలక్షణుడుగ గోచరుడ నగుచుండుటచే తురీయుడను (నాల్గవవాడను) అగుదును. విశ్వుడు జాగ్రదవస్థను, తైజసుడు స్వప్నావస్థను, ప్రాజ్ఞుడు సుషుప్త్యవస్థను మాత్రమే దర్శింపగలుగును. కాని, నేను అవస్థాత్రయమును దర్శించెడివాడ నగుటచే 'సదాదృక్' (అవస్థాత్రయద్రష్ట) రూపుడ నగుదును. స్థూలసూక్ష్మక్రమమున వివేచన చేసి యన్వేషించు సమయమున మిథ్యాభూతమగు విశ్వాదిభేదము తొలగి తుదకు శేషించువాడ నగుటచే తురీయుడను గాని, వస్తుతః తురీయుడనుగాను. కావున నేనద్వయుడను.

శరీరబుద్ధీన్ద్రియదుఃఖసన్తతి-
ర్న మే న చాహం మమ నిర్వికారతః ।
అసత్త్వహేతోశ్చ తథైవ సన్తతే-
రసత్త్వ మస్యాః స్వపతో హి దృశ్యవత్ ॥ 2

తా॥ నిర్వికారుడ నగుటచే దేహేన్ద్రియాదిసంఘాతము నేను కాను, అందుచేతనే యీ శరీరేన్ద్రియాదులు నావి కావు. స్వప్నపదార్థములవలె జాగ్రత్పదార్థములును అసద్రూ

పము లగుటచేత, అసద్రూపములగు దేహేంద్రియాదులు నేనెట్లగుదును? అట్టివి ఆత్మీయములని యెట్లు చెప్పనగును?

ఇదం తు సత్యం మమ నాస్తి విక్రియా
వికారహేతు ర్నహి మేఽద్వయత్వతః।
న పుణ్యపాపే న చ మోక్షబన్ధనే
న చాస్తి వర్ణాశ్రమితాఽశరీరతః॥ ౬

తా॥ నేనద్వయుడ నగుటచే నాకు స్వగతవికారము గాని, పరకల్పిత వికారముగాని లేదు. వికారహేతువును లేదు. ఇది సత్యము. మఱియు, నేనశరీరుడ నగుటచే శరీరకర్మ నిబన్ధనము లయిన వర్ణాశ్రమములు గాని, పుణ్యపాపములు గాని, బన్ధమోక్షములుగాని నాకు లేవు.

అనాదితో నిర్గుణతో న కర్మ మే
ఫలం చ తస్మాత్పరమోఽహ మద్వయః।
యథా నభః సర్వగతం న లిప్యతే
తథా హ్యహం సర్వగతోఽపి సూక్ష్మతః॥ ౭

తా॥ నేననాదిపురుషుడను; నిర్గుణుడ నగుటచే పుణ్యాపుణ్యలక్షణమగు కర్మ గాని, తత్సాధ్యమగు సుఖదుఃఖాది రూప ఫలముగాని నాకు లేదు. కాన, సంసారులకంటె విలక్షణుడ నయి ఉత్తముడ నగుటచే పురుషోత్తముడను. ఆకాశము సర్వగత మయ్యును, అమూర్తమయి నిర్లిప్తముగ నుండు

రీతిని సర్వప్రాణిదేహాగతుడ నయ్యును, అమూర్తుడ నగుట వలన శరీరాదిగత దోషాదులచే స్పృశింపబడక నిర్లిప్తుడనయి యుండెదను. ఇట్లు కర్మ-తత్ఫలస్పర్శ లేక నిర్విశేషుడనయి యుండుటచే అద్వయుడను.

"అనాదిత్వా న్నిర్గుణత్వా త్పరమాత్మాయ మవ్యయః।
శరీరస్థోఽపి కౌన్తేయ న కరోతి న లిప్యతే॥

యథా సర్వగతం సౌక్ష్మ్యాదాకాశం నోపలిప్యతే।
సర్వత్రావస్థితో దేహే తథాఽత్మా నోపలిప్యతే॥
(భ. 13. 31, 32.)

సదా చ భూతేషు సమోఽహ మీశ్వరః
క్షరాక్షరాభ్యాం పరమో హ్యథోత్తమః।
పరాత్మతత్త్వశ్చ తథాఽద్వయోఽపి సన్
విపర్యయేణాభివృత స్త్వవిద్యయా॥ ౮

తా॥ నేను ఈశ్వరుడను (పరమాత్మను); సర్వభూత సముడను; కాన నాకు దేహాదికృత వైషమ్యము లేదు. ఈశ్వరు డనగా నియామకుడు; నియామకునికంటె భిన్నమై నియమింపబడునది వేఱొకటి యుండవలెను గాన, అందు మూలమున నాకు సద్వితీయత్వము నాపాదింపరాదు. నేను క్షరమగు (నశ్వరమగు) కార్యవర్గము కంటెను, అక్షరము (అనశ్వరము) కారణరూపమునగు మాయాశబలితచైతన్యము

కంటె పరముడను (విలక్షణుడను). అనగా కార్యకారణాది భేదకల్పనల కధిష్ఠానభూతుడ నగుటచే నుత్తముడను. ఇట్లు సర్వాత్మకుడను, అద్వయుడ నయ్యును యథార్థమగు నా పరమాత్మతత్త్వము అవిద్యాకల్పిత విపరీతజ్ఞానముచే నావృతమయి తెలియరాకున్నది.

"ద్వావిమౌ పురుషౌ లోకే క్షరశ్చాక్షర ఏవ చ
క్షరః సర్వాణి భూతాని కూటస్థోఽక్షర ఉచ్యతే॥
ఉత్తమః పురుషస్త్వన్యః పరమాత్మేత్యుదాహృతః।
యో లోకత్రయ మావిశ్య బిభర్త్యవ్యయ ఈశ్వరః॥
యస్మాత్క్షర మతీతోఽహ మక్షరాదపి చోత్తమః।
అతోఽస్మి లోకే వేదే చ ప్రథితః పురుషోత్తమః॥
(భ. 15. 16 17, 18.)

అవిద్యయా భావనయా చ కర్మభి-
ర్వివిక్త ఆత్మాఽవ్యవధిః సునిర్మలః।
దృగాది శక్తిప్రచితోఽహ మద్వయః
స్థితః స్వరూపే గగనం యథాఽచలమ్॥

తా॥ నేను దేశకాలవస్తుపరిచ్ఛేదము లేనివాడను (అవ్యవధిః) గనుకనే అవిద్య (మూలాజ్ఞానము) తోను, భావన (అవిద్యాకల్పిత దేహాద్యభిమానము) తోను, దేహాద్యభిమాన నిబంధనములగు పుణ్యపాపలక్షణములగు కర్మల

తోను నెట్టి సంపర్కము లేనివాడను. కాన విశుద్ధుడను. అట్లు ఆత్మ ఆకాశమువలె నిరవచ్ఛిన్నుడు, నిష్క్రియుడు నగుచో ద్రష్ట, శ్రోత, మన్త, బోద్ధ - ఇత్యాది వ్యవహారము లెట్లుపపన్నములగు నందురేని ఆత్మయందు అవిద్యచే నధ్యస్త మయిన అన్తఃకరణపరిణామరూప - దృగాదిశక్తిసంబంధము వలననే నాకు (ఆత్మకు) ద్రష్ట శ్రోత-ఇత్యాది వ్యవహార ముపపన్న మగుచున్నది. ఇట్లు ఆ యా వ్యవహారముల నొందు చునే నేను ఆకాశము వలె నిశ్చలుడనై అద్వయుడనై స్వస్వ రూపమున ప్రతిష్ఠితుడనై యుందును.

అహం పరంబ్రహ్మ వినిశ్చయాత్మదృజ్
న జాయతే భూయ ఇతి శ్రుతే ర్వచః ।
న చైవ బీజేఽప్యసతి ప్రజాయతే
ఫలం న జన్మాఽస్తి తతో హ్యమోహతా ॥ ౧౦

తా॥ బీజమే లేనియపుడు వృక్షఫలాదు లెక్కడనుండి వచ్చును? అట్లే ఆత్మజ్ఞానము చే సంసారబీజమగు అవిద్య నశించినపుడు సంసారమునకు పునరావృత్తి యెక్కడిది? శ్రుతియు 'అహం బ్రహ్మాస్మి' యని నిశ్చయముగ ఆత్మ జ్ఞానము గలవాడు మరల సంసారి కాడని' చెప్పినది.

'స తు తత్పద మాప్నోతి యస్మాద్భూయో న జాయతే'
కఠ. ౩. ౮.

'పురుషా న్న పరం కించిత్ సా కాష్ఠా సా పరా గతిః'

(కఠ. 3. 11.)

'బ్రహ్మవేద బ్రహ్మైవ భవతి' (ము, 3. 2. 9.)

'అథ సోఽభయం గతో భవతి' (తై. 2. 7.)

మమేద మిత్థం చ తథేద మీదృశం
తథాఽహ మేవం న పరో న చాన్యథా।
విమూఢ తైవం న జనస్య కల్పనా
సదా సమే బ్రహ్మణి చాద్వయే శివే॥ ౧౧

తా॥ జన్మమరణాదులు పొందు జీవులకు మొదట స్థూలసూక్ష్మదేహముల యందు 'అహం' అని అహంకారము (దేహాద్యభిమానము) ఉదయించి 'నేను ఇట్టివాడను' అను నభిమానము కలుగును. తదుపరి 'ఇది' యని బాహ్యార్థ జ్ఞానమును, 'ఇది యిట్టిది' యని దానియందు శోభనధర్మాది జ్ఞానమును కలుగును. పిమ్మట 'యిది నాది' -'అది యిట్టిది; నాది యిట్టిది కాదు-అను జ్ఞానములు క్రమముగా కలుగును. తరువాత తనకంటెను, తనచే జూడబడు దృశ్యజగత్తు కంటెను పరుడగు నీశ్వరుని గూర్చి 'ఈశ్వరుడు కలడా? లేడా? ఆ యీశ్వరుడిట్లు యుండును; ఇంకొకరీతిగా నుండడు; అతడు సర్వజ్ఞుడు-అని; యీరీతిగా మోహామువలన పెక్కు వికల్పములు గలుగుచుండును. ఆ మోహము నశించినపుడు

యథార్థముగ నిత్యసముడు అద్వయుడు పరమానందరూపుడు నగు బ్రహ్మయం దీ కల్పనలకు తావు లేదు.

యదద్వయం జ్ఞాన మతీవ నిర్మలం
మహాత్మనాం తత్ర న శోక మోహతా ।
తయో రభావే న హి జన్మ కర్మ వా
భవే దయం వేదవిదాం వినిశ్చయః ॥ ౧౨

తా॥ మహాత్ములకు అసంభావనా - విపరీతభావనాది ప్రతిబంధములు లేనట్టి అద్వయ - ఆత్మాకారమగు నిర్మల జ్ఞాన ముదయించినంతనే సంసారిత్వము (శోకమోహతా) పోవును. శోకమోహములు తొలగినంతనే వానికి గారణ మగు అవిద్యయు నివర్తించును. ఇట్లు సంసారకారణములగు శోకమోహములు సమూలముగ నశించుటచే కర్మ జన్మ బద్ధరూపమగు సంసారము తిరిగి తలయెత్తదని వేదవేత్తల యొక్క నిశ్చయము.

'తత్ర కో మోహః కః శోక ఏకత్వ మనుపశ్యతః'
(ఈశా. 7.)

'భిద్యతే హృదయగ్రన్థి శ్ఛిద్యన్తే సర్వసంశయాః ।
క్షీయన్తే చాస్య కర్మాణి తస్మిన్ దృష్టే పరావరే॥
(ము. 2. 2. 8.)

సుషుప్తవ జ్జాగ్రతి యో న పశ్యతి
ద్వయం తు పశ్యన్నపి చాద్వయత్వతః।
తథాచ కుర్వన్నపి నిష్క్రియశ్చ యః
స ఆత్మవి న్నాన్య ఇతీహ నిశ్చయః॥ ౧౩

తా॥ ఎవడు సుషుప్తియందువలె జాగ్రద్దశయందు సైతము ద్వైతప్రపంచము బాధిత మగుటజేసి దానిని నిష్ప్రపంచాత్మస్వరూపముగనే దర్శించుచు విశేషాకారము కలదానినిగా దర్శింపక అద్వయస్వరూపమున ప్రతిష్ఠితుడై యుండునో, ఎవడు, అకర్తృ - ఆత్మస్వరూపానుభవము కలుగుటవలన యథాపూర్వము స్నాన శౌచ భిక్షాటనాది కృత్యముల దేహధారణము కొఱకై నిర్వర్తించుచునే నిష్క్రియాత్మభావమున నుండునో అతడే ఆత్మజ్ఞాని. ఇట్లు విక్షేపదశయందు సైతము చిత్తవిక్షేపములకు లోనుగాక ఆత్మస్వరూపదర్శనానంద మనుభవించుచుండు ఆత్మజ్ఞానియే బ్రహ్మవేత్తలలో నుత్తముడు; ఇతరుడు గాడని వేదాంత శాస్త్రనిశ్చయము.

ఇతీద ముక్తం పరమార్థదర్శనం
మయా హి వేదాన్తవినిశ్చితం పరమ్।
విముచ్యతేఽస్మిన్ యది నిశ్చితో భవే
న్న లిప్యతే వ్యోమవదేవ కర్మభిః॥ ౧౪

తా॥ ఇట్లు వేదాంతశాస్త్రమున నిరూపింపబడిన పరమాత్మస్వరూపమగు పరమార్థతత్త్వము ఈ ప్రకరణమున ప్రతిపాదింపబడినది. ఈ యర్థము నెవడు మననము చేసి వినిశ్చయజ్ఞానము పొందునో యతడు కర్మ తత్ఫలసంబంధము లేక యాకాశము వలె నిర్లిప్తుడై యుండును.

## ఈక్షితృత్వ ప్రకరణమ్

ఈక్షితృత్వం స్వతఃసిద్ధం జన్తూనాం చ తతోఽన్యతా ।
అజ్ఞానాదిత్యతోఽన్యత్వం సదసీతినివర్త్యతే ॥

అవ :— "ముక్తి కర్మసాధ్యము; లేక కర్మసహిత జ్ఞానసాధ్యము; కేవల బ్రహ్మాత్మైక్యజ్ఞానముచే సిద్ధింపదు. మఱియు నాత్మజ్ఞానము తంత్రాంతరములయందు అనుమానాది ప్రమాణములచే నిర్ణీత మగుటచే - 'నాత్మజ్ఞానము వేదాంతశాస్త్రైకసమధిగమ్యము'-అని చెప్పుటయు యుక్తము గాదు-అను నాక్షేపముల బరిహరించుటకై యీ ప్రకరణ మారంభింపబడుచున్నది.

తా॥ 'తత్పదలక్షితుడగు సద్రూపబ్రహ్మ నేనే' యని బోధించు తత్త్వమసీత్యాది మహావాక్యములచే ఆత్మయం

దవిద్యచే కల్పితములగు కర్తృత్వభోక్తృత్వాది ధర్మములు బాధితములై నివర్తించి యాత్మ జ్ఞానస్వరూపమున దేజరిల్లును. కాన, యాత్మకు కర్తృత్వభోక్తృత్వాదికములు కల్పితములు. జ్ఞాతృత్వము (జ్ఞానస్వరూపము) స్వాభావికము.

ఇట్లు మహావాక్యములచేతనే అన్యనిరపేక్షముగ నాత్మ జ్ఞానోదయ మగుచుండుటచే జ్ఞానసిద్ధికి ప్రమాణాంతరసాపేక్ష గాని, కర్మాదిసాధనాంతరాపేక్షగాని లేదు.

ఏతావదిత్యమృతత్వం న కించి దన్యత్సహాయకమ్।
జ్ఞానస్యేతి బ్రువచ్ఛ్రౌత్రం సలిఙ్గం కర్మ బాధతే॥ ౨

తా॥ 'ఏతావదరే ఖల్వమృతత్వం' 'ఓ మైత్రేయి! ఇంతవఱకు 'నేతి నేతి' యని బ్రతిపాదింపబడిన యీ యద్వైతాత్మదర్శనమే అన్యసహకారికారణనిరపేక్షముగ అమృతత్వసాధన మగుచున్నది' యనుచు శ్రుతి (బృ. 4. 5. 15.) సాధనసహితకర్మకు మోక్షసాధనత్వమును నిరాకరించినది.

సర్వేషాం మనసో వృత్తి మవిశేషేణ పశ్యతః।
తస్య మే నిర్వికారస్య విశేషః స్యాత్కథం చన॥ 3

తా॥ కర్తృత్వభోక్తృత్వాద్యభిమానము లేక కేవల సాక్షిరూపుడనై సర్వప్రాణిబుద్ధివృత్తుల బ్రేరేపించుచు వాని నన్నిటిని దర్శించుచు నిర్వికారుడనై భాసించు నాకు కర్మ

సాధన వర్ణాశ్రమా ద్యభిమానలక్షణమగు వికారము ఎట్లు కలుగును ?

మనోవృత్తం మనశ్చైవ స్వప్నవజ్జాగ్రతీక్షితుః।
సంప్రసాదే ద్వయాసత్త్వా చ్చిన్మాత్రః సర్వగోఽవ్యయః॥

తా॥ స్వప్నదశయందు బాహ్యవిషయములు లేక పోవుటవలన ఆత్మ కేవలము వృత్తిసహితమగు నంతఃకరణ మును దర్శించునట్లే జాగ్రద్దశయందును ఘటాదివిషయాకార బుద్ధివృత్తులను, తదాశ్రయమగు నంతఃకరణమును సాక్షి రూపుడై విలోకించుచుండును. ఇట్లు కేవలము సాక్షిమాత్రుడై ద్రష్టయై యొప్పు నాత్మకు వికార మెట్లు గలుగును ?

మఱియు నాత్మకు మనోవృత్తిదర్శనమే స్వాభావిక మగు విశేషమనియు జెప్పరాదు. సుషుప్తియందు అన్తఃకర ణము స్వవృత్తులతోపాటు లయము చెందుచుండుటచే నపుడు మనస్సు-తద్వృత్తు లనెడి ద్వయము లేవుకాన; ఆత్మ యెపు డును అద్వయుడు, స్వయంజ్యోతీరూపుడు, అపరిచ్ఛిన్నుడు (సర్వగః), నిత్యుడు నగుచు స్వస్వరూపమున నుండును. ఆత్మకు మనోవృత్తిదర్శన మాగంతుకముగాని స్వాభావికము గాదు.

'న తు తద్ద్వితీయ మస్తి తతోఽన్యద్విభక్తం యత్పశ్యేత్'
(బృ. 4. 3. 23.)

స్వప్నః సత్యో యథాఽఽబోధా ద్దేహాత్మత్వం తథైవ చ।
ప్రత్యక్షాదేః ప్రమాణత్వం జాగ్రత్స్యాదాఽఽత్మ
వేదనాత్॥ 38

తా॥ మెలకువ వచ్చునంతవఱకు స్వప్నము సత్యము గనే కన్పట్టి లౌకిక వైదిక వ్యవహారాస్పద మగునట్లు, ఆత్మ తత్త్వసాక్షాత్కారము కలుగునంతవఱకు జాగ్రద్దశ యందును దేహాత్మభావము, ప్రత్యక్షాదిప్రమాణములును, సర్వవ్యవహారాంగములై సత్యములవలె దోచుచుండును, కావున యథార్థముగ ద్వైతమే లేనిచో ప్రత్యక్షాదిప్రమాణవిరోధము, లౌకిక వైదిక వ్యవహారవిలోపమును సంభవించు ననెడి శంకలకు తావు లేదు.

వ్యోమవత్ సర్వభూతస్థో భూతదోషై ర్వివర్జితః।
సాక్షీ చేతాఽగుణః శుద్ధో బ్రహ్మైవాఽస్మి స కేవలః॥

తా॥ ఆత్మ యొక్క అవ్యవహార్యస్వరూప మిట్లు ఆవిష్కరింపబడుచున్నది. చిద్రూపుడను (చేతా), సాక్షి యగుటచే భూతదోషరహితుడను, (సర్వభూతములయందు అహమాకారము గల యంతఃకరణవృత్తులయందు అభివ్యక్తుడగుచుండుటచే) ఆకాశమువలె సర్వభూతములయందుండు వాడను (అసంగః); అజ్ఞానరహితుడను (శుద్ధః), అవస్థాత్రయరహితుడను (కేవలః); నిర్గుణుడు పూర్ణుడ నగు బ్రహ్మయే నేను.

నామరూపక్రియాభ్యోఽన్యో నిత్యముక్తస్వరూపవాన్ ।
అహమాత్మా పరం బ్రహ్మ చిన్మాత్రోఽహం
సదాఽద్వయః ॥ ౭

తా॥ నామరూపక్రియాత్మక ప్రపంచరహితుడును, నిత్యముక్తస్వరూపుడును నగు పరబ్రహ్మ నేను. కనుక నేను (ఆత్మ) కేవలచిద్రూపుడను; సర్వదా అద్వయరూపుడను;

అహం బ్రహ్మాస్మి కర్తా చ భోక్తా చాస్మీతి యే విదుః ।
తే నష్టా జ్ఞానకర్మభ్యాం నాస్తికాః స్యుర్న సంశయః॥ ౮

తా॥ భేదాభేదమతానుసారముగ జ్ఞానకర్మసముచ్చయవాదులు 'అహంబ్రహ్మాస్మి' యను జ్ఞానము వలెనే 'అహం కర్తా భోక్తా' (నేను కర్తను భోక్తను) అను ననుభవము గూడ ప్రమాణమూలమే యగుటజేసి ప్రామాణికము. కాన ఆత్మ కేవల-అద్వయరూపుడు గాడని చెప్పుదురు. శాస్త్రము విరుద్ధార్థప్రతిపాదకము కాదు. గనుక విరుద్ధదర్శనము నవలంబించుచో నట్టివారు 'అహం కర్తా భోక్తా'-యని కర్తృత్వభోక్తృత్వాద్యభిమాన మున్నందున జ్ఞానకాండకును, 'అహం బ్రహ్మాస్మి' - యని అకర్తృ-అభోక్తృ - ఆత్మస్వరూపజ్ఞానమున్నందున కర్మకాండకును దూరులై (ఉభయభ్రష్టులై) నాస్తికు లగుదురు; సందియము లేదు.

ధర్మాధర్మఫలై ర్యోగ ఇష్టోఽస్పృష్టో యథాఽఽత్మనః ।
శాస్త్రా ద్బ్రహ్మత్వ మప్యస్య మోక్షో జ్ఞానా
త్త థేష్యతామ్ ॥

తా॥ ప్రమాణాంతరములచే తెలియబడనప్పటికిని (అదృష్టః) శాస్త్రముచే నాత్మకు ధర్మ - అధర్మఫలములగు సుఖదుఃఖాదులతో సంబంధము నంగీకరించినట్లే, ప్రమాణా న్తరవేద్యము కాకపోయినను శాస్త్రము చేతనే బ్రహ్మాత్మైక్య జ్ఞానము కలుగు ననియు నంగీకరింపవలెను.

"పుణ్యో వై పుణ్యేన కర్మణా భవతి పాపః పాపేన"
(బృ. 3. 2. 13.)

"తమేవ విదిత్వాఽతిమృత్యు మేతి నాఽన్యః పన్థా విద్యతేఽ యనాయ" (శ్వే. 6. 15; 3. 8.)

ఇట్లు బ్రహ్మాత్మభేదజ్ఞానము, భేదజ్ఞానమూలములగు కర్మలును నిందితము లగుటచే భేదజ్ఞానముగాని, భేదాభేద జ్ఞానముగాని, మోక్షము కర్మసాధ్య మనిగాని, లేక జ్ఞాన కర్మసముచ్చయసాధ్య మనిగాని చెప్పుట శాస్త్రతాత్పర్య విషయము కానందున శాస్త్రానుసారులగు జిజ్ఞాసువులు యథా శాస్త్రము పరమార్థమును దర్శింపవలెను.

యా మోహరజనాద్యా స్తా వాసనాః స్వప్నదర్శిభిః ।
అసంస్థాయ స్త ఏవేహ తతోఽన్యః కేవలో దృశిః ॥ ౧౦

తా॥ శ్రుత్యుక్తములగు మాహారజనాదివాసనలు సాక్షియు ద్రష్టయు నగు నాత్మచే దృశ్యములుగా స్వప్నమున ననుభూతము లగుచునే యున్నవి. దృశ్యములకంటె ద్రష్ట విలక్షణుడు జాగ్రద్వాసనావాసితమగు నంతఃకరణము కంటెను, తత్కల్పిత హరిద్రారంజిత పటాదిరూపసన్మశ మిథ్యాపదార్థజాతము కంటెను ద్రష్ట యగు నాత్మ విలక్షణుడై స్వప్నమున దోచుచుండుటవలన జాగ్రద్దశయందును కర్తృత్వ భోక్తృత్వాది వాసనావాసితమగు నంతఃకరణము (లింగాత్మ) కంటెను, తత్కల్పిత-దృశ్య వ్యావహారిక జగత్తుకంటెను ద్రష్ట యగు నాత్మ విలక్షణుడే యగును. కాన ద్రష్ట యగు నాత్మ కేవలుడు (శుద్ధుడు).

శ్రుతి – "తస్య హైతస్య పురుషస్య రూపం యథా
మాహారజనం వాసః"

అని యారంభించి 'యథాऽసకృద్విద్యుత్తమ్' అని యుపసంహారము చేయుచు స్వప్నమున ననుభూతము లగుచుండు పెక్కు వాసనలను (అన్తఃకరణసంస్కారములను) వివరించినది. (బృ. 2. 3. 6.) (మాహారజనం వాసః = పసుపు బూసిన వస్త్రము).

కోశా దివ వినిష్కృష్టః కార్యకారణవర్జితః।
యథాऽసి ర్దృశ్యతే స్వప్నే తద్వ ద్బోద్ధా
స్వయంప్రభః॥ ౧౧

శం. ర. 13–12

తా॥ ఒర నుండి పైకి తీయబడిన ఖడ్గము స్వస్వరూప మున భాసించునట్లు ఆత్మయు స్వప్నమున కార్యకారణరూప మున బరిణమించుచు దృశ్యమగుచుండు మనస్సు (లింగ శరీరము) కంటె వేరుగా ద్రష్టయై స్వయంప్రకాశుడై స్వస్వ రూపమున గోచరించుచుండును - అనగా కోశవినిర్ముక్త ఖడ్గము వలె ఉపాధివినిర్ముక్తాత్మస్వరూపము స్వయంజ్యోతీ రూపమున స్వప్నమున గోచరించుచుండును.

"అత్రాయం పురుషః స్వయంజ్యోతి ర్భవతి"

(బృ. 4. 3. 9.)

వి:- స్వప్నమున ఆత్మ ప్రత్యక్షముగా గోచరించినను (దృశ్యుడై నను) ఘటాదుల వలె దృశ్యుడగునని చెప్పరాదు. ఘటా దులు జడములు. కాన పర (ఆత్మ) ప్రకాశ్యములు. ఆత్మ చేతనుడు. సర్వపదార్థావభాసకుడు; స్వయంప్రకాశుడు. ఆత్మను (ద్రష్ట) ప్రకాశింపజేయు ద్రష్ట మఱియొకడు లేడు. ఉన్నాడనినచో అనవస్థాదోషము ప్రాప్తించును. కాన, ఆత్మ స్వప్నమున గోచరించినను ఘటాదులవలె దృశ్యుడు లేక పరప్రకాశ్యుడు గానేరడు.

"యేనేదం సర్వం విజానాతి తం కేన విజానీయాత్,
విజ్ఞాతార మరే కేన విజానీయాత్" (బృ. 2. 4. 14.)

ఆపేమాత్రప్రతిబుద్ధస్య జ్ఞస్య స్వాభావికం పదమ్ ।
ఉక్తం నేత్యాదివాక్యేన కల్పితస్యాపనేతృకమ్॥ ౧౨

తా॥ గాఢనిద్రాపరవశు డగుచు ప్రాణనామములతో బిలిచినను లేవక తుదకు పలుమారులు పొరలించుటచే నిదుర నుండి మేల్కాంచెడి జీవునిస్వరూపమును శ్రుతి వర్ణించుచు, "నేతి నేతి" త్యాదివాక్యములచే ఆత్మ (జీవుని) యందు అధ్యస్తములైన సమస్తకారణకార్యాత్మకోపాధులను ప్రతిషేధించి కర్తృత్వభోక్తృత్వాదిధర్మము లధ్యస్తములే కాని పారమార్థికములు గావని (వానిని) నిషేధించి - జీవుడు పరమార్థమున నిత్యబుద్ధముక్తస్వభావు డగుట నిరూపించినది.

"తౌ హ పురుషగ్ సుప్త మాజగ్మతు స్తమేతై ర్నామభి రామంత్రయాం
చక్రే బృహన్ పాండరవాసః సోమరాజన్నితి స నోత్తస్థౌ
తం పాణినాపేషం బోధయాంచకార సహోత్తస్థౌ"
(బృ. 2. 1, 15.)

"అథాత ఆదేశో నేతి నేతి....సత్యస్య సత్య మితి ప్రాణా
వై సత్యం తేషా మేష సత్యమ్" (బృ. 2. 3. 6,)

మహారాజాదయో లోకా మయి యద్వత్ప్రకల్పితాః ।
స్వప్నే తద్వద్ద్వయం విద్యా ద్రూపం వాసనయా
సహ॥ ౧౩

**తా॥** కేవల దృక్స్వరూపుడనగు నాయందు స్వప్నమున మహారాజాదిలోకము లెట్లు కల్పింపబడినవో యట్లే యంతఃకరణము యొక్క సంస్కారముచే మూర్తా - మూర్త రూపములు రెండును నాయందు కల్పింపబడినవని యెఱుగుము - అని యీరీతిగా నేతి నేతీత్యాది వాక్యములచే నిషేధింపబడిన మూర్తామూర్త - తద్వాసనాశ్రయ ... సర్వము కల్పితము గాని పారమార్థికము గాదని శ్రుతియే ప్రతిపాదించినది.

"యత్రైష ఏతత్సుప్తోఽభూ ద్య ఏష విజ్ఞానమయః
పురుషః———స యత్రైత త్స్వప్నయా చరతి తే హాస్య
లోకా స్తదుతేవ మహారాజో భవత్యుతేవ మహాబ్రాహ్మణ
ఉతేవోచ్చావచం నిగచ్ఛతి" (బృ. 2. 1. 18.)

"ద్వే వావ బ్రహ్మణో రూపే మూర్తం చైవామూర్తంచ
మర్త్యం
చామృతం చ స్థితం చ యచ్చ సచ్చత్యం చ ॥
(బృ 2. 3. 1.)

**వి :-** విజ్ఞానమయస్వరూపుడగు జీవుడు దర్శనలక్షణమగు స్వప్నావస్థయందు కర్మఫలములగు, (ప్రసిద్ధ) లోకముల నొందుచున్నాడు. అట్టిదశయందు జీవుడు మహారాజువలె సామ్రాజ్యాది గుణవిశిష్టు డగును; మహాబ్రాహ్మణుని వలె

శ్రోత్రియత్వాది గుణయుక్తుడగును. దేవత్వ-తిర్యక్త్వాది - ఉత్కృష్ట-అపకృష్ట గుణవిశిష్ట మగు శరీరము గూడ సూక్ష్మ పుణ్యపాపానుగుణముగా పొందుచుండును. అగుచో నీ మహా రాజత్వాదులు వ్యావహారికదశయందలి మహారాజత్వాదుల వలె వ్యావహారికసత్యములు గావను నంశమును శ్రుతి "ఇవ' కారముచే ప్రతిపాదించి - 'ఏవ మేవైష ఏతత్ప్రాణాన్ గృహీత్వా స్వే శరీరే యథాకామం పరివర్తతే"-మహారాజు తనదేశమునందలి జనులను వశపఱచుకొని తన దేశమునందు స్వేచ్ఛగా ప్రవర్తించునట్లు విజ్ఞానాత్మయు వాగాదీంద్రియ ములను జాగరితస్థానములనుండి యుపసంహరించి తన దేహ ముననే స్వేచ్ఛగా పరివర్తనము జెందుచుండును - అనగా కామకర్మలచే నుద్భాసితములగు పూర్వానుభూత వస్తు సదృశవాసనల ననుభవించుచుండును - అని యుపసంహారము జేసినది. కాన స్వప్నద్రష్ట శరీరమధ్యముననే ప్రాణశబ్దవాచ్య లిఙ్గశరీరోపాధిని మహారాజాద్యాత్మకముగా భావించి సుఖ దుఃఖాదివ్యవహారముల నొందుచుండును. కావున స్వప్నమున నుపలబ్ధమగునది యంతయు పరమార్థము గాదు. అందుచే వాసనాశ్రయ - లింగశరీరసహితమగు మూర్తామూర్తరూప స్థూలప్రపంచముగూడ దృక్స్వరూపుడగు నాత్మకు దృశ్య మగుచుండుటచే స్వప్నప్రపంచము ఆత్మయందు కల్పితమే కాని పరమార్థము గాదనుట యుపపన్న మగును.

దేహలిఙ్గాత్మనా కార్యా వాసనారూపిణా క్రియాః ।
నేతి నేత్యాత్మరూపత్వా న్న మే కార్యా క్రియా
క్వచిత్ ॥ ౧౪

తా॥ స్థూల-సూక్ష్మ-దేహ తాదాత్మ్యాభిమానము గలిగి కర్మప్రవృత్తినిమిత్త-అవిచ్ఛిన్నవాసనా (సంస్కార) రూపుడగు జీవునకే కర్మలయందు ప్రవృత్తి యుండునుగాని స్థూలసూక్ష్మ దేహాభిమానము విడచి నేతి నేతి వాక్యప్రతిపాదితాత్మస్వరూపనిష్ఠితుడ నగుటచే కర్తృత్వ భోక్తృత్వాద్యభిమానము లేని నాకు స్వప్నమునగాని, జాగ్రద్దశయందుగాని యెప్పుడును కర్మలయందు ప్రవృత్తి యుండదు. కాన, నే జేయవలసిన క్రియలు లేవు.

న తతోఽమృతతాశాస్తి కర్మణోఽజ్ఞానహేతుతః ।
మోక్షస్య జ్ఞానహేతుత్వా న్న తదన్య దపేక్షతే ॥ ౧౫

తా॥ అజ్ఞానవశమున దేహాభిమానము, దేహాభిమానముచే కర్మలయందధికారము సిద్ధించుచుండును. కాన, కర్మలు అజ్ఞానమూలములు. అజ్ఞానమును, తన్మూలములగు కర్మలును జడములు, వానికి బరస్పరము విరోధము లేదు. అగుచో కర్మలు అజ్ఞానము నెట్లు నశింపజేయగలవు? అజ్ఞానమును నశింపజేయజాలినది జ్ఞాన మొక్కటియే. జ్ఞానాజ్ఞానములు పరస్పరవిరుద్ధస్వభావములు గలవి యగుటచే మోక్షసిద్ధికై జ్ఞానము అజ్ఞానమూల కర్మసాహాయ్యము నపేక్షింపదు.

కావున, కర్మలుగాని, కర్మ-సముచ్చితజ్ఞానముగాని మోక్ష సాధనము గావు.

ఽమృతం చాభయం నార్తం నేతీత్యాత్మా ప్రియో మమ।
విపరీత మతోఽన్య ద్యత్త్యజే త్తత్సక్రియం తతః॥ ౧౬

తా॥ బ్రహ్మస్వరూపమగు అమృతత్వము భయరహితము; వినాశరహితమును. ఇట్టి యమృతత్వము కర్మసాధ్యము గాదు. బ్రహ్మకంటె భిన్నమయినదంతయు ఆర్తము. (అనిత్యము). బ్రహ్మకంటె జీవుడు భిన్నుడుకాడు. జీవులందఱు ఆత్మస్వరూపభూతులే. 'అనేన జీవేనాత్మనాఽను ప్రవిశ్య' (ఛా. 6. 3. 2.) అను శ్రుతి యిందులకు ప్రమాణము. నేతి నేతి వాక్యములు జీవుని (ఆత్మ) యందు గల్పింపబడిన మూర్తామూర్త తద్వాసనాదివిశేషముల నన్నిటిని ప్రతిషేధించుటచే నిర్విశేషచిద్రూప మయిన ఆత్మస్వరూపము కర్మసాధ్యము గాదు. ఆత్మ యన్నిటి కంటె ప్రియతరుడు. ఆత్మకంటె భిన్నమై భేదబుద్ధితో దృశ్యమగునది యంతయు అనాత్మభూతము అప్రియము - మిథ్యాభూతము; క్రియాసహితమును. కాన సాధకులగు జిజ్ఞాసువులు దానియం దభిమానము త్యజింపనగును.

# ప్రకాశ ప్రకరణమ్ - ౧౭

ప్రకాశస్థం యథా దేహం సాలోక మభిమన్యతే ।
ద్రష్ట్రాభాసం తథా చిత్తం ద్రష్టాఽహమితి మన్యతే॥ ౧

అవ॥ 'అన్నిటికంటె ఆత్మ ప్రియుడు'; 'భోక్త' యగు జీవుడు నిర్విశేషబ్రహ్మస్వరూపుడు గూడనగుచో లోకమున నందఱకును నిత్యము 'అహమ్ - అహమ్' అని ఆత్మానుభవమున్నను 'బ్రహ్మాహ'మ్మని (బ్రహ్మమే నేనని) యేల తెలిసికొనరని శంకించి పదార్థతత్త్వపరిశోధనము లేమి చేతనే తెలిసికొనగల్గుటలేదని చెప్పుచు 'త్వం'పదార్థశోధనప్రధానమగు ప్రకరణము నారంభించుచున్నారు.

తా॥ సూర్యప్రకాశ మంతటను వ్యాపించి సర్వప్రకాశకమై యుండియు స్థూలదేహసంపర్కముచే తద్దేహాకారమును బొందినట్లుండి యా దేహముకంటె వ్యతిరిక్తముగ గన్పట్టదు. దేహమును సూర్యప్రకాశవిశిష్టమై గన్పట్టును. అట్లే నిఖిల జగదవభాసకమైన సాక్షిచైతన్యముగూడ నంతఃకరణసంపర్కముచే తదాకారమును దాల్చినట్లు భాసించుచు అంతఃకరణము కంటె వ్యతిరిక్తముగ గన్పట్టదు. సాక్షిచైతన్యవ్యాప్తమయిన యంతఃకరణముగూడ, చైతన్యవిశిష్టమై సచేతనమువలె గోచరించును. కావుననే నేను కర్తను, ద్రష్టను, భోక్తను

అని యంతఃకరణస్వభావవిశిష్టమైన యాత్మానుభవమునే పొందుదురు గాని నిర్విశేషబ్రహ్మానుభవమును పొందరు.

యదేవ దృశ్యతే లోకే తేనాభిన్నత్వ మాత్మనః।
ప్రపద్యతే తతో మూఢ స్తేనాత్మానం న విన్దతి॥ ౨

తా॥ ఏది లోకమున దృశ్యమై యనుభూత మగుచుండునో దానితో జీవుడు (చిదాభాసుడు) తాదాత్మ్యము చెంది మూఢుడై మోహావశమున తత్స్వభావవిశిష్టునిగనే తన్ను భావించుకొనుచుండును. కాన, ఆత్మస్వరూపానుభవమును పొందలేకపోవుచున్నాడు.

వి :- అన్నమయకోశము (స్థూలదేహము), దానిలో ప్రాణమయ, మనోమయ, విజ్ఞానమయకోశములు (సూక్ష్మ శరీరము) ను గలవు. ఇవి యన్నియు చైతన్యవ్యాప్తములై యుండును. ఇవి యహంకారప్రతీతికి గోచరము లగుటచే దృశ్యములు. జీవుడు వీనితో - అనగా చిత్తాదదేహాంత సంఘాతముతో-తాదాత్మ్యము చెందియుండును. తద్వివిక్తాత్మ స్వరూపానుభవము లేమిచే చిత్తాదిదేహపర్యన్తసంఘాతమునే ఆత్మస్వరూపమునుగా దలచి సంసారియై చరించుచుండును ఇట్లు మూఢుడై మోహావశమున దేహాదులకును, ఆత్మకును

అన్యోన్యాధ్యాస జేయుచు తనను బ్రహ్మస్వరూపునిగా దెలిసికొననేరడు.

దశమస్య నవాత్మత్వప్రతిపత్తివ దాత్మనః ।
దృశ్యేషు తద్వదేవాయం మూఢో లోకో న
చాన్యథా॥ 3

తా॥ పదిమంది మూర్ఖ లోకపు డొకనదిని దాటి యావలి యొడ్డు చేరి 'మన మిపుడెందఱమున్నా'మని లెక్కించుకొనిరి. అందు లెక్కించువాడు తనను విడిచి (మరచి) తొమ్మిదిమందినే లెక్కించెనని ప్రతీతి గలదు. ఇట పదియనవాడు తన యవివేకముచే తనకంటె భిన్నులగు తొమ్మిదిమందికంటె భిన్నముగా తనను తెలిసికొనలేడు. అందుచే నాతనికి పదియవవాడు లేడని భ్రాంతి కలిగినది. అట్లే శాస్త్రాచార్యోపదేశము లేని మూఢుడు దృశ్యములగు బుద్ధ్యాదులతో తాదాత్మ్యము చెంది బుద్ధ్యాదివ్యతిరిక్తమైన ఆత్మస్వరూపమును దర్శింపలేడు. బుద్ధ్యాదిస్వభావవిశిష్టునిగనే తనను తలచును.

త్వం కురు త్వం తదేవేతి ప్రత్యయా వేకకాలికౌ ।
ఏకనీడౌ కథం స్యాతాం విరుద్ధా న్యాయతో వద ॥ 4

తా॥ ఒకే యాత్మను గూర్చి యేకకాలమున పరస్పర విరుద్ధములగు 'నీవు చేయుము' అను కర్తృత్వబుద్ధియు 'నీవు బ్రహ్మవు' అను అకర్తృత్వబుద్ధియు నెట్లు సమంజసము లగునో సయుక్తికముగ జెప్పుము.

వి :- శీతోష్ణప్రత్యయములవలె పరస్పరవిరుద్ధములైన కర్తృత్వ-అకర్తృత్వప్రకారక బుద్ధులు రెండింటిలో ఒకటి సత్యమై రెండవదానిని బాధింపవలెను - అని చెప్పుట యుక్తి సహ మగును గాని 'రెండును సత్యములే - ప్రమాణములే' యని చెప్పుట యుక్తముగాదు.

దేహాభిమానినో దుఃఖం నాదేహస్య స్వభావతః ।
స్వాపవత్తత్ప్రహాణాయ తత్త్వ మిత్యుచ్యతే దృశేః॥ ౭

అవ :- అగుచో ప్రత్యక్షానుభవసిద్ధమైన నేను దుఃఖిని; నేను సుఖిని' అను దుఃఖిత్వాదిజ్ఞానముచే శాస్త్ర సిద్ధమైన బ్రహ్మాత్మైక్యజ్ఞానము బాధింపబడుట యుక్తము - అను శంకకిట సమాధానము చెప్పబడుచున్నది.

తా॥ దుఃఖిత్వాదికము ఆత్మకు స్వాభావిక మగుచో యథార్థమే యగును గాన నయ్యది శ్రుతివాక్యశతముచే గూడ నివర్తింపబడదు. అట్లుగాక దుఃఖిత్వాదికము అవిద్యా ప్రయుక్త దేహాద్యభిమానమూల మగుచో నవిద్య నివర్తిం

చినగాని దుఃఖిత్వాదికము నివర్తింపదు. అవిద్యానివృత్తి బ్రహ్మాత్మైక్యజ్ఞానమాత్రసాధ్యము గాని కర్మసాధ్యము గాదు. మఱియు దేహాభిమానము గలవానికే దుఃఖము గలుగునుగాని సుషుప్తియందువలె దేహాభిమానము లేనివానికి సహజముగనే దుఃఖము ప్రాప్తింపదు. అట్టి దేహాద్యభిమానము నివర్తించుటకొఱకే 'తత్త్వమసి''యని శ్రుతి బ్రహ్మాత్మైక్యజ్ఞానమును బోధించినది.

కాన, ప్రత్యక్షానుభవసిద్ధమైన దుఃఖిత్వాదిప్రతీతిచే శాస్త్రసిద్ధమైన జ్ఞానము బాధింపబడదు.

దృశేశ్ఛాయా యదారూఢా ముఖచ్ఛాయేవ దర్శనే।
పశ్యంస్తం ప్రత్యయం యోగీ దృష్ట ఆత్మేతి మన్యతే॥

తా॥ తత్త్వమస్యాది వాక్యముచే దేహాదివ్యతిరిక్తాత్మజ్ఞానము కలిగినను, 'నేను దుఃఖిని' అను ప్రతీతి యనువర్తించుచుండుటచే దుఃఖము దేహాభిమానమూలము గాదని యందు లేని యట్లు గాదు.

ఒకఁడు దర్పణము (ఉపాధి) నందు తన ముఖమును చూచుకొని దర్పణ-ముఖ-స్వభావవివేకము లేక దర్పణగత దోషమాలిన్యాదిదోషవిశిష్టమైనదిగనే తన ముఖమును భావించుకొనును. దర్పణవివిక్త ముఖస్వరూపమును తెలిసికొననేరడు. అట్లే అంతఃకరణ (అహంకార) ప్రతిఫలితచైతన్యమును

అంతఃకరణదోషాల్పజ్ఞత్వాది దోషవిశిష్టముగనే దర్శింతురు. సామాన్యముగ 'నేను' అను ప్రతీతికి ఉపాధి (బుద్ధి) దోషాస్కందితమగు అంతఃకరణప్రతిఫలితచైతన్యమే గోచరించుచుండును. అంతఃకరణవివిక్తాత్మదర్శనము గలుగదు. దర్పణగత మాలిన్యాదులు ముఖమునం దారోపింపబడునట్లే అంతఃకరణగత దుఃఖిత్వసుఖిత్వాదులు చైతన్యము (ఆత్మ) నం దారోపింపబడుచుండును. ఇట్లు 'నేను దుఃఖిని' అను ప్రతీతి, కల్పితాత్మవిషయ మగుటచే దుఃఖిత్వము అవివేకమూలమని తేలినది. ఎవడు 'తత్త్వమసి' వాక్యముచే అంతఃకరణవివిక్తాత్మజ్ఞానమును పొందునో వానికి దుఃఖిత్వప్రతీతి అనువర్తింపదు. ఒకవేళ నాప్రతీతి కలిగినను నది యారోపితము; మిథ్య యని సమ్యగ్జ్ఞానముచే నెఱిగి వానికి వశుడు గాడు (ప్రతిభాసస్య బాధితానువృత్తిమాత్రత్వాత్).

తం చ మూఢం చ యద్వ్యన్యం ప్రత్యయం వేత్తి నో దృశేః ।
స ఏవ యోగినాం శ్రేష్ఠో నేతరః స్యా న్న సంశయః॥ ౭

తా॥ ఎవడు అహంకారమును, మోహమూలకమగు నవివేకమును, దుఃఖిత్వాదిప్రతీతియు ఉపాధియగు నంతఃకరణమునకు సంబంధించినవే కాని, సాక్షియగు నాత్మకు సంబంధించినవి కావని వివేకముచే నెఱుగునో యతడే యోగులలో

ప్రియతముడు; సమ్యగ్దర్శి. పూర్వోక్త సాహంకారాత్మదర్శనము గలవాడు సమ్యగ్దర్శి కాడు. సందియము లేదు.

'అజ్ఞశ్చాశ్రద్దధానశ్చ సంశయాత్మా వినశ్యతి' భ. గీ.

విజ్ఞాతేర్యస్తు విజ్ఞాతా స త్వమి త్యుచ్యతే యతః।
స స్యాదనుభవ స్తస్య తతోఽన్యోఽనుభవో

మృషా ॥ ౮

తా॥ జీవులందఱకు నాత్మగా భాసించు నహంకారమును అనాత్మ యని పోనాడినచో నా యహంకారముకంటె నన్యమగు 'త్వం' పదార్థము భాసింపనందున తత్త్వమసి వాక్యము నిరాధార మగునని యందురేని యట్లు గాదు.

దర్శనశ్రవణాదిజ్ఞానముల గ్రహించుచు విజ్ఞాతయై సర్వసాక్షియై సర్వవస్తుప్రకాశకుడై వెలుగొందు స్వయంజ్యోతిరూపుడగు నాత్మయే నీవని బృహదారణ్యకశ్రుతి బోధించుచున్నది. కావున, తత్త్వమసి వాక్యమున 'త్వం' శబ్దవాచ్యుడు సర్వావభాసకుడగు నాత్మయే (నీవే) యని శ్రుతిబోధించుట వలన తత్త్వమసి వాక్యము నిరాలంబము గాదు. ఇట్లు 'త్వం' పదార్థమునకు శ్రుతిబోధితమగు ననుభవమే యథార్థ మయినది. తదితరానుభవము మిథ్య.

"న దృష్టే ర్ద్రిష్టారం పశ్యేః......న విజ్ఞాతే ర్విజ్ఞాతారం విజానీయాః, ఏష త ఆత్మా సర్వాన్తరః; అతోఽ న్యదార్తమ్" ॥ (బృ. 3. 4. 2.)

"న హి విజ్ఞాతు ర్విజ్ఞాతే ర్విపరిలోపో విద్యతేఽవినాశిత్వాత్ న తు తద్ద్వితీయ మస్తి తతోఽన్య ద్విభక్తం యద్విజానీయాత్" (బృ. 4. 3. 30)

దృశిరూపే సదా నిత్యే దర్శనాదర్శనే మయి ।
కథం స్యాతాం తతో నాన్య ఇష్యతేఽనుభవ స్తతః॥ ౯

తా॥ నేనే దృగ్రూపుడను, అన్యనిరపేక్షమైన సత్త (ఉనికి) గలవాడను; ద్రష్ట నగుటచే-నన్ను దర్శింపజేయజాలు మఱియొక ద్రష్ట లేకపోవుటచే - జడాదిపదార్థములకువలె ఒకపుడు దర్శనము, మఱియొకపుడు అదర్శనము సంభవింప నేరవు.

వి :- జడపదార్థములు స్వతంత్రముగా భాసింపలేవు. చక్షురాదులచే భాసింపజేయబడుచుండును. అని పరప్రకాశ్యములు, అన్యాధీనప్రకాశము గలవి గాన, వానికి దర్శనాదర్శనములు సంభవము లగుచుండును.

ఆత్మ ద్రష్ట; చేతనుడు; అన్యనిరపేక్షస్వప్రకాశము గలవాడు. ఆత్మను దర్శింపజేయు మఱియొక ద్రష్ట యున్నా

డన్నచో అనవస్థాదోషము ప్రాప్తించును. కనుక, అనుభవ రూపుడే యాత్మ. అట్లగుటజేసి ఆత్మ యనుభవరూపమున సదా గోచరుడగుచుండును. జడములకువలె దర్శనాదర్శనములు లేవు.

యత్థనస్తాపో రవే ర్దేహే దృష్టేః స విషయో యథా ।
సత్త్వస్థ స్తద్వ దేవేహ దృష్టేః స విషయ స్తథా ॥ ౧౦

తా॥ ఆత్మ నిత్యదృగ్రూపు డగుట వివరింపబడుచున్నది. సూర్యుని వేడిమి దేహమునకు సోకి దేహగతమై దేహతాదాత్మ్యాభిమానముచే 'నా యొడలు వేడెక్కినది; మండుచున్నది' - యని దేహముతో పాటు ద్రష్టయగు నాత్మచే ననుభూత మగుచున్నది - కాని దేహముకంటె (తత్పదార్థముకంటె) నతిరిక్తముగ నా వేడిమి గోచరము కాదు.

అట్లే ఆ యా విషయానుభవముచే గలిగిన సుఖదుఃఖాదితాపము అంతఃకరణగతమై అంతఃకరణతాదాత్మ్యాభిమానముచే సుఖాదితాపవిశిష్టమగు నంతఃకరణముతో పాటు ద్రష్ట యగు నాత్మచే ననుభూత మగుచున్నది.

ఇట్లు దేహతాదాత్మ్యాభిమానముచే 'నేను తపుడను: నా యొడలు వేడెక్కినది' - అను అనుభవము గలిగినట్లు అంతఃకరణతాదాత్మ్యాభిమానముచే 'నేను సుఖిని:- నేను దుఃఖిని' అను అనుభవమును కలుగుచుండుట జేసి

యీ సుఖదుఃఖాద్యనుభవములు అవివేకమూలములు, అధ్యాసమూలములు నని తెలియుచున్నది. కాన వివేకికి సుఖదుఃఖాదులు ఆత్మకు సంబంధించినవిగా నెప్పుడును భాసింపవు. ఆత్మ కేవలము దృగ్రూపుడు.

ACC NO = 16

ప్రతిషిద్ధేదమంశో జ్ఞః ఖమివైకరసోఽద్వయః ।
నిత్యముక్తః సదా శుద్ధః సోఽహంబ్రహ్మాస్మి
కేవలః ॥ ౧౧

181.482 SHA

తా॥ నేతి నేతీత్యాది శ్రుతివాక్యములచే 'ఇది కాదు. ఇది కాదని ఇదం (ఇది) శబ్దప్రతిపాద్యమగు దృశ్య మంతయు ఆత్మ కాదని నిషేధింపబడినది. కాన, దృశ్యము అనాత్మ రూపము. అనాత్మరూపమగు ఇదమంశము నిషేధింపబడగా మిగిలెడి అద్వయరూపుడను నేను. ఆకాశము వలె ఏకరూపుడను; నిత్యముక్తుడను; నిత్యపరిశుద్ధుడను. అద్వితీయుడగు బ్రహ్మను. (చూ. 3వ ప్రకరణము, 2 శ్లో.)

విజ్ఞాతుర్నైవ విజ్ఞాతా పరోఽన్యః సంభవత్యతః ।
విజ్ఞాతాఽహం పరో ముక్తః సర్వభూతేషు
సర్వదా ॥ ౧౨

తా॥ సర్వసాక్షియై సర్వవస్త్వవభాసకుడై విజ్ఞాతయైన ఆత్మకంటె వేఱుగా సర్వవ్యాపకుడైన మఱియొక

విజ్ఞాత లేనందున స్థావరజంగమరూపములయిన నిఖిలభూతముల యందును సాక్షియై భాసించుచు నిత్యముక్తుడనై వెలయు విజ్ఞానరూపుడను నేను.

వి :- జ్ఞానము జ్ఞేయము (తెలియదగినవస్తువు) కంటె భిన్నము. కాన నది జ్ఞేయధర్మరహితము. జ్ఞానరూపుడగు ఆత్మ జ్ఞేయధర్మరహితుడగుటచే నిత్యముక్తుడు; స్వరూపభేద రహితుడు.

యో వేదాలుప్తదృష్టిత్వ మాత్మనోఽకర్తృతాం తథా।
బ్రహ్మవిత్త్వం తథా ముక్త్వా స ఆత్మజ్ఞో న చేతరః ॥ ౧౩

తా॥ ఇట్లు శ్రుత్యుపదేశమువలన నిరంతరము అద్వయాత్మానుసంధానము చేయుచు 'నేను బ్రహ్మవేత్త' ననెడి యభిమానమునుగూడవిడిచి ఆత్మ నిర్విశేషస్వరూపుడనియు, సదా చిద్రూపు డగుటచే ద్రష్ట యనియు, కర్తృత్వాద్యభిమానరహితు డగుటచే అకర్త యనియు నెవడు తెలిసికొనునో, యతడే యాత్మతత్త్వజ్ఞుడైన బ్రహ్మవేత్త. అట్లుగాక లేశమేని యభిమాన మెవనికి శేషించి యుండునో, యతడు ఆత్మజ్ఞుడు గాడు.

జ్ఞాతైవాహ మభిన్నోఽయం శుద్ధో ముక్తః సదేత్యపి।
వివేకీ ప్రత్యయో బుద్ధేర్దృశ్యత్వా న్నాశవాన్
యతః ॥ ౧౪

తా॥ బ్రహ్మవేత్తకు బ్రహ్మాత్మజ్ఞాని ననెడి యభిమానము శేషించియుండు ననెడి వాదము సరికాదు. 'అహం బ్రహ్మాస్మి' త్యాది మహావాక్యశ్రవణము వలన బుద్ధియందు అఖండ బహ్మాకారచరమవృత్తి యుదయించును. ఇదియే బ్రహ్మవిద్య. ఇదియు బుద్ధివృత్తిరూపమగుటజేసి దృశ్యమగుచు సాక్షిగోచర మగుచుండును. ఇట్లు దృశ్యమై సాక్షిభాస్యమయిన యీ వృత్తి తుదకు స్వయముగ నశించును. ఎట్లన - జలగతమాలిన్యమును బోగొట్టుటకు దోడుపడెడి చిల్లగింజగంధము జలమునందలి మాలిన్యమును బోగొట్టుచు నా మాలిన్యము తోపాటు దానును స్వయముగ నశించునట్లు బుద్ధిగత - అవిద్యాకల్పిత భేదవాసనాదిరూప మాలిన్యమును బోగొట్టుటకు తోడుపడిన అఖండబ్రహ్మాకారచరమవృత్తి బుద్ధిగతమాలిన్యమును బోగొట్టుచు నామాలిన్యము తోపాటు దానును స్వయముగ నశించును. కాన బ్రహ్మవేత్తకు బ్రహ్మాత్మజ్ఞాని ననెడి యభిమానము శేషించి యుండదు.

అలుప్తా త్యాత్మనో దృష్టిర్నోత్పాద్యా కారకై ర్యతః ।
దృశ్యయా చాన్యయా దృష్ట్యా జన్యతాఽన్యాః
ప్రకల్పితా ॥ ౧౨

తా॥ ఆత్మచైతన్యము దృగ్రూపము. ఆత్మచైతన్య దృష్టిచేతనే సర్వవస్తువులు భాసించుచుండును. ఈ యాత్మ

దృష్టి కెన్నఁడు లోపముండదు. ఇట్లు స్వరూపభూత మయిన యాత్మదృష్టి యుపాధి యగు బుద్ధివృత్తిచే ఘటపటాది విశేషాకారము గలదిగ కల్పింపబడుచున్నది. అనగా, నిర్వికారమైన ఆత్మదృష్టియందు బుద్ధివృత్తిచే విశేషాకారమారోపింపబడుచున్నది. ఘటముతోపాటు ఘటాకాశము వలె బుద్ధివృత్తితోపాటు బుద్ధివృత్త్యవచ్ఛిన్న చైతన్యము గూడ ఉపాధికల్పితభేదరూపమున భాసించుచున్నది. ఉత్పత్తివినాశములు ఘటమునకు గలవుకాని యాకాశమునకు లేవు. అట్లే యుత్పత్తిలయములు బుద్ధివృత్తివే కాని చైతన్యమునకు లేవు. ఆకాశమునకు వలెనే చైతన్యమునకు గూడ నుత్పత్తి లేదు.

దేహాత్మబుద్ధ్యపేక్షత్వా దాత్మనః కర్తృతా మృషా ।
నైవ కించిత్కరోమీతి సత్యా బుద్ధిః ప్రమాణజా॥ ౧౬

తా॥ అనాత్మ యగు దేహమే యాత్మ యను మిథ్యాబుద్ధి వలన 'నేను కర్తను' - అనెడి కర్తృత్వబుద్ధి గలుగుచున్నదిగాన, ఆత్మయందు కర్తృత్వము కల్పితముగాని స్వాభావికము గాదు. 'నేను కర్తను గాను' అను అకర్త్రాత్మబుద్ధి 'నిష్కలం నిష్క్రియం శాన్త' మిత్యాది శాస్త్రప్రమాణము వలన గలుగుటజేసి సత్యము. కాన, సత్యమగు అకర్త్రాత్మబుద్ధిచే మిథ్యాబుద్ధిజన్య మగు దేహాత్మ

బుద్ధియు తత్పూర్వకమగు కర్తృత్వబుద్ధియు బాధింపబడును.

కర్తృత్వం కారకాపేక్ష మకర్తృత్వం స్వభావతః।
కర్తా భోక్తేతి విజ్ఞానం మృషైవేతి సునిశ్చితమ్॥ ౧౩

తా॥ అసంగుడు, నిరవయవుడు నగు ఆత్మకు ఇంద్రియాది కారకసంసర్గము వాస్తవముగా లేనందున అకర్తృత్వము స్వాభావికము, కాన ఆత్మ కర్తయు భోక్తయు నగు ననెడి జ్ఞానము మిథ్యయే యగును.

ఏవం శాస్త్రానుమానాభ్యాం స్వరూపేఽవగతే సతి।
నియోజ్యోఽహ మితి హ్యేషా సత్యా బుద్ధిః కథం
భవేత్॥ ౧౪

తా॥ పైన 'విజ్ఞాతే ర్యస్తు విజ్ఞాతా స త్వ మిత్యుచ్యతే' (శ్లో. 8) యను శ్లోకమున నుదాహరింపబడిన శ్రుతి ప్రమాణము వలనను, 'యత్ప్రస్తాపో రవేర్దేహ' (శ్లో. 10) యను శ్లోకమున చూపిన యనుమానప్రమాణము వలనను అహం బ్రహ్మాస్మి - యని యాత్మస్వరూపవిజ్ఞానము నిర్బాధముగా గలుగుచుండ 'నేను నియోజ్యుడను' - అనెడి బుద్ధి యథార్థ మెట్లగును ?

యథా సర్వాన్తరం వ్యోమ వ్యోమ్నోఽప్యభ్యన్తరో
హ్యహమ్ ।
నిర్వికారోఽచలః శుద్ధోఽజరో ముక్తః
సదాఽద్వయః ॥ ౧౯

తా॥ సర్వవ్యాపకమగు నాకాశము కంటెను సూక్ష్ముడను, నిర్వికారుడను, నిశ్చలుడను, శుద్ధుడను, జరామరణరహితుడను, నిత్యముక్తుడను, నిత్యము అద్వయరూపుడను.

---

## అచాక్షుష ప్రకరణమ్ - ౧౩

అచక్షుష్ట్వాన్న దృష్టిర్మే తథాఽశ్రోత్రస్య కా శ్రుతిః ।
అవాక్త్వాన్న తు వక్తిః స్యాదమనస్త్వాన్మతిః కుతః ॥ ౧

తా॥ నేత్రము దేహదేశము నాశ్రయించినది; భౌతికము. కాన, ఆత్మకు సంబంధించినది కాదు. మఱియు చక్షురింద్రియము ద్వారా బుద్ధివృత్తి వెలుపలకు ప్రసరించి ఘటపటాదిరూపరంజితమై యొప్పి జ్ఞానక్రియగా భాసించును. ఇట్టి బుద్ధివృత్తిరూపజ్ఞానమునకే దృష్టి యని పేరు. శ్రోత్రాదీంద్రియములు, తజ్జన్యజ్ఞానములు కూడ నిట్టివే. కాన ఇంద్రి

యములు, తజ్జన్యజ్ఞానములును నాకు (ఆత్మకు) సంబంధించినవి కావు. ఇట్లు చక్షురింద్రియము లేమిచే దృష్టిగాని, శ్రోత్రేంద్రియము లేమిచే శ్రవణముగాని, వాగింద్రియరహితుడ నగుటచే వాక్కుగాని, మనోరహితుడ నగుటచే మతిగాని నాకు (ఆత్మకు) లేవు.

అప్రాణస్య న కర్మాస్తి బుద్ధ్యభావే న వేదితా ।
విద్యావిద్యే తతో న స్త శ్చిన్మాత్రజ్యోతిషో మమ॥ ౭

తా॥ నిత్యము చిదేకరసరూపుడనై వెలుగొందు నాకు ప్రాణబుద్ధులు లేనందున తన్నిమిత్తము లయిన కర్మజ్ఞానములుగాని, విద్యావిద్యలుగాని లేవు. కాన నిత్యశుద్ధుడను.

నిత్యముక్తస్య శుద్ధస్య కూటస్థస్యావిచాలినః ।
అమృతస్యాక్షరస్యైవ మశరీరస్య సర్వదా ॥ ౮

తా॥ శరీరసంబంధము లేనిదే ఆత్మకు అశుద్ధి - చలన-వినాశాదులు సంభవింపవు. నేను అశరీరుడ నగుటచే శుద్ధుడను; కాన నిత్యముక్తుడను. అచంచలుడ నగుటజేసి కూటస్థుడను. వినాశరహితుడ నగుటచే నమృతుడను. కాన నాకు విద్యావిద్యలు లేవు.

జిఘత్సా వా పిపాసా వా శోకమోహౌ జరామృతీ ।
న విద్యన్తేఽశరీరత్వా ద్వ్యోమవద్వ్యాపినో మమ॥ ౯

తా॥ అశరీరుడను, అప్రాణుడను, అమనస్కుడను, ఆకాశమువలె సర్వవ్యాపకుడ నగుటచే నాకు ఆకలిదప్పులు గాని, శోకమోహములుగాని, జరామరణములుగాని లేవు.

అస్పర్శత్వా న్న మే స్పృష్టి ర్నాజిహ్వత్వా ద్రసజ్ఞతా।
నిత్యవిజ్ఞానరూపస్య జ్ఞానాజ్ఞానే న మే సదా॥ ౫

తా॥ స్పర్శేంద్రియరహితుడ నగుటచే స్పర్శగాని, జిహ్వేంద్రియశూన్యుడ నగుటచే రసజ్ఞతగాని, నిత్యవిజ్ఞానరూపుడ నగుటచే జ్ఞానాజ్ఞానములు గాని నాకు లేవు.

యా తు స్యాన్మానసీ వృత్తి శ్చాక్షుషా రూపరఞ్జనా।
నిత్యమేవాత్మనో దృష్ట్యా నిత్యయా దృశ్యతే
హి సా॥ ౬

తా॥ చక్షురింద్రియము ద్వారా వెలుపలకు ప్రసరించి రూపాదివిషయాకారరంజితమై యొప్పు బుద్ధివృత్తి దృగ్రూప-ఆత్మచైతన్యప్రకాశముచే నెల్లపుడు దృశ్య మగుచుండును (ప్రకాశింపజేయుచుండును). ఇది సర్వానుభవసిద్ధము. ఏది దేనిచేత ప్రకాశింపజేయబడునో యది దానికి సంబంధింపదు. కంటిచే ప్రకాశింపజేయబడు రూపము కంటికి సంబంధింపదు. శబ్దాదులును శ్రవణాదీంద్రియములకు సంబంధింపవు. అట్లే యాత్మచైతన్యముచె భాసించెడి దృష్ట్యాదులును ఆత్మకు సంబంధింపవు.

తథాన్యేంద్రియయుక్తా యా వృత్తయో విషయాఙ్జనాః।
స్మృతీ రాగాదిరూపా చ కేవలాన్తర్మనస్యపి॥ 8

తా॥ అట్లే అన్యేంద్రియములద్వారా బుద్ధియందుద యించు తత్తద్విషయాకారవృత్తులును, చక్షురాదీంద్రియ నిరపేక్షముగా మనస్సున నుదయించు రాగాదిరూపస్మృతియు పూర్వోక్తమగు ఆత్మచైతన్యప్రకాశము చేతనే ప్రకాశింపజేయబడుచున్నది.

మానస్యస్తద్వదన్యస్య దృశ్యన్తే స్వప్నవృత్తయః।
ద్రష్టుర్దృష్టిస్తతో నిత్యా శుద్ధానన్తా చ కేవలా॥ 9

తా॥ ఇట్లు జాగ్రద్దశయందలి బుద్ధివృత్తులే కాక స్వప్నమున మనస్సున నుదయించు విషయాకారవృత్తులు గూడ సాక్షిచైతన్యప్రకాశము చేతనే ప్రకాశింపజేయబడుచున్నవి, బుద్ధివృత్తులు ప్రకాశ్యము లగుటచే నవి ప్రకాశకమగు ఆత్మచైతన్యప్రకాశము కంటె భిన్నములు, సర్వవస్తుప్రకాశకుడగు సూర్యునకు ఆ యా వస్తువుల యందలి దోషములు సంక్రమింపనట్లు సర్వబుద్ధివృత్తిప్రకాశకమగు ఆత్మచైతన్యమునకు బుద్ధివృత్తిగత మాలిన్యాదు లంటవు. కాన ఆత్మచైతన్యదృష్టి నిత్యము, శుద్ధము, అనంతము, అద్వితీయము.

అనిత్యా సాఽవిశుద్ధేతి గృహ్యతేఽత్రావివేకతః ।
సుఖీ దుఃఖీ తథాచాహం దృశ్యయోపాధిభూతయా॥ ౯

తా॥ ఆత్మదృష్టి పైన చెప్పినట్లు కూటస్థమైనను వృత్తివిశిష్టమగు నంతఃకరణము కంటె నాత్మ భిన్న మను వివేకము లేక ఉపాధి యగు బుద్ధి యందలి దోషములను ఆత్మదృష్టియందారోపించి ఆత్మదృష్టి అనిత్యము, అవిశుద్ధము'- అనియు, నేను సుఖిని, దుఃఖిని - అనియు తలతురు.

మూఢయా మూఢ ఇత్యేవం శుద్ధయా శుద్ధ ఇత్యపి ।
మన్యతే సర్వలోకోఽయం యేన సంసార మృచ్ఛతి॥ ౧౦

తా॥ మోహావిష్టమైన బుద్ధితో తాదాత్మ్యము చెంది మూఢుడ ననియు విశుద్ధమైన బుద్ధితో తాదాత్మ్యము చెంది విశుద్ధుడ ననియు భ్రమించి యందఱు సంసారమున పరిభ్రమించుచున్నారు.

అచక్షుష్ట్వాదిశాస్త్రోక్తం సబాహ్యాభ్యన్తరం త్వజమ్ ।
నిత్యముక్త మిహాత్మానం ముముక్షుశ్చే త్సదా
స్మరేత్॥ ౧౧

తా॥ ప్రాణులలో నెవనికైనను తీవ్రమోక్షేచ్ఛ జనించినచో నాతడెప్పుడును శ్రుత్యాచార్యోపదేశముల ననుసరించి పైన అచక్షుష్ట్వాది శాస్త్రప్రతిపాదితాత్మస్వరూపమును అనుసంధానము చేసికొనుచుండవలెను.

అచక్షుష్ట్వాదిశాస్త్రోచ్చ నేంద్రియాణి సదా మమ ।
అప్రాణో హ్యమనాః శుభ్ర ఇతి చాథర్వణే ర్వచః ॥ ౧౨

తా॥ 'అచక్షుష్క మశ్రోత్ర మవా గమన' యని బృహదారణ్యక శ్రుతియు, 'అప్రాణో హ్యమనాః శుభ్ర' యని ముండకోపనిషత్తును బుద్ధి - ఇంద్రియ - ప్రాణాది వ్యతిరిక్త - నిత్య శుద్ధ బుద్ధ ముక్త స్వరూపుడగు ఆత్మస్వరూపమును బ్రతిపాదించినవి.

శబ్దాదీనా మభావశ్చ శ్రూయతే మమ కాఠకే ।
అప్రాణో హ్యమనా యస్మా దవికారీ సదా
హ్యహమ్ ॥ ౧౩

తా॥ 'అశబ్ద మస్పర్శ మరూప మవ్యయం తథాఽరసం నిత్య మగంధవచ్చ యత్ । అనాద్యనన్తం మహతః పరం ధ్రువం నిచాయ్య తం మృత్యుముఖా త్ప్రముచ్యతే' యని కాఠకశ్రుతి యందు ఆత్మస్వరూపము ప్రతిపాదింపబడినది. 'బ్రహ్మము శబ్దస్పర్శరూప రసగంధరహితము; అవ్యయము; నిత్యము; ఆద్యన్తరహితము; బుద్ధియను పేరు గల మహత్తత్త్వము కంటె విలక్షణ మయినది. అట్టి యాత్మతత్త్వము శాశ్వత మయినదని యెఱిగి అవిద్యాకామకర్మలక్షణమగు మృత్యుముఖమునుండి విముక్తు డగునని యీ శ్రుతితాత్ప

ర్యము. ఇట్లు శ్రుతిప్రామాణ్యము ననుసరించి 'నేను ప్రాణేంద్రియమనోవిలక్షణుడ నగు నిర్వికారాత్మస్వరూపుడను.'

విక్షేపో నాస్తి తస్మాన్మే న సమాధి స్తతో మమ ।
విక్షేపో వా సమాధిర్వా మనసః స్యాద్వికారిణః॥ ౧౪

**తా॥** విక్షేపముగాని, విక్షేపనివృత్తిరూపమగు సమాధిగాని వికారాస్పదమగు మనస్సునకు సంబంధించినవి. నేను మనస్సుకంటె విలక్షణుడనై యమనస్కుడ నగుటచే నాకు విక్షేపసమాధులు లేవు.

అమనస్కస్య శుద్ధస్య కథం తత్స్యాద్ద్వయం మమ ।
అమనస్త్వావికారిత్వే విదేహవ్యాపినో మమ ॥ ౧౫

తా॥ పరిచ్ఛిన్న దేహరహితుడ నగుటచే అమనస్కుడను. అమనస్కుడ నగుటచే నిర్వికారుడను; సర్వవ్యాపకుడను. ఇట్లు నిర్వికారుడనై నిత్యపరిశుద్ధుడనైన నాకు విక్షేపసమాధు లెక్కడివి ?

ఇత్యేత ద్యావదజ్ఞానం తావత్కార్యం మమాభవత్ ।
నిత్యముక్తస్య శుద్ధస్య బుద్ధస్య చ సదా మమ ॥ ౧౬

**తా॥** ఇట్లు నిత్య శుద్ధ బుద్ధ ముక్త స్వభావుడ నయ్యు ఆత్మవిషయకమగు నజ్ఞానము విడువనంతవరకు సమాధి

మున్నగునవి ఆచరించితిని. అపరోక్షాత్మస్వరూపజ్ఞానము కలిగిన నాకిపుడు వానితో బని లేదు.

సమాధిర్వాఽసమాధిర్వా కార్యం చాన్యత్కుతో భవేత్
మాం హి ధ్యాత్వా చ బుద్ధ్వా చ మన్యన్తే
కృతకృత్యతామ్ ॥ ౧౭

తా॥ ప్రత్యగాత్మస్వరూపుడ నగు నన్ను శ్రుత్యాచార్యోపదేశముల ననుసరించి చక్కగ దెలిసికొని యపరోక్షాత్మానుభవము నొంది కృతార్థుల మైతిమని తలచు ముముక్షువుల కజ్ఞానము నశించుటచే తన్మూలకమగు సంసార మనువర్తింపదుగాన, విక్షేపము లేదు. అందుచే తన్నివృత్తిరూపమగు సమాధియు లేదు.

'ఏష నిత్యో మహిమా బ్రాహ్మణస్య న కర్మణా వర్ధతే నో కనీయాన్' (బృ. 4. 4. 23.)

'యస్త్వాత్మరతిరేవ స్యా దాత్మతృప్తశ్చ మానవః ।
ఆత్మన్యేవ చ సంతుష్ట స్తస్య కార్యం న విద్యతే ॥
భ. గీ. 3, 17.

అహం బ్రహ్మాస్మి సర్వోఽస్మి శుద్ధో బుద్ధోఽస్మ్యతః
సదా ।
అజః సర్వత ఏవాహ మజర శ్చాక్షయోఽమృతః ॥ ౧౮

తా॥ బ్రహ్మాత్వము నాకు నిత్యసిద్ధ మగుటచే నెపుడును నేను శుద్ధుడను, బుద్ధుడను; కాన బంధరహితుడను, అజుడను, వినాశరహితుడను; కాన జన్మక్షయ హేతురహితుడను. ఇట్లు నిష్ప్రపంచాత్మస్వరూపుడ నగుటచే సమాధ్యాదులు నాకు కర్తవ్యములు గావు.

మహాన్యః సర్వభూతేషు బోద్ధా కశ్చిన్న విద్యతే।
కర్మాధ్యక్షశ్చ సాక్షీ చ చేతా నిత్యోఽగుణోఽ
ద్వయః॥ ౧౫

తా॥ దేహభేదముచే నాత్మభేదము సిద్ధ మగుటచే 'అహం బ్రహ్మాస్మి'యని పూర్ణబ్రహ్మానుభవ మెట్లు గలుగును ?

శ్రుతి యందు 'ఆత్మ యొకడే సర్వభూతములయందు సాక్షియై, చేతనుడు, నిత్యుడు, అగుణుడు, అద్వయుడు నగుచు సర్వకర్మాధ్యక్షుడై విరాజిల్లుచుండును. ఈ యాత్మకంటె వేఱొకజ్ఞాత యెవడును లేడు'-అని ప్రతిపాదింపబడినది. కాన దేహభేదముచేత ఆత్మభేదము సిద్ధింపదు. అందువలన అహం బ్రహ్మాస్మి యని పూర్ణ బ్రహ్మానుభవము గలుగుటలో బాధకమ్మేయు లేదు

న సచ్చాహం న చాసచ్చ నోభయం కేవలః శివః।
న మే సంధ్యా న రాత్రి ర్వా నాహర్వా సర్వదా
దృశేః॥ ౨౦

తా॥ ప్రత్యక్షయోగ్యము లయిన పృథివీ జల తేజస్సులు సత్ అనియు, 'త్యత్' శబ్దవాచ్యములును, ప్రత్యక్షాయోగ్యములును నగు వాయ్వాకాశములు 'అసత్' అనియు చెప్పబడును. పంచభూతపరిణామాత్మకమగు శరీరము ఉభయాత్మకము. నేను సదసదుభయాతీత కేవలశివస్వరూపుడను. సర్వదా ద్రష్టనై వెలుగొందుచుండు నాకు సంధ్యగాని, రాత్రిగాని, పగలుగాని, లేక స్వప్న సుషుప్తి జాగ్రదాద్యవస్థలు గాని లేవు. నిత్యము నిర్వికారుడనై ద్రష్టృరూపమున ప్రకాశించుచుండు నాకు స్వరూపావరణ విక్షేపరూపావస్థ లెక్కడివి?

సర్వమూర్తివియుక్తం యద్యథా ఖం సూక్ష్మమద్వయమ్।
తేనాప్యస్మి వినాభూతం బ్రహ్మైవాహం
తథాఽద్వయమ్॥ ౨౧

తా॥ పృథివ్యాది పరిచ్ఛిన్నపదార్థముల కంటె విలక్షణమై యాకాశము సూక్ష్మము, అద్వయమునై యొప్పునట్లు బ్రహ్మయు పరిచ్ఛిన్నమగు దృశ్యము సర్వముకంటె విలక్షణుడై యత్యంతసూక్ష్ముడై, పరిపూర్ణుడై; అద్వితీయుడునై

విరాజిల్లుచుండును. ఇట్లు అద్వితీయుడు, పరిపూర్ణుడు నగు బ్రహ్మకంటె ఆత్మ భిన్నుడు కానందున బ్రహ్మయే నేను. బ్రహ్మకును ఆకాశమునకును ఉపమానోపమేయభావము చెప్పుటచే బ్రహ్మకంటె నాకాశము భిన్నమని యంగీకరించి నట్లగును గదా? బ్రహ్మకు అద్వితీయత్వ మెట్లు పొసగునని యనరాదు. బ్రహ్మ యిట్లుండునని సుఖబోధకొఱకు వ్యవహారదృష్టితో నీ యుపమానోపమేయభావము చెప్పబడినది. కాని, పరమార్థమున నాకాశముగూడ మిథ్యయే. అట్టి యాకాశముచే బ్రహ్మకు సద్వితీయత్వము లేదు. కాన నట్టి యాకాశము కంటె గూడ విలక్షణుడు పూర్ణుడు నగు బ్రహ్మయే నేనని సిద్ధించినది.

ఆకాశదృష్టాంతముచే బ్రహ్మకు పూర్ణత్వము నిరూపించి పరమార్థమున నాకాశముచే సద్వితీయత్వము లేదని చెప్పబడినది. మరల నిపుడాదృష్టాంతము చేతనే భేదప్రతీతిచే గలుగు పరిచ్ఛిన్నత్వము గూడ నిరాకరింపబడుచున్నది.

మహాత్మా స్వత ఆత్మేతి భేదో వ్యోమ్నో యథా
భవేత్ ।
ఏకస్య సుషిభేదేన తథా మమ వికల్పితః ॥ ౨౨

తా॥ విజాతి యగు నామొక్క స్వరూపము (ఆత్మ) బ్రహ్మ యనియు, నామొక్క ఆత్మ యనియు నొకే యాత్మ

యందు ఆత్మ - ఆత్మీయభావముచే భేదము భాసించుటకు గారణ మేమని యనవచ్చును. వివిధవస్తుకల్పిత ఛిద్రభేదముచే నొకే యాకాశమందు అంశాంశిభావ మారోపితమైనట్లు అంతఃకరణాద్యుపాధికృత భేదముచే నొకే యాత్మయందు ఆత్మ - ఆత్మీయభేదభావ మారోపింపబడినది.

భేదోఽభేద స్తథా చైకో నానా చేతి వికల్పితః ।
జ్ఞేయం జ్ఞాతా గతిర్గన్తా మయ్యేకస్మిన్ కుతో
భవేత్ ॥ ౨౩

తా॥ బ్రహ్మాత్మైక్యజ్ఞానము గలుగుటకు పూర్వము అవిద్యాదశయందు భేదాభేదములు, ఏకత్వానాత్వములు, జ్ఞాతృజ్ఞేయభావము, క్రియాఫల (గతి) భోక్తృత్వములును, నాయందారోపింపబడినవి. పరిశీలించినచో ఆత్మతత్త్వజ్ఞానినై యద్వయభావమున నున్న నాయందివి యన్నియు నెక్కడివి ?

న మే హేయం నచాదేయ మవికారీ యతో హ్యహమ్ ।
సదా ముక్త స్తథా శుద్ధః సదా బుద్ధోఽగుణో
ఽద్వయః॥ ౨౪

తా॥ ఆత్మకు హేయమగు సంసారిత్వమును, ఉపాదేయమగు బ్రహ్మత్వము నుండుటచే నిర్విశేషత్వ మెట్లు సిద్ధించును ?- అని యనరాదు.

నేను నిర్వికారుడ నగుటచే నారోపితము, హేయము నగు సంసారిత్వము లేదు; బ్రహ్మత్వము నా యథార్థస్వరూపమె యగుటఁజేసి నిత్యసిద్ధ మగుటచె నాకుపాదేయము గాదు. కాన నేను నిత్యముక్తుడను (బంధసంసర్గశూన్యుడను); నిత్యశుద్ధుడను (సంసారహేతు - అవిద్యాసంబంధరహితుడను); నిత్యబోధస్వరూపుడను; (బోధరూపుడ నగుటచే) నిర్గుణుడను; బోధస్వరూపుడ నయ్యు జ్ఞేయవస్త్వంతరహితుడ నగుటచే నద్వయుడను.

వి :- "అవికార్యోఽయ ముచ్యతే" (భ. గీ. 2. 25)

ఇత్యేవం సర్వదాఽత్మానం విద్యాత్సర్వం సమాహితః ।
విదిత్వా మాం స్వదేహస్థ మృషి ర్ముక్తో ధ్రువో
భవేత్ ॥ ౨౫

తా॥ ఇట్లు పైన పేర్కొనబడిన లక్షణములు గలిగి యాత్మ తన దేహమునందే యున్నటుల శాస్త్రాచార్యోపదేశముల ననుసరించి తెలిసికొని శ్రవణ - మనన - నిదిధ్యాసన పరుడై తీవ్రమోక్షేచ్ఛతో 'అహం బ్రహ్మాస్మి' యని నిరంతర మనుసంధానము జేసికొనుచుండవలెను. అట్లు చేసినచో ఋషియై (సర్వదర్శియై) తప్పక ముక్తుడగును.

కృతకృత్యశ్చ సిద్ధశ్చ యోగీ బ్రాహ్మణ ఏవచ ।
య ఏవం వేద తత్త్వార్థ మన్యథా హ్యాత్మహా
భవేత్ ॥ ౨౬

తా॥ మఱియు నెవడీ యాత్మతత్త్వమును తెలిసికొనునో యాతడు కృతార్థుడు, సిద్ధుడు, యోగి, బ్రహ్మజ్ఞానసంపన్నుడునగును. అట్లు తెలిసికొననివాడు ఆత్మఘాతుకుడగును.

(బృ. ఉ. 3-10; భాగ. 11. 20. 17)

వేదార్థో నిశ్చితో హ్యేష సమాసేన మయోదితః।
సంన్యాసిభ్యః ప్రవక్తవ్యః శాంతేభ్యః శిష్టబుద్ధినా॥ ౨౭

తా॥ సునిశ్చితమగు వేదార్థము నిట సంగ్రహముగా వివరించితిని. శాస్త్రాచార్యోపదేశములచే సుసంస్కృతచిత్తుడగు శిష్టుడు శమదమాది సాధనసంపత్తి గల సంన్యాసులకు మాత్రమే దీనిని ప్రవచింపవలెను.

## స్వప్నస్మృతి ప్రకరణమ్

స్వప్నస్మృత్యోర్ఘటాదేర్హి రూపాభాసః ప్రదృశ్యతే।
పురా నూనం తదాకారా ధీర్దృష్టే త్యనుమీయతే॥ ౧

అవ :- పూర్వప్రకరణమున ఆత్మకు సంసారిత్వము అంతఃకరణోపాధికల్పితము; స్వాభావికము గాదు; బ్రహ్మాత్మైకత్వజ్ఞానముచే నజ్ఞాన తత్కార్యములు బాధింపబడగనే

యాత్మ బ్రహ్మ రూపమున నపరోక్షముగ సాక్షాత్కరించు నని శాస్త్రప్రామాణ్యముచే నిర్ధారింపబడినది. అంతఃకరణము పరోక్షము; సంసారిత్వప్రతీతి అపరోక్షము; కాన సంసారప్రతీతి బుద్ధ్యవివేకకల్పితము గాదని శంకించి యంతఃకరణమున కపరోక్షత్వమును సోపపత్తికముగ నిరూపించుటకై యీప్రకరణ మారంభింపబడుచున్నది.

తా॥ స్వప్నమునందును, స్మృతియందును ఘటపటాది వస్తువులు (విషయములు) ఆ యా రూపములతో బొడగట్టుచుండును గనుక అంతకు బూర్వము జాగ్రదవస్థయందును ఘటపటాద్యాకారము గల యంతఃకరణవృత్తి యపరోక్షముగా సాక్షాత్కరించి యుండవలె నని యనుమానప్రమాణముచే నూహింపనగును.

వి :– పూర్వ మొకప్పుడు దర్శించిన ఘటపటాదివస్తువులే మరల స్వప్నమునగాని, స్మృతియందుగాని గోచరములగుచుండును – అను నియమము లోకసిద్ధము. పూర్వము దర్శింపబడిన యా ఘటాదులు స్వప్నసమయమున గాని, స్మృతికలిగినసమయమునగాని, లేకున్నను తత్తదాకారప్రతీతి కలుగుచుండుటచే స్వప్నస్మృతులయందు గోచరించు విషయములు, విషయాకారముగా బరిణమించిన యంతఃకరణవృత్తి రూపములే కాని వేరు కావు – అనగా తత్తదాకారపరిణత

వృత్తిమదంతఃకరణమే స్వప్నస్మృతులయందు తత్తదర్థాకారమున భాసించుచుండును. కనుక, జాగ్రత్పూర్వానుభవముల యందు సైతము తత్తదర్థాకారవృత్తులతో గూడిన యంతఃకరణమే యా యా యర్థరూపమున నపరోక్షముగా భాసించినదని యనుమానప్రమాణముచే జెప్పవలసియున్నది. ఇట్లు అర్థాకారవృత్తిమదంతఃకరణము అపరోక్షముగా నన్నిదశల యందు భాసించుచుండుటచే నీయంతఃకరణోపాధిచే నజ్ఞానవశమున నాత్మయందు కల్పింపబడెడి సంసారిత్వప్రతీతియు నపరోక్షమే యగు ననుటయుక్తము.

భిక్షాటన్ యథా స్వప్నే దృష్టో దేహో న స స్వయమ్ ।
జాగ్రద్దృశ్యాత్తథా దేహాద్ద్రష్టృత్వాదన్య ఏవ సః ॥ ౨

తా॥ యతి నిదురించుచు తాను భిక్షాటనము చేయుచున్నట్లు స్వప్నము గాంచును. స్వప్నమున భిక్షాటనము చేయుచు గోచరించిన యా దేహము జడమగుటచే స్వయముగా ద్రష్ట కాజాలదు. అది తనకంటె భిన్నమై దృశ్యముగా గన్పట్టుటచే యతికి స్వప్నదృష్ట దేహాత్మత్వప్రతీతి కలుగదు. అట్లే జాగ్రద్దశయందును భిన్నముగా దృశ్యమై గోచరించు శరీరము జడ మగుటచే స్వయముగా ద్రష్ట కాజాలదు.

జడము, దృశ్యము నగు శరీరము కంటె చేతనుడు, ద్రష్టయు నగు ఆత్మ భిన్నుడే యగుటచే ఆత్మానాత్మవివేకము గల జ్ఞానికి దేహాత్మత్వప్రతీతి కలుగదు.

వి :- ఇట 'దేహ' పదముచే స్థూల సూక్ష్మ దేహములు రెండును గ్రహింపనగును. తత్తదర్థాకారవృత్తులతో గూడిన యంతఃకరణమే యా యా యర్థరూపమున నపరోక్షముగా భాసించుచుండునని ప్రమాణములచే నిర్ణీతమగుటచే నంతఃకరణమును దృశ్యమే యగుచున్నది. అంతఃకరణము సూక్ష్మశరీరమున కుపలక్షకము. కాన, దృశ్యము జడము నగు సూక్ష్మశరీరముకంటె గూడ ద్రష్టయు చేతనుడు నగు ఆత్మ భిన్నుడగును. ఇట ననుమానప్రయోగ మిట్లు చేయ నగును :-

"వివుతో దేహాది ర్నాత్మా, దృశ్యత్వాత్, స్వప్నదృశ్య దేహాదివత్."

మూషాసిక్తం యథా తామ్రం తన్నిభం జాయతే తథా ।
రూపాదీన్ వ్యాప్నువ చ్చిత్తం తన్నిభం దృశ్యతే
ధ్రువమ్ ॥ 3

తా॥ మూసయందు కరిగించి పోసిన రాగి మూస యొక్క యాకారమునే పొందునట్లు రూపాదివిషయముల

వ్యాపించు నంతఃకరణము కూడ తత్తదర్థాకారముల దాల్చు చుండును.

వ్యఞ్జకో వా యథాఽఽలోకో వ్యఙ్గ్యస్యాకారతా
మియాత్ ।
సర్వార్థవ్యఞ్జకత్వా ద్ధీరర్థాకారా ప్రదృశ్యతే ॥ ౮

అవ :- మూసయు, రాగియు రెండును మూర్త పదార్థము లగుటచే కరిగించి పోసిన రాగి కఠినమూర్తి మూషాభిహతమై మూషాకారము దాల్చుట యుక్తమే. కాని యమూర్త మగు నంతఃకరణము రూపాదివిషయాకారముల దాల్చుటెట్లు ?- అని శంకించి వేరొక దృష్టాంత మీయబడు చున్నది.

తా॥ అగ్ని (వ్యంజకము) అయఃపిండాదుల (వ్యంగ్యముల) యాకారము దాల్చునట్లు, సూర్యాలోకము (వెలుతురు) ఘటపటాది విషయాకారముల బొందునట్లు సర్వవిషయాభివ్యంజక మగు బుద్ధియు తత్తద్విషయాకారములతో విలసిల్లుచు దృశ్య మగుచుండును.

ధీరేవార్థస్వరూపా హి పుంసా దృష్టా పురాఽపి చ ।
న చేత్స్వప్నే కథం పశ్యే త్స్మరతో వాఽఽకృతిః
కుతః ॥ ౯

తా॥ జాగ్రద్దశయందును, పూర్వద్రష్ట విషయానుభవముల యందును అంతఃకరణమే ఆయా యర్థస్వరూపమున భాసించినదని యవశ్య మంగీకరింపవలెను. అట్లు కానియెడల బాహ్యవస్తువులు లేకున్నను స్వప్నమునందును, పురానుభూత వస్తువు లట లేకున్నను స్మృతియందును ఆ యా యర్థముల యాకారములు భాసించుటకు గారణమేమి?

వ్యఞ్జకత్వం తదేవాస్యా రూపాద్యాకారదృశ్యతా ।
ద్రష్టృత్వం చ దృశే స్తద్వ్యాప్తిః స్యాద్ధియ ఉద్భవే ॥ ౬

తా॥ బుద్ధి ఘటపటాదివిషయాకారముగా పరిణమించి దర్శనయోగ్య మగుటయే బుద్ధికి గల విషయాభివ్యంజకత్వము. అట్లే ధర్మాధర్మవశమున నుద్భవించిన యంతఃకరణమును వ్యాపించుట - అనగా తద్రూపమున స్ఫురించుటయే ఆత్మయొక్క ద్రష్టృత్వము.

వి:- ఘటపటాదివిషయముల భాసింపజేయునది చైతన్యము. ఆ ఘటపటాది విషయములు కూడ బుద్ధియందే తప్ప నితరత్ర స్వతంత్రముగా స్ఫురింపవు. బుద్ధి విషయాకారముగా బరిణమించనిచో చైతన్యము విషయాకారమున స్ఫురింపనేరదు, కావున విషయముల నభివ్యక్తము చేయుటకై తత్తద్విషయాకారముల దాల్చుటచే బుద్ధి విషయాభి

వ్యంజకమైనది. రూపాద్యాకారమున భాసించి బుద్ధి విషయాభివ్యంజకమైనయట్లు పూర్వజన్మకృత ధర్మాధర్మవశమున నుద్భవించెడి యంతఃకరణమును వ్యాపించుచు - అనగా బుద్ధిరూపమున స్ఫురించుచు విషయముల భాసింపజేయుచుండుటచే నాత్మ ద్రష్ట యగును.

తటాకోదకము కాలువల ద్వారా క్షేత్రముల జేరి యా యా క్షేత్రముల యాకారముల దాల్చునట్లు నంతఃకరణముకూడ ఇంద్రియాదుల ద్వారా వృత్తిరూపమున ఘటపటాదివిషయ దేశముల బొంది ఆ యా విషయాకారముల బొందుచున్నది. కావున బుద్ధి, వృత్తిరూపమున బరిణమింపక విషయముల వ్యాపింపదు. ఇట్లు విషయవ్యాప్తికై బుద్ధి పరిణామము చెందును, చైతన్యప్రకాశవ్యాప్తము లగుచునే తత్తద్విషయాకారములతో బుద్ధివృత్తు లుదయించుచుండుటచే తత్సాక్షిరూపమగు చైతన్యమునకు మాత్రము బరిణామము లేదు.

చిన్మాత్రజ్యోతిషా సర్వాః సర్వదేహేషు బుద్ధయః।
మయా యస్మా త్ప్రకాశ్యన్తే సర్వస్యాత్మా తతో
హ్యహమ్॥ 2

శం. ర. 13_17

అవ :- చైతన్యమునకు బరిణామము లేకపోయినను ఆ చైతన్యము ప్రతిదేహమునందును బుద్ధి - తద్వృత్తులకు సాక్షిరూప మగుటచే దేహభేదముచే చైతన్యరూపసాక్షియు భేదించును. సాక్షిభేదము నంగీకరించుచో సర్వబుద్ధ్యవభాసక మగు చైతన్యమున కేకత్వ మెట్లు సిద్ధించు ననెడి శంకకిట సమాధానము చెప్పబడుచున్నది.

తా॥ కేవలచైతన్యజ్యోతీరూపుఁడ నగు నాచేతనే యన్ని దేహములయందలి బుద్ధులు ప్రకాశింపజేయబడుటచే సర్వమునకు ఆత్మను - అనగా సర్వబుద్ధ్యవభాసక సాక్షిరూపచైతన్యము - నేనే

వి :- అపరిణామి చైతన్యప్రకాశవ్యాప్తము లగుచునే యొక శరీరమున బుద్ధివృత్తు లుదయించుచో నన్ని శరీరముల యందలి బుద్ధులను అవికారిచైతన్యము చేతనే భాసించుచుండు నను వ్యాప్తి యేర్పడును. కాన సర్వబుద్ధిప్రకాశకము చైతన్యము; చైతన్యప్రకాశ్యములు సర్వబుద్ధులును; ప్రకాశ్యములగు వస్తువులు భేదించినను ప్రకాశకుడగు సూర్యుఁ డొక్కఁడే - అట్లే అవభాస్యములగు బుద్ధులు భేదించినను సర్వబుద్ధ్యవభాసకమగు చైతన్య మొక్కటియే. కాన ప్రకాశకమగు చైతన్యము నందు భేదము కల్పించుట ప్రమాణ విరుద్ధము. మఱియు భేదము కూడ ద్రష్టయు సాక్షియు నగు

చైతన్యము (ఆత్మ) చేతనే భాసింపచేయబడవలెను కదా! అట్టిచో భేదముకూడ సాక్షిభాస్య మగుటచే నది సాక్షి ధర్మము కానేరదు. కాన, సాక్షిభేదాశంకకు తావు లేదు.

కరణం కర్మ కర్తా చ క్రియా స్వప్నే ఫలం చ ధీః ।
జాగ్రత్యేవం యతో దృష్టా ద్రష్టా తస్మా
దతోఽన్యథా ॥ ౮

అవ :- సర్వబుద్ధ్యవభాసక మగు చైతన్య మొక్కటియే యైనను ఆ సాక్షిచైతన్యముచే భాసింపజేయబడెడి బుద్ధ్యాదు లనేకములుండుటచే నాచైతన్యమున కద్వయత్వము సిద్ధింప నేరదను శంకకిట సమాధానము చెప్పబడుచున్నది.

తా॥ స్వప్నమున బాహ్యవస్తువులు లేనందువలన నచటి క్రియ, కారకములు (కరణము, కర్మ, కర్త), ఫలము అన్నియు బుద్ధియే యగుటచే జాగ్రద్దశయందును బుద్ధియే క్రియాకారక ఫలరూపములతో దృశ్య మగుచున్నదని నిశ్చితము. కావున, బుద్ధి-తత్కల్పిత క్రియాకారకఫలాదుల కంటె బుద్ధి-తద్వృత్తిసాక్షి యగు నాత్మ (చైతన్యము) విలక్షణుడు అనగా సత్య - అద్వయరూపు డగును.

వి :- బాహ్యపదార్థముల యునికిని వ్యక్తము చేయు నది బుద్ధి. బుద్ధియే స్వప్నమునందు వలెనే జాగ్రద్దశయందును

తత్తదర్థాకారముల దాల్చి గోచరించుచుండును. విషయాకారస్ఫూర్తి బుద్ధిచేతనే కలుగుచున్నదని యంగీకరింపక పోయినచో గాఢసుషుప్తి యందును తదాకారవిశేషస్ఫూర్తి కలుగవలెను. గాఢసుషుప్తియందు అంతఃకరణము లయ మొందుటచేతనే తత్తదాకారస్ఫూర్తి కలుగుటలేదు. కావున నాత్మయందు విషయములతోపాటు బుద్ధియు నధ్యస్తమైన దని యంగీకరింపనగును. అట్లధ్యస్తమైన బుద్ధి యాద్యంతములు కలది యగుటచే మిథ్య యగుచున్నది. మిథ్యాభూతములగు బుద్ధి - తద్వృత్తులకంటె తత్సాక్షియగు నాత్మ (చైతన్యము) విలక్షణుడు - సత్య - అఖండైకరసస్వరూపుడు. కాన, మిథ్యాభూతములగు బుద్ధి - తత్కల్పితపదార్థములచే, ఆత్మకద్వయత్వహాని లేదు.

బుద్ధ్యాదీనా మనాత్మత్వం హేయోపాదేయరూపతః ।
హానోపాదానకర్తాత్మా న త్యాజ్యో న చ గృహ్యతే॥ ౯

తా॥ బుద్ధ్యాదులు దుఃఖరూపము లగుచో హేయములు (త్యాజ్యములు) ను, సుఖరూపము లగుచో నుపాదేయములు (గ్రాహ్యములు)ను నగుచుండుటచే వానికి అనాత్మత్వము (ఆత్మభేదము) సిద్ధించుచున్నది. ఆత్మబుద్ధ్యాదుల కధిష్ఠాన మయి దుఃఖమును సుఖమును ప్రవేశించుచు హానము (లయము) ను, ఉపాదానము (విక్షేపము) ను, ఇది

త్యాజ్యము, ఇది గ్రాహ్యము అను భావమును కలిగించు చుండుటచే హానోపాదానకర్త యగుచున్నాడు. అట్లు అధిష్ఠానమయిన యాత్మ నెవరు త్యజింపగలరు? ఎవరు గ్రహింపగలరు? కాన, ఆత్మ హేయోపాదేయరూపుడు గాడు.

సబాహ్యాభ్యన్తరే శుద్ధే ప్రజ్ఞానైకరసే ఘనే ।
బాహ్య మాభ్యన్తరం చాన్యత్కథం హేయం
ప్రకల్ప్యతే ॥ ౧౦

తా॥ బాహ్యాభ్యంతరములయందును ఆత్మయే యగుచు, నిత్యశుద్ధుడును, విజ్ఞానఘనుడును నగు నాత్మయందు, ఆత్మకంటె వేఱుగా బాహ్యాభ్యంతరములు గాని, హేయోపాదేయరూపము గాని కల్పించుట యెట్లు?

వి:- ఆత్మ స్వస్వరూపముచేత హేయోపాదేయరూపుడు కాకపోయినను, తత్సంబద్ధములగు బాహ్యములయిన వస్త్రాభరణాదుల వలనను, అంతరములయిన పాపాదులు, యోగధ్యానాదుల వలనను ఆత్మయందు హేయోపాదేయభావము కల్పింపవచ్చును గదా యనుశంక కిది సమాధానము.

ఆత్మ నిత్యశుద్ధుడు; కేవలుడును; అందుచేత ఆత్మకంటె వేఱుగ బాహ్య మనునది లేదు. ఉప్పుగల్లు లోపలను,

వెలుపలను ఉప్పుగల్లే. స్వరూపభేదము లేదు, అట్లే ఆత్మ విజ్ఞానఘనుడు, లోపలను బయటను అంతట విజ్ఞానస్వరూపుడే. అందుచే విజ్ఞానస్వరూపముకంటె వేఱుగా నాంతరమయిన భాగము లేదు. ఇట్లు ఆత్మకంటె వేఱుగా వస్తుసత్తగల పదార్థములు (సత్యములయిన వస్తువులు) లేనందునను, ఉన్నయట్లు గోచరించెడి బుద్ధ్యాదులు మిథ్యాభూతము లగుటచేతను, ఆత్మ యీ బుద్ధ్యాదుల కధిష్ఠాన మగుటచేతను పరమార్థమున ఆత్మకంటె వేఱుగా బాహ్యాభ్యంతరములు లేవు. కాన ఆత్మ హేయోపాదేయరూపుడు కాదు.

య ఆత్మా నేతి నేతీతి పరాపోహేన శేషితః ।
స చే ద్బ్రహ్మవిదాత్మేష్టో యతే కాతఃపరం
కథమ్ ॥ ౧౧

తా॥ బ్రహ్మవేత్త 'నేతినేతి' యనెడి శ్రుతివాక్యజన్యజ్ఞానసంపదచే సకలదృశ్యనిషేధము చేయగా శేషించినచిన్మాత్రాత్మస్వరూపమున ప్రతిష్ఠితుడై యుండి కృతకృత్యుడగుచో నాతడిక దేనికై యత్నింపవలెను ?

అశనాయాద్యతిక్రాన్తం బ్రహ్మైవాస్మి నిరన్తరమ్ ।
కార్యవాన్ స్యాం కథం చాహం విమృశేదేవ
మఞ్జసా ॥ ౧౨

అవ :- ఇట్టి యాత్మతత్త్వముపరానుభవముచే గమ్యము కాదు కనుక బ్రహ్మవేత్త శాస్త్రాచార్యోపదేశముల ననుసరించి స్వయముగనే వివేచన చేసికొనవలయు నని యిట ప్రతిపాదింపబడుచున్నది.

తా॥ క్షుత్పిపాసాది సంసారధర్మాతీతుడై బాహ్యాభ్యంతరములు లేక విజ్ఞానఘనుడైన బ్రహ్మను నేనే. కనుక నిష్క్రియాత్మస్వరూపుడనైన నేను చేయవలసిన కార్యమేదియు లేదు. – అని నిరంతర మనుసంధానము చేసికొనవలెను.

"కతమో యాజ్ఞవల్క్య సర్వాన్తరో యోఽశనాయాపిపాసే శోకం మోహం జరాం మృత్యు మత్యేతి ఏతం వై త మాత్మానం విదిత్వా పుత్రైషణాయాశ్చ విత్తైషణాయాశ్చ లోకైషణాయాశ్చ వ్యుత్థాయాథ భిక్షాచర్యం చరన్తి తస్మా ద్బ్రాహ్మణః పాణ్డిత్యం నిర్విద్య బాల్యేన తిష్ఠాసేత్ బాల్యం చ పాణ్డిత్యం చ నిర్విద్యాథ మునిః" (బృ. ఉ.. 3 5. 1.)

పారగస్తు యథా నద్యా స్తత్థః పారం యియాసతి।
ఆత్మజ్ఞశ్చే త్తథా కార్యం కర్తు మన్య దిహేచ్ఛతి॥ ౧౩

తా॥ నది యావలియొడ్డు చేరినవాడు తిరిగి ఆ యావలి యొడ్డునే చేరవలెనని కోరుచో ఆత్మతత్త్వజ్ఞానియు నిశ్రేయో మార్గమున తిరిగి మఱియొక కార్యమును చేయ నిచ్ఛిం

చును. నదీపారంగతుడు తిరిగి పారము పొందవలెనని కోరనట్లే ఆత్మజ్ఞానియు నే కార్యమును చేయ నిచ్ఛగింపడని భావము.

ఆత్మజ్ఞస్యాపి యస్య స్యా ద్ధానోపాదానతా యది।
న మోక్షార్హః స విజ్ఞేయో వాన్తోఽసౌ బ్రహ్మణా
ధ్రువమ్॥ ౧౮

తా॥ ఆత్మ జ్ఞానికి గూడ హానోపాదానములు కలుగుచో నతడు మోక్షార్హుడు గాడు. అతడు నిజముగా బ్రహ్మకు దూరుడు.

సాదిత్యం హి జగత్ప్రాణ స్తస్మాన్నాహర్నిశైవ వా
ప్రాణజ్ఞస్యాపి న స్యాతాం కుతో బ్రహ్మవిదోఽ
ద్వయే॥ ౧౯

తా॥ ఆదిత్యసహితమగు నీ జగత్తంతయు ప్రాణరూపుడగు హిరణ్యగర్భుడే. ప్రాణము ఉదయాస్తమయరహిత సూర్యరూప మగుటచే ప్రాణాత్మభావము నొందిన ప్రాణోపాసకునకు కూడ రాత్రింబవళ్ళుండవు. ఇట్లు అపరబ్రహ్మమైన హిరణ్యగర్భాఖ్యప్రాణము నుపాసించినవానికే (భేదదర్శికే) రాత్రింబవళ్ళు లేనియపుడు అద్వయపరబ్రహ్మభావము నొందిన బ్రహ్మజ్ఞానికి అహోరాత్రము లెక్కడివి?

వి :- అద్వయబ్రహ్మభావము నొందిన బ్రహ్మజ్ఞానికి అహోరాత్రాదిభేద జ్ఞానము లేనందున -

"అనాగతాం తు యే పూర్వా మనతిక్రాంతు పశ్చిమామ్।
సంధ్యాం నోపాసతే విప్రా స్తే కథం బ్రాహ్మణాః స్మృతాః॥

అని యీరీతిగా శాస్త్రవిహితము లయినను సంధ్యావందన నిత్యాగ్నిహోత్రాది కార్యములు కర్తవ్యములు గావు.

"న హ వా అస్మా ఉదేతి న నిమ్లోచతి సకృద్దివా
హైవాస్మై భవతి" ఛాం. ఉ. 3. 11, 3.

న స్మరత్యాత్మనో హ్యాత్మా విస్మరేద్వాఽప్యలు ప్తచిత్।
మనోఽపి స్మరతీత్యేతద్ జ్ఞాన మజ్ఞానహేతుజమ్॥ ౧౬

తా॥ బ్రహ్మవేత్తకు కర్తవ్యములగు బాహ్యక్రియలు లేకపోయినను 'సంధ్యం సమాధా వాత్మన్యాచరేత్' (ఆరుణిక - ఉ. 2.) అను శ్రుతివాక్యము ననుసరించి ఆత్మవిస్మృతి కలుగకుండ నిరంతర మాత్మస్మరణము కర్తవ్య మగుచున్నది - అని యనరాదు. సమ్యగ్దర్శి కాని బ్రహ్మవేత్తకే యాత్మకంటె భిన్నముగా, మనస్సు గోచరించును. అట్టివాని నుద్దేశించియే పై 'సంధ్యం సమాధా' అను శ్రుతివాక్యము ప్రవృత్త మయినది. సమ్యగ్దర్శియగు ఆత్మజ్ఞాని నుద్దేశించి

కాదు. ఆత్మజ్ఞాని మనస్సు నిరంతరము బ్రహ్మాకారవృత్తి సంపన్నమై యుండును. అందుచే అలుప్తచిద్రూపుడగు ఆత్మజ్ఞానికి మనస్సు ఆత్మకంటె భిన్నముగా గోచరింపదు. అట్టి ఆత్మజ్ఞానికి ఆత్మను గూర్చిన స్మృతివిస్మృతులు రెండును నుండవు. ఒకవేళ నున్నను మనస్సు జడ మగుటచే నది స్వతంత్రముగా స్మరింపలేదు గనుక 'మనస్సు స్మరించును' అను జ్ఞానము నజ్ఞానవిలసితమే యగును.

జ్ఞాతుర్జ్ఞేయః పరో హ్యాత్మా సోఽవిద్యాకల్పితః స్మృతః।
అపోఢే విద్యయా తస్మిన్ రజ్జ్వాం సర్ప
ఇవాద్వయః ॥ ౧౭

తా॥ ఆత్మకు చిద్రూప మెన్నడు లోపింపదు (అలుప్త చిత్) కాన, ఆత్మ ఆత్మను స్మరింపదు; కాని, పరమాత్మను స్మరించును గదా యనిన నట్లు గాదు.

జ్ఞానగోచరములగు ఘటపటాదివిషయము లన్నియు రజ్జువునందు సర్పమువలె ఆత్మ (చైతన్యము) యందు అవిద్యాకల్పితములు. ఈ నియమము ననుసరించి ఆత్మకు పరమాత్మ జ్ఞానగోచరుడు (జ్ఞేయః) అగుచో పరమాత్మయు ఘటపట రజ్జుసర్పాదులవలె పరత్వ జ్ఞేయత్వాది ధర్మములతో నొప్పి అవిద్యాకల్పితుడు (మిథ్య) కావలసివచ్చును. అట్లవిద్యాకల్పితుడగుచో పరమాత్మ సద్రూపుడు ఎట్లగును ?

కాన, ఆత్మకు పరమాత్మ జ్ఞానగోచరుడు (జ్ఞేయుడు) కాడు. బ్రహ్మాత్మైకత్వజ్ఞానము (ఆత్మవిద్య) కలిగినంతనే పరమాత్మయందవిద్యాకల్పితము లయిన పరత్వ జ్ఞేయత్వాదులు నిర్మూలింపబడును. రజ్జుజ్ఞానముచే నవిద్యాకల్పిత మయిన సర్పము రూపుమాసి రజ్జువే శేషించునట్లు ఆత్మయు జ్ఞాతృజ్ఞేయ విభాగము లేక నద్వయబ్రహ్మస్వరూపుడే యగును.

కర్తృకర్మఫలాభావా త్సబాహ్యాభ్యన్తరం హ్యజమ్ ।
మమాహం వేతి యో భావ స్తస్మిన్ కస్య కుతో
భవేత్ ॥ ౧౮

తా॥ క్రియా కారక ఫలములు లేక బాహ్యాభ్యంతరములయందు విజ్ఞానఘనుడై, అవిద్యాసంబంధము లేకపోవుటచే అవిద్యాకల్పిత జన్మజరామరణాదులు లేక యజుడైన యాత్మయందు 'నేను - నాది' యను నభిమాన మెట్లు కలుగును? కావున, బ్రహ్మవిద్య యుదయింపకపూర్వమే క్రియాకారకఫలములు, సర్వకర్తృత్వాజ్ఞానమును; అహంకార మమకారములును కలుగుచుండును. జ్ఞానానంతర మివి యేవియు నుండవు.

ఆత్మా హ్యాత్మీయ ఇత్యేష భావోఽవిద్యాప్రకల్పితః ।
ఆత్మైకత్వే హ్యసౌ నాస్తి బీజాభావే కుతః
ఫలమ్ ॥ ౧౯

తా॥ కాన నేను, నాది యను భావము అవిద్యాకల్పితము. బ్రహ్మాత్మైకత్వజ్ఞానము కలిగినంతనే సంసారబీజము లగు అవిద్యాకామకర్మలు లేనందున క్రియాకారకఫలము లుండవు.

ద్రష్టృ శ్రోతృ తథా మన్తృ విజ్ఞాత్రేవ తదక్షరమ్ ।
ద్రష్ట్రాద్యన్యన్న తద్యస్మాత్తస్మాద్ద్రష్టాఽహ
మక్షరమ్ ॥ ౨౦

తా॥ ద్రష్టయు, శ్రోతయు, మన్త (మననముచేయువాడు) యు, విజ్ఞాత (తెలిసికొనువాడు) యు ప్రత్యగ్రూపుడు, సర్వాధిష్ఠానమును బ్రహ్మ (అక్షరము) యే. ద్రష్ట్రాదిస్వరూపుడు, ప్రత్యగ్రూపుడు నగు నక్షరము (బ్రహ్మ) కంటె నితర మేదియు లేదు. కాన ద్రష్ట, శ్రోత - యిత్యాది నామములచే బ్రసిద్ధుడగు అక్షరరూపబ్రహ్మను నేనే.

"అదృష్టం ద్రష్ట్రశ్రుతం శ్రోత్రమతం మన్త్రవిజ్ఞాతం
విజ్ఞాతృ" ...
"నాన్యదతోఽస్తి ద్రష్టృ నాన్యదతోఽస్తి శ్రోతృ
నాన్యదతోఽస్తి విజ్ఞాతృ" బృ. ఉ. 3. 8 11.

స్థావరం జంగమం చైవ ద్రష్ట్రత్వాదిక్రియాయుతమ్ ।
సర్వ మక్షరమేవాతః సర్వస్యాఽఽత్మాఽక్షరం
త్వహమ్ ॥ ౨౧

తా॥ ఉపాధియగు నంతఃకరణమును, దర్శనశ్రవణాది క్రియావిశిష్టమగు (ఉపహితమగు) అంతఃకరణావచ్ఛిన్న చైతన్యము (జీవుఁడు) ను, అంతఃకరణోపాధుల కాధారము లగు స్థావరజంగమశరీరములును సర్వము అక్షరమే (బ్రహ్మయే). కాన, అక్షరరూపుఁడ నగు నేనే సర్వమునకు ఆత్మను (స్వరూపమును). నాకంటె నితర మేమియు లేదు.

అకార్యశేష మాత్మాన మక్రియాత్మక్రియాఫలమ్ ।
నిర్మమం నిరహంకారం యః పశ్యతి స పశ్యతి ॥ ౨౨

తా॥ ఆత్మ మమతాఽహంకారములు లేనివాఁడనియు (కనుకనే) అకర్త (అకార్యశేషః) యనియు, నిష్క్రియుఁడనియు, క్రియా-తత్ఫలవిలక్షణుఁ డనియు నెవఁడెఱుఁగునో యతఁడే సమ్యగ్దర్శి.

వి:- స్థావరాది సర్వప్రపంచమునకు అక్షరుఁడే యాత్మ యని చెప్పుచో సప్రపంచాత్మభావము కలుగు ననెడి సందియము పొడమవచ్చును. బ్రహ్మకు కర్తృత్వ భోక్తృత్వాభిమానములుగాని, మమతాహంకారములుగాని లేవు; క్రియా తత్ఫలములు లేవు. వానికంటెవిఁ క్షణుఁడు. అట్టి యక్షర రూప బ్రహ్మజ్ఞానము వలన సప్రపంచాత్మభావము కలుగదు.

మమాహంకారయత్నేచ్ఛాః శూన్యా ఏవ స్వభావతః ।
ఆత్మనీతి యది జ్ఞాత మాధ్వం స్వస్థాః కిమీహితైః॥ ౨౩

తా॥ మమతాహంకారములు, రాగద్వేషములు, క్రియలు (యత్నములు) అన్నియు అవిద్యచే నాత్మయందు కల్పితములు; వాస్తవములు గావని యెఱిగి ముముక్షువులగు మీరు స్వస్థులై యుండుడు, జ్ఞానము పొంది కృతకృత్యులైన మీకు కర్మలతో నేమి ?

యోఽహంకర్తార మాత్మానం తథా వేత్తార మేవ చ ।
వేత్త్యనాత్మజ్ఞ ఏవాసౌ యోఽన్యథాజ్ఞః స
ఆత్మవిత్ ॥ ౨౮

తా॥ ఎవడు ఆత్మను కర్తగను, జ్ఞాత (తెలిసికొను వాడు) గను తెలిసికొనుచున్నాడో అతడు ఆత్మతత్త్వము నెఱిగినవాడు కాడు. ఎవడు ఆత్మను, అకర్త, అభోక్త, అజ్ఞాత యని తెలిసికొనునో యతడే యాత్మతత్త్వవేత్త.

యథాఽన్యత్వేఽపి తాదాత్మ్యం దేహాదిష్వాత్మనో
మతమ్ ।
తథాఽకర్తృ రవిజ్ఞానా త్ఫలకర్మాత్మతాఽఽత్మనః॥ ౨౯

తా॥ ఆత్మ దేహాదులకంటె విలక్షణుడయ్యును, నా స్థూల దేహాదులతో తాదాత్మ్యము చెంది 'నేను మనుష్యుడను, నేనంధుడను, బధిరుడ నని యీరీతిగ నవిద్యావశమున భావించునట్లు, అహంకారప్రధానమైన యంతఃకరణము

(సూక్ష్మశరీరము) తో తాదాత్మ్యము చెంది (ఆ సూక్ష్మ దేహము కంటె భిన్నుడ నను వివేకము లేక) కర్తృత్వా ద్యభిమానమును (మిథ్యాబుద్ధిని) కలిగియుండును. ఈ ఆత్మకు కర్తృత్వభోక్తృత్వాది ధర్మములు మిథ్యాజ్ఞానము చేతనే కాని వాస్తవముగా లేవు.

దృష్టిః శ్రుతి ర్మతి ర్జ్ఞాతిః స్వప్నే దృష్టా జనైః సదా ।
తాసా మాత్మస్వరూపత్వా దతః ప్రత్యక్షతాత్మనః ॥ ౨౬

తా॥ దృష్టి (దర్శనము), శ్రుతి (శ్రవణము), మతి (మననము), జ్ఞాతి (జ్ఞానము) శబ్దములచే దర్శనశ్రవణాద్యాకార - అంతఃకరణవృత్తులు నిర్దేశింపబడుచున్నవి. ఆ యంతఃకరణవృత్తులు స్వప్నమున నెప్పుడును గోచరించుచునే యుండును అంతఃకరణవృత్తులే ఘటపటాద్యాకారములతో స్వప్నమున దృశ్యములుగా గన్పట్టుచుండుటచే వానిని దర్శించెడిసాక్షి యగు నాత్మ అంతఃకరణ - తద్వృత్తులకంటె విలక్షణుడే యగును. మఱియు నా యంతఃకరణాతద్వృత్తులకు స్వరూప మగుటచే నాత్మకు అపరోక్షత్వము యుక్తమే.

వి :- సుషుప్తి యందంతఃకరణము, తద్వృత్తులును స్వకారణమగు నవిద్యయందు లయము చెందినను, ఆత్మ లయము చెందక తాను అద్వితీయ - అపరోక్ష - చిన్మాత్ర

స్వరూపుడై భాసించుచుండును. ఇట్లు దృశ్యత్వ - జ్ఞేయత్వాది ధర్మములు గల అహంకారాది రూపమగు నంతఃకరణము కంటె ఆత్మ విలక్షణుడగుటచే సాక్షియై స్వయంప్రకాశుడైన యాత్మకు నిత్యాపరోక్షబ్రహ్మరూపత్వము సిద్ధించినది.

పరలోకభయం యస్య నాస్తి మృత్యుభయం తథా ।
తస్యాత్మజ్ఞస్య శోచ్యాః స్యుః స బ్రహ్మేన్ద్రా
అపీశ్వరాః ॥ ౨౭

తా॥ ఎవనికి పరలోకమును గూర్చి గాని, మృత్యువును గూర్చి గాని భయము లేదో యట్టి యాత్మజ్ఞానిజ్ఞానైశ్వర్యసంపన్నుండగు బ్రహ్మేంద్రాదులను జూచియు 'ఐశ్వర్యాసక్తు లగుటచే వీరు తత్సంరక్షణయందు వ్యగ్రులై యుందురే కాని, స్వస్థులుగ నెట్లుందురు' ? అని జాలిపడుచుండును.

వి :- 'కిమహం సాధు నాకరవమ్; కిమహం పాపమకరవమ్' (తై. ఉ. 2. 9.) 'నేను పుణ్యమాచరింపనైతి ననియు, పాప మాచరించితి ననియు పరలోకమును గూర్చిన భయము అవిద్యావశుడైన సంసారికి గల్గును గాని 'నైనం కృతాకృతే తపతః' (బృ. ఉ. 4. 4. 22.) నిత్యకర్మానుష్ఠాన - తదభావముల వలన గలుగు ఫలము లాత్మజ్ఞానినంటవు గాన ఆత్మజ్ఞానికి పరలోకమును గూర్చిన భయము లేదు.

మఱియు 'న జీవో మ్రియతే (ఛా. ఉ. 6-11-16) అను శ్రుతి ప్రమాణము ననుసరించి జీవునకు మరణ మను నది లేదు గాన, ఆత్మజ్ఞానికి మృత్యువును గూర్చి భయము లేదు. 'ద్వితీయాద్వై భయం భవతి' (బృ. ఉ. 1. 4. 2.) తనకంటె వేఱుగ ద్వితీయవస్తుదర్శనము వలన భయ ముత్పన్న మగుచుండును. ఆత్మజ్ఞానికి తనకంటె వేఱుగ ద్వితీయవస్తువు గోచరింపమిచే భయము లేదు. కాన పరలోకమును మరణమును గూర్చిన వ్యగ్రతకు గారణమగు అహంకారాదులు లేక బ్రహ్మనిష్ఠుడగువాడే యాత్మవేత్త.

ఈశ్వరత్వేన కిం తస్య బ్రహ్మేంద్రత్వేన వా పునః ।
తృష్ణాచే త్సర్వత శ్ఛిన్నా సర్వదైన్యోద్భవాఽ
శుభా ॥ ౨౮

తా॥ సర్వదుఃఖములకు గారణమై పాపప్రవృత్తికి ద్వారమై యశుభమైన తృష్ణ సమూలముగ నశించినచో నా యాత్మజ్ఞానికి ఈశ్వరత్వ, బ్రహ్మత్వ, ఇంద్రత్వాదులతో నేమి పని ?

"యదా సర్వే ప్రముచ్యన్తే కామా యేఽస్య హృది శ్రితాః ।
అథ మర్త్యోఽమృతో భవత్యత్ర బ్రహ్మ సమశ్నుతే."
(బృ. ఉ. 4. 4. 7.)

అహం మిత్యాత్మధీ ర్యాచ మమేత్యాత్మీయధీరపి ।
అర్థశూన్యే యదా యస్య స ఆత్మజ్ఞో భవే త్తదా॥ ౨౯

తా॥ ఎవనికి నేను, నాది యను ఆత్మ - ఆత్మీయ భావములు విషయశూన్యములు (ప్రయోజనశూన్యములు) అగునో - అనగా తత్ప్రయుక్త వ్యవహారము కలుగదో - అతడే యాత్మజ్ఞుడు.

వ్యవహారదశయందు గూడ నెవనికి వేఱుగా నే వస్తువులు భాసింపక యెల్లయెడల ఆత్మస్వరూపము మాత్రము భాసించునో యతడే యాత్మజ్ఞాని యని భావము.

బుద్ధ్యాదా సత్యుపాధౌ చ తథాఽసత్యవిశేషతా ।
యస్య చే దాత్మనో జ్ఞాతా తస్య కార్యం కథం
భవేత్ ॥ ౩౦

తా॥ జాగ్రత్స్వప్నముల యందు బుద్ధ్యాదులగు నుపాధు లున్నను, సుషుప్తియందు లేకున్నను ఆత్మ నిర్విశేష స్వరూపముగనే యుండు నని తెలిసికొన్నచో నిర్విశేష స్వరూపుడగు నాత్మకు కర్తృత్వ భోక్తృత్వములు లేనందున అట్టి యాత్మస్వరూపము నెఱిగిన తత్త్వజ్ఞానికి చేయవలసిన దేమున్నది ?

ప్రసన్నే విమలే వ్యోమ్ని ప్రజ్ఞానైకరసేఽద్వయే ।
ఉత్పన్నాత్మధీ ర్యో బ్రూత కిమన్యత్కార్య
మిష్యతే ॥ ౩౧

తా॥ ఆకాశమువలె ప్రసన్నుడై, సహజముగా దోష రహితుడై విజ్ఞానఘనుడై యద్వయుడైన యాత్మను గూర్చిన సమ్యగ్దర్శన మెవనికి కలుగునో యా తత్త్వజ్ఞానికి చేయవలసిన దేమున్నది ?

ఆత్మానం సర్వభూతస్థ మమిత్రం చాత్మనోఽపి యః।
పశ్య న్నిచ్ఛత్యసౌ నూనం శీతీకర్తుం విభావసుమ్ ॥ 32

తా॥ సర్వభూతాత్మస్వరూపుడైన యాత్మకు శత్రుత్వ మిత్రత్వములు గల్పించుట ఉష్ణస్వభావుడగు నగ్నికి శీత స్వభావము గల్పించుట వంటిది.

వి :- ఉష్ణస్వభావము గల యగ్నికి శీతస్వభావము గల్పించుట యెట్లు దుఃసాధ్యమో యట్లే సర్వభూతాత్మ స్వరూపుడగు నాత్మకు శత్రుత్వ మిత్రత్వములు గల్పించుటయు దుశ్శకము. కాన శాస్త్రాచార్యోపదేశముల వలన తత్త్వము నెఱిగిన యాత్మజ్ఞాని శ్రేయోమార్గ ప్రతిబంధ రూపశత్రువును నిర్మూలించుటకై యేదియైన యనుష్ఠింపవలె నను వాదము పరాస్తము.

ప్రజ్ఞాప్రాణానుకార్యాత్మా ఛాయేవాత్మాఽగోచరః।
ధ్యాయతీవేతి చోక్తో హి శుద్ధో ముక్తః స్వతో
హి సః ॥ 33

తా॥ సూర్యుడు స్వయముగ కదలిక లేనివాడయ్యు జలాదుల యందు ప్రతిఫలించి వాని (ఆ యుపాధుల యొక్క) కదలికచే కదలినట్లు తోచుచుండును. అట్లే బుద్ధి ప్రాణోపాధికుడగు నాత్మ యింద్రియములయందును తద్ద్వారకములగు ఘటపటాద్యాకార – అంతఃకరణవృత్తులయందును ప్రతిఫలించుచు నా యుపాధిధర్మములచే ధ్యానించుచున్నట్లును, మిక్కిలి చలించుచున్నట్లును లోకమున భ్రాంతి గలుగుచుండు నని శ్రుతియందు నిరూపింపబడినది. యథార్థముగా నాత్మ నిత్య శుద్ధ బుద్ధ ముక్తస్వభావుడు.

'ధ్యాయతీవ లేలాయతీవ' (బృ. ఉ. 4. 3. 7.)

అప్రాణస్యామనస్కస్య తథాఽసంగస్య మే దృశేః ।
వ్యోమవ ద్వ్యాపినో హ్యస్య కథం కార్యం భవే
న్మమ ॥ 38

తా॥ నేను అప్రాణుడను; అమనస్కుడను; అసంగుడను; దృగ్రూపుడను; ఆకాశమువలె సర్వవ్యాపకుడను. అట్టి నాకు చేయదగిన దేముండును?

వి :– ఆత్మ అప్రాణు డగుటచే క్రియాశక్తిరహితుడు. అమనస్కు డగుటచే జ్ఞానశక్తిరహితుడు. అసంగుడు గాన, ఉపాధిధర్మశూన్యుడు. ఆకాశము వలె సర్వవ్యాపకుడు గాన, సహజముగా చలనశక్తిరహితుడు. దృగ్రూపుడగుటచే

చిదేకరసస్వరూపుఁడు. కాన నాత్మస్వరూపనిష్ఠుఁడగువానికి కర్తవ్య మేముండును ?

అసమాధిం న పశ్యామి నిర్వికారస్య సర్వదా।
బ్రహ్మణో మే విశుద్ధస్య శోధ్యం నాన్య
ద్విపాప్మనః॥ 3౫

తా॥ నిర్వికారుఁడనగు నాకు సమాధి లేని దశ గోచరింపదు. నిత్యశుద్ధుఁడనై నిత్యవిగతకల్మషుఁడనై బ్రహ్మస్వరూపాపన్నుఁడనైన నాకు శోధింపదగిన (నిర్మూలింపదగిన) యితర కల్మషము లేమియు లేవు.

వి :- "తత్రైకాగ్రం మనః కృత్వా యతచిత్తేంద్రియ
క్రియః।
ఉపవిశ్యాఽఽసనే యుంజ్యా ద్యోగ మాత్మవిశుద్ధయే॥"
(భ. గీ. 6. 12.)

అని యీరీతిగా సుఖాసనమున నుపవిష్టుఁడై యోగబలముచే మనస్సమాధానము కుదుర్చుకొని యాత్మశుద్ధి సంపాదించుకొనవలె నని గీతాదిశాస్త్రములు చెప్పుచున్నవి. అసమాధి యన వికారము. వికారహేతువు ఉపాధి యగు బుద్ధి. ఉపాధిశూన్యుఁడై నిత్యము నిత్యశుద్ధ - నిర్వికార - బ్రహ్మస్వరూపనిష్ఠుఁడైనవానికి యోగాది సాధనాపేక్ష యుండదు.

గన్తవ్యం చ తథా నైవ సర్వగస్యాఽచలస్య చ ।
నోర్ధ్వం నాధస్తిర్యో వాఽపి నిష్కలస్యాగుణత్వతః ॥ ౩౬

తా॥ సర్వవ్యాపకుడనై నిశ్చలుడనైన నాకు గమన క్రియగాని, ప్రాప్తవ్య స్థానము గాని లేవు. పూర్ణుడను (నిష్కలః), నిర్గుణుడ నగుటచే ఊర్ధ్వాధో మధ్య దేశవిభాగము గూడ లేదు.

వి :- శ్లోకమున 'గంతవ్యం' అను పదమునకు 'ప్రాప్య స్థాన' మని యర్థము. అయినను తంత్రముచే నీ పదమును భావప్రధాన నిర్దేశపరముగ గూడ (ప్రకరణము ననుసరించి) గ్రహించుటచే 'గతి' (ప్రాప్తి) యను నర్థముగూడ సిద్ధించి నది. ఆత్మకు ఊర్ధ్వాధోమధ్య దేశ విభాగము లేదనుటచే ప్రాక్పశ్చిమాది దిగ్విభాగము గూడ లేదని గ్రహింప నగును.

చిన్మాత్రజ్యోతిషో నిత్యం తమస్తస్మిన్న విద్యతే ।
కథం కార్యం మమైవాద్య నిత్యముక్తస్య శిష్యతే ॥ ౩౭

తా॥ చిదేకరసరూపుడగు నాత్మయందజ్ఞానము భాసిం పదు. నిత్యముక్తుడనై యాత్మస్వరూపనిష్ఠుడనగు నాకు శాస్త్రవిహిత విధినిషేధము లెట్లు వర్తించును ?

వి :- గుణక్రియాది విశేషముల భాసింపజేయునది అజ్ఞానము. వెలుగు చీకటుల వలె జ్ఞానాజ్ఞానములు పరస్పర

విరుద్ధస్వభావము గలవి. ఆత్మ కేవలజ్ఞానస్వరూపుడు. అట్టి యాత్మయందజ్ఞానము భాసింపనేరదు. కాన అజ్ఞానకల్పిత గుణక్రియాది విశేషములు ఆత్మయందుండునని యూహించుటకే యవకాశము లేనపుడు ఆత్మకు శాస్త్రవిహిత కర్మవిధిశేషత్వము ప్రాప్తింపదు.

అమనస్కస్య కా చిన్తా క్రియావాఽనిన్ద్రియస్య కా ।
'అప్రాణో హ్యమనాః శుభ్ర' ఇతి సత్యం శ్రుతే
ర్వచః ॥ ౩౭

తా॥ అమనస్కుడగుటచే చింత కాని, ప్రాణరహితుడగుటచే క్రియగాని, ఆత్మకు లేవు. కాన 'అప్రాణో హ్యమనాః శుభ్రః' (ము. ఉ. 2. 1. 2.) అను శ్రుతివాక్యము నిర్దోషము, స్వతఃప్రమాణము గాన యథార్థమే యగుచున్నది.

అకాలత్వాదదేశత్వాదదిక్త్వాదనిమిత్తతః ।
ఆత్మనో నైవ కాలాదేరపేక్షా ధ్యాయతః సదా ॥ ౩౮

తా॥ ఆత్మ దిక్ – దేశ – కాల – నిమిత్తరహితుడు. కాన, నిరంతర మాత్మానుసంధానము జేసికొనువానికి దిగ్దేశకాలాద్యపేక్ష లేదు.

వి :– ఆత్మానుసంధానమునకై మనస్సును పదిలపఱచుకొనుటకు ప్రదోషాది కాలవిశేషములు, ఏకాంతము

పవిత్రము నగు తీర్థాదిప్రదేశము, ప్రాచ్యాది దిగ్విభాగము, గ్రహణాది పర్వకాలనిమిత్తములు ఆవశ్యకము లగుచుండును (శ్వేతాశ్వతర. 2. 10) కాని, కాలాది నిమిత్తాపేక్ష లేని యాత్మను చిత్తైకాగ్రతతో నిరంతరము అనుసంధానము చేసు కొనెడి యాత్మజ్ఞానికి దిగ్దేశకాలాద్యపేక్ష లేదు. వ్యాసభగవానుడును 'యత్రైకాగ్రతా తత్రావిశేషాత్' (బ్ర. సూ. 4. 1. 11.) అను సూత్రమున నీ విషయమును స్పష్టము చేసినాడు.

యస్మిన్ దేవాశ్చ వేదాశ్చ పవిత్రం కృత్స్న మేకతామ్ ।
వ్రజేత్తన్మానసం తీర్థం యస్మిన్ స్నాత్వాఽమృతో
భవేత్ ॥ ४० ॥

తా॥ పూజా దర్శన స్పర్శన స్మరణాదులచే భక్తులను పవిత్రీకరించెడి మాధవ, విశ్వేశ్వర, రామేశ్వర త్రివిక్రమాది తత్తత్తీర్థస్థాన విశేషాధిష్ఠానదైవములును, అధ్యయన, బ్రహ్మయజ్ఞపారాయణానుష్ఠానాదులచే పావనము చేసెడి ఋగ్యజుస్సామాథర్వణ వేదములును, అశేష పవిత్ర తీర్థములును, శివకేశవ నామసంకీర్తనాదులును, సముద్రమునందు నదులువలె, దేని యందంతర్భావము చెందుచున్నవో అట్టి వేదాంతమహావాక్య జనిత సర్వాత్మక బ్రహ్మాకారవృత్తి రూపమున విలసిల్లెడి మానసతీర్థమున మునిగి యమృతస్వరూపుడవు (నిర్విశేష - నిత్యాత్మస్వరూపుడవు) కమ్ము. (అట్టి మానసతీర్థమున నిరంత

రము మునిగియున్నవానికి తీర్థాంతరాపేక్ష గాని, సాధనాంతరాపేక్ష గాని యుండదు.)

"శతం శుక్రాణి యత్రైకం భవన్తి। సర్వే వేదా
యత్రైకం భవన్తి।
సర్వే హోతారో యత్రైకం భవన్తి। స మానసీన ఆత్మా
జనానామ్ ॥ (తై. ఆ. 3. 11.)

"యథోదకం శుద్ధే శుద్ధ మాసిక్తం తాదృగేవ భవతి। ఏవం మునేర్విజానత ఆత్మా భవతి గౌతమ ॥" (కఠ. ఉ. 4. 14.)

న చాస్తి శబ్దాది రనన్యవేదనః
పరస్పరేణాపి న చైవ దృశ్యతే।
పరేణ దృశ్యాస్తు యథా రసాదయః
తథైవ దృశ్యత్వత ఏవ దైహికాః ॥ ౭౧

టీ॥ వ్యవహారమున గోచరించెడి శబ్ద స్పర్శ రూప రస గంధాది విషయములు జడములు; కావున స్వయం ప్రకాశములు గావు; ఒకదానిచే నొకటి ప్రకాశింపజేయ బడదు. కాని దృశ్యము లగుచున్నవి (వ్యవహారమున గోచరము లగుచున్నవి.) అందుచే జడములైన యీ శబ్దాదులు జడముకాని చేతనుడైన యాత్మ చేతనే ప్రకాశింప

జేయబడుచున్నవి. (శబ్దాదయః, పరప్రకాశ్యాః; జడత్వాత్; ఘటాదివత్) అట్లే దేహమునందలి రసాదులుగూడ దృశ్యములగుటచే (జడము లగుటచే) బాహ్యరసాదులవలె పరప్రకాశ్యములు (ఆత్మప్రకాశ్యములు). (దైహికా అపి రసాదయః, దృశ్యాః, దృశ్యత్వాత్; యథా బాహ్యరసాదయః; తథైవేమే; తస్మాత్తథా.)

అహం మమేత్యేషణయత్నవిక్రియా
సుఖాదయ స్తద్వదిహ ప్రదృశ్యతః।
దృశ్యత్వయోగాచ్చ పరస్పరేణ తే
న దృశ్యతాం యాన్తి తతః పరో భవాన్॥ ౨౧

తా॥ అహంకారము, కామ - ప్రయత్న - కర్తృత్వ - భోక్తృత్వ - సుఖ - దుఃఖ - ద్వేషాదు లనెడి మనోవృత్తులు గూడ జడములు, 'మమ' (నావి) యని నిర్దేశింపబడుచు శబ్దాదులవలె దృశ్యములై గోచరించుచుండుటచే స్వయం ప్రకాశములు గావు; శబ్దాదులవలెనే యొకదానిచే నొకటి ప్రకాశింపజేయబడవు. కాని దృశ్యము లగుచున్నవి. కాన అహంకారాదులకంటె - అహంకారాది సంఘాతరూపమగు లింగదేహము కంటె ద్రష్ట యగు నీవు (ఆత్మ) అన్యుడవు.

అహంక్రియాద్యా హి సమస్తవిక్రియా
సకర్తృకా కర్మఫలేన సంహతా।

చితిస్వరూపేణ సమన్తతోఽర్కవత్
ప్రకాశ్యమానాఽసితతాత్మనో హ్యతః ॥ ౪౩

తా॥ అహంకార మమకారాది సర్వవికారములును కర్తృత్వ భోక్తృత్వరూప ఫలములతో వ్యాప్తియుండును. సూర్యుడు లోకము నంతయు ప్రకాశింపజేయుచు నా దృశ్యజాతముతో నెట్టి సంబంధము లేకయుండునట్లు స్వయంప్రకాశుడగు ఆత్మయు సర్వవికారములను ప్రకాశింపజేయుచు వానితో నెట్టి సంబంధము లేక యుండును. ఆత్మకు దృశ్యములగు వికారములతో గల సంబంధము గూడ దృశ్యమగుటచే నది ద్రష్టయగు ఆత్మధర్మము గానేరదు. కాన ఆత్మ స్థూలసూక్ష్మదేహాది వికారజాతమును ప్రకాశింపజేయుచునే తత్సంబంధము లేనందున వానిచే బద్ధుడుగాక నిత్యబద్ధుడై యుండును.

దృశిస్వరూపేణ హి సర్వదేహినాం
వియద్యథా వ్యాప్య మనాంస్యవస్థితః ।
అతో న తస్మాదపరోఽస్తి వేదితా
పరోఽపి తస్మాదత ఏక ఈశ్వరః ॥ ౪౪

తా॥ ఆకాశము సర్వవ్యాపకమై ఘటపటాది విషయజాతమును వ్యాపించునట్లు ఆత్మయు ద్రష్టయై సర్వప్రాణుల యొక్క మనస్సులను వ్యాపించియుండును. చైతన్యస్వరూపు

డగుటచే సర్వద్రష్టయగు ఈశ్వరుడును ఆత్మకంటె భిన్నుడు కాడు. కాన ఆత్మ అద్వితీయుడు.

(ఆత్మా న స్వరూపభేదవాన్, ఉపాధిపరామర్శ మంతరేణా విభావ్యమానభేదత్వాత్, ఆకాశవత్.)

శరీరబుద్ధ్యో ర్యది చాన్యదృశ్యతా
నిరాత్మవాదాః సునిరాకృతా మయా ।
పరశ్చ శుద్ధో హ్యవిశుద్ధికర్మతః
సునిర్మలః సర్వగతోఽసితోఽద్వయః ॥ ౪౫

తా॥ శరీరబుద్ధులు - అనగా స్థూల సూక్ష్మ శరీరములు జడములు గాన స్వయంప్రకాశములు గావు; పరప్రకాశ్యములు - అని న్యాయపూర్వకముగా నిర్ణీత మగుటచే శూన్య - క్షణికాది బౌద్ధవాదములు నిరాకరింపబడినట్లే యగుచున్నవి. అవిశుద్ధికరమగు ధర్మాధర్మాదికర్మలకు సాక్షి యగుటచే ఆత్మ, కర్మకంటె విలక్షణుడు; అకర్త యగుట జేసి శుద్ధుడు. కర్మఫలభోగరహితు డగుటచే నిర్మలుడు; సర్వవ్యాపకు డగుటచే బంధరహితుడు, అద్వయుడు.

ఘటాదిరూపం యది తేన గృహ్యతే
మనః ప్రవృత్తం బహుధా స్వవృత్తిభిః ।
అశుద్ధ్యచిద్రూపవికారదోషతా
మతే ర్వృథా వారయితుం న పార్యతే ॥ ౪౬

తా॥ ఒకవేళ నీ మతమున 'స్వవృత్తులచే ఘటాది వివిధవిషయాకారరూపమగు మనస్సు ఆత్మచే గ్రహింపబడదని (మనస్సు పరప్రకాశ్యము గాక స్వయంప్రకాశమే యని) చెప్పుచో నపుడు మనస్సును గ్రహించునది మనస్సే యగును. ఆ మనస్సే యాత్మ యగును. కాన మనస్సుకంటె నతిరిక్తముగ సాక్షియగు నాత్మ సిద్ధింపదు. మనస్సు అవిశుద్ధి జడత్వాది వికారదోషదూషిత మగునట్లు ఆత్మకును అవిశుద్ధ్యాది దోషములు ప్రసక్తించును. అట్టియెడ ఆత్మకు విముక్తియే యుండదు.

అట్లు గాక 'ఘటాదిరూపం యది తేన గృహ్యతే' అను పాఠము నాశ్రయించి శంకాపరముగ నిట్లు చెప్పవచ్చును.

తన వృత్తులచే వివిధముగా బ్రవర్తిల్లుచు ఘటాద్యాకార రూపమగు మనస్సు చేతనుడగు నాత్మచే గ్రహింపబడుచో నపుడు ఆత్మకు దృశ్యమగు వికారజాతముతో సంబంధ ముండుటవలన ఆత్మకు అశుద్ధి - జడత్వాది దోషములు బుద్ధికి వలెనే వారించుట శక్యము గాదు. చైతన్య సంసర్గముచే బుద్ధి చిచ్ఛాయారూప మగునట్లు బుద్ధిసంపర్కముచే ఆత్మకు అవిశుద్ధ్యాదిదోషము లనివార్యము లగుచున్నవి.

యథా విశుద్ధం గగనం నిరన్తరం
న సజ్జతే నాపి చ లిప్యతే తథా ।
సమస్తభూతేషు సదైవ తేష్వయం
సమః సదాత్మా హ్యజరోఽమరోఽభయః॥ ४2

తా॥ ఆకాశము పరిణామ విక్రియాది దోషరహితమై విశుద్ధమై, నిరవయవమై సర్వవ్యాపకమయ్యును ఏ పదార్థముతోను లాక్షాదుల వలె లగ్నము కాదు; భల్లాతకాదిరసములచే వస్త్రాదులవలె నే పదార్థముచేతను రంజితము కాదు. అట్లే విశుద్ధుడు, సర్వవ్యాపకుడు నని శాస్త్రముచే నిర్ణయింపబడిన యాత్మ బుద్ధ్యాదులకు సాక్షియై వానిని వ్యాపించి ప్రకాశింపజేయుచున్న బుద్ధ్యాదులతో లగ్నము గాదు, వానిచే రంజితమును గాదు. మఱియు నీ యాత్మ తత్తదభిమాన దేవతాసహితములగు సమస్తభూతములయందు నెప్పుడు సమానముగ నుండును. కనుక ఆత్మ యెప్పుడును జరామరణరహితుడు; భయరహితుడు (అనగా ఆత్మ నిత్యశుద్ధుడని భావము.)

"సమం సర్వేషు భూతేషు తిష్ఠన్తం పరమేశ్వరమ్ ।
వినశ్యత్స్వవినశ్యన్తం యః పశ్యతి స పశ్యతి ॥
(భ. గీ. 13 27.)

"యః సర్వేషు భూతేషు తిష్ఠన్ సర్వేభ్యో భూతేభ్యోఽన్తరో యం సర్వాణి భూతాని న విదు ర్యస్య సర్వాణి భూతాని

శరీరం యః సర్వాణి భూతాన్యన్తరో యమయత్యేష త
ఆత్మాన్తర్యామ్యమృతః ॥" (బృ. ఉ. 3. 7. 15.)

"న లిప్యతే లోకదుఃఖేన బాహ్యః". (కఠ. ఉ. 5. 11.)

అమూర్తమూర్తాని చ కర్మవాసనా
దృశిస్వరూపస్య బహిః ప్రకల్పితా।
అవిద్యయాహ్యాత్మని మూఢదృష్టిభి
రపోహ్య నేతీత్యవశేషితో దృశిః॥ ౪౮

తా॥ మూర్తములు అమూర్తములు నగు (స్థూల) పంచమహాభూతములును, కర్మవాసనాశ్రయమగు లింగశరీరమును దృశిస్వరూపుడగు బ్రహ్మ యొక్క రూపములుగా శ్రుతి యందు చెప్పబడినవి. మూఢులు అవిద్యచేత వీనిని దృక్స్వరూపుడు, ప్రత్యగాత్మస్వరూపుడు నగు బ్రహ్మయందు గల్పింతురు. ఇట్లు అవిద్యచేత బ్రహ్మయందు అధ్యస్తమైన మూర్తామూర్తప్రపంచమును (ఆత్మకు బహిర్భూత మయిన మిథ్యాప్రపంచమును) 'నేతి నేతి,' 'సత్యస్య సత్యం' ఇత్యాది వాక్యములచే నిషేధించుటచే కల్పితప్రపంచాధిష్ఠానరూపుడు, కేవలుడు, దృగ్రూపుడు నగు బ్రహ్మ శేషించును

వి :_ శుక్తియందారోపితమైన రజతము అధిష్ఠాన శుక్తి యాథాత్మ్యజ్ఞానముచే నివర్తింపగనే కల్పిత రజతాధిష్ఠానమగు శుక్తి కేవలము భాసించునట్లు సకలజగదధిష్ఠాన

బ్రహ్మయాథాత్మ్యజ్ఞానముచే నారోపితమగు జగత్తు నివర్తింపగనే (నిషేధింపబడగనే) అధిష్ఠాన మగు బ్రహ్మమాత్రము శేషించును (నిష్ప్రపంచబ్రహ్మాత్మజ్ఞానము కలుగును.)

'అధిష్ఠానావశేషో హి నాశః కల్పితవస్తునః'

సూత. సం. 4-2-8.

'ద్వే వావ బ్రహ్మణో రూపే మూర్తం చైవా

మూర్తం చ.

'తస్య హైతస్య పురుషస్య రూపం యథా మాహారజనం

వాసః' (బృ. 2. 3. 1.)

'సత్యస్య సత్యమ్' (బృ. ఉ. 2. 3. 6.)

(అనుమానప్రయోగము :- 'నహి మిథ్యార్థేన సత్యం వస్తు సంసృజ్యతే, ప్రతిపన్నోపాధౌ నిషిధ్యమానత్వాత్, రజ్జుసర్పాదివత్').

ప్రబోధరూపం మనసోఽర్థయోగజం
స్మృతౌ చ సుప్తస్య చ దృశ్యతేఽర్థవత్ ।
తథైవ దేహప్రతిమానతః పృథగ్
దృశేః శరీరం చ మనశ్చ దృశ్యతః ॥ 5

తా॥ ఘటాదివిషయసంబంధముచే మనస్సునందు ఘటాది విషయాకారరూపవృత్తిజ్ఞానము కలుగును. ఆ వృత్తి

జ్ఞానమే స్మృత్యవస్థ యందును, స్వప్నదశ యందును ఘటాది విషయము లచట లేకున్నను తత్తద్విషయాకారరూపమున భాసించుచుండును. ఇట్లు ఘటాదివిషయములు లేకున్నను తత్తద్విషయాకారము దృశ్యముగా గోచరించుచుండుటచే నా యా యర్థములు దృగ్రూపుడగు నాత్మ కంటె భిన్నములే యగుచున్నవి. ఇట్లే శరీరము (స్థూలము), మనస్సు (లింగశరీరము), దేహద్వయవాసనారూపమును దృశ్యములే యగుటజేసి యని దృగ్రూపుడగు నాత్మ కంటె భిన్నములే యగును గాని, యాత్మకు సంబంధించినవి కావు. కాన ఆత్మ యందు కల్పితమైన దృశ్యమును (జగత్తును) నిషేధించుటచే రజ్జుసర్పమునకు వలెనే యీ జగత్తుకు గూడ మిథ్యాత్వము సిద్ధించినది.

స్వభావశుద్ధే గగనే ఘనాదికే
మలేఽపయాతే సతి చావిశేషతా ।
యథా చ తద్వ చ్ఛ్రుతివారితద్వయే
సదాఽవిశేషో గగనోపమే దృశౌ ॥ ౫౦

తా॥ ఆత్మయందధ్యస్తమైన జగత్తును శ్రుతివాక్యములచే నిషేధించినచో సంసారనివృత్తి యనెడి విశేషయోగముచే నాత్మ సవికారమై యనిత్య మగును - అనెడి శంక యిట నిరస్త మగుచున్నది.

శుద్ధస్వభావము గల యాకాశమందు మేఘాదిరూప దోషములు తొలగగనే యాకాశము సహజశుద్ధస్వభావముతో నిర్విశేషముగా భాసించును. అట్లే ఆకాశమువలె నిర్మల మయిన ఆత్మయందు నేతినేతీత్యాది శ్రుతివాక్యములచే ద్వయరూపమగు స్థూలసూక్ష్మశరీరాది దృశ్యజగత్తు నిషేధింపబడగనే యాత్మ సహజమగు నిత్యశుద్ధబుద్ధస్వభావముతో నిర్విశేషరూపమున భాసించును.

వి :- మిథ్యాకల్పిత రజ్జుసర్పనివృత్తిచే నధిష్ఠానమగు రజ్జువునం దెట్టి విశేషము గోచరింపనియట్లు మిథ్యాకల్పిత దృశ్యసంసారనివృత్తిచే నధిష్ఠానము, దృగ్రూపుడు నగు నాత్మ యం దెట్టి విశేషము భాసింపదని భావము.

## నాన్యదన్యత్ప్రకరణమ్ - ౧౫

నాన్యదన్యద్భవేద్యస్మా న్నాన్యత్కించిద్విచిన్తయేత్ ।
అన్యస్యాన్యాత్మభావే హి నాశ స్తస్య ధ్రువో
భవేత్ ॥ ౧

తా॥ ఒక వస్తువు మఱియొక వస్తువుగా నెన్నటికి రూపొందదు. అట్లుగాక యొకటి మఱియొకటిగా రూపొందు

నని యంగీకరించుచో నా వస్తువునకు వినాశము నిశ్చయము. బ్రహ్మకంటె జీవుడుభిన్ను డగుచో నా జీవుడు బ్రహ్మ భావము పొందునెడల నాతనికి (జీవునకు) వినాశము సంగీక రింపవలసియుండును. కాన, బ్రహ్మకంటె జీవుడు భిన్నుడు గాడు.

వి:- ఆత్మ స్వభావశుద్ధుడు గాడు. సహజముగా శుద్ధుడేయైనచో శుద్ధత్వసంపాదక సాధనసామగ్రి వ్యర్థ మగును. కాన సహజముగా నాత్మ సంసారియై ఔషధయోగ ముచే తామ్రాదులు సువర్ణత్వము పొందునట్లు జ్ఞాన ధ్యానాది సాధనానుష్ఠానముచేత స్వభావశుద్ధబ్రహ్మస్వరూపు డగునని కొందఱు చెప్పెదరు. ఆ వాద మిట నిరసింపబడు చున్నది.

జీవబ్రహ్మలకు భేదము గలదని గాని, భేదాభేద ములు గలవని గాని యంగీకరింపరాదు. భేదాభేదముల నంగీకరించుచో నవి (భేదాభేదములు) విరుద్ధస్వభావములు గలవి యగుట జేసి 'అహం బ్రహ్మాస్మి' యని ఏకరూపజ్ఞాన ధ్యానములు అసంభవము లగును. అట్లు జ్ఞానధ్యానములు లేనిచో అసంసారి బ్రహ్మభావరూపఫలము సిద్ధింపనేరదు. ఇక భేద మున్నదని చెప్పుచో జీవు డెన్నటికి బ్రహ్మభావమును పొందనేరడు. ఒక వస్తువు మఱియొకవస్తువుగా రూపొం దుచో పూర్వవస్తువునకు వినాశము తప్పదు గదా! కాన

జీవుఁడు తాను వినాశము చెందక బ్రహ్మభావమును పొందలేఁడు. జీవుఁడే నశించుచో నిక బ్రహ్మభావప్రాప్తి యెవరికి? కాన శ్రుతియుక్తివిరుద్ధ మగుటచే జీవబ్రహ్మలకు భేదము నంగీకరింపరాదు.

మఱియు ఓషధీరసయోగముచే తామ్రాదులకు సువర్ణత్వము వలె జ్ఞానధ్యానాదులచే సంసారి యగు జీవునకు బ్రహ్మభావప్రాప్తి కలుగు ననుటయు సరి కాదు. కాలాంతరమున రసభావము తఱిగి తామ్రాదులకు స్వస్వరూపము ప్రాప్తించునట్లు జ్ఞానధ్యానాది కర్మఫలము క్షీణించినంతనే ఆత్మకు తిరిగి సంసారిత్వము ప్రాప్తింపగలదు. కాన, ఆత్మకంటె బ్రహ్మ భిన్నుఁ డను వాదము సరి కాదు.

'యథా భేషజసంపర్కా త్తామ్రస్య మలనాశనమ్ ।
తథా జీవస్య దుఃఖాదినివృత్తిః కేనచి ద్భవేత్ ॥

రసవిద్ధ మయః స్వర్ణం యథా భవతి సర్వదా ।
కేనచి త్సాధనేనైవ తథా జీవః శివో భవేత్ ॥
ఇతి కేచిత్ స్వమోహేన ప్రవదన్తి తు వాదినః'॥
సూత. సం. 4. 39. 29, 30.

స్మరతో దృశ్యతే దృష్టం పటే చిత్ర మివార్పితమ్ ।
యత్ర యేన చ తౌ జ్ఞేయౌ సత్త్వక్షేత్రజ్ఞసంజ్ఞకౌ ॥ ౨

తా॥ జాగ్రద్దశలో జూచిన వస్తువులను తిరిగి మనము స్మరించినపుడు (స్మృత్యవస్థయందు) అవి వస్త్రమునందు చిత్తరువు వలె మన మనఃఫలకమునందు ముద్రితములై గోచరించును. (తత్తదర్థాకారవృత్తిరూపమున నా పదార్థములు భాసించును). ఆ పదార్థములు దేనియందు భాసించునో యది సత్త్వము (అంతఃకరణము); దేనిచేత ప్రకాశింపజేయబడునో యతడు క్షేత్రజ్ఞుడు.

ఫలాన్తం చానుభూతం యద్యుతం కర్త్రాదికారకైః।
స్మర్యమాణం హి కర్మస్థం పూర్వం కర్మైవ తచ్చితః॥ 3

తా॥ జాగ్రద్దశయందు ద్వైతము కర్తృ కర్మ కరణాది భిన్నభిన్న కారకసహితమై సుఖదుఃఖ ఫలహేతువగుచు దృశ్యము (కర్మ)తో సంబంధించి యనుభూత మగుచుండును. ఇట్లు జాగ్రద్దశయందు దృశ్యసంబంధముగా (కర్మసంబద్ధమై) అనుభూత మగుచుండెడి ద్వైతము స్మరింపబడినపుడు (స్మృత్యవస్థయందు) గూడ దృశ్యముతో సంబంధించియే యంతఃకరణమున ననుభూత మగుచుండును. (అనగా ఈ స్మృత్యవస్థయందు ద్వైతమున కాశ్రయ మంతఃకరణ మగును.) ఇట్లు దృశ్యముతో సంబంధించియే ద్వైత మంతఃకరణమున ననుభూత మగుచుండుటచే ద్వైతము దృశ్య

నిష్ఠమే యగును గాని ద్రష్టృనిష్ఠము గాదు. మఱియు 'దీనిని స్మరించుచున్నాను' అను లోకానుభవమును బట్టి దృశ్యసంబద్ధమై పూర్వానుభూత మయిన ద్వైతమున కిపుడు (స్మరింపబడినపుడు) చిత్తమే యాశ్రయముగా దృశ్య మగుచుండుట జేసి యట్లు దృశ్య మగు నంతఃకరణము గూడ సాక్షిభాస్యమే (కర్మయే) యగుచున్నది.

ద్రష్టుశ్చాన్యద్భవేద్దృశ్యం దృశ్యత్వాద్ఘటవత్సదా ।
దృశ్యాద్ద్రష్టాఽసజాతీయో న ధీవత్సాక్షితాఽన్యథా॥ ౪

తా॥ దృశ్యమగు నంతఃకరణాదికము ఘటాదులవలె ద్రష్టకంటె నెపుడు భిన్నమే యగును. ద్రష్టయు జడమగు దృశ్యము కంటె నెపుడును విలక్షణుడే యగును. అట్లు గానిచో నిరంతరము ఘటాది విషయాకారవృత్తిరూప పరిణామముల నొందు నంతఃకరణము వలెనే ద్రష్టయు నిరంతర పరిణామశీలుడు కావలెను. అట్టిచో పరిణామి యగు నంతఃకరణమునకు వలెనే ద్రష్టకు గూడ సాక్షిత్వము సిద్ధింపదు.

స్వాత్మబుద్ధి మపేక్ష్యాసౌ విధీనాం స్యాత్ప్రయోజకః ।
జాత్యాదిః శవవత్తేన తద్వాన్నాత్మాఽన్యథా ॥ ౫

తా॥ "నేను బ్రాహ్మణుడను; క్షత్రియుడను; ఇది నాది' యనెడి ఆత్మాత్మీయాభిమానలక్షణ మగు మిథ్యా దృష్టిని పురస్కరించుకొని బ్రాహ్మణత్వాది జాత్యాదులు

వారి వారి నా యా కర్మల యందు ప్రవర్తింపజేయుచుం డును. ఆ యభిమానమే లేనిచో తత్తజ్జాతివిహిత కర్మల యందు ప్రవృత్తియే యుండదు. ఎట్లన, ప్రాణోత్క్రమణ మైన తరువాత శవదేహమునందు 'ఇతడు నా తండ్రి, ఈమె నా తల్లి' యనెడి మిథ్యాభిమానముతో శవసంస్కారమును నిర్వర్తింతురు. అట్టి యభిమానమే లేనిచో సంస్కారము జేయుటకు ప్రవర్తింపరు. శవదేహమువలెనే జాత్యాదులును ఆత్మధర్మములు గావు. జాత్యాదు లాత్మధర్మములే యగుచో జాత్యాదిధర్మములు గల ఘటాదులవలె ఆత్మకును అనాత్మత్వదోషము ప్రసక్తించును. కాన, ఆత్మ సాక్షియే కాని జాత్యాద్యభిమానప్రయుక్త కర్మాధికారియై పరిణామి స్వభావము గలవాడు కాడు.

న ప్రియాప్రియ ఇత్యుక్తే ర్నా దేహత్వం క్రియాఫలమ్ ।
దేహయోగః క్రియాహేతు స్తస్మా ద్విద్వాన్
క్రియా స్త్యజేత్ ॥ ౬

తా॥ 'అశరీరం వా వ సన్తం న ప్రియాప్రియే స్పృశతః' (ఛాం. ఉ. 8. 12. 1.) అశరీరియగువానిని ప్రియముగాని యప్రియముగాని స్పృశింపదు - అని శ్రుతి పేర్కొనినది. అశరీరత్వ మనగా దేహాభిమానరాహిత్యము. ఈ యశరీరిత్వమే మోక్ష మనబడును. ఇది క్రియాసాధ్యము గాదు.

ఏలయన, క్రియకు ఫలములు సుఖదుఃఖము లగుట ప్రసిద్ధము. కర్మానుష్ఠానము జేసినచో తత్ఫలములగు సుఖదుఃఖముల ననుభవించుటకై యవశ్యము దేహగ్రహణము జేయవలసి యుండును. ఇట్లు క్రియలు దేహగ్రహణమునకు హేతువు లగునుగాని, యశరీరిత్వమునకు గాదు. క్రియలకు ఫల మశరీరిత్వ మని యెచటను శ్రుతి పేర్కొనలేదు; అట్లు చెప్పుట యుక్తిసహమును కాదు. కాన, విద్వాంసుడు ముక్తి, జ్ఞానసాధ్యమే కాని, క్రియాసాధ్యము గాదని యెఱిగి జాత్యాది మిథ్యాభిమాన సాపేక్షములగు కర్మల సంన్యసించి శ్రవణ మననాదులయందు బ్రవృత్తుడు కావలెను.

కర్మస్వాత్మా స్వతన్త్రశ్చే న్నివృత్తౌ చ తథేష్యతామ్।
అదేహత్వే ఫలేఽకార్యే జ్ఞాతే కుర్యాత్కథం

క్రియాః ॥ 8

తా॥ రాగాదులు గలిగి కర్మలయందు బ్రవర్తించుటకు ఆత్మ స్వతంత్రు డగుచో, విశుద్ధాంతఃకరణము గలిగి వీతరాగుడైన యాత్మయు కర్మల సంన్యసించుటయందు స్వతంత్రుడగు నని యంగీకరింపవలెను. కర్మసాధ్యఫలాభిలాష లేనివాడు కర్మత్యాగ మథసిద్ధమే యగును గదా! అశరీరిత్వ (దేహాభిమానరాహిత్య) రూప మోక్షము క్రియాసాధ్యము గాడని శాస్త్రాదులచే నెఱిగినంతనే కర్మల వలన

ప్రయోజనము లేసందున ముముక్షువగువాడు కర్మలయం దెట్లు ప్రవర్తించును?

జాత్యాదీన్ సంపరిత్యజ్య నిమిత్తం కర్మణాం బుధః ।
కర్మహేతువిరుద్ధం యత్స్వరూపం శాస్త్రతః స్మరేత్ ॥ ౮

తా॥ పండితుడు కర్మలయందు బ్రవృత్తికి గారణమగు జాత్యాద్యభిమానమును విడిచి కర్మప్రవృత్తిహేతువగు మిథ్యాభిమానమును రూపుమాపెడి శుద్ధ - ఆత్మస్వరూపమును శాస్త్రాదులచే నెఱిగి నిరంతరము తత్స్వరూపానుసంధానము జేసికొనుచుండవలెను.

ఆత్మైకః సర్వభూతేషు తాని తస్మింశ్చ ఖే యథా ।
పర్యగాద్వ్యోమవత్సర్వం శుక్రం దీప్తిమదిష్యతే ॥ ౯

తా॥ ఆకాశమునందు సర్వభూతములును, సర్వభూతముల యందాకాశము నున్నట్లే ఆత్మయందే సర్వభూతములును, సర్వభూతములయందు నాత్మయు ఏకరూపమున వ్యాపించి యున్నది, కాన చేతనభేదము లేదు; ఆత్మకంటె భూతములును భిన్నములు గావు. అట్టి యాత్మ యాకాశమువలె నంతట సద్రూపమున వ్యాపించియున్నాడు; స్వయం ప్రకాశస్వభావుడు - అని యీ రీతిగా శ్రుతిప్రతిపాదితాత్మ స్వరూపానుచింతనము చేయవలెను.

'స పర్యగా చ్ఛుక్ర మకాయ మవ్రణ మస్నావిరం శుద్ధ
మపాపవిద్ధమ్' – ఈశా. ఉ. 8.

"యస్తు సర్వాణి భూ తాన్యాత్మన్యే వానుపశ్యతి ।
సర్వభూ తేషు చాత్మానం తతో న విజుగుప్సతే॥
ఈశా. ఉ. 6.

"నైనేన కించ నానావృతం నైనేన కించనాసంవృతమ్ "
బృ ఉ. 2. 5. 18.

వ్రణస్నాయ్వోరభావేన స్థూలం దేహం నివారయేత్ ।
శుద్ధాపాపతయాఽలేపం లిఙ్గం చాకాయమిత్యత ॥ ౧౦

అవ :– "అవ్రణ మస్నావిరం శుద్ధ మపాపవిద్ధమ్" అను మంత్రము యొక్క యర్థ మిట వివరింపబడుచున్నది.

తా॥ ఆత్మ అవ్రణుడు (వ్రణములు లేనివాడు), అస్నావిరుడు (సిరలు లేనివాడు) అగుటచే స్థూలదేహమే యాత్మ యనువాదమును తిరస్కరింపవలెను. శుద్ధుడు (రాగాదిదోషహీనుడు), అపాపవిద్ధుడు (పుణ్యపాపహీనుడు) అగుటచే ఆత్మకు పుణ్యపాపప్రయుక్త సుఖదుఃఖాదులుగాని, తదనుభవసంస్కారవిలిప్తత్వము గాని లేవని (అలేపః) త్రోసిపుచ్చవలెను. అకాయుడు (దేహరహితుడు) అగుటచే సూక్ష్మదేహము కంటె గూడ భిన్నుడు. కనుక సూక్ష్మ

దేహాత్మవాదమును గూడ నిరసింపవలెను. ఆత్మ స్థూల సూక్ష్మదేహముల కంటెను, తత్కార్య-తద్వాసనల కంటెను విలక్షణుడు, అపరిచ్ఛిన్నుడని నిరంతర మనుసంధానము చేసికొనుచుండవలెను.

వాసుదేవో యథాఽశ్వత్థే స్వదేహే చాబ్రవీత్సమమ్ ।
తద్వద్వేత్తి య ఆత్మానం సమం స బ్రహ్మ
విత్తమః ॥ ౧౧

తా॥ అశ్వత్థము నికృష్టోపాధి; శ్రీకృష్ణుని దేహము ఆవిర్భూత విజ్ఞానైశ్వర్యశక్తిసమన్విత మగుటచే నుత్కృష్టోపాధి. అయ్యును శ్రీకృష్ణుడు అశ్వత్థమునందు వలెనే తన దేహమునందును తాను సమముగా (నిర్విశేషరూపమున) నున్నట్లు జెప్పెను. "(అశ్వత్థః సర్వవృక్షాణాం ... వృష్ణీనాం వాసుదేవోఽస్మి". భ. గీ. 10. 26. 27.) ఇట్లు ఆత్మనెవడు నిర్విశేషస్వరూపునిగా (ఉపాధికృత వైషమ్యరహితునిగా) తెలిసికొనునో యతడే బ్రహ్మవేత్తలలో నగ్రగణ్యుడు.

సర్వాణి తత్ర భూతాని వసన్తి పరమాత్మని ।
భూతేషు చ స సర్వాత్మా వాసుదేవ స్తతః స్మృతః ॥
విష్ణు. పు. 6. 5. 80.

యథా హ్యన్యశరీరేషు మమాహన్తా న చేష్యతే।
అస్మింశ్చాపి తథా దేహే ధీసాక్షిత్వావిశేషతః॥ ౧౨

తా॥ అన్యశరీరముల యందు, 'ఈ శరీరమే నేను; ఇది నాది' యనెడి ఆత్మాత్మీయాభిమానము లేనట్లే యీ దేహమునందును నట్టి యభిమాన ముంచుట సమ్మతము గాదు, ఇతర దేహములందువలెనే యీ దేహమునందును ఆత్మ యంతఃకరణసాక్షిరూపుడుగనే యెట్టి విశేషము లేకయే యుండును గదా! అట్టిచో నా యభిమానమునకు తావేది?

రూపసంస్కారతుల్యాధీ రాగద్వేషౌ భయం చ యత్।
గృహ్యతే ధీశ్రయం తస్మాజ్జ్ఞాతా శుద్ధోఽభయః
సదా॥ ౧౩

తా॥ నీల పీతాదిరూపముల జూచినపు డొక సంస్కారము గలుగును. దాని కాశ్రయ మంతఃకరణము. నీలాది రూపముల జూచుట వలన గలుగు రాగద్వేషములకును, భయమునకు నాశ్రయ మంతఃకరణమే. అంతఃకరణము నాశ్రయించిన రాగద్వేషభయములనే సాక్షి యగు నాత్మ గ్రహించుచుండుట చే నీ రాగద్వేషభయములు ఆత్మాశ్రితములు గావు. కాన, ద్రష్ట యగు నాత్మ రాగాదివర్జితు డగుటచే శుద్ధుడు, అభయరూపుడు నగుచున్నాడు. చూ. ఉపదేశ సాహస్రి. గద్య. 35.

'కామః సంకల్పో విచికిత్సా శ్రద్ధాఽశ్రద్ధా ధృతి
రధృతి ర్హ్రీ
ర్ధీ ర్భీ రిత్యేతత్సర్వం మన ఏవ.' బృ. ఉ. 1. 5. 3.

వి : సంస్కారో నామ స్వాశ్రయస్య ప్రాగుద్భూతా
వస్థా సమానావస్థాన్తరాపాదకోఽతిన్ద్రియో ధర్మః.

యన్మనా స్తన్మయోఽన్యత్వే నాత్మత్వాప్తౌ క్రియాఽత్మని।
ఆత్మత్వే చానపేక్షత్వా త్సాపేక్షం హి న
తత్స్వయమ్ ॥ ౧౪

తా॥ ఉపాసకుడు తత్పరుడై స్వాభీష్టదేవత నుపాసించి తద్దేవతాస్వరూపు డగును. ఇట ఉపాసకుడు వేరు; ఉపాస్య దైవము వేరు. కాన ధ్యానక్రియ సార్థక మగుచున్నది. మోక్షరూపబ్రహ్మ ఆత్మస్వరూపుడే కాన, ఆత్మస్వరూప ప్రాప్తికి ధ్యానాదిక్రియ యావశ్యకము గాదు. మఱియు ఆత్మస్వరూపప్రాప్తికి అవిద్యాకల్పితమైన యావరణము మాత్రమే వ్యవధానము గాన అవిద్యానివృత్తికి విద్య (జ్ఞానము) యావశ్యకముగాని క్రియ గాదు. అట్లుగాక మోక్షము క్రియాసాపేక్ష మగుచో క్రియాసాధ్యఫలము అనాత్మస్వరూపము, అనిత్యము నగుటవలన నది యాత్మ స్వరూపము గానేరదు. కాన, ఆత్మ నిత్యశుద్ధుడు.

ఖమివైకరసా జ్ఞప్తి రవిభక్తాఽజరాఽమలా ।
చక్షురాద్యుపధానా సా విపరీతా విభావ్యతే ॥ ౧౫

తా॥ జ్ఞానము (ఆత్మ) ఆకాశము వలె నిర్విశేషస్వరూపము, విభాగశూన్యము, జరామరణరహితము, నిర్మలము. అట్టి జ్ఞానము ఉపాధి (ఇంద్రియ) సంసర్గదోషవశమున జన్మ వినాశభేదములు గలదివోలె తెలియబడుచుండును.

దృశ్యత్వా దహమిత్యేష నాత్మధర్మో ఘటాదివత్ ।
తథాఽన్యే ప్రత్యయా జ్ఞేయా దోషాశ్చాత్మాఽ
మలోహ్యతః ॥ ౧౬

తా॥ ఘటాదులు దృశ్యము లగుటచే నాత్మ ధర్మములు గావు. అట్లే అహంకారము, ఇతర రూపాదివిషయ జ్ఞానములు వృత్తులు, రాగద్వేషాది దోషములును దృశ్యములే యగుటజేసి యాత్మధర్మములు గావు. కాన, ఆత్మ నిత్యశుద్ధుడు.

సర్వప్రత్యయసాక్షిత్వా దవికారీ చ సర్వగః ।
విక్రియేత యది ద్రష్టా బుద్ధ్యాదీవాల్పవిద్భవేత్ ॥ ౧౭

తా॥ ఆత్మ తత్తదర్థాకారముగ బరిణమించు బుద్ధి వృత్తులకు సాక్షిభూతు డగుటచే నిర్వికారుడు; సర్వవ్యాప

కుడు. అట్లుగాక పరిణామము చెందుచో బుద్ధ్యాదులవలెనే యల్పజ్ఞు డగును.

వి :- ఇట బుద్ధ్యాదిపదము చేత చిదాభాసవిశిష్ట బుద్ధ్యాదులను (బుద్ధిచిత్తమనస్సుల) గ్రహింపవలెను. లేనిచో బుద్ధ్యాదులు సహజముగా జడములుగాన వానికి అల్పజ్ఞత్వము సిద్ధింపదు. చిదాభాసవిశిష్టబుద్ధికి విషయప్రకాశకశక్తి గలదు గాని పూర్వాపరముల ననుసంధానించుకొను శక్తి లేదు. ద్రష్ట యగు నాత్మకు గూడ పరిణామ మంగీకరించుచో వికారి యగుట వలన బుద్ధ్యాదులకు వలె పూర్వాపరానుసంధానము లేక సర్వవ్యవహారలోపము ప్రసక్తించును.

(చూ. 18 అ-157, 158)

న దృష్టి ర్లుప్యతే ద్రష్టు శ్చక్షురాదే ర్యథైవ తత్ ।
న హి ద్రష్టు రితి హ్యుక్తం తస్మాద్ద్రష్టా
సదైకదృక్ ॥ ౧౮

తా॥ చక్షురాదీంద్రియముల వలన గలుగు జ్ఞానము వృత్తిపరిణామరూప మగుటచే నశించునట్లు ద్రష్ట యగు ఆత్మ యొక్క జ్ఞానము నశింపదు. శ్రుతియు "న హి ద్రష్టు ర్దృష్టే ర్విపరిలోపో విద్యతే, అవినాశిత్వాత్" (బృ. ఉ. 4. 3. 23.) - 'ద్రష్ట యగు నాత్మకు వినాశము లేదుగాన, ఆత్మ

దృష్టికి వినాశ మెన్నడు నుండ'దని చెప్పినది. కాన ద్రష్ట యగు నాత్మ సర్వదా ఏకరూపదృష్టిస్వభావుడు.

సంఘాతో వాఽస్మి భూతానాం కరణానాం తథైవ చ।
వ్యస్తం వాఽన్యతమో వాఽస్మి కో వాఽస్మీతి
విచారయేత్ ॥ ౧౭

తా॥ ఆత్మ నిత్యశుద్ధబుద్ధస్వభావు డయ్యును ఉపాధి సంబంధము చే అన్యథా భాసించుటచే 'అహం బ్రహ్మాస్మి' యను జ్ఞానము కలుగుటకై పదార్థవివేచనపూర్వకముగ ముముక్షు విట్లు విచారణ చేయవలెను.

'అహ' మ్మను ప్రతీతిచే భాసించెడి యీ యాత్మ యెవరు ? 'నేను మనుష్యుడను, కృశించితిని, స్థూలముగా నున్నాను.' ఇత్యాది ప్రతీతి కలుగుచుండుటచే నాత్మ భూత సంఘాతాత్మక దేహరూపుడా ? 'నేను చూచుచున్నాను, వినుచున్నాను, రుచి చూచుచున్నాను, గ్రుడ్డివాడను, చెవిటి వాడను' ఇత్యాది వ్యవహారమువలన నింద్రియములయందే అహ మ్మను ప్రతీతి గల్గుచున్నది. కాన, ఆత్మ యింద్రియ సంఘాతరూపుడా? ఇంద్రియములయందు వేర్వేఱుగనే 'నేను' అను ప్రతీతి గల్గుటవలన నొక్కొక్క యింద్రియము ప్రత్యేకముగా నొక్కొక్క యాత్మరూపమా ? ఒకే దేహ మునను ఇంద్రియరూప - అనేకాత్మల నంగీకరించుచో నెపు

స్థైన పరస్పరము నైమత్యము గలిగి భోగవ్యవస్థ కుదురదు గాన నింద్రియము లన్నియు నాత్మ లగుట యసంభవము. కాన, వీనిలో నేదేనొకటి యాత్మ యగునా? ఇంద్రియ సమూహము కంటె నతిరిక్తముగ తదధిష్ఠానరూపుడై యాత్మ యొప్పునా? ఇంద్రియాధిష్ఠానరూపు డగుచో నంతఃకరణ ప్రాణాదులలో నాత్మ యొకడగునా? లేక యంతఃకరణా దులకంటె విలక్షణస్వభావుడై విలసిల్లుచుండునా?

వ్యస్తం నాహం సమస్తం వా భూత మిన్ద్రియమేవ వా ।
జ్ఞేయత్వాత్కరణత్వాచ్చ జ్ఞాతాఽన్యోఽస్మా
ద్ఘటాదివత్ ॥ ౨౦

తా॥ నేను భూతసంఘాతాత్మక దేహరూపుడను గాను; ఇంద్రియసంఘాతరూపుడను గాని, యంతఃకరణాది రూపుడనుగాని కాను. ఇవి యన్నియు ఘటాదులవలె జ్ఞేయములు (దృశ్యములు), గొడ్డలి మున్నగువానివలె కరణములు (సాధనములు) నగుటచే పరిచ్ఛిన్నములు, అచేతనము లగును. కాన దృశ్యములు, అచేతనములు నగు అంతఃకరణా దులకంటె ద్రష్టయు చేతనుడు నగు ఆత్మ విలక్షణుడు.

ఆత్మాగ్ని రిన్ధనా బుద్ధి రవిద్యాకామకర్మభిః ।
దీపితా ప్రజ్వలత్యేషా ద్వారైః శ్రోత్రాదిభిః సదా ॥ ౨౧
కం. ర. 13-23

తా॥ ఆత్మ యనెడి యగ్నికి ఇంధనము (సమిధ) బుద్ధి. అది యవిద్యారాగద్వేషకర్మలచేత నుత్తేజింపబడినదై చక్షురాదీంద్రియముల ద్వారా ప్రజ్వలించుచుండును.

వి :— ఆకారము లేని యగ్ని విశేషాకారముతో నభివ్యక్త మగుటకు కాష్ఠాదులు కారణ మగునట్లు ఆత్మచైతన్యము విశేషాకారముతో నభివ్యక్త మగుటకు బుద్ధి కారణ మగును. అగ్నిగ్రస్తములగు కాష్ఠాదులు వాయుప్రేరితములై యుత్తేజితము లగునట్లు చైతన్యగ్రస్తమగు బుద్ధియు అవిద్యాకామకర్మ వాసనాప్రేరితమై యుత్తేజిత మగుచు ప్రజ్వలించి యింద్రియాదుల ద్వారా బహిర్గత మగుచుండును.

ఇట ఆత్మాగ్నులకు బుద్ధీంధనాదులకు నభేదాధ్యవసాయము చేసి రూపణము చేయబడినది. అందుచే వ్యవహారకాలమున శ్రోత్రాదీంద్రియములచే రూపాదివిషయములు గ్రహింపబడుట యనగా, రూపాదివిషయము లాత్మాగ్నియందు హోమ మగుచున్నవని భావింపవలెను. అట్లు భావన జేసినకొలది విషయములందాసక్తి నివర్తించును.

దక్షిణాక్షిప్రధానేషు యదా బుద్ధిర్విచేష్టతే ।
విషయై ర్హవిషా దీప్తా హ్యాత్మాగ్నిః స్థూలభుక్తదా ॥ ౨౨

తా॥ దక్షిణనేత్రప్రధానములగు నింద్రియములందు బుద్ధియెప్పుడు ప్రవర్తించి రూపాదివిషయము లనెడి హవిస్సులచే నుత్తేజితమగునో, తత్తద్విషయాకారముగా బరిణమించి ప్రకాశించునో - యప్పుడు ఆత్మాగ్ని స్థూలవిషయానుభవము గలిగియుండును. ఇదియె జాగ్రద్దశ.

వి :- శరీరమున వామభాగము కంటె దక్షిణభాగము ప్రధానము గాన 'దక్షిణాక్షి ప్రధానేషు' అని చెప్పబడినది.

హూయమానేతు హవింషీతి రూపాదిగ్రహణే స్మరన్ ।
అరాగద్వేష ఆత్మాఽగ్నౌ జాగ్రద్దోషైర్న లిప్యతే॥ ౧౩

తా॥ రూపాదివిషయముల గ్రహించునపుడు ఆత్మ రాగద్వేషవర్జితుడై 'రూపాదివిషయము లనెడి హవిస్సులు ఆత్మాగ్నియందు హుతము లగుచున్న' వని ధ్యానించుచు పుణ్యపాపలక్షణములగు జాగ్రద్దోషములచే లిప్తుడు గాక యుండును.

మానసే తు గృహే వ్యక్తః సోఽవిద్యాకర్మవాసనామ్ ॥
పశ్యం స్తైజస ఆత్మోక్తః స్వయంజ్యోతిః
ప్రకాశితా ॥ ౧౪

తా॥ స్వప్నమున బాహ్యేంద్రియవ్యాపారము లుపరతము లగును. బాహ్యములగు నాదిత్యాది జ్యోతిస్సులు నుం

డవు. అట్టియెడ మానసమందిరమున (మనఃపరిణామోపాధిర్మానసం గృహం) అభివ్యక్తుడగు నాత్మ, అవిద్యామూలక కర్మలచే నుద్బుద్ధమయి విషయాకారముగా బరిణమించు (కర్మ) వాసనను దర్శించుచు తైజసుడని చెప్పబడును. (తేజసి వాసనామయే విషయేఽభివ్యక్తః తైజసః). అచట భాసించు కర్మ సుఖదుఃఖాదు లన్నియు మనోవృత్తిరూపములు, దృశ్యములు నగుటజేసి యా మనోవృత్తులకు సాక్షియై యాత్మ యపుడు స్వయంజ్యోతీరూపు డగుచు విలసిల్లుచుండును.

విషయా వాసనా వాఽపి చోద్యన్తే నైవ కర్మభిః।
యదా బుద్ధౌ తదా జ్ఞేయః ప్రాజ్ఞ ఆత్మా
హ్యనన్యదృక్ ॥ ౨౫

తా॥ అంతఃకరణమున నెపుడు స్థూలములగు విషయములుగాని, స్వప్నమున గోచరించెడి సూక్ష్మములగు కర్మవాసనలుగాని ప్రేరితములు గావో యపుడు ఆత్మవ్యతిరిక్తమగు విషయమును గాని వాసనను గాని దర్శింపనివాడై (అనన్యదృక్) యాత్మ ప్రాజ్ఞు డని చెప్పబడును. (ప్రజ్ఞాతిశయాత్ ప్రాజ్ఞః).

మనోబుద్ధీన్ద్రియాణాం చ హ్యవస్థాః కర్మచోదితాః।
చైతన్యేనైవ భాస్యన్తే రవిణేవ ఘటాదయః॥ ౨౬

తా॥ సూర్యునిచే ఘటాదులువలె, చేతనుడగు నాత్మ చేతనే యింద్రియావస్థ యగు జాగ్రద్దశయు, మనోఽవస్థ యగు స్వప్నదశయు, బుద్ధ్యవస్థ (కారణావస్థ) యగు సుషుప్తిదశయు భాసింపజేయబడుచున్నవి.

తత్త్రైవం సతి బుద్ధిర్జ్ఞ ఆత్మభాసాఽవభాసయన్ ।
కర్తా తాసాం యదర్థాస్త్రా మూఢైరేవాభిధీయతే॥ ౨౭

తా॥ జాగ్రత్స్వప్నాదిదశలు మూడు నీ రీతిగా నాత్మ యందధ్యస్తములుకాగా నాత్మ కర్మచోదిత సుఖదుఃఖాది వాసనామయ మనోవృత్తులను జాగ్రదాదిదశలయందు స్వచైతన్యముచే భాసింపజేయుచుండును. కాని శాస్త్రాచార్యోపదేశ రహితులగు మూఢులు కర్మోద్భాసిత బుద్ధ్యవస్థానుగతుడగు చిదాభాసుని బుద్ధికంటె వ్యతిరిక్తముగ దర్శింపలేక యాత్మయే ద్రష్ట (దర్శనకర్త) యని వ్యవహరింతురు.

సర్వజ్ఞోఽప్యత ఏవ స్యాత్స్వేన భాసాఽవభాసయన్ ।
సర్వం సర్వక్రియాహేతోః సర్వకృత్త్వం
తథాఽఽత్మనః॥ ౨౮

తా॥ అజ్ఞాన - తత్కార్యమగు బుద్ధియందు ప్రతిబింబించిన చిదాత్మకు ఉపాధివశమున జ్ఞాతృత్వము లేక ద్రష్టృత్వము కల్పితము. అట్లే ఆదిత్యుడు స్వప్రకాశము చేతను

వలె, ఆత్మయు, స్వచైతన్యము చేతనే స్వచైతన్యాశ్రిత మాయా వివర్తమగు సర్వమును నెట్టి వికారములకు లోనుగాక ప్రకాశింపజేయుచు సర్వజ్ఞుడని వ్యవహరింపబడును. అంతియే కాని ఆత్మకు సర్వవిషయజ్ఞాతృత్వము (సర్వవిషయజ్ఞానకర్తృత్వము) లేదు. మఱియు ఆత్మయు స్వసాంనిధ్యమాత్రము చేతనే మాయోపాధివశమున సర్వక్రియాకారక ప్రవృత్తి హేతువగుచు యంత్రారూఢములగు వస్తువులను వలె సర్వమును భ్రమింపజేయుచు సర్వకర్త యని వ్యవహరింపబడు చున్నాడు. కాన ఆత్మకు సర్వజ్ఞత్వ - సర్వకర్తృత్వములు మాయోపాధినిమిత్తములు.

> సోపాధిశ్చైవ మాత్మోక్తో నిరుపాఖ్యోఽనుపాధికః ।
> నిష్కలో నిర్గుణః శుద్ధస్తం మనోవాక్చ
> నాప్నుతః ॥ ౭౬

తా॥ ఆత్మ జాగ్రదాది - అవస్థాత్రయమునకు సాక్షిభూత డగుటచే దృశ్యదోషవినిర్ముక్తుడై నిత్యశుద్ధ చిద్రూపుడయ్యును మాయోపాధివశమున జ్ఞాత, కర్త, సర్వజ్ఞుడు అని యీరీతిగా వ్యవహారముల నొందుచుండు నని చెప్పబడినది. కాని ఆత్మ సహజముగా ఘటాదులవలె నుల్లేఖింప యోగ్యుడు గాడు (నిరుపాఖ్యః). కాన వ్యవహారాతీతుడు (అనుపాధికః) గుణశూన్యు డగుటచే శుద్ధుడు. అవయవశూన్యుడు (నిష్కలః) అగుటచే కూటస్థుడు. అట్లు వ్యవహారాతీతుడు

గావుననే యాత్మ మనస్సునకును, వాక్కునకును గోచరుడు గాడు.

చేతనోఽచేతనో వాఽపి కర్తాఽకర్తా గతోఽగతః ।
బద్ధో ముక్తస్తథా చైకోఽనేకః
శుద్ధోఽన్యథేతి వా ॥ 30

తా॥ ఆత్మ మనస్సుకు, వాక్కునకు నతీతుడు. అట్లుగాక, వానికి గోచరుడగుచో ప్రత్యక్షసిద్ధ ఘటాదివిషయమై యెవరికిని విప్రతిపత్తి లేనట్లు ఆత్మవిషయమున గూడ నెవరికిని విప్రతిపత్తి యుండెడిది కాదు. కాని, ఆత్మవిషయమై దర్శనకారులు పెక్కు రీతుల వివాదపడుచున్నారు. ఎట్లన :-

ఆత్మ చేతను డనియు, అచేతను డనియు కర్త యనియు, అకర్త యనియు వ్యాపకు డనియు, అవ్యాపకు డనియు బద్ధు డనియు, ముక్తుడనియు ఒకడే యనియు, అనేకు లున్నారనియు శుద్ధు డనియు, శబలు డనియు భిన్న భిన్నప్రకారముల ఆత్మ నిరూపణము చేయుచున్నారు.

వి :- దేహేంద్రియమనోబుద్ధులలో నొకడు ఆత్మ; అచేతను డని వేదబాహ్యమతములు; దేహేంద్రియాదుల కంటె విలక్షణుడు, చేతనుడని వేదవాదులు; కర్త యని నైయాయికాదులును, అకర్త యని సాంఖ్యాదులు చెప్పుదురు. ఆత్మ శరీరపరిమాణము గలవాడని జైనులును, అణు

పరిమాణము గలవాడని విశిష్టాద్వైతులు, సర్వవ్యాపకుడని నైయాయికాదులు చెప్పుదురు. ఆత్మ అద్వితీయుడు (కేవలుడు) అని వేదాంతులు నిరూపింప 'ఆత్మ లనేకు' లని సాంఖ్య నైయాయికాదుల వాదము; వేదాంతులు, సాంఖ్యులును ఆత్మ రాగాదిగుణరహితు డగుటచే శుద్ధుడని యంగీకరింతురు. కాని, నైయాయికాదు లంగీకరింపరు. మఱియు జీవుడు బద్ధుడు; ఈశ్వరుడు జీవభిన్నుడు; ముక్తుడని యీ రీతిగా నాత్మవిషయమై పెక్కు విప్రతిపత్తులు గానవచ్చుచున్నవి.

అప్రాప్యైవ నివర్తన్తే వాచో ధీభిః సహైవ తు।
నిర్గుణత్వాత్ క్రియాభావా ద్విశేషాణా మభావతః॥ ౩౧

తా॥ ఆత్మవిషయమై పెక్కు విప్రతిపత్తులు గలుగుచుండుటచే ఆత్మ ఘటాదులవలె మనస్సునకు, వాక్కునకు గోచరుడు గాడనుట స్పష్టమైనది.

మఱియు మనస్సుగాని, వాక్కుగాని సగుణము, సక్రియము, సవిశేషము నగువానిని మాత్రమే ప్రకాశింపజేయ జాలునుగాని నిర్గుణము, నిష్క్రియము, నిర్విశేషము నగు వస్తువు (ఆత్మ) నెట్లు ప్రకాశింపజేయజాలును. కనుక, వాక్కులు మనస్సుతో సహా ఆత్మను బ్రకాశింపజేయజాలకయే నివర్తించుచుండును.

వి :- ధీశబ్దము జ్ఞానసామాన్యమును బోధించును. కాని యిచట 'వాక్' శబ్దసాహచర్యముచే, 'శబ్దశక్తిచే నుద యించు అంతఃకరణపరిణామరూపమగు సప్రకారక (సవి కల్పక) జ్ఞానమే' 'ధీశబ్దార్థ' మని గ్రహింపవలెను. ఈ వాఙ్మ నస్సులు సహప్రవృత్తి గలవి. కనుకనే, శబ్దశక్తిచే నే యర్థము ప్రకాశింపజేయబడినను, అది మనస్సు (శబ్దశక్తి జనిత విజ్ఞానము) చేత ప్రకాశింపజేయబడుచుండును. మనస్సు చేతనే యర్థము తెలియబడినను, అది శబ్దశక్తి-ప్రకాశ్య మగుచుండును. ఇట్లీరెండిటికి సాహచర్యము సహజసిద్ధము. అందుచే ద్రవ్యాది సవికల్పకవస్తువులను (సగుణములు, సక్రి యములు, సవిశేషములు నగు వస్తువులను) బోధించు శబ్దము లను, వస్తుత్వసాదృశ్యమును బురస్కరించుకొని నిర్వికల్పము, అద్వయము నగు బ్రహ్మను బోధించుటకై ప్రయోగిం చుచో, నా శబ్దములు స్వప్రకాశము, అనభిధేయము నగు బ్రహ్మను జేరలేక మనస్సుతోపాటు నివర్తించుచుండును.

'ఉదపాది చ యచ్ఛబ్దైర్జ్ఞాన మాకారవద్ధియః ।
స్వతో బుద్ధం తదప్రాప్య నామ్నా సహ నివర్తతే ॥'

సురేశ్వరవార్తికము.

'యతో వాచో నివర్తన్తే అప్రాప్య మనసా సహ'.

తై. ఉ. 2. 9.

'న చక్షుషా గృహ్యతే నాపి వాచా నాన్యై ర్దేవై స్తపసా కర్మణావా' ముం. ఉ. 3. 1. 8.

వ్యాపకం సర్వతో వ్యోమ మూర్తై స్సర్వై ర్వియోజితమ్ ।
యథా తద్వదిహాత్మానం విద్యాచ్ఛుద్ధం పరమ్ పదం ॥ 32

అవ :- బ్రహ్మ వాఙ్మనస్సుల కతీతుడగుచో నిక బ్రహ్మను తెలియుటెట్లు ? ఆ బ్రహ్మ వేదాంతవేద్యు డగుట యెట్లు ? అను శంకకిట సమాధానము చెప్పబడుచున్నది.

తా॥ అమూర్తము, సర్వవ్యాపకము నగు ఆకాశము మూర్తపదార్థములతో నెట్టి సంబంధము లేక వానికంటె వివిక్తమై యొప్పునట్లు సర్వవ్యాపకు డయ్యును అవస్థాత్రయ-ఉపాధిసంబంధవర్జితుడై యా యవస్థాత్రయమునకు సాక్షియై వెలుగొందుచు లక్షితు డగుచుండు శుద్ధుడగు నాత్మయే పరబ్రహ్మ యని వేదాన్తసమయము. కాన, వాఙ్మనస్సుల కతీతుడయ్యు నవస్థాత్రయసాక్షియై లక్షితుడగుచు గోచరించుచుండు నాత్మనే పరబ్రహ్మ యని తెలియునది. (అవస్థాత్రయము=జాగ్రత్ స్వప్నసుషుప్తులు).

దృష్టం హిత్వా స్మృతిం తస్మిన్ సర్వగ్రశ్చ తమస్త్యజేత్ ।
సర్వదృగ్జ్యోతిషా యుక్తో దినకృచ్ఛార్వరం యథా ॥ 33

తా॥ సూర్యుడు రాత్రులయందలముకొనెడి కటిక చీకటిని తన కిరణజాలముతో నిర్మూలించి దివ్యతేజసంపన్నుడై (నిస్తమస్కుడై) భాసించునట్లు బ్రహ్మ (ఆత్మ) జిజ్ఞాస కలిగిన పురుషుడు గూడ (శాస్త్రగురూపదేశాదుల వలన గలిగిన) విద్యచే నవస్థాత్రయమునందు వాడగట్టు మిథ్యాజగత్తుకు మూల మయిన యవిద్యను పూర్తిగా పోగొట్ట వలెను.

జాగ్రద్దశ (దృష్టము) యందు నేను ద్రష్టను, శ్రోతను; మననము చేయువాడను'-అని యీరీతిగా దర్శన శ్రవణమననాది క్రియాకర్తృత్వాద్యభిమానమును విడి దర్శనాదిక్రియల నొనర్చు దశయందు గూడ నిష్క్రియ నిర్విశేషాత్మానుభవము నొందవలెను,

జాగ్రద్దశయందలి పదార్థముల యొక్క స్మృతిరూపమగు స్వప్నమునందుగలుగు 'స్వప్నమున నేను మహారాజునయితిని; దేవుడనయితిని; వ్యాఘ్రమయితిని'- ఇత్యాద్యనుభవములన్నియు దృశ్యమగు తత్తద్వాసనా సమాహితాంతఃకరణము యొక్క వికారములే కాని యాత్మ (ద్రష్ట)కు సంబంధించినవి కావని తదభిమానమును వీడి యసంగాత్మానుభవము నొందవలెను.

పిదపసర్వమును తనయందు లయ మొందించుకొను గాఢతమోరూపమగు సుషుప్తిని గూడ భాసింపజేయు ఆత్మ

మూఢుడు గాని యజ్ఞాని కాని కాడని దెలిసి సుషుప్తిని (అజ్ఞానమును) త్యజింపవలెను. ఇట్లు అసంగ - ఆత్మభావమున నుండు జ్ఞాని సర్వసాక్షి యగు ప్రత్యగాత్మయై బ్రహ్మైక్యమును బొందును (జ్యోతిషా యుక్తః)

రూపస్మృత్యన్ధకారార్థాః ప్రత్యయా యస్య గోచరాః ।
స ఏవాత్మా సమో ద్రష్టా సర్వభూతేషు సర్వగః ॥ ౩౪

**తా॥** జాగ్రత్ స్వప్న సుషుప్తిదశలయందు రూప - స్మృతి - అంధకారము లనెడి విషయములను భాసింపజేయు సాక్షియే సర్వభూతాంతరాత్మ; సర్వద్రష్ట; సర్వవ్యాపకుడు, నిర్విశేషస్వరూపుడు.

ఆత్మబుద్ధిమనశ్చక్షుర్విషయాలోకసంగమాత్ ।
విచిత్రో జాయతే బుద్ధేః ప్రత్యయోఽజ్ఞానలక్షణః । ౩౫

అవ :- ఆత్మనిర్విశేషస్వరూపు డగుచో నా యాత్మ యందు విచిత్రసంసారానుభవమునకు గారణమేమి? యను శంకకిట సమాధానము చెప్పబడుచున్నది.

తా॥ ఆత్మ నిర్విశేషస్వరూపుడయ్యు బుద్ధి, మనస్సు, ఇంద్రియములు - విషయములు, ప్రకాశము (వెలుగు) - వీనితో నాధ్యాసిక (కల్పిత) సంబంధమును పొందుటచే అజ్ఞానమూలక బుద్ధ్యుపాధికల్పిత విచిత్రసంసారానుభవమును బొందుచుండును.

వి :- ఆత్మ అసంగుడుగాన నాత్మకేపదార్థముతో నెట్టి సంబంధము లేదు. కాని, యిచట ఆత్మకు బుద్ధ్యాదులతో సంబంధమున్నట్లు చెప్పబడినది. ఆ సంబంధము వాస్తవిక మగుచో నసంగత్వమునకు హాని గలుగును. అందుచే నజ్ఞానరూపోపాధివశమున నీ సంబంధ మేర్పడుచున్నట్లు (అజ్ఞానలక్షణః) పేర్కొనబడినది. బుద్ధి దృశ్యము, జడము గావున ఆత్మ (చేతన) సంబంధము లేనిదే ప్రత్యక్షాదిజ్ఞానము (ప్రమ) బుద్ధియందుదయింపదు. అంతఃకరణవృత్తియందభివ్యక్తమగు చైతన్యమే ప్రమ - యని చెప్పబడును. ఆత్మకిట్టి యంతఃకరణముతో తాదాత్మ్యధ్యాసమూలముననే ప్రమాతృ, ప్రమాణ, ప్రమేయాది వ్యవహార ముపపన్న మగుచున్నది. ఈ ఘటాదిజ్ఞానమున కాశ్రయము బుద్ధి; మనస్సు సాధారణకరణము; ఇంద్రియములు విశేషకరణములు ప్రమాకరణములు=(ప్రమాణములు); ఘటాదివిషయములు నిమిత్తకారణములు; సూర్యప్రకాశాదులు లేనిదే ఘటాది వస్తుప్రతీతి కలుగనిచే నవి సహకారికారణములు నగుచున్నవి.

వివిచ్యాస్మాత్స్వమాత్మానం విన్ద్యాచ్ఛుద్ధం పరం పదమ్।
ద్రష్టారం సర్వభూతస్థం సమం సర్వభయాతిగమ్॥ ౩౬

సమస్తం సర్వగం శాన్తం విమలం వ్యోమవత్ స్థితమ్ ।
నిష్కలం నిష్క్రియం సర్వం నిత్యం ద్వన్ద్వైర్వి
వర్జితమ్ ॥ 32

తా॥ ఆత్మ జిజ్ఞాసువు పైన జెప్పిన బుద్ధ్యాదిసంఘము నుండి వివేచన జేసి శుద్ధుడు, సాక్షి, సర్వభూతాంతర్యామి, నిర్విశేషస్వరూపుడు, సర్వభయాతీతుడు, సర్వాత్మకుడు, సర్వవ్యాపకుడు, శాన్తుడు, నిర్మలుడు, ఆకాశమువలె సర్వత్ర నున్నట్టియు, నిరవయవుడు, నిష్క్రియుడు, నిత్యుడు, సుఖదుఃఖాది ద్వంద్వరహితుడు సర్వమయుడై పరమప్రాప్యుడు నగు బ్రహ్మను (ఆత్మను) తెలిసికొనవలెను.

వి :- ఇచటి విశేషణము లన్నిటిని 'త్వం' పదవాచ్యుడగు సాక్షిపరముగను, 'తత్' పదవాచ్యుడగు బ్రహ్మపరముగను సమానముగా సమన్వయించి తత్త్వమసి మహావాక్యార్థానుసంధానము చేయునది.

సర్వప్రత్యయసాక్షీ జ్ఞః కథం జ్ఞేయో మయేత్యత ।
విమృశ్యైవం విజానీయాజ్జ్ఞానకర్మ నవేతి వా ॥ 33

తా॥ ఎల్లజ్ఞానములకు (ప్రత్యయములకు) సాక్షి, జ్ఞానస్వరూపుడునని చెప్పబడు ఆత్మ యెట్టివాడు? ఆ యాత్మ జ్ఞేయుడగునా కాదా? జ్ఞేయుడగుచో ఘటాదులవలె జ్ఞాన

మునకు విషయము (కర్మ) అగునా కాదా యని వివేచనజేసి యాత్మ తత్త్వము నరయవలెను.

అదృష్టం ద్రష్టృవిజ్ఞాతం దభ్ర మిత్యాదిశాసనాత్ ।
నైవ జ్ఞేయం మయాఽన్యైర్వా పరం బ్రహ్మ కథంచన ॥ ౩౯

తా॥ యది మన్యసే సువేదేతి దభ్రమేవాపి నూనం త్వం వేత్థ బ్రహ్మణో రూపమ్ (కేన ఉ. 9) 'నేనే బ్రహ్మ నని చక్కఁగా దెలిసికొనినట్లు దలంచుచున్నచో అత్యల్పము గనే నిశ్చయముగా నీవు దెలిసికొనుచున్నావు' – అని శ్రుతి జ్ఞేయముగు వస్తువత్యల్ప మగునని యుపదేశించుటచే జ్ఞేయు డగుచో బ్రహ్మకు అల్పత్వదోషము ప్రసక్తించును.

మఱియు 'తద్వా ఏతదక్షరం గార్గ్య దృష్టం ద్రష్టృ' (బృ. ఉ. 3. 8 11.) 'ఓగార్గి, ఈ బ్రహ్మ యెవరిచేతను చూడబడదు (అదృష్టం) కాని సర్వమును చూచుచుండును. (ద్రష్ట) – యని శ్రుతి (బ్రహ్మ యెవరి చేతను చూడబడదని) శాసించినందువలనను బ్రహ్మాత్మతత్త్వ మేరికిని దెలియరాదు (జ్ఞానమునకు కర్మ గాదు),

స్వరూపావ్యవధానాభ్యాం జ్ఞానాలోకస్వభావతః ।
అన్యజ్ఞానానపేక్షత్వా జ్జ్ఞానం నైవ సదా మయా ॥ ౪౦

అవ :- ఆత్మ జ్ఞేయుడు కానిచో 'ఆత్మన్యేవాత్మానం పశ్యేత్' (బృ. ఉ. 4. 4. 23.) 'ఆత్మయందే (కార్యకరణాది సంఘాతమునందే) ఆత్మను గాంచవలెను' - అను శ్రుతితో విరోధము సంభవింపవచ్చును గదా యను శంకకిట సమాధానము చెప్పబడుచున్నది.

తా॥ (ఆత్మను దెలియగోరుచున్న) నా స్వరూపమే యాత్మ. అందుచే ఆత్మ నాకు వ్యవహితుడు (దూరమున నున్నవాడు) గాడు; మఱియు ఆత్మ చైతన్యప్రకాశస్వరూపుడు. అట్టి యాత్మ స్ఫూర్తి నాకు గలుగుటకు అన్యజ్ఞానాపేక్ష లేదు. కాన, ఆత్మ యెల్లపుడు దెలియబడుచునే యుండును. (సదా జ్ఞాతమేవ).

వి :- ఘటాదులు జ్ఞానస్వరూపములు గావు; అచేతనములు; పరిచ్ఛిన్నములు. అవి తమ్మొదాము దెలిసికొననేరవు. అవి జ్ఞాత (దెలిసికొనువాని) కంటె భిన్నములై వ్యవహితములుగ నుండును; కనుక పరప్రకాశ్యములు. ఆత్మ యట్లు గాదు. జ్ఞాత (ఆత్మను దెలియగోరువాని) యొక్క స్వరూపమే యాత్మ; చేతనుడు; అపరిచ్ఛిన్నుడు. కాన, ఆత్మను దెలియుటకు జ్ఞాత్రంతరాపేక్ష (అన్యాపేక్ష) లేదు. అందుచే పరప్రకాశ్యుడు గాడు; స్వప్రకాశజ్ఞానస్వరూపుడు. జ్ఞాతకు స్వస్వరూపుడగు నాత్మతో నెట్టి వ్యవధానముండదు. జ్ఞాతకే 'తత్త్వమసి' బ్రహ్మాత్మోపదేశము

జేయుటవలన నా, జ్ఞాత తనకంటె తాను భిన్నుడు గానందు వలన ఆత్మకు ఘటాదులవలె జ్ఞేయత్వ ముపపన్నము గాదు. జ్ఞానికి స్వస్వరూపజ్ఞానము (ఆత్మజ్ఞానము) నిరంతరము కలుగు చుండును గనుక యాత్మ తెలియబడదని (అజ్ఞాతః) చెప్పు టయు పొసగదు. ఆత్మ స్వయంప్రకాశుడు, ఆవరణరహితుడు గాన నిత్యజ్ఞానస్వరూపుడు. అట్టి ఆత్మ అన్ని యవస్థల యందును దెలియబడుచునే యుండును (సదా జ్ఞాతః).

నాన్యేన జ్యోతిషా కార్యం రవేరాత్మప్రకాశనే।
స్వబోధాన్నాన్యబోధేచ్ఛా బోధస్యాత్మప్రకాశనే॥ ౨౧

తా॥ సూర్యునకు తన స్వరూపమును బ్రకాశింపజేయు టకు మఱియొక జ్యోతిస్సుయొక్క యావశ్యకత లేదు, అట్లే బోధ (జ్ఞాన) స్వరూపుడగు ఆత్మకును తన బోధస్వరూప మును దెలియజేయుటకు చేతనాంతరాపేక్ష లేదు.

న తస్యైవాన్యతోఽపేక్షా స్వరూపం యస్య యస్యతేత్।
ప్రకాశాంతరదృశ్యో న ప్రకాశో హ్యాస్తి కశ్చన॥ ౨౨

తా॥ ఏది యెవనికి స్వరూపమో దానిని బ్రకాశింప జేయుటకై ప్రకాశాంతరాపేక్ష లేదు. ఆత్మ, జ్ఞాత యొక్క స్వరూపమే యగుటజేసి ఆత్మస్వరూపప్రకాశమునకై చేత

నాంతరాపేక్ష లేదు. మఱియు ప్రకాశరూపుడగుసూర్యుడు స్వయముగనే ప్రకాశించును గాని మఱియొక ప్రకాశముచే (జ్యోతిస్సును) ప్రకాశింపజేయబడడు. అట్లే ప్రకాశరూపుడగు నాత్మయు స్వయముగనే ప్రకాశించునుగాని మఱియొకప్రకాశము (చైతన్యము) చే ప్రకాశింపజేయబడదు.

వ్యక్తిః స్యాదప్రకాశస్య ప్రకాశాత్మసమాగమాత్।
ప్రకాశస్వర్క కార్యః స్యాదితిమిథ్యావచో
హ్యతః॥ ౪౩

తా॥ సహజప్రకాశము లేనిఘటాది జడపదార్థములు సూర్యాదిప్రకాశస్వరూపసంపర్కము వలన వాని నావరించి యున్న తమోరూపమగు ఆవరణము (చీకటి) తొలగి యభివ్యక్తము లగుచున్నవి. అంతియేకాని, సూర్యాదుల వలన వానియందు వేఱుగాప్రకాశ మను గుణ మొకటి యుదయింపదు. కాన, సూర్యునివలన లోకమునకు ప్రకాశము గలుగు ననెడిమాట యథార్థము గాదు.

వి :- సూర్యుడు పరప్రకాశ్యుడు కాకపోయినను ఘటాదిపదార్థముల బ్రకాశింపజేయుచు తనను ప్రకాశింపజేయునట్లే ఆత్మయు దృశ్యజగత్తుతోపాటు తనను గూడ బ్రకాశింపజేయుచు స్వరూపప్రకాశదృశ్యుడే యగు ననెడి శంక కిట సమాధానము చెప్పబడినది.

సహజప్రకాశము లేని ఘటాది పదార్థములకు సూర్యాది ప్రకాశస్వరూపసంసర్గము వలన చీకటి తొలగి అభివ్యక్తి కలుగుచున్నది. సహజప్రకాశము గల సూర్యునకు మాత్రము పరప్రకాశ్యత్వము లేదు. కాన, సహజబోధ స్వరూపుడగు ఆత్మకు గూడ బోధాంతర (చేతనాంతర) బోధ్యత్వము (జ్ఞేయత్వము) గాని, స్వప్రకాశ్యత్వముగాని యుపపన్నము గాదు. ఆత్మ స్వయంప్రకాశుడే కాని స్వప్రకాశ్యుడు గాడు.

యతోఽభూత్వా భవేద్యచ్చ తస్య తత్కార్యమిష్యతే।
స్వరూపత్వాదభూత్వా న ప్రకాశో జాయతే రవేః॥ ౪౮

తా॥ ఏ వస్తువు పూర్వము లేకుండ పిదప దేనినుండి పుట్టుచున్నదో యది దాని కార్యముగా నెన్నబడుచున్నది. సూర్యుని ప్రకాశము సూర్యుని స్వరూపమే యగుటజేసి యా ప్రకాశము మొదట లేకుండి తరువాత సూర్యునినుండి పుట్టుట లేదు. కాన, సూర్యుని ప్రకాశము సూర్యునినుండి పుట్టిన కార్యము గాదు.

సత్తామాత్రే ప్రకాశస్య కర్త్రాదిత్యాది రిష్యతే।
ఘటాదివ్యక్తితో యద్వ త్తద్వద్బోధాత్మ
నీష్యతామ్॥ ౪౯

తా॥ సూర్యుని ప్రకాశము సోకినంతనే (సూర్యప్రకాశ సాన్నిధ్యమాత్రమున) ఘటాదిపదార్థముల కభివ్యక్తి గలుగు చుండుటచే సూర్యునివలన ప్రకాశము గలుగుచున్నదని (ప్రకాశకర్తా ఆదిత్యః) యంగీకరించినట్లే, బోధరూపుడగు నాత్మకును ఘటాదివస్తువులతోడి సాన్నిధ్యమాత్రముచే నా యా పదార్థముల నావరించియున్న యావరణము తొలగి తత్తత్పదార్థముల యభివ్యక్తి (జ్ఞానము) కలుగుచుండుటచే నాత్మకును 'బోద్ధ' యని (ఘటాదిజ్ఞానము ఆత్మ వలన గలుగుననెడి) వ్యవహారము గలిగినదని యంగీకరింపుము. వాస్తవముగా సూర్యుడు ప్రకాశకుడు (ప్రకాశకర్త) కానట్లు ఆత్మయు బోద్ధ (జ్ఞాత = జ్ఞానకర్త) కాడు.

బిలాత్సర్పస్య నిర్యాణే సూర్యో యద్వత్ప్రకాశకః।
ప్రయత్నేన వినా తద్వజ్జ్ఞాతాఽఽత్మా బోధరూపతః॥ ౪౯

తా॥ కలుగునుండి సర్పము వెలికి వచ్చినంతనే సూర్యుడు వేఱుప్రయత్నము లేకయే పూర్వసిద్ధమైన తన ప్రకాశముచేత నా సర్పమును భాసింపజేయుచు ప్రకాశకు డని చెప్పబడునట్లు ఆత్మయు బోధ (జ్ఞాన) రూపు డగుటచే నెట్టి ప్రయత్నము (వికారము) లేకయే (పూర్వసిద్ధమైన బోధస్వరూపముచేత) నా యా పదార్థముల యభివ్యక్తి (జ్ఞానము) కలిగించుచు జ్ఞాత యని వ్యవహరింపబడు చున్నాడు.

దగ్ధైవ ముష్ణః సత్తాయాం తద్వద్బోధాత్మనీష్యతామ్।
సత్యేవ యదుపాధౌ తు జ్ఞాతే సర్ప ఇవోత్థితే॥ ౪౨

తా॥ సహజముగా నుష్ణస్వభావము గల యగ్ని దాహ్యములగు కాష్ఠాదులుచెంత నున్నంతమాత్రమున సత్తామాత్రముచే దాహకు డగునట్లు (ఆ కాష్ఠాదుల దహించువా డని చెప్పబడునట్లు) బోధ్యము (జ్ఞేయము) లగు ఘటాది వస్తువుల సాన్నిధ్యమాత్రముచే నాత్మయు బోద్ధ (జ్ఞాత) యగుచున్నాడు. ఎట్లన :- బిలము నుండి వెలువడెడి సర్పము (ఉపాధి) యొక్క జ్ఞానము కలిగినయపుడె సూర్యుడు 'తత్ప్రకాశకు' డని చెప్పబడును; బిలనిర్గతసర్పజ్ఞానము లేనియపుడు తత్ప్రకాశకత్వమును సూర్యున కుండదు.

వి :- కాష్ఠాదులు లేనిచో నగ్నికి దాహకత్వము వలె, జ్ఞేయవస్తుసాన్నిధ్యము లేనిచో నాత్మకు జ్ఞాతృత్వము నుండదు. కాన అగ్నిసూర్యులకు దాహకత్వప్రకాశకత్వాదుల వలె ఆత్మకును జ్ఞాతృత్వ మౌపాధికమే (ఔపచారికమే) కాని, వాస్తవము కాదు.

జ్ఞాతాఽయతోఽపి తద్వజ్జః కర్తా భ్రామకవద్భవేత్।
స్వరూపేణ స్వయం నాత్మా జ్ఞేయోఽజ్ఞేయోఽథవా తతః॥ ౪౩

తా॥ సూర్యుడు (భ్రామకః) ప్రయత్నము లేకయే నిదురించుటకు బూర్వము జనసమూహమును తత్తత్కార్యములయందు ప్రవర్తింపజేయునట్లు - లేదా - అయస్కాంతము తాను నిశ్చలముగా నుండియే (అయత్నః) ఇనుపముక్కలను చలింపజేయునట్లు ఆత్మయు ప్రయత్నము లేకయే జ్ఞేయవస్తుసాన్నిధ్యముచే జ్ఞాత యైనట్లు స్వగతవిశేషశూన్యుడయ్యు సన్నిధిమాత్రముచేత కారకములను (ఇంద్రియాదులను) ప్రవర్తింపజేయుచు కర్త యని వ్యవహరింపబడుచున్నాడు.

మఱియు నాత్మ నిర్విశేషస్వరూపుడు, సహజముగా జ్ఞానస్వరూపుడు (అలుప్తప్రకాశస్వరూపుడు) నగుటచే తన యసాధారణస్వభావముచే ఘటాదులవలె జ్ఞేయుడు కాని, వ్యవహితములగు వస్తువులవలె అజ్ఞేయుడు (ప్రకాశరహితుడు) గాని కాడు.

ఇట్లే నిర్వికారు డగుటచే ఆత్మ జ్ఞాత కాడు; చైతన్యస్వరూపు డగుటచే అజ్ఞాతయు గాడు; నిర్వ్యాపారు డగుటచే కర్త గాడు; అధ్యాసమూలక దేహేంద్రియపంజరాధిష్ఠాత యగుటచే అకర్తయు గాడు.

విదితావిదితాభ్యాం తదన్యదేవేతి శాసనాత్ ।
బన్ధమోక్షాదయో భావా స్తద్వదాత్మని కల్పితాః॥ ౭౫

తా॥ బ్రహ్మ విదితము కంటెను, అవిదితము కంటె నత్యంతము విలక్షణ మని శ్రుతి శాసించుటవలన బంధము, మోక్షము మున్నగు భావములు ఆత్మయందు గల్పింపబడి నవే కాని వాస్తవములు గావు.

వి :- అన్యదేవ తద్విదితాదథో అవిదితాదధి' (కేన, 3.) విదిత మనగా దెలియబడినది ('విది' క్రియకు కర్మభూతము). అట్టిది యెప్పుడైన నెవనిచేనైన కొంచెమై నను దెలియబడియే యుండును. కావున, వ్యాకృతమగున దంతయు విదితమేయగును. బ్రహ్మ యట్టి విదితము (వ్యక్తము - కార్యము) కంటె నన్యమే యగును. అగుచో బ్రహ్మ యజ్ఞానమే యగునా ? అట్లు గాదు అవిదిత మనగా నవ్యాకృతము(అవ్యక్తము); ప్రకృతి). ఇది వ్యాకృతబీజము. అవిద్యాలక్షణమగు నీ యవ్యక్తము కంటెను బ్రహ్మమీదుగా (ఉపరి) నుండును. ఏది దేనికంటె మీదుగనుండునో యది దానికంటె భిన్నము గదా ! ఏది విదితమో యది యల్పము, మర్త్యము, దుఃఖరూపము గాన హేయము. కావున, బ్రహ్మ 'విదితము' కంటె నన్యము అని చెప్పినచో నహేయ మని చెప్పినట్లగును. అట్లే 'అవిదితాదధి' - 'అవిదితముకంటె నన్యము' - అని చెప్పినచో నుపాదేయ మగును. బ్రహ్మ విదితావిదితములకంటె (కార్యకారణములకంటె) విలక్షణ

మైనది యనుటచే హేయోపాదేయశూన్యమగు బ్రహ్మ స్వస్వరూపమే యగునని చెప్పబడినది.

నాహోరాత్రే యథా సూర్యే ప్రభారూపావిశేషతః ।
బోధరూపావిశేషాన్న బోధాబోధౌ తథాఽఽత్మని॥ ౨౦

తా॥ నిత్యప్రకాశస్వరూపుడగు సూర్యునియందహో రాత్రములు లేనట్లు అలుప్తజ్ఞానస్వరూపుడగు ఆత్మయందు జ్ఞానాజ్ఞానములు రెండును లేవు.

అవిద్యామూలము బంధము; విద్యామూలము మోక్షము. విద్యాఽవిద్యలు రెండును లేనపుడు ఆత్మకు బంధమోక్షములును లేవు.

యథోక్తం బ్రహ్మ యో వేద హానోపాదానవర్జితమ్ ।
యథోక్తేన విధానేన స సత్యం నైవ జాయతే॥ ౨౧

తా॥ ఎవడు పైనచెప్పినట్లు పదార్థపరిశోధనపూర్వకముగా హేయోపాదేయశూన్యుడగు (నిర్విశేషస్వరూపుడగు) బ్రహ్మను తెలిసికొనునో యతనికి పునరావృత్తి లేదు; సత్యము.

"న స పునరావర్తతే"
న స భూయోఽభిజాయతే". భ. గీ. 13. 23.

జన్మమృత్యుప్రవాహేషు పతితో నైవ శక్నుయాత్ ।
ఇత ఉద్ధర్తు మాత్మానం జ్ఞానా దన్యేన కేనచిత్ ॥ ౨౨

తా॥ జన్మజరామరణరూప సంసారప్రవాహముల యందు బడిన పురుషుడు జ్ఞానముకంటె వేరు సాధనము చేత తన నుద్ధరించుకొనజాలడు.

'నాన్యః పన్థా విద్యతేఽయనాయ'
తై. ఆ. 3. 13; శ్వే. ఉ. 3. 8; 6. 15.

భిద్యతే హృదయగ్రన్థి శ్ఛిద్యన్తే సర్వసంశయాః ।
క్షీయన్తే చాస్య కర్మాణి తస్మిన్దృష్టే" ఇతి శ్రుతేః ॥ ౨౩

తా॥ పరావరుడగు బ్రహ్మను దర్శించినంతనే సర్వసంసారకారణమగు హృదయగ్రన్థి - అనగా - ఆత్మకును మనస్సునకును గల తాదాత్మ్యసంబంధమను ముడి వీడును; సంశయము లన్నియు తొలగిపోవును; సంచితములగు కర్మలన్నియు క్షీణించును - అని ముండకోపనిషత్తు (2. 2, 8.) చెప్పుటచేతను సంసారనివృత్తికి జ్ఞానము కంటె వేరు సాధనము లేదు.

మమాహ మిత్యేత దపోహ్య సర్వతో
విముక్తదేహం పద మమ్బరోపమమ్ ।
శం. ర. 13-26

సుదృష్టశాస్త్రానుమితిభ్య ఈరితం
విముచ్యతేఽస్మిన్ యది నిశ్చితో నరః॥ ౨౪

తా॥ పదార్థపరిశోధనపూర్వకముగా శ్రుతియుక్తులచే దేహాద్వయసంబంధశూన్యము, ఆకాశసదృశము (నిరతిశయము, నిష్ప్రపంచము) నగు బ్రహ్మాత్మత్త్వము నిరూపింపబడినది. ఇది నాది, ఇది నేను - అను అభిమానముల పూర్తిగా వీడి ఎవడీ శ్రుతియుక్తిప్రతిపాదిత బ్రహ్మాత్మత్త్వము నందు దృఢనిశ్చయముతో నుండునో యతడు సంసారబంధవినిర్ముక్తు డగును.

---

## పార్థివప్రకరణమ్ - ౧౬

పార్థివః కఠినో ధాతుర్ద్రవో దేహే స్మృతోఽమ్మయః।
పక్తిచేష్టావకాశాః స్యు ర్వహ్నివాయ్వమ్బ
రోద్భవాః॥ ౧

అవ :- పూర్వప్రకరణమున బ్రహ్మాత్మైకత్వజ్ఞానమే స్వరూపావస్థానలక్షణ మోక్షసాధనము గాని, భేదాభేద జ్ఞానము గాదని ప్రతిపాదింపబడినది. ఇపుడు సకలతార్కిక మత నిషేధపూర్వకముగ ముముక్షువును స్వారాజ్యపదమున

నిలుపుటకై మొదట స్థూలశరీరాత్మవాదము నిరాకరింపబడు చున్నది.

తా॥ శరీరమున మాంసాదిరూపములగు కఠినధాతువులు పృథివీవికారములు, రక్తాది ద్రవములు జలవికారములు. పాకము, చేష్ట, అవకాశము (దేహమున సూక్ష్మములగు అన్నపానాదిసంచారమార్గములు) ఇవి క్రమముగా అగ్ని-వాయు - ఆకాశకార్యములు.

ఇట్లు పంచభూతవికార మగు స్థూల శరీరము ఆత్మ కాదు. (దేహోఽనాత్మా, భూతపరిణామత్వాత్, వల్మీకాదివత్)

ఘ్రాణాదీని తదర్థాశ్చ పృథివ్యాదిగుణాః క్రమాత్।
రూపాలోకవదిష్టం హి సజాతీయార్థ మిన్ద్రియమ్ ॥ ౨

తా॥ ఘ్రాణ - రసనా - చక్షుస్ - త్వక్ - శ్రోత్రములనెడి యింద్రియములును, ఇంద్రియార్థములగు (విషయములగు) గంధ - రస - రూప - స్పర్శ - శబ్దములును క్రమముగా పృథివ్యప్తేజోవాయ్వాకాశము లనెడి పంచభూతముల యొక్క ధర్మములు. గంధాదులు ఘ్రాణాదీంద్రియముల చేతనే గ్రహింపబడుచుండుటజేసియు, తదితరములచే గ్రహింపబడకుండుట వలనను (అన్వయ వ్యతిరేకముల వలన) నా

గంధాదులు ఇంద్రియార్థము లనుట ప్రసిద్ధము. మఱియు నే యింద్రియము ఏ భూతము యొక్క ధర్మమును గ్రహింప జేయుచున్నదో, యా యింద్రియము ఆ భూతమునకు సజాతీయ మగును. ఎట్లన!- రూపము తైజసము; దానిని ప్రకాశింపజేయు దీపాదులును తైజసములే కదా! కాన గ్రాహకములగు (కరణములగు) ఇంద్రియములును, గ్రాహ్యములగు (కార్యములగు) గంధాదులును సజాతీయములే. అనగా భౌతికములగు గంధాదులను ప్రకాశింపజేయుటజేసి ఇంద్రియములును భౌతికములే యగును. ఇట్లు భౌతికములును, జ్ఞానకరణములును నగు ఇంద్రియములు ఆత్మ కానేరవు. (ఇంద్రియాణి నాత్మానః, కరణత్వాత్, కుఠారవత్)

వి :- గ్రాహ్య గ్రాహకములు సజాతీయములుగా నుండు ననెడి న్యాయము ననుసరించి ఇంద్రియములు భౌతికములని నిర్ధారింపబడినది. జ్ఞానస్వరూపుడు, ద్రష్ట యగు నాత్మచేతనే సర్వము భాసింపజేయబడుటచే నాత్మచే భాసింపజేయబడు ప్రపంచము గూడ పై న్యాయము ననుసరించి జ్ఞాన (చైతన్య) స్వరూపమే యగుటజేసి జ్ఞాత (ప్రమాత) జ్ఞానము (ప్రమా) జ్ఞేయము (ప్రమేయము) - ఈ మూడును చిన్మయములే యగుచున్నవి. కావుననే, తటాకోదకము కాలువల ద్వారా క్షేత్రముల ప్రవేశించి తద్రూపము నొందునట్లు ప్రమాతృచైతన్యము అంతఃకరణవృత్తి

ద్వారా విషయచైతన్య దేశము జేరి తద్రూపము నొందును; అట ప్రమాతృవిషయచైతన్యముల యోగముచే 'ప్రమ' (ఘటాదిజ్ఞానము) కలుగునని చెప్పబడుచున్నది. ఇట్లు ప్రమాతృ - ప్రమా - ప్రమేయములు మూడును చైతన్యమే యగుటవలననే సర్వము బ్రహ్మయే యను శ్రుతివాక్యము యుక్తిసహ మగుచు సిద్ధాంతమై యొప్పుచున్నది. (చూ. వేదాన్తపరిభాష ప్రత్యక్షపరిచ్ఛేదము.)

బుద్ధ్యర్థాన్యాహు రేతాని వాక్పాణ్యాదీని కర్మణే ।
తద్వికల్పార్థ మన్తఃస్థం మన ఏకాదశం భవేత్ ॥ 3

తా॥ ఘ్రాణాదీంద్రియములు జ్ఞానమునకు సాధనము (కరణము) లగుటచే జ్ఞానేంద్రియములు; వాక్ - పాణి - పాద - పాయు - ఉపస్థ లనునవి వచన - ఆదాన - గమన - విసర్గ - ఆనందము లనెడి కర్మలకు సాధనము లగుటచే కర్మేంద్రియములు. పై వాని వికల్పము కొఱకు అంతఃకరణమై యొప్పు మనస్సు ఏకాదశేంద్రియము. ఇట్లు మనస్సు కూడ కరణమే యగుటచే ఆత్మ కాదు.

వి :- జ్ఞానేంద్రియముల కంటెను; కర్మేంద్రియముల కంటెను అతిరిక్తముగ జ్ఞానసాధనమగు అంతఃకరణ మొకటి యున్నదని యంగీకరింపవలెను. లేనిచో, ఉపలబ్ధిసాధనము లగు ఆత్మేంద్రియవిషయముల సన్నిధానమున (చేరికవలన)

నిత్యోపలబ్ధి (ఎల్లప్పుడు ఘటాదివిషయజ్ఞానము) కలుగు చుండవలెను. అట్లు కలుగుటలేదు. లేక యేదియేని ప్రతిబంధకము వలన నా యా విషయజ్ఞానము కలుగ దనినచో నిత్యానుపలబ్ధి (ఏ జ్ఞానముకూడ కలుగకుండుట) ప్రసక్తింప వలెను. అట్లుగాక, ఆ యా విషయజ్ఞాన మొకప్పుడు గలుగుటయు, మఱియొకప్పుడు గల్గకుండుటయు సంభవించుచున్నది. దీనికే వికల్పమని పేరు. దేనియొక్క సమవధానముచేతను, అనవధానముచేతను నొకపుడు విషయజ్ఞానము కల్గుటయు, నొకపుడు కలుగకుండుటయు సంభవించుచున్నదో యదియే యంతఃకరణము. ఇదియే ఇంద్రియవికల్పహేతువు. కావుననే 'మనస్సు ఇక్కడ లేదు; అందువలన చూడలేక పోతిని; వినలేకపోతిని' యనెడి లోకానుభవము సమర్థనీయమగుచున్నది.

'అన్యత్ర మనా అభూవం నాదర్శ మన్యత్ర మనా అభూవం నాశ్రౌషమ్' బృ. 1. 5. 3.

చూ. ఉత్క్రాన్తిగత్యధికరణము. 'నిత్యోపలబ్ధ్యనుపలబ్ధి ప్రసఙ్గోఽన్యతరనియమోవా'. (బ్ర. సూ. 2. 3. 30.)

నిశ్చయార్థా భవేద్బుద్ధి స్తాం సర్వార్థానుభావినీమ్ ।
జ్ఞాతాఽఽత్మోక్తః స్వరూపేణ జ్యోతిషా
వ్యఞ్జయన్ సదా ॥ ౪

తా॥ అంతఃకరణము యొక్క నిశ్చయాత్మకవృత్తికే బుద్ధి యని పేరు. ఇదియే సర్వవ్యవహారహేతుభూతమై సర్వ పదార్థానుభవము గలిగియుండును. ఆత్మ స్వరూపభూతమగు తన ప్రకాశము (జ్యోతిస్సు) చే నీబుద్ధిని సర్వదా అభివ్యక్తము చేయుచు (బుద్ధివృత్తుల ప్రేరేపించుచు) తత్సాక్షిభూతుడై (జ్ఞాతయై) యుండునని చెప్పబడును.

ఇట్లు ఆత్మకు దృశ్య మగుచుండుటచే బుద్ధియు ఆత్మ కాదు. కాన, విజ్ఞానమే (బుద్ధియే) ఆత్మ యను బౌద్ధవాదము నిరాకృతము. (బుద్ధిరపి నాత్మా, కరణవిశేషత్వాత్, మనోవత్)

వ్యఞ్జకస్తు యథాऽऽలోకో వ్యఙ్గ్యస్యాకారతాం గతః।
వ్యతికీర్ణోఽప్యసంకీర్ణ స్తద్వజ్జ్ఞః ప్రత్యయైః సదా॥ 2

తా॥ దీపసూర్యాదుల ప్రకాశము తనచే నభివ్యక్తము చేయబడు (వ్యఙ్గ్య) ఘటాదులతో సమానాకారము బొంది వానినుండి వేఱుచేయుటకు వీలులేనట్లు వ్యామిశ్రభావము చెందియు నసంకీర్ణమై వివిక్తముగా నుండునట్లు ఆత్మయు తనచే నభివ్యక్తము చేయబడు బుద్ధివృత్తులతో సమానాకారము నొంది వానితో తాదాత్మ్యము జెందియు నసంకీర్ణుడై వివిక్తముగా నుండును. ఇట్లు ఆత్మ, దృశ్యము (బుద్ధి) కంటె వివిక్తస్వరూపుడై యొప్పుచుండుటచే నిత్యశుద్ధుడు.

"స సమానః సన్నుభౌ లోకా వనుసంచరతి"

బృ. ఉ. 4. 3. 7

స్థితో దీపో యథాఽయత్నః ప్రాప్తం సర్వం
ప్రకాశయేత్ ।
శబ్దాద్యాకారబుద్ధిస్థః ప్రాప్తా స్తద్వత్ప్రపశ్యతి ॥ ౬

తా॥ దీప మొకచోటనుండి తనకు దగ్గఱ నున్న వస్తువులను వేరు ప్రయత్నము లేకయే ప్రకాశింపజేయునట్లు ఆత్మయు, శబ్దాద్యాకారములుగా పరిణామము చెంద ప్రాప్తించెడి బుద్ధివృత్తులను సాక్షియై దర్శించుచుండును (భాసింపజేయుచుండును).

శరీరేంద్రియసంఘాత ఆత్మత్వేన గతాం ధియమ్ ।
నిత్యాత్మజ్యోతిషా దీప్తాం విశంవన్తి సుఖాదయః ॥ ౭

తా॥ సుఖదుఃఖాదులు బుద్ధివృత్తులు. కాన, దేహ - ఇంద్రియసంఘాతముతో తాదాత్మ్యము చెంది నిత్య - ఆత్మజ్యోతిస్సుచే భాసింపజేయబడెడి బుద్ధితోనే యీ సుఖాదులు విశేషించి సంబంధించునుగాని, ఆత్మతో సంబంధింపవు.

వి :- సుఖదుఃఖాదులు ఆత్మధర్మములు గావు. అవి దేహేంద్రియాదులయందు ఆత్మబుద్ధితో ప్రవర్తించు (తాదాత్మ్యము చెందు) బుద్ధియొక్క ధర్మములు. కాన

"నేను సుఖిని - దుఃఖిని" అను వ్యవహారమున సుఖదుఃఖాది విశిష్టబుద్ధియే 'అహం' పదవాచ్యము. ఆత్మ కేవలము బుద్ధి వృత్తులకు సాక్షిమాత్రము.

శిరోదుఃఖాదినాఽఽత్మానం దుఃఖ్యస్మీతి హి పశ్యతి।
ద్రష్టాఽన్యో దుఃఖినో దృశ్యాద్ద్రష్టృత్వాచ్చ న
దుఃఖ్యసౌ ॥ ౮

తా॥ శిరస్సు మున్నగు దేహావయవముల యందు బాధ గల్గునెడల 'నేను దుఃఖిని' అని బుద్ధి తనను దుఃఖ విశిష్టమైనదానినిగా తలపోయుచుండును. ఇట్టివేళల బుద్ధి దేహముతో తాదాత్మ్యము చెందుచుండును. ఇట్లు దుఃఖ విశిష్టమై దృశ్యమగుచుండు బుద్ధికంటె ద్రష్ట యగు ఆత్మ భిన్నుడు. ద్రష్ట యగుటచేసియే ఆత్మ దుఃఖి కాడు.

దుఃఖీ స్యాద్దుఃఖ్యహం మానాద్దుఃఖినో దర్శనాన్న వా।
సంహతేఽఙ్గాదిభిర్ద్రష్టా దుఃఖీ దుఃఖస్య నైవ సః ॥ ౯

తా॥ దుఃఖాకారముగ పరిణామము చెందు అంతఃకరణముతో తాదాత్మ్యము చెందుటవలన ఆత్మ దుఃఖి యగును గాని, దుఃఖియగు నంతఃకరణమును దర్శించినందువలన (దుఃఖి) గాడు. అట్లుగాక, సాక్షిగా నుండి దర్శించినంత

మాత్రముననే యాత్మ దుఃఖి యగుచో నితరుల దుఃఖమును దర్శించెడి యుదాసీనులుగూడ దుఃఖభాజనులు గావలసి వచ్చును. అట్లు జరుగుట లేదు. కాన, శిరఃపాణి పాదాద్యఙ్గ ములతోను, చక్షురాదీంద్రియములతోను గూడిన దేహము నందు అనుభవింపబడుచుండు దుఃఖము సైతము, ఆ దుఃఖ మును దర్శించుచుండెడి (అనగా ద్రష్టయై) యుదాసీనుడగు ఆత్మకు గలుగదు.

వి :- ఆత్మ ద్రష్ట, అసంగుడు, సాక్షి యగుట శ్రుతి ప్రసిద్ధము. "అసఙ్గోహ్యాయమనా శ్చ్నభ్రః"
"అసఙ్గోహ్యాయం పురుషః" (బృ. ఉ. 4. 3. 15.)

చక్షుర్వత్కర్మ కర్తృత్వం స్యాచ్చే న్నాఽనేకమేవ తత్ ।
సంహతం చ తతో నాఽఽత్మా ద్రష్టృత్వాత్ కర్మతాం
వ్రజేత్ ॥ ౧౦

తా॥ ద్రష్ట యయ్యును ఆత్మకు దుఃఖిత్వము ఉపపన్న మేలకారాదు ? ఒకే నేత్రము అద్దము నందున్నపుడు దృశ్యము. ముఖమునందున్నచో ద్రష్టయు నగుచున్నది. అనగా ఒకే వస్తువునకు కర్మకర్తృత్వము - అనగా - దృశ్య త్వము (కర్మత్వము) ద్రష్టృత్వము (కర్తృత్వము) లోకసిద్ధము. అట్లే అంతఃకరణమునందు ప్రతిఫలించి జీవరూపము నొం దుచో దుఃఖసంబంధము గల ఆత్మ దృశ్యము (కర్మ);

స్వరూపచైతన్యరూపమగు ఆత్మ ద్రష్ట. కాన, నేత్రములకు వలెనే ఆత్మకు కర్మకర్తృత్వము సిద్ధ మగుచున్నది. అట్టి యెడ ఆత్మకు దుఃఖసంబంధము లేదని చెప్పుట యెట్లు పొసగును? అనిన నట్లు గాదు. నేత్రము సావయవము. అందుచే నది అంశభేదముచే దృశ్యముగను ద్రష్టగను గోచరింపవచ్చును. నేత్రమునందు రెండంశలు గలవు. (1) గోళకాంశము (2) శక్తిమత్త్వాంశము. అందు అద్దమునందున్న గోలకాంశము దృశ్యము. ముఖమునందున్న శక్తిమత్త్వాంశము ద్రష్ట అయినది. కావున, నేత్రమునకు కర్మకర్తృత్వరూప మగు ఉభయరూపత్వము సిద్ధింపవచ్చును. ఆత్మవిషయమున నట్లు చెప్పుటకు వలనుపడదు. ఆత్మ ఏకరూపు డగుట వలన అంశభేదము లేదు. అంశభేదము లేని ఆత్మ ఒక యంశముతో దుఃఖసంభిన్నుడై మరియొక యంశముతో స్వరూపచైతన్యస్వభావుడై ద్రష్టయు నగుట యెట్లు పొసగును? మఱియు దృశ్యమగునది అనాత్మ యగుట పైన జెప్పబడినది. కాన, ఒకే యాత్మ దృశ్యము ద్రష్టయు, అగుట యసంభవము. ఆత్మ ద్రష్టయే (కర్తయే), దృశ్యము (కర్మ) గాదు.

అనుమాన ప్రయోగము :- చిత్ప్రకాశైకస్వభావో హ్యాత్మా ద్రష్టైవ, న దృశ్యాంశసంభిన్నః, దృశ్యాంశే స్యానాత్మత్వాత్.

జ్ఞానయత్నాద్యనేకత్వ మాత్మనోఽపి మతం యది।
నైకజ్ఞానగుణత్వాత్తు జ్యోతిర్వ త్తస్య కర్మతా॥ ౧౧

తా॥ ఆత్మ కంశభేదము లేదని చెప్పుట తగదు. ఆత్మయందు జ్ఞాన - ప్రయత్న - ఇచ్ఛా - ద్వేషాది గుణములు గలవు. గుణభేదముచే ఆత్మయు ననేకాత్మకము గావగును. ఇట్లనేకాత్మకమగు ఆత్మ, నేత్రము వలెనే కొన్ని యంశములచే గ్రాహ్యమును, (దృశ్యము) కొన్ని యంశములచే గ్రాహకము (ద్రష్ట)ను గాదగును గదా! యని శంకించుటకును వీలు లేదు. ఆత్మయందు పైన పేర్కొనిన ప్రయత్నేచ్ఛాద్వేషాదిగుణములు లేవు. ఆత్మ నిర్గుణుడు; జ్ఞానైకస్వరూపుడు. "కృత్స్నః ప్రజ్ఞానఘన ఏవ" (ముం. ఉ. 2. 2. 9) అను శ్రుతియు నిందులకు ప్రమాణము. అందుచే పైన పేర్కొనినట్లు గుణభేదముచే నాత్మకు అనేకాత్మకత్వము జెప్పుట యుక్తిసహము గాదు; శ్రుతి విరుద్ధము గూడ. అటు ప్రజ్ఞానఘనస్వరూపుడగు ఆత్మ నేత్రము వలె (జ్యోతిర్వత్) కర్మ (దృశ్యము) కాదు.

వి:- యత్నేచ్ఛాదిగుణములు ఆత్మయందు గలవని నైయాయికమతము. అది యిట నిరాకరింపబడినది.

జ్యోతిషో ద్యోతకత్వేఽపి యద్వన్నాత్మప్రకాశనమ్।
భేదేఽప్యేవం సమత్వాజ్జ ఆత్మానం నైవ పశ్యతి॥
౧౨

తా॥ ఆత్మ గూడ నంశభేదముచే గ్రాహ్యము, గ్రాహకము అను భేదముచే నొప్పునని చెప్పినవారి నిట్లు ప్రశ్నింపవలెను. గ్రాహ్యాంశరూపము చేతనమా ? లేక జడమా ? గ్రాహ్యాంశము చేతన మని చెప్పుట తగదు. ఆదిత్యాది జ్యోతిస్సులు తమకంటె భిన్నములగు పదార్థముల ప్రకాశింపజేయునట్టివి, అనగా, పరప్రకాశకములు; ఆత్మస్వరూపప్రకాశకములు గావు. నేత్రము పరప్రకాశకమే గాని తన స్వరూపమును ప్రకాశింపజేయనేరదు. కావున, నాత్మయు పరప్రకాశకమే యగును గాని, స్వప్రకాశకము గానేరదు. అట్టియెడ, గ్రాహ్యాంశము చేతనమని చెప్పుచో చేతనత్వావిశేషముచే నీ గ్రాహ్యాంశరూప మగు చేతనము గూడ పరప్రకాశకమే కావలెనుగాని, పరప్రకాశ్యము గాజాలదు. కనుక, గ్రాహ్యాంశము చేతన మగుచో నది పరప్రకాశ్యము-లేక - దృశ్య మగుట యెట్లు ?

ఇక గ్రాహ్యాంశము జడ మను రెండవ పక్షమును జూతము. జడ - అజడములకు అంశాంశిభావముగాని, అభేదముగాని ఉపపన్నము గాదు. అందుచే గ్రాహ్యాంశము జడ మగుచో నది యాత్మయొక్క (చైతన్యము యొక్క) యంశము (భాగము) కాజాలదు. మఱియు జడరూపమగు గ్రాహ్యాంశము దృశ్యమగుటచే దానికి ఆత్మత్వము సిద్ధింపదు, దృశ్యమగునది ఆత్మ కానేరదు గదా! జడమని

చెప్పుటచే నయ్యది స్వప్రకాశకము, పరప్రకాశకము గూడ గానేరదు. కనుక, ఆత్మను గ్రాహ్యాంశ మున్నదని యంగీకరించుచో, నది పైన జెప్పినట్లు చేతనమని గాని, జడమని గాని చెప్ప వలనుబడదు. అందుచే ఆత్మ యొక యంశముచే గ్రాహ్యము మఱియొక యంశముచే గ్రాహకము నగునని చెప్పదగదు.

యద్ధర్మా యః పదార్థో న తస్యైవేయా త్సకర్మతామ్।
న హ్యాత్మానం దహత్యగ్నిః తథా నైవ
ప్రకాశయేత్ ॥ ౧౩

అవ :- స్వరూపముచే గాని, అంశచే గాని ఆత్మ తెలియబడకపోవచ్చును. స్వగుణమగు జ్ఞానముచే తాను తెలియబడవచ్చును గదా! యను ప్రశ్న కిచట సమాధానము చెప్పబడుచున్నది.

తా॥ ఏది యే పదార్థము యొక్క యసాధారణ ధర్మమో యా ధర్మమున కాపదార్థము కర్మ కాదు. అగ్ని యందు దాహకత్వము, ప్రకాశము నను రెండు ధర్మములు గలవు. ఆ ధర్మము లితరపదార్థముల వ్యాపించి, వానిని దహించును, లేక ప్రకాశింపజేయును. అంతియేకాని, యా ధర్మము లగ్నిని వ్యాపించి యగ్నిని దహింపవు; ప్రకాశింప జేయవు. "అగ్ని తనను దహించుకొనును; ప్రకాశింప

జేయును - అనుట తగదుగదా! అగ్ని తనయందలి దాహ కత్వాదిధర్మములకు తాను కర్మ గానట్లు ఆత్మయు తన యందలి జ్ఞానమునకు కర్మ గాడు (జ్ఞానముచే దెలియబడడు).

1

ఏతేనై వాత్మనాఽఽత్మనో గ్రహో బుద్ధే ర్నిరాకృతః।
అంశోఽప్యేవం సమత్వాద్ధి నిర్భేదత్వా న్న
యుజ్యతే॥ ౧౪

తా॥ ఈ దృష్టాంతము చేతనే విజ్ఞాన (బుద్ధి) స్వరూప మగు నాత్మ తనచేతనే గ్రహింపబడునను బౌద్ధవాదము సయితము నిరాకరింపబడినది. స్వరూపము స్వరూపముచే గ్రాహ్యము కాకున్నను ఏకాంశముచే గ్రాహ్యము, అన్యాంశ ముచే గ్రాహకము గాదగునను కల్పనయు ఆత్మ నిరంశమయి యేకరూప మగుటచే యుక్తము గాదనియు పైన నిరాకరింప బడినది.

వి॥ బౌద్ధులు విజ్ఞానము (బుద్ధి) నే ఆత్మగా నంగీక రించి, దానికంటె వ్యతిరిక్తముగ బాహ్యముగ నేదియు లేదనియు, ఆ బుద్ధి క్షణక్షణము పుట్టి నశించు స్వభావము గల

1. ఇట 'ఆత్మనః' అనియు సాధుపాఠము వాణీవిలాసముద్రితపుస్తకమున గలదు. కాని యట్లు గ్రహించిన, ఛందోభంగము గలుగును. కాన, "ఆత్మానః" యని దీర్ఘఘటితపాఠము ఛాందస మని గ్రహింపనగును.

దనియు, అదియే గ్రాహ్య - గ్రాహకరూపమున భాసిల్లు చుండు ననియు చెప్పుదురు. ఆ బౌద్ధమత మిట నిరాకరింప బడినదని గ్రహించునది.

రెండవ శ్లోకమున గ్రాహ్యగ్రాహకములు సజాతీయములుగ నుండవలె ననునెడి నియమము ననుసరించి ద్రష్టయు చేతనుడును నగు ఆత్మచే ప్రకాశింపజేయబడెడి జగత్తంతయు చిన్మయ మగునని చెప్పబడినది. అనగా, దృశ్యము లేక గ్రాహ్యము చేతనమే యగుట పైన నిరూపింపబడినది. ఇపుడు గ్రాహ్యము చేతనము గాదని నిరాకరించుట ఎట్లు పొసగును? అని సందియము గలుగవచ్చును. కాని, యట పై నియమము ననుసరించి వ్యావహారికసత్త యందు భౌతిక రూప రసగంధాదులను గ్రహించు ఇంద్రియములు భౌతికములే యని చెప్పబడినవి. పారమార్థికసత్త యందే సర్వము చిన్మయ మని వివరింపబడినది. కాగా, నిట నిషేధము వ్యావహారికసత్తావిషయకము అని గ్రహించుచో విరోధముండదు.

శూన్యతాఽపి న యుక్తైవం బుద్ధేరన్యేన దృశ్యతా ।
యుక్తాఽతో ఘటవత్తస్యాః ప్రాక్సిద్ధేశ్చ వికల్పతః ॥ ౧౫

తా॥ పైన జెప్పినట్లు బుద్ధికి స్వగ్రాహ్యత్వమును నిరాకరించుటచేత బుద్ధి అన్యగ్రాహ్య మగుట నిరూపింపబడి నది. అట్లు గానిచో, బుద్ధి క్షణిక మను మాట పొసగదు

అగుచో, బుద్ధియు బుద్ధిగ్రాహకమును శూన్యమే కానిమ్ము. ఆ శూన్యమే ఆత్మతత్త్వము - అని చెప్పెడి శూన్యవాదిమతమిట నిరాకరింపబడుచున్నది.

పైన చెప్పఁబడిన కారణములచే బుద్ధికి స్వగ్రాహ్యత్వ మెట్లు యుక్తము గాదో అట్లే బుద్ధికిని, బుద్ధిగ్రాహకమగు ఆత్మకును శూన్యత్వము జెప్పుట యుక్తముగాదు. ఆత్మ అపరోక్షముగ నిరంతర మనుభూయమాన మగుచుండుటచే బుద్ధిగ్రాహక మగు ఆత్మ శూన్యము గాదు. బుద్ధికి స్వగ్రాహ్యత్వమును నిరాకరించినందున ఘటమెట్లు పరప్రకాశ్యమో యట్లే బుద్ధియు పరప్రకాశ్యము అనగా, స్వభిన్నసాక్షిప్రకాశ్య మని యంగీకరించుట యుక్తము. ఇట్లు బుద్ధిగ్రాహకముగ నాత్మ నంగీకరించుటచే గ్రాహకమగు నాత్మ శూన్యమెన్నటికిని గాజాలదు. మరియు, స్వప్నజాగరములయందు బుద్ధి యున్నదనుటకును, సుషుప్తియందా బుద్ధి లేదనుటకును (అనగా బుద్ధియొక్క భావాభావములకు) సాక్షి ఆత్మ. ఇట్టి యాత్మ బుద్ధియొక్క వికల్పమునకు పూర్వమే సుషుప్తియందు సాక్షిచైతన్యరూపమున నిరంతరము వెలుగొందు చుండుటచే ఆత్మ శూన్య మను వాదము నిరాధారము. సుషుప్తియందు ఆత్మ సాక్షిరూపమున వెలుగొందదని చెప్పుచో సుషుప్తి యసాక్షిక మగును. అట్టియెడ సుషుప్తి

యందలి "సుఖ మహ మస్వాప్సమ్" (నేను బాగుగ నిద్రించితిని) "న కించి దవేదిషమ్" (నాకేమియు దెలియదు) యనెడి యీ యనుభవములను జాగ్రద్దశయందు పరామర్శించుట యుపపన్నము గాదు. కావున, బుద్ధివికల్పములకు పూర్వమే సుషుప్త్యనుభవములకు సాక్షియై యాత్మ యున్నాడని యంగీకరింపవలెను.

అవికల్పం తదస్త్యేవ యత్పూర్వం స్యాద్వికల్పతః ।
వికల్పోత్పత్తిహేతుత్వాత్ యద్యస్యైవ తు కారణమ్ ॥

తా॥ ఏ కార్యము దేనితో నియతముగ గూడియుండునో, యది దానికి కారణము. ఘట మనెడి కార్యము నియతముగ మృత్తుతో (మట్టితో) గూడియుండును. కనుక, ఘటరూప కార్యమునకు మృత్తు కారణము. కార్యమునకే వికల్పమనియు పేరు. అట్టి కార్యరూప వికల్పమునకు బూర్వమే కారణము సిద్ధమై యుండుట లోకసిద్ధము. అట్టి కారణము నిర్వికల్పము. ఘటము వలెనే సవికల్పమగు బుద్ధియు నియతముగ సవికల్పమగు 'సత్' రూప కారణముతో గూడియున్నది. "బుద్ధిః అస్తి–విజ్ఞానం అస్తి" అని యీ రీతిగ బుద్ధి సదర్థముతో గూడి యనుభూత మగుచుండును. ('సత్' అనగా త్రికాలాబాధిత మగు సత్యము) కనుక, సవికారమగు బుద్ధికంటె పూర్వమే నిర్వికారుడు సాక్షియు నగు నాత్మ యుండునని యంగీకరింపవలెను.

మఱియు శూన్యమే కారణమని చెప్పినచో, ఆ యా కార్యవిశేషముల(వికల్పముల) యుత్పత్తిని గూర్చి యా యా కారణవిశేషము లావశ్యకము (నియతము) లనెడి నియమముతో విరోధము సంభవించును. ఉదా :- కుండ యనునది యొక కార్యవిశేషము, దానిని చేయగోరువాడు నియతముగ మృత్తునే కోరును. అట్లే వస్త్రముల నేయువాడు నియతముగ తంతువులనే (నూలునే) కోరును. అట్లుకాక, మూలకారణము శూన్యమే యని చెప్పుచో నది సర్వత్ర సులభమే యగుటచే ఘటపటాది కార్యవిశేషముల యుత్పత్తికై మృత్ - తంతు రూప కారణవిశేషముల గోరవలసిన పని యుండదు. అనగా అట్టి మట్టి - నూలు మొదలగువాని నపేక్షింపకయే ఘట పటాదుల జేయవచ్చును. ఇట్టిది లోకవ్యవహారవిరుద్ధము. కారణము లేనిది కార్యముపుట్టదు గనుక వికల్పములగు కార్యముల కంటె నేది పూర్వమో, యట్టి కూటస్థ-అవికల్ప వస్తువు నియతముగ కారణమై యుండకతీరదు. కావున, జగత్కారణము శూన్య మని చెప్పుట యుక్తిసహము గాదు.

అజ్ఞానం కల్పనామూలం సంసారస్య నియామకమ్ ।
హిత్వాఽఽత్మానం పరం బ్రహ్మ విద్యాన్ముక్తం
సదాఽభయమ్ ॥

అవ :- లోకమున కారణము వ్యాపారసహితముగ గన్పట్టును; కాన, నిర్వికారమగునది (సర్వావ్యాపారమైనది)

కారణము గాదు. పని చేసెడి కులాలాదులే కారణములుగ గన్పట్టుచున్నారు గదా! జగత్కారణముగ జెప్పెడి బ్రహ్మ కూటస్థుడు (నిర్వికారుడు) అని చెప్పుచున్నారు. కూటస్థుడగు బ్రహ్మ జగత్కారణ మెట్లగును? అను శంక కిట సమాధానము చెప్పబడుచున్నది.

అనాదియగు అవిద్యయే కూటస్థప్రత్యగాత్మరూపుడగు బ్రహ్మయందు సర్వకల్పనలకు మూల మగుచున్నది. అనగా, అవిద్యయే నిర్వికారచైతన్యస్వరూపుడగు బ్రహ్మయందు సవికారజగద్రూపము భాసించుటకు హేతువగుచున్నది. కాన, జగత్తున కంతటికి బ్రహ్మ యధిష్ఠానకారణము. ఆ యధిష్ఠానమునందే యజ్ఞానముచే జగత్తు ఆరోపిత మగుచున్నది. రజ్జువునందు కల్పితమగు సర్పమునకు రజ్జు వధిష్ఠానమై కారణ మగునట్లు బ్రహ్మయందు కల్పితమగు జగత్తునకు బ్రహ్మ యధిష్ఠానమై కారణ మగుట యుక్తము. కావున నధిష్ఠానమగు బ్రహ్మయందు జగద్రూపమగు సంసారమును నియమించునది అజ్ఞానమే యగును. ముముక్షువు శాస్త్రగురూపదేశముల వలన నీ యజ్ఞానమును విడిచి భయరహితము, నిష్ప్రపంచము నగు పరబ్రహ్మను అనుసంధానింప వలయును.

వి :- ఈ యజ్ఞానము సర్వదా కార్యసహితముగనే భాసింపుచుండ, అజ్ఞానవిశిష్టమగు బ్రహ్మనే ప్రత్యగ్రూప

ముగ గ్రహింపనగును. నిర్విశేషమగు బ్రహ్మను ప్రత్యగ్రూపముగ గ్రహించుట యెట్లు? అని శంకింపరాదు. యథార్థజ్ఞానముచే సర్పాదిరూపకార్యసహితముగ భ్రాంతిని లేక అజ్ఞానమును విడిచి యథార్థమగు (సర్[illegible]రరహితమగు) రజ్జువును గ్రహించుట లోకసిద్ధము. కాన, అజ్ఞానము తన కార్యములతో పాటు పుట్టుచు నశించుచు నుండును. ఆ యజ్ఞానము యొక్క భావాభావములకు సాక్షియై ఆత్మ తుదకు శేషించి భాసిల్లును.

"అధిష్ఠానావశేషోహి నాశః కల్పితవస్తునః"

అను నభియుక్తోక్తియు నిందులకు ప్రమాణము. తనయందు కల్పితకార్యములను బట్టియే ఆ కార్యములకు సాక్షిత్వము గూడ నాత్మయందు కల్పితము. అందుచే కల్పితవస్తువులు నశించినంతనే ఆత్మయందలి సాక్షిత్వము గూడ తొలగి పోవును. ప్రపంచము అజ్ఞానమూల మగుటచే జగత్తుకు అజ్ఞానము ఉపాదానకారణము. కల్పితమగు నా జగత్తునకు అధిష్ఠానమగుటచే జగత్తుకు అజ్ఞానము ఉపాదాన కారణము. బ్రహ్మ వివర్తోపాదాన కారణము. కావున, శాస్త్రగురూపదేశాదులచే అజ్ఞానమును నశింపజేసి కార్యకారణరూప ప్రపంచసంగరహితుడు, అద్వయుడు, అభయ స్వరూపుడు నగు బ్రహ్మ తానే యని యను సంధానము చేసికొన నగును. పై కారణములచే

బ్రహ్మ కూటస్థు డయియే (నిర్వ్యాపారు డయియే) జగత్కారణ మనుటలో విరోధ మేమియు లేదు.

జాగ్రత్స్వప్నౌ తయోర్బీజం సుషుప్తాఖ్యం తమోమయమ్।
అన్యోన్యస్మిన్నసత్త్వాచ్చ నాస్తీత్యేతత్త్రయం త్యజేత్॥
౧౭

అవ :- సంసార నియామకము అజ్ఞానము; ఆ యజ్ఞానమును విడిచి, ఆత్మను బ్రహ్మనుగా తెలిసికొనవలయు నని చెప్పబడినది. అయితే, సంసార మన నేది? దానికి యజ్ఞాన మెట్లు కారణ మగును? ఆ యజ్ఞానమునుండి ఆత్మను వివేకించి తెలిసికొనుట యెట్లు? యను ప్రశ్నలకిట సమాధానము జెప్ప బడుచున్నది.

తా॥ స్థూలముగ గోచరించు జాగ్రదవస్థయు, సూక్ష్మముగ గోచరించు స్వప్నదశయు సంసార మనబడును. ఈ రెండింటికి అజ్ఞప్రాయమగు సుషుప్తి కారణము. (ఇట "తమోబీజం" అని చెప్పక "తమోమయమ్" అని మయట్ప్రత్యయమును బ్రయోగించుటవలన అజ్ఞానము స్వతంత్రకారణము గాదను విషయము సూచితము. "తమోమయం" అనగా అజ్ఞానప్రాయ మని యర్థము. అనగా, చిదాభాససహితమైన యజ్ఞానము కారణమని యర్థము.) ఇట్లు కార్యకారణస్వభావమును జెప్పి వానిని విడుచు విధానమిపుడు చెప్పబడుచున్నది.

ఈ స్థూల సూక్ష్మకారణావస్థలు మూడును ఒకదాని యందొకటి యుండవు. జాగ్రద్దశయందు స్వప్నసుషుప్తులు గాని,అట్లే స్వప్న సుషుప్తిదశలయందు తదితరములు గాని భాసింపవు.అందుచే నివి త్రికాలాబాధ్యములు కావు.వీనిలో నన్నిటియందును ('అస్తియని)సత్త్వ మనుగత మగుచునే యుండును.అట్లనుగతమయ్యెడి సత్త్వము(సద్రూపుడగు ఆత్మ) త్రికాలాబాధ్యము.మరియు నివి (జాగ్రత్స్వప్నాదులు)దృశ్య ములు. కావున,రజ్జువునందు కల్పితములై దృశ్యములుగ గోచ రించెడి సర్ప-జలధారాదులవలె వీనిని గూడ, మిథ్య యని (వాస్తవికములు గావని)గ్రహించి వీనిని త్యజింపవలెను-అనగా వీనికంటె వ్యతిరిక్తముగ త్రికాలాబాధ్య సచ్చిద్రూపుడగు ఆత్మను వివేకించి(శోధించి) తెలిసికొనవలెను.

ఆత్మబుద్ధిమనశ్చక్షురాలోకార్థాదిసంకరాత్ ।
భ్రాన్తిః స్యాదాత్మకర్తృతి క్రియాణాం సన్నిపాతతః॥ ౧౯

అవ :- త్యజేత్ (విడిచిపెట్టవలయును)అనుటచే ఆత్మ కర్తృత్వ మనెడి వికారము గలవాడుగ ప్రతీతుడగుచున్నాడు. అట్టి యాత్మ నిర్వికారబ్రహ్మస్వరూపు డెట్లగును?అను శంక కిట సమాధానము చెప్పబడుచున్నది.

తా॥ దేహము,బుద్ధి,మనస్సు, నేత్రము,ప్రకాశము, దేశ కాలాదులు-ఇవి యొకదానియందొకటి పరస్పరము అధ్య

స్తము లగుటవలన క్రియలేర్పడుచున్నవి. ఇట్లు వీనియం దేర్పడిన క్రియలను జూచి వీని కధిష్ఠానభూతు డగు ఆత్మ కూటస్థుడయ్యును సవ్యాపారు డను ప్రతీతి భ్రాంతి మూలమున కలుగుచుండును. కాన, ఆత్మ కర్త యను ప్రతీతి భ్రాంతి మూలకము. ఆత్మ స్వయముగ నిష్క్రియు డగుటచే నిష్క్రియబ్రహ్మస్వరూపు డగుట యుక్తమే.

నిమీలోన్మీలనే స్థానే వాయవ్యే తేన చక్షుషః।
ప్రకాశత్వాన్మనస్యేవం బుద్ధౌ నస్తః ప్రకాశతః॥ ౨౦

ఒక వస్తువు యొక్క ధర్మము నింకొకదాని యందారోపించువిషయమై దృష్టాంత మీయబడుచున్నది.

కన్నులు మూయుట(నిమీలనము), తెఱచుట(ఉన్మీలనము), అను క్రియలు వాయువుకు సంబంధించినవి. కాని, నేత్రమునకు సంబంధించినవి కావు. ఏలయన, వాయువు, క్రియాత్మకము. నేత్రేంద్రియము ప్రకాశరూపము. కాన, నేత్రమునందు జరగెడు ఉన్మేషనిమేషాదిక్రియలు వాయువుయొక్క కార్యములే యగును. కాని "కన్ను మూసికొనినది, తెఱచి కొనినది" యని యీ రీతిగ క్రియలు నేత్రమునందే యధ్యస్తములు [ఆరోపితములు) అగుచున్నవి. దీనికి అన్యవస్తువునందు అన్యధర్మారోపమనెడి యధ్యాసయే కారణము. నేత్రము వలెనే మనోబుద్ధులు గూడ ప్రకాశస్వరూపములే గాని క్రియాత్మకములు కావు. క్రియాత్మకత్వ మనునది ప్రాణాధీనము. అయినను నేత్రము

నందు వలెనే ప్రకాశస్వరూపములగు మనోబుద్ధులందు గూడ "చంచలం మనః," "స్థిరా బుద్ధిః" ఇత్యాది ప్రతీతుల ననుసరించి ప్రాణధర్మ మగు క్రియాత్మకత్వము ఆరోపింపబడుచున్నది.

సంకల్పాధ్యవసాయే తు మనోబుద్ధ్యోర్యథా క్రమాత్।
నేతరేతరధర్మత్వం సర్వం చాత్మని కల్పితమ్॥ ౨౧

అవ :- మనోబుద్ధులకు గల యసాధారణ ధర్మముల నిరూపించుచు నీ ప్రాసంగిక విషయ ముపసంహరింప బడుచున్నది.

తా॥ సంకల్పము మనోధర్మము.అధ్యవసాయము(నిశ్చయము)బుద్ధియొక్క ధర్మము.ఇవి వీనియొక్క యసాధారణ ధర్మములు.అందుచే మనోధర్మమగు సంకల్పము బుద్ధికిగాని, బుద్ధిధర్మమగు నిశ్చయము మనస్సునకు గాని, యుండవు.అనగా, నొకదానిధర్మము మఱియొకటి గలిగి సాంకర్యము బొందవు. అట్లే కూటస్థుడు,అసంగుడునగు నాత్మకు కర్తృత్వ మెన్నడు లేదు.అవిద్యామనోబుద్ధ్యాదులు జడము లగుటచే వానికి స్వతంత్రముగ కర్తృత్వము లేదు.జడములకు స్వతంత్రముగ కర్తృత్వ మున్నదని యంగీకరించుచో, రథశకటాదులు వాని యంతటు నవి పురుషప్రేరణ లేకయే నడువవలసివచ్చును. మఱియు జడములగు అవిద్యాదులకును,అజడమగు నాత్మకును

వాస్తవికమగు సంబంధ మేదియు నుండదు. వానికి భ్రాంతి కల్పితసంబంధమే(ఆధ్యాసిక సంబంధమే)యని యంగీకరింప వలెను. కాన, నాత్మయందు గనపట్టెడి యీ సంసారబంధము ఆధ్యాసిక సంబంధమూలమే గాని, వాస్తవికము గాదు. కనుక, నాత్మ యెల్లపుడు అద్వయ-నిష్క్రియ బ్రహ్మస్వరూపుడగుట సిద్ధము.

స్థానావచ్ఛేదదృష్టిః స్యా దింద్రియాణాం తదాత్మతామ్।
గతా ధీ స్తాంహి పశ్యన్ జ్ఞో దేహమాత్ర ఇవేష్యతే॥

౨౨

అవ :- పైన "దేహ-ఇంద్రియ-మనోబుద్ధులే యాత్మలు, శూన్యమేయాత్మ"-యను వాదములు నిరాకరింపబడి, యాత్మ వానికంటె, విలక్షణుడని నిరూపింపబడినది. ఇపుడు, "దేహాదుల కంటె, విలక్షణు డయ్యును ఆత్మ దేహసమ పరిమాణము గల వాడు"-అను జైనసిద్ధాంతమును బట్టి ఆత్మకు పరిచ్ఛిన్నత్వము ప్రాప్తించుచున్నది. అట్లు ఆత్మ పరిచ్ఛిన్నుడగుచో నపరిచ్ఛిన్న బ్రహ్మస్వరూపు డెట్లగును? పరిచ్ఛిన్నవస్తువు బ్రహ్మ కానేరదు గదా!! మఱియు ఆత్మకంటె కల్పకుడు వేరొకడు లేనందునను, పరిచ్ఛిన్నుడగునట్టి యాత్మ యందు సర్వము కల్పితమని చెప్పుట యుక్తము కాదు గనుకను, ఆత్మ సర్వకల్పనములకు

నాధారము కానేరడు-అను శంక కీట సమాధానము చెప్ప బడుచున్నది.

తా॥ ఇంద్రియములు బాహ్యదేహావయవ గోళకముల ద్వారా బాహ్యార్థములను దర్శింపగలవు గాని, స్వయముగ నా యా వస్తువుల దర్శింపలేవు. నేత్రేంద్రియము గోళకపరి చ్ఛిన్నమగుచు గోళకతాదాత్మ్యమును జెంది యా యా వస్తు వుల దర్శింపజేయుచు గోళకసమపరిమాణము గలది యగును. త్వగింద్రియము దేహతాదాత్మ్యముచే దేహసమపరిమాణము గలది యగును. ఇట్లే ఇతరేంద్రియములును. అట్టి దేహేంద్రి యములతో తాదాత్మ్యము నొందిన బుద్ధిని ప్రకాశింపజేయుచు జ్ఞానస్వరూపుడగు నాత్మ తాను స్వయముగ బరిచ్ఛిన్నుడు (పరిమాణముకలవాడు) కాక పోయినను, దేహసమపరిమాణము గలవానివలె భ్రాంతిచే ప్రతీతుడగుచుండును. కాన, ఆత్మకు దేహసమపరిమాణ మనునది భ్రాంతివ్యవహారమూలము. అట్లుగాక, దేహసమపరిమాణుడనుచు ఆత్మకు మధ్యమపరి మాణ మంగీకరించుచో మధ్యమపరిమాణము గల ఘటాదుల వలె నాత్మయు సావయవుడును, కావున, అనిత్యుడును గావలసి వచ్చును. అనిత్యుడగుచో ఆత్మయు దేహముతోపాటు నశించు నని చెప్పవలెను. అట్లు నశించు నని చెప్పుచో, పారలౌకిక స్వర్గాదిఫలముల నుద్దేశించి యజ్ఞాదులయందు ప్రవృత్తి

యసంభవ మగును.ఇట్లు దేహ-అంతఃకరణాద్యుపాధులసంబంధము లేక యాత్మకు స్వయముగ పరిచ్ఛిన్నత్వము సంభవింపదు గాన,స్వయముగ నపరిచ్ఛిన్నుడగు ఆత్మకు బ్రహ్మత్వముపపన్నమే యగును.అవయవశూన్యుడైన యాత్మకు వాస్తవముగ నుపాధులతో నెట్టి సంబంధముండదు గనుక, అసంగుడు, అపరిచ్ఛిన్నుడును నగు నాత్మయందు సర్వము కల్పితమని చెప్పుట యుక్తమే యగును.

క్షణికం హి తదత్యర్థం ధర్మమాత్రం నిరంతరమ్।
సాదృశ్యాద్దీపవ త్తద్ధీ స్తచ్ఛాన్తిః పురుషార్థతా॥ ౨౩

అవ :- ఆత్మ దేహసమ(మధ్యమ)పరిమాణము గలవాడనెడి జైనమతనిరాకరణముచే ఆత్మకనంతత్వము ప్రాప్తింప,దానిని సహింపక శాక్యులు(బౌద్ధులు)ఇట్లాక్షేపించుచున్నారు.

తా॥ జ్ఞానము, జ్ఞేయము-ఈ రెండును క్షణికములు;ప్రతిక్షణము పుట్టుచు,నశించునట్టివి. ఇవి ధర్మమాత్రములు(వస్తుమాత్రములు);అనగా వీనికి చిరస్థాయి యగు నధిష్ఠానము లేదు. ఆ జ్ఞానధార నిరంతరమై భాసించుటచే విచ్ఛిన్న మయినట్లు గోచరింపదు.అయినను ప్రతిక్షణము పుట్టుచు నశించునేని'అదియే యిది'యనియు,'స్వప్నాదుల దర్శించిన యాతడే నేను'

అని యీ రీతిగ దృశ్యమును గూర్చియు,ద్రష్టను గూర్చియు ప్రత్యభిజ్ఞ యెట్లు పొసగును?-అను ప్రశ్నకు తావు లేదు. ఆ దీపమే యీ దీపము-అనునట్లు అతిసాదృశ్యమువలన అదియే యిది యను జ్ఞానము కలుగును. అట్లు నిరంతరము జ్ఞానజ్ఞేయములు భాసించుటగాని,వానిని గూర్చిన యవివేకము తొలగుట గాని పురుషార్థము(మోక్షము)అని చెప్పబడును.

స్వాకారాన్యావభాసం చ యేషాం రూపాది విద్యతే।
యేషాం నాస్తి తతశ్చాన్య త్పూర్వాసంగతి రుచ్యతే॥
౨౮

అవ:- దూషణవిభాగజ్ఞానమునకై యిపుడు బౌద్ధమత భేదము వివేచించి ప్రదర్శింపబడుచున్నది.బాహ్యరూపాదివస్తువులు వానికంటె భిన్నమగు జ్ఞానముచే భాసింపజేయబడునని కొందఱు బౌద్ధులు చెప్పుదురు. జ్ఞానమాత్రమే కాని బాహ్యరూపాదివస్తువులు లేవని కొందఱు చెప్పుదురు. మఱికొందఱు 'జ్ఞానము గూడలేదు; సర్వము శూన్యమని చెప్పుదురు. పై మూడు మతములలో బాహ్యార్థము గలదనెడి మొదటి మతము యుక్తము గాదని చెప్పబడుచున్నది.

బాహ్యాకారత్వతో జ్ఞప్తేః స్మృత్యభావః సదా క్షణాత్।
క్షణికత్వాచ్చ సంస్కారం నైవాధత్తే క్వచిత్తు ధీః॥
౨౯

తా॥ (పై బౌద్ధమతానుసారము) జ్ఞానమే జ్ఞేయ-బాహ్య విషయాకారముగ పరిణమించుననని చెప్పవలెను. మఱియు జ్ఞాత-జ్ఞానము-జ్ఞేయము సర్వము క్షణికమే కావున, నెప్పుడును స్మృతియే లేకపోవును. మఱియు క్షణిక మగుటచేతనే బుద్ధియు నెప్పటికప్పుడు నశించుచు పుట్టుచు నుత్తరకాలీన బుద్ధియందు సంస్కారమును ఎన్నఁడును గలిగింపజాలదు.

వి:- జ్ఞానమే బాహ్యవస్త్వాకారముగ పరిణమించు నని చెప్పవలెను. ఏలన-జ్ఞేయమగు నా వస్తువునకు ఉత్పత్తికి బూర్వము జ్ఞానముతో సంబంధములేదు. ఆ వస్తువు ఉత్పన్నమైన తరువాత గూడ నది క్షణికమగుటచే దానికి జ్ఞానముతో సంబంధము లేదు. (అది జ్ఞానమునకు విషయము గాదు). అట్లు జ్ఞానముతో సంబంధింపని విషయ మెపుడును ప్రత్యక్షము గాజాలదు. కాని, వస్తు ప్రత్యక్ష మగుచునే యున్నది. అందుచే నది ధూమముచే వహ్నివలె నిత్యము అనుమితము (అనుమేయము) అగుచుండు ననియు చెప్పరాదు. ఇట్లు వస్తు ప్రత్యక్షమున కన్యథా ఉపపత్తి లేనందున, జ్ఞానమే జ్ఞేయబాహ్య వస్త్వాకారముగ బరిణమించు నని చెప్పవలసియుండును. అట్లు చెప్పుచో బాహ్యాహ్రూపాది వస్తువులు దానికంటె భిన్నమగు జ్ఞానముచే భాసింపజేయబడు నను వాదము పరాస్తమై, జ్ఞానమాత్రమే కాని, బాహ్యాహ్రూపాదివస్తువులు లేవనెడి విజ్ఞానమాత్రాస్తిత్వవాదమున బ్రవేశించుట యగును.

విజ్ఞానవాదియు జ్ఞాత యగు బుద్ధికి క్షణికత్వ మంగీకరించును. బుద్ధి క్షణక్షణము నశించి పుట్టుచుండుటచే పూర్వ క్షణమున నుండెడి బుద్ధి యుత్తర క్షణమున నుండెడి బుద్ధితోఁ సంబంధింపదు. గాన, తనచే ననుభూతము లయిన పదార్థములయొక్క సంస్కారమును ఉత్తర క్షణవర్తియగు బుద్ధియందు నిలుపజాలదు. అట్టియెడ పూర్వానుభూతములగు పదార్థముల గూర్చిన స్మృతి యెన్నటికిని కలుగ నేరదు. అంతియే కాదు. స్మృతికి కారణము సంస్కారము. సర్వము క్షణికమగుటచే బుద్ధి యా వస్తువిషయక సంస్కారమును, తన యందును (బుద్ధియందును) కలిగించుకొన నేరదు. కాని, స్మృతి కలుగుట యందఱకును అనుభవ సిద్ధము. కాన, విజ్ఞానాత్మవాదము గూడ గ్రాహ్యము గాదు. ఈ ప్రకారమే శూన్యవాదము గూడ యుక్తివిరుద్ధ మగుటచే ఆదరణీయము గాదు.

ఆధారస్యాప్యసత్త్వాచ్చ తుల్యతా నిర్నిమిత్తతః।
స్థానే వా క్షణికత్వస్య హానం స్యా న్న తదిష్యతే॥ ౨౯

అవ:- పూర్వశ్లోకమున గల "క్వచిత్" అను పదము యొక్క యర్థమే అనగా, బుద్ధి సంస్కారము నెక్కడను కలిగింపక పోవలె ననెడి విషయమే యిట స్పష్టము జేయబడుచున్నది. బౌద్ధులు బుద్ధికి నెట్టి యాధారమును(సాక్షిని)అంగీకరింపరు. అందువలన పూర్వక్షణవర్తి జ్ఞానమునకు ఉత్తరక్షణ

వర్తి జ్ఞానము తుల్యము-అనుటకు కారణ మేమియు జెప్పుటకు వీలులేదు. అట్లుగాక యీ పూర్వాపర జ్ఞానములకు తుల్యత్వమును సంపాదించుటకై ఏదియేని యాధార మంగీకరించుచో నప్పుడు విజ్ఞానము క్షణికము గాకపోవలసి వచ్చును. అట్లు చెప్పుట వారి కిష్టము గాదు.

వి. బుద్ధి సంస్కారమును గలిగించునపుడు ఆ సంస్కారమున కాధారమైన ఆత్మ గాని అంతఃకరణముగాని లేనందున, బౌద్ధ బాహ్యవాద మతము దూషింపబడినది. అట్టి యాధారము లేనందున పూర్వాపరజ్ఞానములకు తుల్యత్వ ముపపన్నము కానందున సాదృశ్యము వలన ఆ వస్తువే యిదియనెడి ప్రత్యభిజ్ఞ గలుగు ననెడి వాదము గూడ పరాస్తము జేయబడినది. ఇకమీద జేయబడు దూషణము క్షణికవిజ్ఞానమాత్రవాదము నందును సమానమని తెలియునది.

పూర్వాపరజ్ఞానములకు సాదృశ్య మున్నదని చెప్పుచో నా సాదృశ్యము దేనిని బట్టి చెప్పవలసియుండును? లోకమున గుణములను బట్టి లేక అవయవములనుబట్టి యిది దానితో సమానమని సాదృశ్యవ్యవహారము సిద్ధించుచున్నది. ఈ విజ్ఞానములు నిర్గుణములు, నిరవయవములును. అందుచే గుణములను బట్టిగాని, అవయవముల బట్టిగాని వీనికి సాదృశ్యము ఘటింపదు. మఱియు, దర్శించెడి నీవును, (ద్రష్టయును) క్షణికమగుటచే పూర్వోత్తరకాలము నందలి యీ విజ్ఞానములు

సమానములని గుర్తించెడి యొకే ద్రష్ట యుండమిచేసి విజ్ఞానములకు సాదృశ్యము సిద్ధింపదు. అట్లు తుల్యత్వమే సిద్ధింపనప్పుడు సాదృశ్యమూలకమగు 'అదియే యిది' యను ప్రత్యభిజ్ఞయు లేదు. అట్లుగాక, పూర్వాపర క్షణ విజ్ఞాన సాదృశ్యమును దర్శించెడి ద్రష్ట యొక్కడే యున్నపుడు సంస్కార స్మృతులు సిద్ధించును గనుక, అందుకై స్థాయి యగు ద్రష్టనంగీకరించుచో వారి క్షణికత్వవాదమునకు జలాంజలి యీయవలసియుండును. అట్లిచ్చుటకు వారంగీకరింపరు.

శాంతేశ్చాయత్నసిద్ధత్వా త్సాధనోక్తి రసంగతా।
ఏకైకస్మిన్ సమాప్తత్వాచ్ఛాంతే రన్యానపేక్షతా॥
౨౭

అవ :- "సర్వం క్షణికం, సర్వం క్షణికమ్" అనెడి నిరంతర భావన చే జగత్తు శాశ్వత మనెడి భ్రాంతి శాంతించుటయే ముక్తి యనెడి బౌద్ధవాద మిపుడు నిరాకరింపబడుచున్నది.

తా॥ ప్రతి పదార్థము క్షణక్షణము నశించి మరల పుట్టుచుండు ననెడి క్షణికవాదమందు పదార్థములు శాశ్వతములనెడి భ్రమ యొక్క నివృత్తి యప్రయత్నముగనే లభించుటచే నా భ్రమ శాంతించుటకై యది యన్యము నపేక్షింపదు. మఱియు నట్లు క్షణక్షణము పుట్టి నశించెడి పదార్థములకు

సాంతత్యము(అవిచ్ఛిన్నత్వము )వాస్తవికము గానందునను,అట్టి పదార్థముల విషయమై స్థాయిత్వభ్రాంతియే యుపపన్నము గానందునను, ఉన్నదని చెప్పినను పదార్థములు క్షణికము లగుటచే స్థాయిత్వభ్రాంతి స్వయముగ-అన్య నిరపేక్షముగ నే-శాంతించుచుండుట వలనను, ఆ స్థాయిత్వభ్రాంతి (పదార్థములు శాశ్వతము లనెడి భ్రమ) శాంతించుటకై యన్య యోగాది సాధనాపేక్ష యనావశ్యక మగును. కనుక, నీ క్షణికవాదమందు స్థాయిత్వభ్రాంతిశాంతియే మోక్ష మను మాట పొసగదు.

అపేక్షా యది భిన్నేఽపి పరసంతాన ఇష్యతామ్।
సర్వార్థే క్షణికే కస్మిం స్తథాఽప్యన్యానపేక్షతా॥ ౨౮

తా॥ ఈ బౌద్ధవాదము ననుసరించి పదార్థము లన్నియు క్షణికములగుచో, లోకవ్యవహారమునందును సాధ్యసాధన భావము పొసగదు. అన్నియు (కార్యములు-కారణములు) క్షణికము లగుటచే కార్యకారణము లత్యంతభిన్నము లగును. అందుచే, కార్యము కంటె నియతముగ పూర్వమందు కారణముండవలె ననెడి నియమమునకు భంగము వాటిల్లును. కార్యము దధి (పెరుగు); దానికి గారణము క్షీరము-ఇవి రెండు నత్యంతవిలక్షణములగును. కార్యకారణములు అత్యంత విలక్షణము లయినను దధిరూప కార్యము క్షీరరూపకార

ణమును గోరునట్లు అత్యంత విలక్షణమగు ఇసుమును గూడ కారణముగా నపేక్షించి యిసుము నుండియు దధిరూపకార్యము పుట్టవలసియుండును. కాని, యిది లోకవిరుద్ధము. అందుచే క్షణికము లగుచు విలక్షణములయినను,లోకప్రసిద్ధి ననుసరించి కొన్ని కొన్ని కార్యములు (దధి మొ॥) కొన్ని కొన్ని కారణ ముల (క్షీరము మొ॥) నపేక్షించునని చెప్పవలదు రేని, క్షణికమ గుటచేతనే దధియు బూర్వక్షణమున నుండెడి క్షీరమునైనను దనకు గారణముగా నపేక్షించుట తగదు.

తుల్యకాలసముద్భూతా విత[illegible]

యోగాచ్చ సంస్కృతో యస్తు సోఽన్యం హీక్షితు

మర్హతి ౨౯

తా॥ ఏక కాలమందు బుట్టెడివి పరస్పర సంబంధము కలవి యగును. ఉదా॥ అంకురము, మేఘము-ఇవి యొకే కాలమున బుట్టి పరస్పరసంబంధము గలవి యగును. అందు అంకుర మనెడి కార్యము మేఘసంబద్ధమై వృష్ట్యుదకముచే సంస్కృతమై పెరుగును. అట్లు అంకురము అన్యమగు మేఘో దకము నపేక్షింపవచ్చును. కాని క్షణికములగు వస్తువులు భిన్నభిన్నకాలములందు బుట్టునవి యగుటచే పరస్పర సంబం ధము లేనందున వానికి బరస్పరము ఉపకార్యోపకారక భావము లేదు. అందుచే నివి యన్యము నపేక్షింపజాలవు.

మృషాధ్యాసస్తు యత్ర స్యాత్తన్నాశ స్తత్ర నో మతః।
సర్వనాశో భవేద్యస్య మోక్షః కస్య ఫలం వద॥ ౩౦

అవ :- ఇట్లు క్షణికవాదమును ఖండించి పిదప శూన్య వాదమును నిరాకరించుటకు ముందు స్వమతము యుక్తమని నిరూపింపబడుచున్నది.

తా॥ ఏ బ్రహ్మయందు అవిద్యావశమున 'నేను కర్తను, నేను భోక్తను'-అని యీ రీతిగా కర్తృత్వాదిరూప సంసారము ప్రతిభాసించునో, బ్రహ్మయందారోపితమగు ఆ సంసారము, 'అహం బ్రహ్మాస్మీ'త్యాది మహావాక్యజన్య బ్రహ్మాత్మైక్య జ్ఞానముచే ఆ బ్రహ్మయందే లయము చెందునని మా (వేదాంతుల)మతము. అనగా, అజ్ఞానవశమున సంసారబంధ మనుభవించువానికి జ్ఞానముచే బంధనివృత్తి గలిగి శుద్ధ-ఆత్మ స్వరూపానుభవము నొందుటయే మోక్షమనెడి వేదాంతిమతము సమంజసమగు భావము. శూన్యవాది మతమున అధిష్ఠానమగు బ్రహ్మగాని, బ్రహ్మయందారోపితమగు సంసారముగాని, సంసారబంధ మనుభవించు భోక్తగాని-యెవరును లేనందున సర్వము శూన్యమగుటచే మోక్షరూపఫల మెవరికి గలుగును?

అస్తి తావత్స్వయం నామ జ్ఞానం వాత్మాన్యదేవ వా।
భావాభావజ్ఞత స్తస్య నాభావ స్త్వధిగమ్యతే॥ ౩౧

అవ :- పరమార్థస్వభావముగల యాత్మ యున్నదని

చెప్పుటకు బ్రమాణము లేనందున సర్వనాశరూపమోక్షమునే తప్పక యంగీకరింపవలసియుండునవెడి శంకకిట సమాధానము చెప్పబడుచున్నది.

తా॥ 'నేను' (స్వయం) అనునది యొకటి యున్నది. ఇది సర్వవాదిసమ్మతమైన విషయము. అయితే ఆ 'నేను' అనునది జ్ఞానమా? ఆత్మయా? లేక శూన్యమా? యనునెడ మాత్రమే వివాదము. కాని, యా 'నేను' అనునది లోక సిద్ధాంతముల యొక్క భావాభావముల దెలిసికొను సాక్షిగ నుండుటచే నది (నేను) శూన్యమని చెప్పుట ప్రామాణికము గాదు. అది (నేను) సాక్షియని యంగీకరింపవలెను. లేనిచో జాగ్రత్స్వప్న సుషుప్తుల దర్శించెడి సాక్షి యగు స్థిరవస్తువు లేనందున సర్వలోక వ్యవహారమునకు లోపము వాటిల్లును.

యేనాధిగమ్యతేఽభావస్తత్సత్త్వా త్తన్న చేష్యతే।
భావాభావానభిజ్ఞత్వం లోకస్య స్యాన్న చేష్యతే॥ ౬౨

అవ :- లోకమునందలి భావాభావములను దర్శించు సాక్షి లేడను విషయము (సాక్షియొక్క అభావము) గూడ నింకొకరికి భాసింపవచ్చును గదా యను శంకకిట సమాధానము చెప్పబడుచున్నది.

తా॥ ఏమియు లేదు (అభావము) అను యెవడు తెలిసి కొనునో యతడు 'సత్'రూపుడే (త్రికాలాబాధ్య స్వరూపుడే)

కావలెను. అతడే భావాభావరూప సర్వవ్యవహారసాక్షి. అట్టి సాక్షి లేడనునెడ 'ఇది యున్నది-ఇది లేదు' అనెడి యీ భావాభావవ్యవహార ముపపన్నము గానేరదు. సర్వము శూన్య మగుటచే నీ వ్యవహారమునకు లోపము గలిగినను క్షతి లేదని సాక్షిని నిరాకరించుటయు పొసగదు. ఎవడు నిరాకరించుచున్నాడో, ఆ నిరాకర్త యొక్క స్వరూపమే సాక్షి. కాన సాక్షిని నిరాకరించుట యనగా దన్ను దాను నిరాకరించుకొనుటయే యగును. అది స్వానుభవవిరుద్ధము గదా! కాన, భావాభావముల దర్శించెడి సాక్షి గలడని యంగీకరించుట యుక్తము.

సదసత్సదసచ్చేతి వికల్పాత్ప్రాగ్యదిష్యతే।
తదద్వైతం సమత్వాత్తు నిత్యం చాన్యద్వికల్పితాత్॥ 33

అవ :- పూర్వము భావాభావవిభాగమును దెలిసికొనునది యొకటి గలదని చెప్పబడినది. దానిని విశేషించి నిర్ధారించుటకై తత్స్వరూప మిపు డుపపాదింపబడుచున్నది.

తా॥ సాక్షి, జగత్తు-ఇవి 'సత్' అగునా? 'అసత్' అగునా? లేక సదసద్రూపములా? యనెడి వివాదములు గలవు. అయితే, యీ వికల్పములు దేని నుద్దేశించి కలుగుచున్నవో యది యీ వివాదముల కాధారము కావలెను. వివాదములు

నిరాలంబములు కాజాలవు కదా! కాన, ఆ వికల్పములు కలుగుటకు బూర్వము వాని కాలంబున మేది స్వయంసిద్ధమై కలదో యది నిర్వికల్పము; వికల్పములకంటె బూర్వము నై పయ్యారహిత మగుటచే నది సమము. (ఏకము). ద్వైతజడ విలక్షణ మగుటచే జ్ఞానస్వరూపము; అద్వైతము. కాన, అనంతము. మఱియు నిత్యము. అనగా కూటస్థము. (నిర్వికారము) కూటస్థత్వము చెప్పుటచే దుఃఖాభావము సూచితము. దాన, ఆనందరూపత్వము ధ్వనితము. కాన, ఆత్మతత్త్వము సత్య జ్ఞానానంతానందరూప మగుట అనుభవసిద్ధ మగుటచే దానిని నిరూపించుటకై ప్రమాణాంతరావశ్యకత లేదు.

వి :- సత్=మూడు కాలముల యందుండునది (కాలత్రయాబాధ్యము). అసత్=మూడు కాలముల యందు లేనిది (శూన్యము-శశశృంగాదికము)

వికల్పోద్భవతోఽసత్త్వం స్వప్నదృశ్యవదిష్యతామ్।
ద్వైతస్య ప్రాగసత్త్వాచ్చ సదసత్త్వాదికల్పనాత్॥ ౩౮

అవ :- నానావిధములుగా ద్వైతము ప్రత్యక్షసిద్ధమై యుండ, అద్వైతమెట్లు సిద్ధించు నను శంకకు సమాధానము చెప్పబడుచున్నది.

తా॥ వికల్పరూపమున బుట్టుట చేతను, సత్, అసత్, సదసత్-అనెడి యీ వికల్పములకంటె బూర్వము లేనందునను

నానావిధ బాహ్యప్రపంచరూపద్వైతము స్వప్నప్రపంచము వలె మిథ్య యగును (ద్వైతం న పరమార్థ సత్, దృశ్యత్వాత్, స్వప్నదృశ్యవత్) కాన, దృశ్యము కానిదియు, వికల్పములకంటె బూర్వము నానకాధారముగా నుండెడి యాత్మతత్త్వము నిత్యము; సత్యము.

వాచారమ్భణశాస్త్రాచ్చ వికారాణాం హ్యభానతా।
మృత్యోః స మృత్యు మిత్యాదే ర్మమ మాయేతి చ
స్మృతేః॥ ౩౫

అవ :- న్యాయపూర్వకముగ ద్వైతమిథ్యాత్వమును ప్రతిపాదించి శాస్త్రము వలనను సయితము ద్వైతము మిథ్య యేనని నిరూపింపబడుచున్నది.

తా॥ ఏక విజ్ఞానముచే సర్వవిజ్ఞానమును (ఒకదానిని దెలిసికొనుటచే నన్నియు దెలియునని) బ్రతిజ్ఞ చేసి దృష్టాంతాపేక్ష కలుగగా "యథా సోమ్యైకేన మృత్పిండేన సర్వం మృణ్మయం విజ్ఞాతం స్యాద్వాచారంభణం వికారో నామధేయం మృత్తికేత్యేవ సత్యమ్" (ఛాం. అ. 1-4) అని చెప్పబడినది. ఓ శ్వేతకేతూ. ఏ ప్రకారముగా నొక మృత్పిండమును (మంటి ముద్దను) దెలిసికొనినచో, మృద్వికారమగు ఘట (కుండ)-శరావ (మూకుడు)-ఉదంచనాది (కడవ మొ॥) సముదాయ మంతయు దెలియబడుచున్నదో, యట్లే కార్య

వికార) మనునది వాచారంభణమగునామధేయము మాత్రమే కాని, కార్యముకంటె వేఱొక వస్తువు కాదు. మృత్తికయే సత్యము-అని యర్థము. వాచారంభణ మనగా వాక్కుచే నారంభింపబడునది (కలదని చెప్పబడునది)యని యర్థము. వికారము (కార్యము) కేవలము వాక్కుచేత నారంభింపబడు చున్నది (కలదని చెప్పబడుచున్నది). కాని, వాస్తవముగా వికారమనునది యొకటి లేదు. ఇది నామధేయము మాత్రమే. మృత్తికయే సత్య మనుటచే వాచారంభణమగు వికారము అసత్య మగునని చెప్పవలెను. అనగా సత్యమగు మృత్స్వరూప మును (కారణమును) దెలిసికొనినచో కార్య (వికార) మగు ఘటశరావోదంచనాది సముదాయ మంతయు మృత్స్వరూపము కంటె భిన్నము కాదు కావున, దెలియబడును. దీని వలన ఏక విజ్ఞానముచే సర్వవిజ్ఞానము గలుగు ననెడి ప్రతిజ్ఞానిర్వాహ మగునని వాచారంభణశ్రుతి చెప్పుచున్నది. ఇట్లు వాచారంభణ శ్రుతిచే వికారములకు అసత్యత్వము చెప్పబడినది. (చూ. తదన న్యత్వమారంభణ శబ్దాదిభ్యః (బ్ర. సూ. **2.1-14**) మఱియు మృత్యోః స మృత్యుమాప్నోతి య ఇహ నానేవ పశ్యతి' (బృ. 4-4-19). వాస్తవముగా నానాత్వము లేని బ్రహ్మ యందు అవిద్యచే నానాత్వము నారోపించి యెవడు నానా రూపములు కలదివోలె దర్శించునో, యతడు మృత్యువు (సంసారము) నుండి మఱియొక మృత్యువు (సంసారము)ను

పొందును—అనగా జన్మమరణరూప సంసారచక్రముననే తిరుగుచుండును అని బృహదారణ్యక శ్రుతియు ద్వైత దర్శనమును నిందించినది. ద్వైతమే సత్యమగుచో ద్వైత దర్శనమును నిందించుట యెట్లుపపన్నమగును? కావున, ద్వైతము అసత్యము.

శ్లోకమునందలి 'మృత్యోః స మృత్యు మిత్యాదేః'- అని 'ఆది' శబ్దముచే సాక్షాత్తు ద్వైతమును నిషేధించెడి 'నేహ నానా స్తి కించన' (బృ. 4-4-19) ఇత్యాది శ్రుతివాక్యముల గ్రహింపనగును.

మఱియు,

దైవీ హ్యేషా గుణమయీ మమ మాయా దురత్యయా।
మామేవ యే ప్రపద్యన్తే మాయా మేతాం తరన్తి తే॥
(భ. గీ. 7-14)

సకలప్రాణివ్యామోహకారణమును, త్రిగుణాత్మికయు నగు భగవన్మాయను దాటుటకు సర్వకర్మసంన్యాసపూర్వక జ్ఞాననిష్ఠ తప్ప, సాధనాంతరము లేదని చెప్పుచు భగవద్గీతయు సకలకార్య (వికార) సహితయు, గుణత్రయాత్మికమునగు దైవీమాయ పరమాత్మజ్ఞానైకనివర్త్యమని శాసించినది. కాన, మాయికమగు ద్వైత మసత్యమే. ద్వైతము సత్యమగునేని

కార్యసహితమగు మాయ తొలగు ననుట నిరర్థకము గావలసి వచ్చును.

విశుద్ధి శ్చాత ఏవాస్య వికల్పాచ్చ విలక్షణః।
ఉపాదేయో న హేయోఽత ఆత్మా నాన్యై రకల్పితః॥ 36

అవ :- ఇట్లు శ్రుతియుక్తులచే ద్వైతము మిథ్య యని నిరూపింపబడుటచే అశుద్ధికారణము లేనందున ఆత్మకు విశుద్ధి సిద్ధించునని చెప్పబడుచున్నది.

తా॥ ద్వైతము (దృశ్యమగు బాహ్య ప్రపంచము) అసత్యము, సదసదాది వికల్పసహితము; రూప (ఆకార) సహితము. కాన నది దృష్టిభేదము ననుసరించి హేయము (త్యాజ్యము), ఉపాదేయము (గ్రాహ్యము) అగుచుండును. ఆత్మ యీ ద్వైతము కంటె విలక్షణుడు; కాన, సద్రూపుడు (సత్యము); వికల్పరహితుడు; రూపరహితుడు. కాన, ద్వైతమునకు వలె ఆత్మకు హేయత్వము గాని, ఉపాదేయత్వము గాని లేదు. అందుచే ఆత్మ హేయోపాదేయరహితుడు, ధర్మాధర్మ ఫలస్పర్శ లేనందున విశుద్ధస్వరూపుడు.

అప్రకాశో యథాఽఽదిత్యే నాస్తి జ్యోతిఃస్వభావతః।
నిత్యబోధస్వరూపత్వా న్నాజ్ఞానం తద్వదాత్మని॥ 37

అవ :- ద్వైతము వలెనే ఆత్మయు వికల్పనార్హు డేల కారాదను శంకకు సమాధానము చెప్పబడుచున్నది.

తా॥ జ్యోతిఃస్వరూపు డగుటవలన సూర్యునియందు చీకటి లేనట్లు నిత్యబోధ (జ్ఞాన) స్వరూపుడగు ఆత్మయందును అజ్ఞానము లేదు. కాన, వాస్తవముగా నాత్మ యందజ్ఞానము లేమిచే ఆత్మ వికల్పనార్హుడు గాడు.

తథాఽవిక్రియరూపత్వా న్నావస్థాంతర మాత్మనః।
అవస్థాంతరవత్త్వే హి నాశోఽస్య స్యా న్న సంశయః॥ ౩౭

తా॥ వికారము గల వస్తువులకే యవస్థాంతరము(మఱియొక యవస్థ) ప్రాప్తించుచుండును. అవస్థాంతరము గలవానికే నాశముకు గలుగును. ఆత్మ కూటస్థుడు, నిర్వికారుడు గాన, ఆత్మకు అవస్థాంతరప్రాప్తి గాని, నాశముగాని లేదు. అట్లుగాక యాత్మ కవస్థాంతర మున్నదని చెప్పుచో నపుడాత్మకును వినాశము తప్పదు. అట్టితరి నిత్యత్వశ్రుతితో విరోధము సంభవించును.

మోక్షోఽవస్థాంతరం యస్య కృతకః స చలో హ్యతః।
న సంయోగో వియోగో వా మోక్షో యుక్తః కథంచన॥
౩౮

సంయోగస్యాప్యనిత్యత్వాద్వియోగస్య తథైవ చ।
గమనాగమనే చైవ స్వరూపం తు న హీయతే॥ ౪౦

అవ :- మోక్షము కూడ అవస్థాంతరమే యను వాదము నిరాకరింపబడుచున్నది.

తా॥ మోక్షము కూడ అవస్థాంతరమే యని చెప్పెడి వారి మతమందు మోక్షము కృతకము (చేయబడునది) అగును. కృతకములు అనిత్యము లనెడి నియమము ననుసరించి కృతకములగు ఘటాదులవలె మోక్షమును అనిత్యము(చలము) కావలెను. అట్లు అనిత్య మగుచో మోక్షము పురుషార్థము కాకపోవును.

మోక్షము అవస్థాంతరము కాకపోయినను బ్రహ్మతో సంయోగము గాని, ప్రకృతితో వియోగము గాని మోక్ష మనెడి వాదమును సరికాదు. సంయోగ వియోగములు కూడ కృతకము లగుటచే బ్రహ్మసంయోగము గాని, ప్రకృతి వియోగము గాని రెండును అనిత్యములే యగును.

జీవుడు సంసారమునుండి విడివడి పరమాత్మ యొద్దకు బోవుటగాని, లేక పరమేశ్వరుడే భక్తానుగ్రహార్థమై భక్తుల కడకు వచ్చుటగాని మోక్ష మని చెప్పుటయు సరికాదు. ఏలయన, గమనము, ఆగమనము-ఇవికూడ క్రియలగుటచే కృతకములే యగుచున్నవి. కాన అనిత్యములగును. మఱియు కూటస్థులై నిర్వికారులగుటవలన జీవ పరమాత్మలకు గమన-ఆగమన రూపవికారముల జెప్పుట యుక్తము గాదు.

ఇక మా మతమున నిట్టి దోషములకు తావు లేదు. ఆత్మస్వరూపము నిత్యముకాన, నశింపనిది. కల్పితమగు నామ రూపాత్మక దృశ్యప్రపంచము మిథ్య యని యుపేక్షించుట వలన సర్వకాలనాధిష్ఠాన మగు స్వరూప పరిజ్ఞానమే మోక్షము.

స్వరూపస్యానిమిత్తత్వా త్సనిమిత్తా హి చాపరే।
అనుపాత్తం స్వరూపం హి స్వేనాత్యక్తం తథైవ చ॥ ४०

తా॥ ఆత్మస్వరూపమునకు గారణము లేదు; అనిమిత్తము, అనగా దేనినుండియు బుట్టదు. కాన నిత్యము. అవస్థాంతరములు గల వస్తువులన్నియు సనిమిత్తములు; అనగా కారణమునుండి పుట్టునవి. కాన అనిత్యములు. స్వరూపమను నది తనచే వలసినపుడు గ్రహించుటకుగాని విడిచిపెట్టుటకుగాని శక్యముగానిది. కాన నెవరికేని ఆత్మస్వరూపము హేయము గాని, ఉపాదేయము గాని కాదు. అట్లు హేయోపాదేయ రహితమగుటచే ఆత్మస్వరూపము నిత్యము.

స్వరూపత్వా న్న సర్వస్య త్యక్తుం శక్యో హ్యనన్యతః।
గ్రహీతుం వా తతో నిత్యోఽవిషయత్వా త్పృథక్త్వతః॥

తా॥ తనకంటె భిన్నమయిన వస్తువును అనగా తనకు స్వరూపము కానిదానిని (విషయమును) త్యజించుటకుగాని,

గ్రహించుటకుగాని శక్యమగును. ఆత్మస్వరూపము తనకంటె వేఱుకానందున (విషయముకానందున) దానిని గ్రహించుటకు గాని, స్వరూపమే యగుటజేసి త్యజించుటకుగాని శక్యము గాదు. అట్లు ఆత్మ తనకంటె వేఱుగా ఘటాదులవలె విషయము గానందున, విషయి యగు ఆత్మ నిత్యుడు.

ఆత్మార్థత్వాచ్చ సర్వస్య నిత్య ఆత్మైన కేవలః।
త్యజే త్తస్మాత్క్రియాః సర్వాః సాధనైః సహ మోక్షవిత్ ॥ ౫౩

తా॥ బాహ్యభోగ్యజాత మంతయు ఆగమాపాయి రూపము; అనగా వచ్చుచు బోవుచు నుండునట్టిది; అనిత్యము. ఈ భోగ్యజాత మంతయు ఆత్మార్థమే-ఆత్మభోగ్యమే. రజ్జువు నలదధ్యస్తమైన సర్పమునకు స్వరూపము రజ్జువే యగునట్లు ఆత్మ యందధ్యస్తమగు భోగ్యజాతమునకు స్వరూపము ఆత్మయే. అట్లు స్వరూపభూతు డగుటజేసి, కేవలుడగు ఆత్మ (ఉపాధిరహితుడగు ఆత్మ) ఆగమాపాయిస్వరూపుడు కాడు; అభోక్త; కాన నిత్యుడు. అట్లు సర్వమునకు స్వరూపభూతు డగు ఆత్మ నిత్యుడు; తద్భిన్న మనిత్యము, ఆత్మార్థమగుట జేసి యాత్మభిన్నమగు సర్వమును ఆత్మస్వరూపముగ భావించుటయే-అనగా,ఆత్మస్వరూపానుస్థానమే మోక్షమని సిద్ధించినది.కాన, ఆత్మజ్ఞాని యగు ముముక్షువు. సాధనములతో పాటు సర్వకర్మసంన్యాస మొనర్పవలయును.

ఆత్మలాభః పరో లాభ ఇతి శాస్త్రోపపత్తయః।
అలాభోఽనాత్మలాభస్తు త్యజే త్తస్మా దనాత్మతామ్॥

తా॥ 'ఆత్మలాభా న్నపరం విద్యతే (ఆప.ధ.1.22.2 'ఆత్మలాభము కంటె మించిన లాభము లేదు'-అని యి రీతిగా శాస్త్రముల వలనను, సర్వస్వము త్యాగము చేసి యైనను ఆత్మసంరక్షణమందందఱు ప్రవృత్తు లగుచు మున్నగు నుపపత్తులవలనను ఆత్మలాభము మహాలాభ మని తెలియ చున్నది.

అయితే, ఆత్మలాభము నిత్యసిద్ధమై యుండ నది యపూర్వప్రాప్తి యెట్లగును? దానికై యితరబోధ యేల? యని యనరాదు. ఆత్మస్వరూపజ్ఞానము లేకపోవుటచే దేహేంద్రియాహంకారాదుల యందు అభేదభావనచే ఆత్మ బుద్ధి కలుగును. ఇవి ఆత్మకంటె భిన్నములు గాన, వాని యందు స్ఫురించెడి యాత్మలాభము అనాత్మలాభమే యగును. అనాత్మలాభము లాభము కాదు. స్వతఃసిద్ధ పరమానందావిర్భావ ప్రతిబంధకమై సంసారదుఃఖహేతు వగుచున్నది గాన, నష్టదాయకమే. కాన, అనాత్మలగు అహంకారాదులయందు అవిద్యచే గల్పింపబడిన యాత్మాభి మానమును ప్రమాణజనిత బ్రహ్మాత్మజ్ఞానముచే విడువ వలయును.

## సాంఖ్యమతఖండనము

గుణానాం సమభావస్య భ్రంశో న హ్యుపపద్యతే।
అవిద్యాదేః ప్రసుప్తత్వాన్న చాన్యో హేతు రుచ్యతే॥
౮౫

అవ :- ఆత్మతత్త్వబ్రహ్మస్వరూపజ్ఞానమగు ఆత్మలాభమే పరమపురుషార్థము; జీవబ్రహ్మైక్య జ్ఞానము మోక్షసాధనము; ఆత్మ అద్వయానందరూపుడు; ఆత్మయందుగనపట్టు సంసారమజ్ఞానమూలము గాని, పరమార్థము గాదు అని స్వమతమును నిరూపించి, ముముక్షువులకు చిత్తదార్ఢ్యము గలుగుటకొఱకై మతాంతరనిరాకరణము జేయబూని భాష్యకారులగు శ్రీశంకర భగవత్పాదులు మొదట సాంఖ్యమతమును ఖండించుచున్నారు.

తా॥ సృష్టికి బూర్వముండెడి సత్త్వరజస్తమోరూప గుణములయొక్క సామ్యావస్థకు భ్రంశము గలుగుట దుర్ఘటము. కాన, ఉపపన్నము గాదు. మఱియు సృష్టికి బూర్వము అవిద్యాదులు స్వకారణములందు లీనములై యుండును. వీనికంటె భిన్నుడగు పురుషు డుదాసీనుడు. కాన జగదుత్పత్తికి గారణము గాజాలడు. కాన, సాంఖ్యసిద్ధాంతము ననుసరించి సృష్టి జరుగుట యసంభవము.

వి :-- ప్రధానము జగత్కారణము. ఇది స్వతంత్రము; అచేతనము; సత్త్వరజస్తమోరూప త్రిగుణాత్మకము. గుణముల యొక్క సామ్యావస్థయే ప్రలయము. పురుషు డుదాసీనుడు. పురుషునకు భోగమును మోక్షమును గల్పించుటకై ప్రధానము మహదహంకారాది రూపమున బరిణమించును-అని సాంఖ్య మతము. ఇది యుక్తము గాదు. గుణములు సామ్యావస్థను విడిచి మహదాదిరూపమున బరిణమించు నని చెప్పుచో, గుణ పరిణామము నిర్హేతుకమా? సహేతుకమా? యని పరిశీలింప వలసినది. నిర్హేతుకమని చెప్పుచో-అనగా సామ్యావస్థ గల ప్రధానము నిర్హేతుకముగనే పరిణమించునని చెప్పుచో నది సర్వదా పరిణమించుచునే యుండవలెను. కాని, యది సర్వదా పరిణమించుట లేదు. కనుక, సహేతుకముగ పరిణమించునని చెప్పుచో అవిద్యా పురుషులు కారణ మగుదురా? ప్రకృతి పరిణమించుటకు బూర్వమే దానియందు అవిద్య లీనమై యుండును. కాన, నది కారణము గాదు. అవిద్యకంటె భిన్నులగు పురుషు లుదాసీనులు. కాన, గుణపరిణామమునకు వేఱు కారణమే లేదు. అచేతనమగు ప్రధానమే స్వతంత్రము గనుక సాంఖ్యులీశ్వరుని జగత్కారణముగా జెప్పరు. కనుక, సాంఖ్యసిద్ధాంతానుసారము సృష్టి జరుగుట యసంభవము.

ఇతరేతరహేతుత్వే ప్రవృత్తిః స్యాత్సదా న వా।
నియమో న ప్రవృత్తీనాం గుణేష్వాత్మని వా భవేత్॥
౨౬

తా॥ గుణములే పరస్పరప్రవృత్తిహేతువు లనియు జెప్పరాదు. అట్లు చెప్పుచో వానిని బ్రవర్తింపజేయు కారణాంతరము లేనందున సర్వదా పరిణామము జరుగవలెను; లేదా, జరుగకపోవలెను. ఉత్పత్తిస్థితి సంహారము లోకే కాలమున జరుగవనెడి ప్రసిద్ధిని బట్టి క్రమముగ నియమబద్ధముగ బరిణామము జరుగుననుటయు యుక్తము గాదు. ఏలయన, గుణ పురుషాతిరిక్త మయిన మఱియొక తత్త్వమును వారంగీకరింపరుగాన, నట్లు క్రమబద్ధముగ గుణములను గాని, పురుషులనుగాని నియమించు కారణాంతరము లేదు.

విశేషో ముక్తబద్ధానాం తాదర్థ్యే న చ యుజ్యతే।
అర్థార్థినో స్త్వసంబంధో నార్థీ స్థో నేతరోఽపి వా॥ ౪౭

తా॥ ప్రధాన మెట్లనను బరిణమించుగాక! ప్రధానము పురుషునియొక్క భోగమోక్షాదుల కొఱకు ప్రవర్తించు ననుటయు సరిగాదు. ఒకే ప్రధానము పురుషులందఱకు సమానము; అట్టి ప్రధానముయొక్క ప్రవృత్తిచే పురుషులందఱు సర్వదా సంసారబద్ధులైన కావలెను; లేదా, ముక్తులైన గావలెను. అట్టిచో బద్ధముక్తవ్యవస్థ కుదురదు. మఱియు ప్రధానము పురుషునికొఱకు బ్రవర్తించుననిన, వీరిలో అర్థియెవరు? ప్రధానమా? పురుషుడా? ఏ వస్తువు నభిలషింతుమో, యా వస్తువునకు అర్థము లేక శేష మని పేరు.

దాని నభిలషించు పురుషుడు అర్థి లేక శేషి యగును. ఆ రెంటికిని ఉపకార్యోపకారకభావము సంబంధము. పురుషుడు జ్ఞానైకస్వభావుడు, అసంగుడు, నిర్వికారుడు నగుటచే పురుషుని అర్థి యన జెల్లదు. జడ మగుటచే ప్రధానమును అర్థి యన వలనుపడదు. కాన ప్రధానపురుషులకు ఉపకార్యోపకారకభావము ఘటింపదు.

ప్రధానస్య చ పారార్థ్యం పురుషస్యావికారతః ।
న యుక్తం సాంఖ్యశాస్త్రేఽపి వికారేఽపి న యుజ్యతే ॥
४८

అవ :- ప్రధానము పురుషునికొఱకు ప్రవర్తించుట నంగీకరించి వ్యవస్థ కుదురదని చెప్పబడినది. ఇపుడు ప్రధానము పురుషుని కొఱకు ప్రవర్తించుటయే యుపపన్నము గాదని చెప్పబడుచున్నది.

తా॥ పురుషుడు నిర్వికారుడు. అట్టి పురుషునియందు ప్రధానముచే గల్పింపబడెడి యతిశయ (విశేష)రూప వికార సంబంధము లేదు. కాన, నిర్వికారుడగు పురుషునికొఱకై ప్రధానము ప్రవర్తించుట సంభవము గాదు. నిర్వికారుడగుట చేతనే పురుషునకు ప్రధానముపై స్వామిత్వమును లేదు. అచేతనమగుటచే ప్రధానము భృత్యునివలె పురుషునకు సుఖ దుఃఖములను సంపాదించుటయును లేదు. స్వామిత్వము సిద్ధించుటకై పురుషునకు వికారిత్వము జెప్పుదువో, వికారి

యగుటచే పురుషునకు అనిత్యత్వము వాటిల్లును. అనిత్యుడగు పురుషునకు నిత్యమగు ప్రధానముపై స్వామిత్వము సిద్ధింపదు. అనిత్యుడగుటచేతనే ప్రధానమునకు పురుషార్థమై ప్రవృత్తియు సంభవింపదు.

వి :- 'సాంఖ్యశాస్త్రేఽపి' యని 'అపి' శబ్దస్వారస్యము వలన సాంఖ్యశాస్త్రమునందు వలెనే పురుషకల్పితములగు నితరశాస్త్రములందును వేదమూలత్వము లేదని సూచింపబడినది.

సంబంధానుపపత్తేశ్చ ప్రకృతేః పురుషస్య చ ।
మిథోఽయుక్తం తదర్థత్వం ప్రధానస్యాచితిత్వతః ॥ ౪౯

తా॥ పురుషుడు అసంగుడు; ఉదాసీనస్వభావుడు; ప్రకృతి జడము, స్వయంప్రవృత్తి లేనిది. అట్టి ప్రకృతిపురుషులకు పరస్పరసంబంధము సంభవింపదు గనుక, ప్రకృతికి పురుషుని నిమిత్తమై ప్రవృత్తి యసంభవము కావుననే ప్రకృతి పురుషులకు అర్థార్థిభావము (స్వస్వామిభావము) ను గల్పింపరాదు.

క్రియోత్పత్తౌ వినాశిత్వం జ్ఞానమాత్రే చ పూర్వవత్ ।
నిర్నిమిత్తే త్వనిర్మోక్షః ప్రధానస్య ప్రసజ్యతే ॥ ౫౦

తా॥ పురుషుడు నిత్యుడని సాంఖ్యసిద్ధాంతము. అట్టి పురుషునియందు ఏదేని క్రియ బుట్టునని చెప్పినచో, 'క్రియా

యుక్తమగునది యంతయు ఘటమువలె అనిత్యమగును' (యత్ క్రియావత్, తదనిత్యం, యథా ఘటాది) – అనెడి న్యాయము ననుసరించి క్రియాయుక్తుడగు పురుషునకు వినాశిత్వము (అనిత్యత్వము) సంభవించును. కాని సాంఖ్య సిద్ధాంతవిరోధము కలుగును. 'అనిత్యత్వము ప్రసక్తించుటచే పురుషునియందు చలనక్రియగాని, పరిణామముగాని చెప్పము; జ్ఞానక్రియమాత్ర ముండునని చెప్పెద' మనుటయు తగదు. జ్ఞానము జన్యమా ? నిత్యమా ? జన్య మనుచో, జన్యజ్ఞాన క్రియాసంబంధముచే పూర్వమువలెనే పురుషునకు అనిత్యత్వ దోషము ప్రసక్తించును. నిత్య మనుచో, నిత్యజ్ఞానయోగము వలన పురుషుడు కూటస్థుడు (నిర్వికారుడు) అగును. అట్టితరి ప్రధానము యొక్క ప్రవృత్తిచే పురుషున కెట్టి యుపకార ముండదు.

ప్రధానము నిర్నిమిత్తముగనే ప్రవర్తించునని చెప్పుచో ప్రధానము సర్వదా యందఱి పురుషులనుగూర్చి ప్రవర్తించు చుండును. గనుక, పురుషులకు ప్రకృతినుండి విముక్తి (మోక్షము) యెన్నటికిని గలుగనేరదు.

## వైశేషికమతఖండనము.

స ప్రకాశ్యం యథోష్ణత్వం జ్ఞానేనైవం సుఖాదయః ।
ఏకనీడత్వతోఽగ్రాహ్యాః స్యుః కణాదాదివర్త్మనామ్ ॥ ౫౧

అవ :- పురుషుడు నిర్గుణుడనెడి సాంఖ్యమతమును నిరాకరించి పురుషులు సగుణులనెడి వైశేషికమతము నిరాకరింపబడుచున్నది.

తా॥ ఆత్మయందు జ్ఞానసుఖాదిగుణములు గలవు. ఆత్మగతజ్ఞానము చేత సుఖాదిగుణములు ప్రకాశింపజేయబడు నని వైశేషికులు చెప్పుదురు. అది సరి కాదు. అగ్నిగతమైన ప్రకాశముచేత అగ్నిగతమగు నుష్ణత్వము తెలియజేయబడదు. అట్లే ఆత్మగతమైన జ్ఞానముచేత ఆత్మగతములగు సుఖాదులు తెలియజేయబడవు.

జ్ఞానము విషయి, సుఖాదులు విషయములు. విషయి విషయములు భిన్న దేశములందున్నపుడు ఇది గ్రహించునది (విషయి),ఇది గ్రహింపబడినది (విషయము) అను భేదము నియమముగా భాసించును. అవి(విషయి విషయములు) ఒకే దేశమున నున్నచో,(ఏకాశ్రయములగుచో) నాభేదము నియమముగా భాసింపదు. కాన,అగ్నిగతములగు ఉష్ణత్వ-ప్రకాశములకు ప్రకాశ్య-ప్రకాశక భావము లేనట్లు ఆత్మగతములగు జ్ఞాన-సుఖాదులకు గ్రాహ్య-గ్రాహక భావము ఉపపన్నము గాదు. కాన, వైశేషికమత మాదరణీయము గాదు.

యుగపత్సమవేతత్వం సుఖవిజ్ఞానయోరపి।
మనోయోగైక హేతుత్వా దగ్రాహ్యత్వం సుఖస్య చ॥

తా॥ (పూర్వశ్లోకమునుండి 'న' అను పదము నిట నన్వయింపవలెను). మనస్సు ఆత్మతో జేరినపుడే (సంయోగము జెందినపుడే) ఆత్మయందు జ్ఞానసుఖాదిగుణములు కలుగును. ఆత్మయందలి జ్ఞానసుఖాదిగుణములకు మనఃసంయోగము అసమవాయికారణము. జ్ఞానాసమవాయికారణమగు మనఃసంయోగముచే సుఖ మనెడి గుణము గలుగదు. అట్లే సుఖాసమవాయికారణ మనఃసంయోగముచే జ్ఞానము గలుగదు. సుఖాసమవాయికారణమగు మనఃసంయోగము నశించినంతనే సుఖము నశించును. అట్లే జ్ఞానాసమవాయికారణ మనఃసంయోగనాశముచే జ్ఞానము నశించును. ఇట్లు భిన్నభిన్న మనఃసంయోగము లసమవాయికారణములుగా గల సుఖజ్ఞానగుణము లాత్మయం దొకే కాలమున సమవేతములై యుండవు గనుక, జ్ఞానముచే సుఖము గ్రాహ్యము గాదు.

వి :- పై శ్లోకమున 'అపి' శబ్దస్వారస్యముచే వైశేషికులు చెప్పు సమవాయికారణము ప్రామాణికము గాదనుట సూచితము. మఱియు సావయవములకు సంయోగము గలుగునుగాని నిరవయవములకు గాదు. ఆత్మ విభువు (సర్వవ్యాపకము) అగుటచే నిరవయవము, మనస్సు అణుపరిమాణము గలది యగుటచే నిరవయవము. నిరవయవములగు ఆత్మలకువలె ఆత్మ మనస్సులకును సంయోగము సంభవము గాదు. ఒకవేళ సంభవమైనచో తిరిగి వానికి విభాగము సంభవము

గాదు. విభాగము లేనిచో ఆత్మమనస్సు లెప్పుడు కలిసియే (సంయోగము చెందియే) యుండవలెను. ఉండుచో భిన్న భిన్న మనఃసంయోగములు లేనందున పైన జెప్పినట్లు ఆత్మయందు జ్ఞానసుఖాది గుణములు గలుగ నేరవు–అదియునుగాక, కార్యము అసమవాయి కారణమును మీరి యుండదనుట యన్యమతమున సిద్ధమై యుండుటచే–జ్ఞానసుఖాదులును తమకు అసమవాయికారణములగు మనఃసంయోగ (దేశ)ములనతిక్రమించి యన్యత్ర గలుగజాలవు. మనస్సు అణుపరిమాణము గనుక మనఃసంయోగము వలన గలిగెడి జ్ఞానసుఖాదులును తత్తదణు మనః సంయోగ ప్రదేశమాత్ర పరిమితములు గావలెను. అట్టితరి సకల శరీరవ్యాప్తమై శీతోష్ణస్పర్శాదిజ్ఞానము గలుగకపోవలెను. అది ప్రత్యక్షవిరుద్ధము–మున్నగు దోషములు వైశేషిక సిద్ధాంతమున గలవనుట 'చ' శబ్దము వలన సూచితము.

తథాఽన్యేషాం చ భిన్నత్వా ద్యుగపజ్జన్మ నేష్యతే।
గుణానాం సమవేతత్వం జ్ఞానం చేన్న విశేషణాత్॥ ౫౩

తా॥ సుఖజ్ఞానములే కాక, ఆత్మయందలి యితర గుణములును పరస్పర విలక్షణములగుటచే వానికి భిన్నభిన్న మనః సంయోగములు అసమవాయికారణము లుండవలెను.
శం. ర. 13-33

ఒకే మనఃసంయోగమనేక గుణములకు కారణము గాజాలదు. కాన, నీ గుణములును సుఖజ్ఞానములువలె నొకేకాలమున నాత్మయందు సమవేతములై యుండజాలవు. మఱియు నేకాశ్రయములగుటచే నవియు సుఖము వలెనే జ్ఞానముచే ప్రకాశింపజేయబడవు. సుఖాదులు జ్ఞాన భాస్యములు (జ్ఞానముచే దెలియజేయబడునవి) కాకపోనిమ్ము. ఒకే యాత్మయందు అవి సమవేతములై యుండుటయే జ్ఞానమనియు చెప్పరాదు. 'జ్ఞాతం సుఖం' (సుఖము దెలియబడినది), జ్ఞాతం దుఃఖం (దుఃఖము తెలియబడినది) అనెడి శిష్టవ్యవహారము ననుసరించి సుఖదుఃఖాదులు జ్ఞానభాస్యము లగుట లోకసిద్ధము. కావున నవి యాత్మసమవేతములై యుండుటయే జ్ఞానము గాదు.

జ్ఞానేనైవ విశేష్యత్వా జ్జ్ఞానాప్యత్వం స్మృతే స్తథా।
సుఖం జ్ఞాతం మయేత్యేవం తవాజ్ఞానాత్మకత్వతః॥ 28

తా॥ 'సుఖం జ్ఞాతం, దుఃఖం జ్ఞాతం'–అను వ్యవహారమున సుఖదుఃఖములు విశేష్యములు; జ్ఞానము విశేషణము. ఇట్లు సుఖదుఃఖాదులు జ్ఞానవిశేష్యములుగనే భాసించుటచే నవి జ్ఞానభాస్యములని చెప్పవలెను.

ఇంతియే కాదు. 'మయా సుఖం జ్ఞాతం' అని యీ రీతిగా జ్ఞాతసుఖాదివిషయక స్మృతి గలుగుచుండును గాన

సుఖాదులు స్మృతిభాస్యములని జెప్పవలెను. స్మృతియు జ్ఞానమే యగుటజేసి స్మృతిభాస్యములైన సుఖాదులును జ్ఞానభాస్యములే యగుచున్నవి. మఱియు సుఖాదులు జ్ఞానవిశిష్టమగు ఆత్మయందు సమవేతములై యుండుటయే జ్ఞానము-అను వాదమును సరికాదు. క్షణికవిశేషగుణములగు సుఖాదులాత్మయందొకే కాలమున నుండవని పైన జెప్పబడినది. ఇంటిలో దీపము వెలిగించినంతనే, పదార్థము లన్నియు భాసించునట్లు ఆత్మయందు జ్ఞానము భాసించినంతనే, యాత్మయందుండునని చెప్పబడెడి సంఖ్యాపరిమాణాది గుణములు గూడ సుఖాదులతోపాటు భాసింపవలసివచ్చును. అట్లు గాక, జ్ఞానవిశిష్టముగాని ఆత్మయందు సమవేతములగు సుఖాదులు భాసింపనే భాసింపవు. ఏలన, నైయాయికమతమున ఆత్మ జ్ఞానభిన్నమని చెప్పుటచే జ్ఞానభిన్నములగు ఘటాదులవలెనే ఆత్మయు జడ మగును. అట్టి జడమగు ఆత్మయందు సమవేతము లయినంతమాత్రమున సుఖాదులు భాసింపనేరవు.

సుఖాదే ర్నాత్మధర్మత్వ మాత్మన స్తేఽవికారతః।
భేదా దన్యస్య కస్మాన్న మనసో వాఽవిశేషతః॥ ౫౫

అవ :_ సుఖాదులాత్మగుణము లని యంగీకరించి వానికి భాస్యభాసక భావము పొసగదని చెప్పబడినది; ఇపుడు సుఖాదు లాత్మగుణములని చెప్పుటయే పొసగదని చెప్పబడుచున్నది.

తా॥ నీ మతమున ఆత్మలు అన్నియు విభువులు (సర్వ వ్యాపకములు) అగుటచే నిత్యములు. అనగా వికారము లేనివి. సుఖాదు లాత్మధర్మములనుచో నాత్మ వికారి కావలయును. ఆత్మ వికారి యగుట నీ మతము ననుసరించి యుక్తము గాదు. మీ మతమున ఆత్మ నిత్య మగుటచే, నిత్యమగు ఆత్మయొక్క గుణ మనిత్యమని చెప్పుటకు దగిన దృష్టాంతము లేదు. కాన, సుఖాదులాత్మ ధర్మము లనుట తగదు; అవి యాత్మధర్మములే కానపుడు వానికి గ్రాహ్యగ్రాహకభావ మెక్కడిది?

మఱియు ఆత్మలకు నానాత్వము,విభుత్వము నంగీకరించి వానికి గుణవత్త్వము (సుఖాదిగుణములు గలిగియుండుట) నంగీకరించుట యుక్తము కాదు. మీ మతమున గుణములకును, గుణికిని(గుణములు గల వస్తువునకును)అత్యంతము భేదము నంగీకరింతురు. [1] మఱియు ఆత్మకు నే శరీర సంబంధము వలన సుఖదుఃఖాదులు గలుగునో, యా శరీరమునందాత్మ లన్నియు విభువులగుటచే సన్నిహితములై యుండును. అవి పరస్పర భిన్నము లయ్యును వానికి గల పరస్పరభేద మటు భాసింపదు. అట్టితరి యా శరీరమున గలిగెడి సుఖాదు లీ యాత్మకు సంబంధించినవి; ఆ యాత్మకు సంబంధింపవు-అని చెప్పుట యెట్లు?

1. ఘటరూపము ఘటము కంటె భిన్నము; అట్లే ఆత్మగతసుఖాది గుణములు గుణి యగు నాత్మకంటె భిన్నములు. కాన గుణములకును, గుణికి నత్యంతభేద మావశ్యకమని భావము.

అట్లు చెప్పుటకు నియామక కారణము లేనందున నొక శరీరమున గలిగెడి సుఖదుఃఖాద్యనుభవము లన్ని శరీరముల యందును గలుగవలసియుండును. అట్లుగాక సుఖదుఃఖాది ప్రతీతికి (పైన చెప్పినట్లు) మనఃసంయోగము కారణము గాన మనఃసంయోగభేదమే యన్యశరీరములందు సుఖదుఃఖాది ప్రతీతి కలుగకుండుటకు నియామక కారణ మనియెదరేమో! మనస్సునందును ఆత్మలన్నియు సన్నిహితములయి యుండును గదా! మనఃసంయోగభేద మెట్లు సిద్ధించును? కాన నదియు నియామకము గాజాలదు. అదృష్ట మాత్మధర్మము గాదు. కనుక నదియు నియామకము గాదు. మఱియు అదృష్ట (ధర్మాధర్మ) హేతుప్రయత్నాదు లన్నియు మనఃసంయోగ మూలములు. పైన చెప్పినట్లు మనఃసంయోగము సర్వాత్మల యందవిశిష్టమై యుండుటచే మనఃసంయోగమూలమగు అదృష్టమునకును ఆశ్రయవిశేషసిద్ధి యెట్లు కలుగును? ఇట్లు నియామక కారణము లేనందున నొక శరీరమున గలిగిన సుఖాదిప్రతీతి శరీరాంతరమున గూడ గలుగవలసియుండును. అనగా ఈ యాత్మయందే యీ సుఖాదిప్రతీతి; ఆ యాత్మ యందు గాదు-అని నియామకము లేకుండబోవును. ఇంకను-, మనస్సు క్రియాశీల మగుటచే మూర్తము, నియమముగ సుఖ దుఃఖాదిప్రతీతిస్థానము నగుటచే సుఖదుఃఖాదులు ఆత్మ ధర్మములు గావు,మనోధర్మము లనియే యేల చెప్పరాదు? కాన సుఖాద్యులాత్మగుణము లనుట యుక్తము గాదు.

స్యాన్మాలాఽపరిహార్యా తు జ్ఞానం చే జ్ఞేయతాం వ్రజేత్।
యుగపద్వాఽపి చోత్పత్తి రభ్యుపేతాఽత ఇష్యతే॥ ౫౬

అవ :- జ్ఞానము జ్ఞానాంతరముచే భాసించును-అనగా జ్ఞానము గూడ జ్ఞేయ మగుననెడి వైశేషికమత మిపుడు నిరాకరింపబడుచున్నది.

తా॥ జ్ఞానము మఱియొక జ్ఞానముచే భాసించునని చెప్పుచో, భాసింపజేయు నాజ్ఞానము మఱియొక జ్ఞానముచేతను, అది మఱియొక జ్ఞానము చేతను-ఇట్లొకదాని చేత నింకొక జ్ఞానము భాసింపవలసినయెడ, అనవస్థ కలిగి జ్ఞానపరంపర (జ్ఞానమాల) అనివార్యమై నియమము లేకపోవలసివచ్చును. ఇట్లు భాసించు జ్ఞానములు, భాసింపజేయు జ్ఞానములు అనంతము లగును. అది యుక్తము కాదు. అనవస్థాదోషపరిహారమునకై భాస్య-భాసక జ్ఞానములు రెండు నొకేసారి యొకమనఃసంయోగము వలన గలుగునని చెప్పుచో నా మనఃసంయోగము వలననే శబ్ద స్పర్శ రూప రస గంధాది జ్ఞానము లన్నియు నొకేసారి గలుగవలసియుండును. ఉద్బోధకసామగ్రీసహిత సంస్కారవశమున కాలాంతరమున గలిగెడి స్మృతియునప్పుడే కలుగవలసివచ్చును. ఇట్టి దోషము లుండుటచే జ్ఞానము జ్ఞానాంతరముచే భాసించునని చెప్పరాదు.

వి :- జ్ఞానమునకు స్వతః ప్రామాణ్యము లేదు. 'అయం ఘటః' (ఇది ఘటము)-ఇది వ్యవసాయాత్మక జ్ఞానము. 'ఘట మహం జానామి'-ఇది అనువ్యవసాయజ్ఞానము. వ్యవసా యాత్మకజ్ఞానము, తద్గత ప్రామాణ్యము అనువ్యవసాయాత్మక జ్ఞానముచే గ్రహింపబడునని నైశేషికులు చెప్పుదురు.

అనవస్థాంతరత్వాచ్చ బన్ధో నాత్మని యుజ్యతే।
నాశుద్ధి శ్చాప్యసంగత్వా దసంగో హీతి చ శ్రుతేః॥ ౫౭

అవ :- ఆత్మకు చైతన్యము స్వరూపలక్షణమా? తటస్థ లక్షణమా? స్వరూపలక్షణ మగుచో పృథివ్యాదులయందు గంధాదులు నిత్యముగా నున్నట్లు ఆత్మయందును చైతన్యము స్వరూపభూతమై నిత్యముగా నుండవలెను. అట్టిచో 'ఆత్మా అనిత్యగుణః' (ఆత్మ అనిత్యగుణములు గలవాడు) అను వచన మసత్యమగును. అట్లుగాక, తటస్థలక్షణ మగునేని; ఆత్మవిలక్ష ణములగు (అనాత్మలగు) వానియందు లేని యాత్మస్వరూప లక్షణము నొకదానిని చెప్పవలయును. ఆత్మకు స్వరూపము చైతన్యము కంటె మఱియొకటి యేదియు లేదు. కనుక 'ఆత్మ దేహాది విలక్షణు'డని యంగీకరించువారందఱు 'ఆత్మ నిర్విశేష చైతన్యరూపుడు కూటస్థుడు' అని యంగీకరింపవలెను. అట్లు గానిచో 'వికారి యగు వస్తువు అనిత్యము గావలెన'నెడి నియ

పము ననుసరించి వికారి యగు ఆత్మయు అనిత్యుడు గావలెను. అట్లైనచో బంధము-మోక్షమును పొందు ఆత్మ యొకటే కలదని నిరూపింప శక్యముగాదని నిరూపింపబడుచున్నది.

తా॥ దేహమునకు వలె ఆత్మకు అవస్థాంతరములు లేనందునే ఆత్మకు వాస్తవమగు బంధము లేదు. బంధము ఆత్మ యందు కల్పిత మగుటచే మోక్షమును కల్పితమే గాని, వాస్తవము గాదు. 'అసంగో హ్యయమనాః శుభ్రః' అను శ్రుతి ప్రామాణ్యము ననుసరించి సంగరహితు డగుటచే ఆత్మకు స్వధర్మకృతబంధము లేనట్లు అన్యసంసర్గ కృతమగు ననుద్ధియు లేదు.

సూక్ష్మైకాగోచరేభ్యశ్చ న లిప్యత ఇతి శ్రుతేః॥ ౫౧

అవ :- ఆత్మకు బంధము పారమార్థికము గాదని నిరూపింపబడుచున్నది.

తా॥ సూక్ష్మ మనగా మనస్సుకు, వాక్కునకును గోచరము గానిది. ఏకత్వ మనగా అద్వితీయత్వము. అగోచరత్వ మనగా నిర్విశేషత్వము. 'న లిప్యతే లోకదుఃఖే న బాహ్యః' అను కాఠకశ్రుతియు నీ సూక్ష్మత్వాదిహేతువుల వలన ఆత్మ లోకదుఃఖములతో సంబంధము లేనివాడని చెప్పుచున్నది.

'యథా సర్వగతం సౌక్ష్మ్యాదాకాశం నోపలిప్యతే।
సర్వత్రావస్థితో దేహే తథాఽఽత్మా నోపలిప్యతే'॥
(భగ. 12-32)

అనెడి గీతావచనము నీ యర్థమునే బోధించుచున్నది.

ఏవం త్వర్థి న మోక్షోఽస్తి బంధాభావాత్కథంచన।
శాస్త్రానర్థక్యమేవ స్యాన్న బుద్ధేర్భ్రాన్తి రిష్యతే।
బన్ధో మోక్షశ్చ తన్నాశః స యథోక్తో నచాన్యథా॥ ౫౬

అవ :- ఆత్మ నిత్య శుద్ధ బుద్ధ స్వభావుడగుచో ఆత్మోపదేశశాస్త్రము నిష్ఫలమని పూర్వవాదు లాక్షేపించుచున్నారు.

తా॥ ఆత్మ నిత్యశుద్ధ స్వభావు డగుచో నట్టి యాత్మ కేవిధముగను బంధముండనేరదు గనుక, మోక్షమును లేదు. బంధ మున్నపుడుగదా మోక్షము! బంధమే లేనిచో మోక్షమును లేదు. బంధమోక్షములు లేనినాడు శాస్త్రోపదేశ మనర్థకము గదా!యని యాక్షేపించుటయు సరికాదు.

బుద్ధియొక్క భ్రాంతియే బంధము. ఆ భ్రాంతి నశించుటయే మోక్షము. అంతియేకాని బంధమోక్షములు పారమార్థికములు గావు. ఆ బంధము యొక్క స్వరూపము 'అజ్ఞానం కల్పనామూలం సంసారస్య నియామకమ్'-అని పూర్వము 17వ శ్లోకమున నిరూపింపబడినది. అజ్ఞాన కల్పిత భ్రాంతి

మూలము సంసారము గావున అజ్ఞాన కల్పిత భ్రాంతినివృత్త్యర్థమై శాస్త్రోపదేశ మావశ్యకమే యగునుగాని నిష్ఫలము గాదు.

బోధాత్మజ్యోతిషా దీప్తా బోధ మాత్మని మన్యతే।
బుద్ధి ర్నాన్యోఽస్తి బోద్ధేతి సేయం భ్రాన్తిర్హి ధీగతా॥ ౬౦

అవ :- చిద్రూపుడగు ఆత్మయందు అజ్ఞానమూలబుద్ధిధర్మాధ్యాసరూపమే బంధము-అని ప్రతిపాదింపబడుచున్నది.

తా॥ చైతన్యస్వరూపుడగు ఆత్మయొక్క జ్యోతిస్సు (ప్రకాశము) చిదాభాసము. చిదాభాసముచే (ఆత్మస్వరూప చైతన్య ప్రకాశముచే) వ్యాప్తమై ప్రకాశితమైన బుద్ధి తనను చైతన్యమని తలచును. నాకంటె వేఱుగా జ్ఞాత యగు సాక్షి లేడు; నేనే జ్ఞాతను'-అని యనుకొనును. చిదాభాసవిశిష్టమగు బుద్ధి ప్రకాశించుచుండగా చైతన్యమునకును బుద్ధికిని భేదము భాసింపనందున, 'నేను కర్తను, నేను బద్ధుడను-అని యీ రీతిగా కర్తృత్వ భోక్తృత్వాది రూపమగు సంసార మాత్మయందు భాసించును. కాన, సంసారము బుద్ధిగతభ్రాంతియే కాని యన్యము కాదు.

బోధస్యాత్మస్వరూపత్వా న్నిత్యం తత్రోపచర్యతే।
అవివేకోఽప్యనాద్యోఽయం సంసారో నాన్య ఇష్యతే॥ ౬౧

అవ :- ప్రతీతి ననుసరించి బుద్ధికి గల చైతన్యాత్మ కత్వము యథార్థ మేల కారాదను ప్రశ్నకు సమాధానము చెప్పబడుచున్నది.

తా॥ సుషుప్తియందు బుద్ధి లేకున్నను ఆత్మచైతన్యము భాసించుచునే యున్నది. చైతన్యము[బోధ] ఆత్మకు నిత్యము; బుద్ధికి ఆగంతుకము. అందుచే బుద్ధి జడమయినను ఆత్మ స్వరూపబోధయుక్తమై యవివేకము వలన తానే కర్తనని భావించును. ఈ యవివేకమునకు ఆది లేదు; అనాదిసిద్ధము. అవివేక మనాది యగుచో అనాద్యజ్ఞానకల్పిత మగు నీ యవివేకమే బ్రహ్మాత్మజ్ఞానముచే దొలగును గాని, సంసారము నివర్తింపదు-అని యనరాదు. కర్త్రాదిధర్మములు గల బుద్ధికంటె విలక్షణుడై సాక్షి యగు ఆత్మ గలడని తెలియకపోవుటయే (అవివేకమే) సంసారము.

మోక్షస్తన్నాశ ఏవ స్యా న్నాన్యోఽ స్త్యనుపపత్తితః।
యేషాం వస్త్వంతరాపత్తి ర్మోక్షో నాశస్తు తైర్మతః॥ ౬౨

తా॥ బంధము అజ్ఞానమూల మగుటకు ఫలము జ్ఞానముచే అజ్ఞానమును, హేయోపాదేయములు లేనందున అజ్ఞానకార్య మగు ఆధ్యాసిక బంధమును నివర్తించుటయే మోక్షము. అట్లు గాక ఆత్మస్వరూపమునకు వస్త్వంతర భావము [అన్యథా భావము] మోక్షమని చెప్పుచో వారి మతమున ఆత్మనాశమే

మోక్షమని చెప్పవలసియుండును. అట్లు చెప్పుట సరికాదు. వస్తువున్నంతకాలము నదిమఱియొక వస్తువుగ మాఱనేరదు. మాఱే వస్తువు నశించుచో మొదటి వస్తువు లేనేలేదు.ఇక వస్త్వంతరముగా మాఱుపొందుట యెట్లు?'వస్త్వంతరాపత్తి'యన వస్త్వంతరప్రాప్తి యను నర్థము వివక్షితమగుచో నిదియు సరికాదు. 'సంయోగా విప్రయోగాన్తాః'[స్త్రీ పర్వ.2. 3; మోక్ష పర్వ. 338. 20 మొ॥] అను న్యాయము ననుసరించి వస్త్వంతర ప్రాప్తియు కృతకమగును. కృతకము[చేయబడినది]అనిత్యమగు నను వ్యాప్తి ననుసరించి మోక్షమును అనిత్యము గావలెను.

అవస్థాంతర మప్యేవ మవికారాన్న యుజ్యతే।
వికారేఽవయవిత్వం స్యాత్తతో నాశో ఘటాదివత్॥ ౯౩

అవ :- వస్త్వంతరాపత్తియే మోక్ష మను పక్షమున జెప్పబడిన అనుపపత్తి-అనిత్యత్వ దోషములే ఆత్మకు అవస్థాంతరప్రాప్తియే మోక్ష మను పక్షమునను గలుగునని, చెప్పబడుచున్నది.

తా॥ వికారరహితుడగుటచే ఆత్మకు అవస్థాంతరప్రాప్తి యుక్తము గాదు. వికారసహితుడని చెప్పుచో ఆత్మకు సావయవత్వమును, సావయవత్వము వలన ఘటాదులకు వలె నాశ

మును అనివార్యమగును. కాన, భ్రాంతిమాత్రనివృత్తియే మోక్షము.

తస్మాద్భ్రాన్తిరతోఽన్యా హి బంధమోక్షాదికల్పనాః।
సాంఖ్యకాణాదబౌద్ధానాం మీమాంసాహతకల్పనాః॥ ౬౪

శాస్త్రయుక్తివిహీనత్వా న్నాదర్తవ్యాః కదాచన।
శక్యంతే శతశో వక్తుం దోషా స్తాసాం సహస్రశః॥ ౬౫

తా॥ ఇట్లు విచారాసహములు, యుక్తిదూరములు, శ్రుతివిరుద్ధములు నగుటచే సాంఖ్య కాణాద బౌద్ధుల బంధ మోక్షాది కల్పనలు ముముక్షువులచే నాదరణీయములు గావు. ఆ వాదములందెన్నియేని దోషముల నిట్లు జూపనగును. కాన, పరిశేషన్యాయము ననుసరించి ఆత్మయందు బంధమోక్ష ప్రతిభాసము భ్రాంతియే యనెడి వేదాన్తిసంమతమగు వాదము శ్రుత్యాద్యవిరుద్ధ మగుటచే ముముక్షువులచే నాదర్తవ్యము.

అపి నిందోపపత్తేశ్చ యాన్యతోఽన్యాని చేత్యతః।
త్యక్త్వాఽతో హ్యన్యశాస్త్రోక్తే ర్మతిం కుర్యా ద్దృఢాం బుధః॥ ౬౬

తా॥ సాంఖ్యకాణాదాది వేదబాహ్యమతములు యుక్తిదూరములు, విచారాసహము లగుటయేకాక నింద్యము లని స్మృత్యాదులయందు చెప్పఁబడినవి. ఎట్లన

"యాన్యతోఽన్యాని శాస్త్రాణి పృథివ్యాం వివిధాని వై।
శజ్కనీయాని విద్వద్భి ర్ధర్మశుద్ధి మభీప్సుభిః॥
[మను. 12. 95]

"యా వేదబాహ్యాః స్మృతయో యాశ్చ కాశ్చ
కుదృష్టయః।
సర్వాస్తా నిష్ఫలాః ప్రేత్య తమోనిష్ఠా హి తాః స్మృతాః॥
[సూతసంహిత. 2-14-18]

ఇట్లు నింద్యములని కీర్తింపబడుటచే సాంఖ్యకాణాదాది మత ప్రతిపాదిత బంధమోక్షాది కల్పనల నాదరింపక వానిని విడిచి వేదాంత శాస్త్రమునందే దృఢమగు నిశ్చయమును గలిగి యుండవలెను.

శ్రద్ధాభక్తీ పురస్కృత్య హిత్వా సర్వ మనార్జవమ్।
వేదాంతస్యైవ తత్త్వార్థే వ్యాసస్యాభిమతే తథా॥ 62

తా॥ శ్రుతిప్రతిపాదితార్థమునందు విశ్వాసము శ్రద్ధ. తత్పరత్వము భక్తి. అట్టి శ్రద్ధాభక్తులు గలిగి త్రికరణ శుద్ధితో భగవద్వేదవ్యాసప్రతిపాదిత వేదాంతశాస్త్రము నాదరింపవలెను.

ఇతి ప్రణున్నా ద్వయవాదికల్పనా
నిరాత్మవాదాశ్చ తథాహి యుక్తితః।

వ్యపేతశంకాః పరవాదతః స్థిరా
ముముక్షవో జ్ఞానపథే స్యు రిత్యుత॥ ౯౦

అవ:- ఇట్లు పరపక్ష నిరాకరణమును జేసిన తరువాత దానికి ఫలము చెప్పబడుచున్నది.

తా॥ ముముక్షువులు పరశాస్త్రములు ప్రామాణికములు గావచ్చు ననెడి శంకను వీడి వేదాంత ప్రతిపాదిత జ్ఞాన మార్గమున సుస్థిరులై యుండగలరనెడి తలంపుతో యుక్తులతో సాంఖ్యకణాదాదుల భేదవాదకల్పనలు, బౌద్ధుల నిరాత్మ (శూన్య) వాదములు ఖండింపబడినవి.

స్వసాక్షికం జ్ఞాన మతీవ నిర్మలం
వికల్పనాభ్యో విపరీత మద్వయమ్।
అవాప్య సమ్యగ్యది నిశ్చితో భవేత్
నిరన్వయో నిర్వృతి మేతి శాశ్వతీమ్॥ ౯౧

అవ :- వేదాంతవిహిత బ్రహ్మాత్మజ్ఞానమే పురుషార్థ సాధనము; అందుచే తత్స్వరూప నిరూపణ పూర్వకముగ ముముక్షువులకాత్మ నిష్ఠత్వ ముపదేశింపబడుచున్నది.

తా॥ ప్రత్యక్షాదిప్రమాణగోచరము గాక స్వసంవేద్యము, ఉపాధిదోషరహితమగుటచే నత్యంత నిర్మలము,

వికల్పనావిలక్షణము, అద్వయము (అఖండవస్తుమాత్రము) నగు జ్ఞానమును బొంది అజ్ఞాన తత్కార్యసంబంధవినిర్ముక్తుడై అఖండానందానుభవ స్వరూపావిర్భావము[శాశ్వతానందము] నొందును.

ఇదం రహస్యం పరమం పరాయణం
వ్యపేతదోషై రభిమానవర్జితైః।
సమీక్ష్య కార్యా మతి రార్జవే సదా
న తత్త్వదృక్ స్యాదన్యమతిర్హి కశ్చన॥ ౭౦

తా॥ "శాశ్వతమగు అఖండానందానుభవ స్వరూపావిర్భావము కలుగు"నని యీ విషయము గురూపదేశైకగమ్యమగుటచే రహస్యము; ఇది పరమాత్మ తత్త్వప్రకాశమగుటచే సత్యోత్తమము; నిరవధికము; సర్వాశ్రయము. ఇట్టి యాత్మజ్ఞానమును సమ్యగ్విచారముచే దృఢపఱచి బహిర్ముఖములగు ఇంద్రియములను మఱలించి పాండిత్యాదుల వలన గలిగెడి 'నేను పండితుడను'-ఇత్యాద్యభిమానముల విడిచి శమదమాది సంపన్నులై సత్వసమరూపమగు బ్రహ్మాత్మతత్త్వమందు సర్వదా నిష్ఠితులై యుండవలె. అట్లుగాక ప్రత్యగాత్మకంటె భిన్నమగు వస్తువు బ్రహ్మ యని తలచి యట్టి బ్రహ్మయందు చిత్తమును నిలుపువారు తత్త్వజ్ఞులు కారు.

వి :- బ్రహ్మ నిర్విశేషస్వరూపుడు. కాన సర్వత్ర ఏకరూపుడు. అందుచే 'ఋజు' వనబడును. అట్టి బ్రహ్మ స్వరూపము ఆర్జవ మనబడును. అట్టి బ్రహ్మతో ప్రత్యగాత్మకు ఐక్యమును సమ్యగ్విచారముచే దృఢపరచుకొనువాడు తత్త్వజ్ఞాని. అట్లుగాక ఆత్మేతర దేవతోపాసన జేయువాడు (బహిర్దృష్టికలవాడు) తత్త్వజ్ఞాని కాడు.

"తదేవ బ్రహ్మ త్వం విద్ధి నేదం యదిద ముపాసతే"
కేన. 4, 5, 6, 7

"అథ యోఽన్యాం దేవతా ముపాస్తేఽన్యోసావన్యోఽహ
మస్మీతి న స వేద (బృ. ఉ. **1-4-10**)

అనేక జన్మాంతరసంచితై ర్నరో
విముచ్యతేఽజ్ఞాన నిమిత్తపాతకైః।
ఇదం విదిత్వా పరమం హి పావనం
స లిప్యతే వ్యోమ ఇవేహ కర్మభిః॥ ౭౧

తా॥ పవిత్రము, అత్యుత్తమము నగు నా బ్రహ్మాత్మజ్ఞానముచే అజ్ఞాన వశమున అనేక జన్మలయందు సంచితములయిన మహాపాతకములనుండి విముక్తు లగుదురు; అంతియే కాదు. ఈ జన్మయందును కర్తృత్వాద్యభిమాన రహితు

శం. ర. **13-35**

లగుటచే ఆ తత్త్వజ్ఞానులను, ఆకసమును ధూళి వోలె, కర్మ లంటవు.

ప్రశాంతచిత్తాయ జితేంద్రియాయ చ
ప్రహీణదోషాయ యథోక్తకారిణే।
గుణాన్వితాయానుగతాయ సర్వదా
ప్రదేయ మేతత్సతతం ముముక్షవే॥ ౭౨

తా॥ ప్రశాంతచిత్తుడు, జితేంద్రియుడు, అనేకజన్మల యందాచరింపబడిన యజ్ఞాన క్రియలచే పరితోషము నొందిన యీశ్వరునిచే నిర్మూలింపబడిన నిఖిల దోషములు గలవాడు, యథాశాస్త్రము ధర్మానుష్ఠానపరుడు, విద్యావినయాదిగుణ యుక్తుడు, నిరంతరానుసరణశీలుడు, ముముక్షువు నగు అధి కారికి యీ యాత్మజ్ఞానము నుపదేశింపవలెను.

వి :- విద్యాధికారికి వలయు శమాదిసాధనముల విష యమై "శాంతో దాంత ఉపరత స్తితిక్షుః సమాహితో భూత్వాఽఽత్మన్యేవాత్మానం పశ్యతి" (బృ. ఉ. 4-4-23) అని కాణ్వులు పఠింతురు. 'సమాహిత' పదస్థానమున 'శ్రద్ధాంత్తః' అని మాధ్యందిన పాఠము. ఉభయ పాఠాను గుణముగ గుణోపసంహారన్యాయమును నాశ్రయించి యిట శమాదు లారును విద్యాసాధనములుగా చేర్చఁబడినవి.

పరస్య దేహే న యథాఽభిమానతా
పరస్య తద్వత్పరమార్థ మీక్ష్య చ।
ఇదం హి విజ్ఞాన మతీవ నిర్మలం
సంప్రాప్య ముక్తోఽథ భవేచ్చ సర్వతః॥ ౨౩

తా॥ అన్యదేహమునందు 'ఇది నాది, ఇది నేను' అని యభిమానము లేనట్లు, స్వదేహమునందును, వేదాంతవాక్య పరిశీలనచే దేహాతిరిక్త-ఆత్మతత్త్వ స్వరూపము నెఱిఁగి, అభిమానరహితుడై బ్రహ్మాత్మైక్య సాక్షాత్కారమును బొంది ముక్తుడై పరమానందానుభవమున దేలియాడుచుండును.

నహీహ లాభోఽభ్యధికోఽస్తి కశ్చన
స్వరూపలాభాత్స ఇతో హి నాన్యతః।
న దేయ మైంద్రాదపి రాజ్యతోఽధికం
స్వరూపలాభం త్వపరీక్ష్య యత్నతః॥ ౨౪

తా॥ స్వరూపలాభము - అనగా - ఆత్మతత్త్వజ్ఞానము. దీనికంటె అధికమగు లాభము మఱియొకటి లేదు. 'ఆత్మలాభాన్న పరం విద్యతే' (ఆప. ధర్మ. 1-22-2) అట్టి ఆత్మస్వరూపలాభము వేదాంత వాక్యములచేతనే గలుగును. అన్యథా సిద్ధింపదు. తనకు స్వర్గాధిపత్యము నిచ్చినను సరే! ఆచార్యుడు

పరీక్షింపక స్వరూపలాభజ్ఞానము (బ్రహ్మాత్మైక్య జ్ఞానము) నొసగరాదు. ఈ విద్య ఐంద్రరాజ్యముకన్న మిన్న.

వి :- ఆత్మస్వరూపలాభజ్ఞానము స్వర్గాధిపత్యము కంటె గొప్పది యనుటచే-"ప్రణాయ్యాయ వాऽంతేవాసినే-నాన్యస్మై కస్మైచన, యద్యప్యస్మా ఇమాం మద్భిః పరిగృహీతాం ధనస్య పూర్ణాం దద్యాత్, ఏతదేవ భూయః"-(ఛాందోగ్య. 3-11-6) అను శ్రుతిప్రామాణ్య మిట సూచితము.

పార్థివ ప్రకరణము

# సమ్యఙ్మతి ప్రకరణమ్ - 17

ఆత్మా జ్ఞేయః పరో హ్యాత్మా యస్మాదన్య న్న విద్యతే।
సర్వజ్ఞః సర్వదృక్ శుద్ధ స్తస్మై జ్ఞేయాత్మనే నమః॥ ౧

తా॥ ప్రత్యక్ష-అనుమానాది ప్రమాణములచే ఆత్మ దెలియబడదు; ఎవడు తెలిసికొనగోరునో, యట్టి జ్ఞాతయొక్క-స్వరూపమే ఆత్మ; కాన లేడనుటకు శక్యము గాదు. దేహేంద్రియాదులకంటె విలక్షణుడై, వానిచే దెలియబడక, తత్సాక్షిభూతుడై స్వయంప్రకాశుడై వెలుగొందు ఆత్మయే; జ్ఞేయుడు

ఆత్మకంటె నేఱుగా పరమార్థమున నేదియు లేదుగాన, ఆత్మ కంటె జ్ఞేయవస్తువు వేఱొకటి లేదు. అట్టి ఆత్మ సర్వజ్ఞుడు; సర్వద్రష్ట; పరిశుద్ధుడు (సత్యజ్ఞానానంద స్వరూపుడు); అట్టు జ్ఞేయమగు ఆత్మస్వరూపమునకు నమస్కారము.

వి :- పరపక్షనిరాకరణ పూర్వకముగా జెప్పబడిన మోక్షసాధన జ్ఞానస్వరూపమును స్వసిద్ధాంతానుగుణముగ వివరించుటకయి యీ ప్రకరణ మారంభింపబడుచున్నది.

'జ్ఞేయాత్మనే నమః'-జ్ఞేయుడగు ఆత్మ తనకంటె భిన్నుడు కానందున, నిట నమః శబ్దార్థము భేదదృష్టివిలయమే.

పదవాక్యప్రమాణజ్ఞైః దీపభూతైః ప్రకాశితమ్।
బ్రహ్మ వేదరహస్యం యై స్తా న్నిత్యం ప్రణతో
స్మ్యహమ్॥ ౨

తా॥ పదవాక్యప్రమాణజ్ఞులై అప్రయత్నముగ దీపము వలె సర్వార్థములను దర్శింపజేయు ఏ గురువులచే వేద రహస్యమగు బ్రహ్మ ప్రకాశింపజేయబడెనో యా గురువులకు నమస్కారము.

యద్వాక్సూర్యాంశుసంపాత ప్రనష్టధ్వాంతకల్మషః।
ప్రణమ్య తాన్ గురూన్ వక్ష్యే బ్రహ్మవిద్యా
వినిశ్చయమ్॥ 3

తా॥ ఎవరి వాక్కు లనెడి సూర్యకిరణముల యొక్క సంపర్కముచే నా యజ్ఞాన మనెడి చీకటి తొలగినదో, యా గురువులకు నమస్కరించి బ్రహ్మవిద్యావినిర్ణయము జేయు న్యాయవిశేషస్వరూపమును వివరించుచున్నాను.

ఆత్మలాభాత్పరో నాన్యో లాభః కశ్చన విద్యతే।
యదర్థా వేదవాదాశ్చ స్మార్తాశ్చాపి తు యాః క్రియాః।
౪

తా॥ వేదవచనములుగాని, వాని ననుసరించెడి స్మృతి వచనములుగాని, శ్రుతిస్మృతులచే ప్రవర్తింపజేయబడిన క్రియలుగాని[చిత్తశుద్ధిని సంపాదించుటద్వారా క్రమముగా] ఏ యాత్మస్వరూపసాక్షాత్కారమునకు దోహదము చేయునో, యట్టి యాత్మలాభముకంటె నుత్కృష్టమయినది వేరొకటి లేదు.

ఆత్మార్థోఽపి హి యో లాభః సుఖాయేష్టో విపర్యయః।
ఆత్మలాభః పరః ప్రోక్తో నిత్యత్వాత్ బ్రహ్మవేదిభిః॥ ౫

తా॥ లోకమున పుత్రులు, ధనము మున్నగువానిని ఆత్మసుఖము కొఱకే కోరుకొందురు. పుత్రధనాదిలాభము వలననే ఆత్మసుఖము గలుగుచుండ, నిక ఆత్మలాభమునకై ఆత్మజ్ఞాన మెందుకు? అని యనరాదు. పుత్రాదిలాభము ఒక

స్వాను దుఃఖహేతువు కూడ నగును. ఆత్మజ్ఞానముచే గలుగు ఆత్మ-లాభ మట్టిది గాదు. అట దుఃఖప్రసక్తి లేదు; అది నిత్యము. అందుచే పుత్రాదిలాభముకంటె ఆత్మలాభము ఉత్కృష్ట మని బ్రహ్మవేత్తలు చెప్పుదురు.

స్వయంలబ్ధస్వభావత్వా ల్లాభ స్తస్య న చాన్యతః।
అన్యాపేక్షస్తు యో లాభః సోఽన్యదృష్టిసముద్భవః॥ ౬

తా॥ ఆత్మలాభము సాధనాంతరములచే సిద్ధించునది గాదు; అది స్వయంసిద్ధము.పుత్రాదిలాభము సాధనాంతరములచే సిద్ధించునది.సాధనము లనిత్యములు కదా! అవి నశింపగనే వానివలన సిద్ధించు లాభము గూడ నశించును. కాన, అన్యాపేక్ష గల పుత్రాదిలాభము కంటె స్వయంసిద్ధమగు ఆత్మలాభము నిత్యము.

అన్యదృష్టి స్త్వవిద్యా స్యా త్తన్నాశో మోక్ష ఉచ్యతే।
జ్ఞానేనైవ తు సోఽపి స్యా ద్విరోధిత్వా న్న కర్మణా॥ ౭

తా॥ ఆత్మకంటె వేఱుగా అన్యప్రతీతిని-పుత్రలాభాది ప్రతీతిని-కలిగించునది అవిద్య. స్వప్నతుల్య మగు అవిద్య నశించి ఆత్మస్వరూప నిత్యసుఖప్రాప్తి కలుగుటయే మోక్షము. అవిద్యావిరోధి జ్ఞానము; కర్మ గాదు; అందుచే జ్ఞానముచేతనే అవిద్య నశించును గాని, కర్మచే గాదు.

కర్మకార్య స్త్వనిత్యః స్యా దవిద్యాకామకారణః।
ప్రమాణం వేద ఏవాత్ర జ్ఞానస్యాధిగమే స్మృతః॥ ౮

తా॥ మిథ్యాప్రతీతికి మూలము రాగము. రాగము కర్మలకు మూలము. కర్మలచే సాధ్యములగు ఘటాదు లనిత్యము లగునట్లే, కర్మసాధ్య మగుచో మోక్షము గూడ అనిత్యము కావలసివచ్చును. జ్ఞానసాధ్యమగు ఫలము-అవిద్యానాశలక్షణమగు మోక్షము-నిత్యము. కాన, వేదాన్తవాక్యములచే అవిద్యావినాశకమగు జ్ఞానమును పొందవలెను. ఈ విషయమై శ్రుతులు ప్రమాణము.

జ్ఞానైకార్థపరత్వా త్తం వాక్య మేకం తతో విదుః।
ఏకత్వం హ్యాత్మనో జ్ఞేయం వాక్యార్థప్రతిపత్తితః॥ ౯

తా॥ ఉపనిషత్తులు బ్రహ్మయొక్క- తటస్థలక్షణమును, స్వరూపలక్షణమును జెప్పి తత్త్వమస్యాది మహావాక్యములచే బ్రహ్మాత్మైక్యజ్ఞానమును బోధించి, యీ ఆత్మతత్త్వజ్ఞానమే పరమపురుషార్థహేతు వని బోధించినది. కర్మకాండ గూడ తత్త్వజ్ఞానమునకు వలయు చిత్తశుద్ధిహేతువు లయిన కర్మలను విధించుట ద్వారా క్రమముగ పరమపురుషార్థసాధన మగుచున్నది. ఇట్లు జ్ఞాన-కర్మకాండలు రెండింటికి ఒకే యర్థమును బోధించుటయందే తాత్పర్యముండుటచే-వాక్యమన్యాద నను సరించి-వేదవాక్యములకు ఏకవాక్యత సిద్ధించినది.

వాచ్యభేదాత్తు తద్భేదః కల్ప్యో వాచ్యోఽపి తచ్ఛ్రుతేః।
త్రయం త్వేతత్తతః ప్రోక్తం రూపం నామ చ కర్మ చ॥
౧౦

తా॥ ఘట-కలశాది శబ్దములవలె బ్రహ్మ-ఆత్మ శబ్దములు రెండును పర్యాయపదములు గావు; భిన్నార్థబోధకములు. అట్లు భిన్నార్థబోధకములగుచో బ్రహ్మాత్మైక్య మెట్లు సిద్ధించును? ఈ వాదము సరికాదు.

జీవబ్రహ్మలకు భేదము సిద్ధించినగాని, తద్వాచకములగు ఆత్మ-బ్రహ్మశబ్దములు పర్యాయవాచకశబ్దములు గావని సిద్ధించును. ఇవి పర్యాయవాచక శబ్దములు గావని సిద్ధించినగాని,తద్బోధ్యములగు జీవబ్రహ్మలకు భేదము సిద్ధింపదు.ఇట్లు అన్యోన్యాశ్రయదోష ముండుటచే పై వాదము జీవబ్రహ్మ భేదవాదము-ప్రామాణికము గాదు.

'త్రయం వా ఇదం నామ రూపం కర్మ'(బృ.ఉ.1_6-1) ఆత్మకంటె అతిరిక్తముగా నామ రూప కర్మలను బృహదారణ్యకశ్రుతి పేర్కొనినది. కాన, జీవ-బ్రహ్మభేదము ప్రామాణికమే-యనుటయు సరికాదు. (దీనికి సమాధానము పై శ్లోకమున చెప్పబడినది.)

అస దేతత్త్రియం తస్మా దన్యోఽన్యేన హి కల్పితమ్।
కృతో వర్ణో యథా శబ్దా చ్ఛ్రుతోఽన్యత్ర ధియా బహిః॥
౧౧

తా॥ నామ రూప కర్మలు మూడును నొకదానిచే నొకటి కల్పింపబడినవి. కనుక, నివి వాస్తవములు (సత్) కానేరవు. మిథ్యయే (అసత్). అన్యోన్యాపేక్ష గల యీ భేదము అనిర్వాచ్య మగుటచే ప్రామాణికము గాదు. కాని, లోకసిద్ధ మయిన మిథ్యాభేదమును వైరాగ్యసిద్ధికై శ్రుతి యనువదించినది. ఈ మిథ్యాభేదముచే అద్వైతమునకు హాని లేదు. పై రెండు శ్లోకములకు మఱియొక వ్యాఖ్య:-

పునరుక్తములు గాని యనేకశబ్దములచే అర్థభేదము ప్రతీయమాన మగుచుండుటచే నైక్యము సిద్ధము గాదు; సత్యమే. కాని, ప్రమాణయుక్తిబాధిత మగుటచే భేదము (ద్వైతము) నందు తాత్పర్యము చెప్పపొసగదు. వాచ్యభేదము ప్రామాణిక మగుచో వాచకశబ్దభేదము సిద్ధించి యనేకత్వము సిద్ధించును. వాచకశబ్దభేదము సిద్ధించినగాని, వాచ్యభేదము సిద్ధింపదు. మఱియు, ఒకే పురుషునియందు పితృ-భ్రాతృ-మాతులాది శబ్దములు అపునరుక్తములుగా ప్రయుక్తము లైనను వాచకశబ్దభేదముచే నా పురుషునియందు అనేకత్వము సిద్ధింపదు. కాన, శబ్దభేదమాత్రమున అర్థభేద నిశ్చయము కుదురదు. అనాది-అవిద్యాకల్పిత మయిన భేదము నను

వదించుచు శ్రుతి పరమపురుషార్థసిద్ధికై జ్ఞానాపేక్షిత చిత్తశుద్ధి సాధన కర్మలను విధించుటచే కర్మకాండకు పరంపరయా ఆత్మతత్త్వజ్ఞాన వాక్యములతో నేకవాక్యత సిద్ధించును. అధికారిభేదముచే కర్మ-జ్ఞానకాండలు రెండిటికి వినియోగభేదముపపన్న మగును. నిరతిశయానందము, అత్యంతిక దుఃఖనివృత్తియు జ్ఞానమునకు ప్రయోజనములు. కాన, కర్మలు, జ్ఞానము-ఒకే పురుషునియందుండుటలో విరోధము లేదు.

మఱియు, 'త్రయం వా ఇదం నామ రూపం కర్మ' యను శ్రుతి. దృశ్యప్రపంచము నామరూపకర్మాత్మకము. శబ్దవిశేషము [నామము] లన్నియు వాఙ్మాత్రములు, రూపవిశేషము లన్నియు చక్షుర్మాత్రములు, కర్మవిశేషము లన్నియు శరీరమాత్రములు-అని విశేషప్రవిలాపనము జేసి యా సామాన్యత్రయమును జెప్పి-ఆ త్రయము గూడ సద్రూపుడగు ఆత్మయే; ఆత్మ అద్వితీయుడు_అని జగత్తుకు ఐకాత్మ్యమును బోధించి శ్రుతి యుపసంహారము జేసినది. కాన, మిథ్యాకల్పితభేదమే కాని, తత్త్వభేదము లేదు.

మఱియు, శబ్దముచే శ్రుతమయిన ఇంద్రాది దేవతా విశేషరూపమును బుద్ధియం దూహించి చిత్తరువున లిఖించుచో చిత్రరూపమున గల్పించిన యా రూపము మిథ్యయే కదా! కాన, శబ్దము అర్థతత్త్వ నిశ్చాయకము గాదు; మిథ్యార్థమును గోచరింపజేయునది.

దృష్టం చాపి యథా రూపం బుద్ధేః శబ్దాయ కల్పతే।
ఏవ మేత జ్జగత్సర్వం భ్రాన్తిబుద్ధివికల్పితమ్॥ ౧౨

తా॥ చిత్తరువున జూచిన రూపము యొక్క సంస్కారముతో బుద్ధి, ఇత డింద్రుడు, అని యీ రీతిగా నామా శబ్దములచే నామా రూపముల వ్యవహరించును. అట్లే అవిద్యచే శుక్తియందు రజతమును వలె ఆత్మయందు కల్పితములయిన వివిధ వస్తువులను జూచి బుద్ధి వాని నామా శబ్దములచే వ్యవహరించుచుండును.

అన దేత త్తతో యుక్తం సచ్చిన్మాత్రం న కల్పితమ్।
వేదశ్చాపి స ఏవాద్యో వేద్యం చాన్యత్తు కల్పితమ్॥ ౧౩

తా॥ పైన జూపిన కారణముల వలన ఈ దృశ్యమంతయు మిథ్య యని చెప్పుటయే యుక్తము. మిథ్యాకల్పిత జగత్తున కధిష్ఠానభూతమై పూర్వసిద్ధమై సాక్షియై వెలుగొందు సత్-చిత్-స్వరూపము [ఆత్మ] మాత్రము కల్పితము గాదు. పూర్వసిద్ధుడగు ఆత్మయే వేదము[వేదన హేతువు], వేద్యము గూడ నగును. తద్భిన్నమగు సర్వము కల్పితమే.

వి :- జడమునకు అర్థప్రకాశనసామర్థ్యము లేదు. జ్ఞానమునకు హేతుభూతులగు శ్రుతియు, ఆచార్యుడును వేదనహేతువగు ఆత్మయొక్క స్వరూపులే. సర్వము మిథ్య

గావున, నేతి నేతీతి వాక్యములచే జేయబడు సర్వకల్పనాప వాదమునను అవధిభూతుడగుటచే ఆత్మయే వేద్యుడు.

యేన వేత్తి స వేదః స్యాత్ స్వప్నే సర్వం తు మాయయా।
యేన పశ్యతి తచ్చక్షుః శృణోతి శ్రోత్ర ముచ్యతే॥ ౧౪

తా॥ స్వప్నావస్థయందు ఎవనిచేత సర్వపదార్థముల జ్ఞానము గలుగుచున్నదో, అచట మాయాకల్పితమగు దృశ్య [వేద్య]పదార్థజాత మంతయు స్వప్నద్రష్టయగు ఆత్మయే-అనగా, స్వప్నమున వేదము [వేదనహేతువు], వేద్యమును ఆత్మయే.స్వప్నమున నేత్రాదీంద్రియముల వ్యాపారముండదు. అచట ఆత్మ దేనిచే రూపాదుల దర్శించునో, అది నేత్రము; దేనిచే వినునో, యదియే శ్రోత్రము.

వి :- 'న తత్ర రథా న రథయోగాః' [బృ.ఉ.4-3-9] ఇత్యాది శ్రుతిప్రామాణ్యముచే స్వప్నమున బాహ్యవిషయ జాతమున కవకాశము లేదు. అందుచేత నచట వేదము(జ్ఞాత), వేద్యము (జ్ఞేయము) ను ఆత్మయే.

యేన స్వప్నగతో వక్తి సా వాగ్ఘ్రాణం తథైవ చ।
రసన స్పర్శనే చైవ మనశ్చాన్య త్తథేంద్రియమ్॥ ౧౫

తా॥ ఆత్మ స్వప్నమున దేనిచే మాటలాడునో, యది వాక్కు; దేనిచే నాఘ్రాణించునో, యది ఘ్రాణము. ఇట్లే రస నేంద్రియము, త్వగింద్రియము మున్నగు ఇతరేంద్రియములు మనస్సు విషయమునను నెఱుగునది.

కల్పోప్యుపాధిభి ర్వైతద్భిన్నం జ్ఞాన మనేకధా।
ఉపాధిభేదా ద్యథా భేదో మణే రేకస్య జాయతే॥ ౧౬

తా॥ నీల పీతాది ఉపాధిభేదముచే నేవిధముగా ఒకే మణియందు భేదము ప్రతీత మగుచున్నదో యట్లే స్వప్న కల్పిత ఉపాధిభేదముచే ఒకే జ్ఞానమున చాక్షుషజ్ఞానము, శ్రావణజ్ఞానము - అని యీ రీతిగ భేదము ప్రతీత మగు చుండును.

జాగ్రతశ్చ తథా భేదో జ్ఞానస్యాస్య వికల్పితః।
బుద్ధిసం వ్యాకరోత్యర్థం భ్రాన్త్యా తృష్ణోద్భవక్రియః॥ ౧౭

తా॥ స్వప్నకల్పిత-ఉపాధి కారణముగా ఒకే జ్ఞానమున భేదము ప్రతీతమగునట్లు జాగ్రదవస్థయందును జ్ఞానమున భేద మారోపితమే; ఆరోపితభేదముచే నొకే జ్ఞానము నిఖిలవ్యవహా రాస్పదమై వెలయును. అజ్ఞానమూలక రాగవశమున తత్త త్క్రియాపరవశుడై జీవుడు బుద్ధిస్థ విషయములను [సుఖ

దుఃఖములను] తనవిగా భావించి [తనయందారోపించుకొని] వ్యవహరించుచుండును.

స్వప్నే తద్వత్ప్రబోధే యో బహిరన్తస్తథైవ చ।
ఆలేఖ్యాధ్యయనే యద్వత్తదన్యోన్యధియోద్భవమ్॥ ౧౭

తా॥ స్వప్నమునందు వలెనే జాగ్రద్దశయందును వ్యవహారము ప్రవర్తిల్లును; స్వప్నమునందు వలెనే జాగ్రద్దశయందును అన్తర్బహిర్భావకల్పనయు జరుగును. పత్రములయందక్షరముల వ్రాయుట, వాని సాయముతో జదువుట-ఈ రెండును పరస్పర సాపేక్ష గలిగి మిథ్య యగును గదా!

వి :- వర్ణము విభువు, నిత్యము-అట్టిచో పత్రములయందు కొన్ని రేఖలు గీచి వానియందు వర్ణత్వమారోపించి-క ఖ గ జ-అని యీ రీతిగా చదువుట,చదివించుట-అంతయు పరస్పర జ్ఞానకల్పిత మగుటచే మిథ్యయే యగును. అట్లే, పరస్పర జ్ఞానసాపేక్ష గల స్వప్నపదార్థములవలె జాగ్రద్దశయందు ప్రతీతములగు బాహ్యాభ్యంతర పదార్థములును పరస్పర జ్ఞానసాపేక్ష కలవి గాన, మిథ్యయే.

యదాయం కల్పయేద్భేదం తత్కామః సన్ యథాక్రతుః।
యత్కామస్తత్క్రతుర్భూత్వా కృతం యత్తత్ప్రపద్యతే॥ ౧౮

తా॥ పూర్వభ్రాంతి సంస్కారవశమున జీవబ్రహ్మభేదము నెపుడు జీవుడు కల్పించుకొనునో, యపుడు మిథ్యా కల్పితభేదము గల స్వభిన్న పదార్థములందు కోరిక గలిగి యట్టి సంకల్పము[క్రతుః]నే చేయును. కోరికల కనుగుణముగ సంకల్పముల జేయుచు,సంకల్పానుగుణముగ నాయా క్రియల జేయుచు తత్ఫలము బొందుచుండును.

అవిద్యాప్రభవం సర్వ మస త్తస్మా దిదం జగత్।
తద్వతా దృశ్యతే యస్మా త్సుషుప్తౌ న చ గృహ్యతే॥ ౨౦

తా॥ అజ్ఞానవశమున జీవబ్రహ్మభేదమును దర్శించు అవిద్యావంతునికే యీ జగత్తు ఆత్మకంటె భిన్నమై పొడ సూపును. సుషుప్తియందు గోచరించుటలేదు. ఇట్లు అవిద్యా కల్పిత మగుటచే నీ జగత్తు మిథ్య [అసత్].

విద్యావిద్యే శ్రుతిప్రోక్తే ఏకత్వాన్యధియా హి నః।
తస్మా త్సర్వప్రయత్నేన శాస్త్రే విద్యా విధీయతే॥ ౨౧

తా॥ బ్రహ్మాత్మైక్యజ్ఞానము విద్య; జీవబ్రహ్మభేదజ్ఞాన మవిద్య—ఈ రెంటిని శ్రుతి బోధించినది. లోకసిద్ధమయి, సర్వ సాధారణమయిన అవిద్య ననువదించుచు,లోకానుభవసిద్ధము గాని విద్యను గూర్చియే శ్రుతి అధ్యారోప-అపవాదరూపమున బహుముఖముల ప్రతిపాదించినది.

చిత్తే హ్యాదర్శవ ద్యస్మా చ్ఛుద్ధే విద్యా ప్రకాశతే।
యస్మై ర్నిత్యైశ్చ యజ్ఞైశ్చ తపోభి స్తస్య శోధనమ్॥

౨౨

తా॥ అద్దము వలె నిర్మలమైన యంతఃకరణమునందే జ్ఞానము [విద్య] యొక్క ప్రకాశము గలుగును. అందుచే యమము, నియమము, యజ్ఞములు, తపస్సులచే చిత్తమును శోధించి పరిశుద్ధము చేసికొనవలెను.

శారీరాదితపః కుర్యా ద్విశుద్ధ్యర్థ ముత్తమమ్।
మన ఆది సమాధానం తత్తద్దేహవిశోషణమ్॥ ౨౩

తా॥ చిత్తశుద్ధి కొఱకై సాత్త్వికములగు కాయిక, మానసిక, వాచిక తపస్సులను చేయవలెను. అట్లే మనస్సు ఇంద్రియముల యొక్క నిగ్రహము, భిన్నభిన్న ఋతువుల యందు శీతోష్ణాది ద్వంద్వముల సహించుచు క్రమముగా దేహమును కృశింపజేయవలెను.

వి :- కాయిక, మానసిక, వాచిక తపస్సులు- చూ. భ. గీ. 17,14-17.

మనస శ్చేన్ద్రియాణాం చ హ్యైకాగ్ర్యం పరమం తపః।
తజ్జ్యాయః సర్వధర్మేభ్యః స ధర్మః పర ఉచ్యతే॥ ౨౪
శం. వ. 13-37

తా॥ మనస్సునకు,ఇంద్రియములకు నేకాగ్రతయే ఉత్తమ తపస్సు.ఇదియే యన్ని ధర్మముల కంటె నుత్కృష్టమైన పరమ ధర్మ మనిమనుస్మృతి, మహాభారతాదులయందు కీర్తింప బడినది.

చూ. మోక్షధర్మ. 290-4; వనపర్వ. 260-25.

దృష్టం జాగరితం విద్యాత్ స్మృతం స్వప్నం తదేవ తు।
సుషుప్తం తదభావం చ స్వమాత్మానం పరం పదమ్॥
౨౮

తా॥ బాహ్యేంద్రియములచే బాహ్యార్థజాతమును దర్శించుట జాగ్రద్దశ; సంస్కారవశమున నిద్రాదశయందు ఆ పదార్థజాతము భాసించుట స్వప్నదశ; దృష్ట-స్మృత పదార్థముల భావము లేకపోవుట (తదభావము) సుషుప్తము. ఈ దృశ్యత్రయము కంటె వేఱుగా సాక్షియై స్వస్వరూపమున భాసించు సత్యజ్ఞానానందలక్షణ మగు ఆత్మయే నేను అని తెలిసికొనవలెను.

సుషుప్తాఖ్యం తమోఽజ్ఞానం బీజం స్వప్నప్రబోధయోః।
స్వాత్మబోధప్రదగ్ధం స్యాద్బీజం దగ్ధం యథా భవమ్॥
౨౯

తా॥ సుషుప్తిసంజ్ఞ గల తపస్సే అజ్ఞానము. ఆ యజ్ఞానమే స్వప్న జాగరితములకు మూలము. అది యాత్మజ్ఞానముచే దగ్ధమై దగ్ధబీజమువలె ఫలోత్పాదకము గాదు.

తదేవైకం త్రిధా జ్ఞేయం మాయాబీజం పునః క్రమాత్ ।
మాయావ్యాత్మవికారో౽పి బహుధైకో జలార్కవత్ ॥ ౨౨

తా॥ ఒక మాయాబీజమే మూడు విధములుగా భిన్నమై క్రమముగా సుషుప్త్యాది క్రమమున వికారము పొందును. మాయ కాశ్రయ మగు ఆత్మ నిర్వికారుడయ్యు, జలములయందు ప్రతిబింబించిన సూర్యుని వలె అనేక రూపములతో పొడగట్టును.

వి :- త్రిధా భిన్నం - ఆత్మయందధ్యాత్మ-అధిదైవత భేదముచే ప్రాజ్ఞ-ఈశ్వరోపాధివిశిష్ట సుషుప్తి-ప్రలయావస్థలు, తైజస-హిరణ్యగర్భోపాధివిశిష్ట స్వప్న-సృష్ట్యవస్థలు, విశ్వ-వైశ్వానరోపాధివిశిష్ట జాగ్రత్-స్థితి-అవస్థలు మాయావశమున ప్రతీతము లగుచుండును.

బీజం చైకం యథా భిన్నం ప్రాణస్వప్నాదిభి స్తథా ।
స్వప్నజాగ్రచ్ఛరీరేషు తద్వచ్చాత్మా జలేందువత్ ॥ ౨౩

తా॥ ఏవిధముగా కారణ (బీజ) రూపిణి యగు మాయ అవ్యాకృత-స్వప్న - జాగ్రదాద్యవస్థారూపమున భేదము (వికారము) నొందునో, యదేవిధముగ నొకే చంద్రుడు జలములయందువలె ఒకే యాత్మ స్వప్న-జాగ్రదాది శరీరములయందు సమష్టి - వ్యష్టిభేదముచే తైజస-హిరణ్యగర్భ-విశ్వ వైశ్వానరాది విభిన్నరూపములతో ప్రకాశించుచుండుచు.

మాయాహస్తిన మారుహ్య మాయావ్యేకో యథా
ప్రజేత్।
ఆగచ్ఛంస్తద్వదేవాత్మా ప్రాణస్వప్నాదిగోచరః॥ ౨౯

తా॥ మాయావి యొకడు తన మాయచే గల్పించిన గజము నెక్కి దేశాంతరముల కేగి తిరిగి వచ్చుచున్నట్లు భాసించియు, అచలుడుగనే యుండువిధముగా ఆత్మయు మాయచే గల్పింపబడిన సుషుప్తి స్వప్నావస్థలయందు గమనాగమనములు చేయుచున్నట్లు భాసించుచునే అచలుడు, నిర్వికారుడుగ నుండును.

న హస్తీ న తదారూఢో మాయావ్యన్యో యథా స్థితః।
న ప్రాణాది న తద్ద్రష్టా తథా జ్ఞోఽన్యః సదా దృశిః॥ ౩౦

తా॥ వస్తుతః ఏనుగుగాని, ఏనుగు నెక్కిన పురుషుడుగాని లేరు. మాయాకల్పితములైన యీ రెండు పదార్థముల

కంటె వేఱుగనే మాయావి యుండును. అట్లే వస్తుతః అవ్యాకృత-స్వప్నాద్యవస్థలుగాని, తత్సాక్షిగాని లేరు. వానికంటె వేఱుగా నిత్యజ్ఞానస్వరూపుడై ఆత్మ ప్రకాశించుచుండును.

అబద్ధచక్షుషో నాస్తి మాయా మాయావినోఽపి నా।
బద్ధాక్షస్యైవ సా మాయాఽమాయావ్యేవ తతో
భవేత్॥ 31

తా॥ నేత్రములు బంధింపని పురుషునకు మాయ భాసించనటుల, మాయావి దృష్టిలో మాయ భాసింపదు; బద్ధనేత్రునకే-మాయామోహితదృష్టి గలవారికే-మాయ; తదితరులకు గాదు. బద్ధనేత్రుల దృష్టిలో యతడు మాయావిగాని, వస్తుతః తన దృష్టిలో మాయ లేనందున అమాయావియే. అట్లే ఆత్మయు అమాయావి; మాయోపలక్షితుడు; మాయాధిష్ఠానము మాత్రమే.

సాక్షాదేవ స విజ్ఞేయః సాక్షాదాత్మేతి చ శ్రుతేః।
భిద్యతే హృదయగ్రన్థిరిత్యాదితః శ్రుతేః॥ 32

తా॥ "యత్సాక్షాదపరోక్షాద్బ్రహ్మ య ఆత్మా సర్వాంతరః" (బృ.ఉ. 3-4-1) ఇత్యాది శ్రుతులచే ఆత్మ అపరోక్షముగనే (సాక్షాత్) జ్ఞేయు డగును. 'అపరోక్షాత్మ

స్వరూపము నెఱుగుచో హృదయగ్రన్థి విచ్ఛిన్న మగును; ఈ జన్మయందే ఆత్మస్వరూపము నెఱుగనిచో, ఎంతగానో హాని' యని ప్రతిపాదించు శ్రుతుల వలన నీ విషయము సిద్ధ మగును.

వి :– 'భిద్యతే హృదయగ్రంథి శ్ఛిద్యన్తే సర్వసంశయాః' ముం. ఉ. 2-2-8.

'నచే దిహావేదీ న్మహతీ వినష్టిః'- కేన. ఉ. 13. [5]

పై శ్లోకమున గల 'ఆది' శబ్దముచే-'ఏకధైవానుద్రష్టవ్యమ్'- బృ. ఉ. 4-4-20;

'మృత్యోః స మృత్యు మాప్నోతి య ఇహ నానేవ పశ్యతి'- బృ. ఉ. 4-4-19.

ఇత్యాది శ్రుతు లిట అనుసంధేయములు.

అశబ్దాదిత్వతో నాస్య గ్రహణం చేన్ద్రియై ర్భవేత్।
సుఖాదిభ్య స్తథాఽన్యత్వాత్ బుద్ధ్యా వాఽపి కథం
భవేత్॥ 33

తా॥ అశబ్దాదిరూపు డగుటచే బాహ్యేంద్రియములచే గాని, సుఖాదులకంటె భిన్నుడగుటచే బుద్ధిచే గాని యాత్మ యెట్లు గ్రహింపబడును?

అదృశ్యోఽపి యథా రాహుశ్చంద్రే బిమ్బం యథాఽ
ప్స్వపి।
సర్వగోఽపి తథైవాత్మా బుద్ధావేవ స గృహ్యతే॥ ౩౮

తా॥ అదృశ్యుడయ్యును, చంద్రునియందు రాహువు యొక్కయు, జలమునందు చంద్రాదుల ప్రతిబిమ్బము యొక్కయు గ్రహణము కలుగుచున్నదో, అదేవిధముగా సర్వవ్యాపకుడై ఇంద్రియములకు గోచరుడు గాకపోయినను బుద్ధి యందాత్మయొక్క గ్రహణము కలుగును.

వి :- తత్త్వమసి-ఇత్యాది వాక్యములచే బుద్ధియందు. ప్రతిబింబించి గ్రహింపబడును. గ్రహణమునగా స్వతఃస్ఫురణమే; [ఘటాదులవలె] విషయీభావము గాదు. శాస్త్రైకగమ్యుడయ్యును, అపరోక్షముగా సాక్షాత్కరించుటలో రాహు దృష్టాంతము, ఉపాధివిశేషమున స్వతఃస్ఫురణవిషయమై ప్రతిబింబదృష్టాంతము నీయబడినవి.

భానోర్బిమ్బం యథా చౌష్ణ్యం జలే దృష్టం న చామ్భసః।
బుద్ధౌ బోధో న తద్ధర్మ స్తథైవ స్యా ద్విధర్మతః॥ ౩౯

తా॥ ఏవిధముగా జలమునందలి ప్రతిబింబముగాని, వేడిమిగాని జలముయొక్క ధర్మములు గావో, అదే విధముగా బుద్ధియందు భాసించు జ్ఞానము బుద్ధియొక్క ధర్మము గాదు. జ్ఞానముకంటె విపరీత ధర్మము గలది యగుటచే బుద్ధి జడము

చక్షుర్యుక్తా ధియో వృత్తి ర్యాస్తాం పశ్య న్నలుప్త దృక్।
దృష్టేర్ద్రష్టా భవే దాత్మా శ్రుతే శ్రోతా తథా భవేత్॥ ౩౬

తా॥ నేత్రేంద్రియయుక్త రూపాకారమైన బుద్ధివృత్తికి సాక్షియై వానిని దర్శించుచు, ఆత్మ అకుంఠిత జ్ఞానశక్తి కలవాడై [అలుప్తదృక్] యొప్పును. దృష్టికి ద్రష్ట, శ్రవణమునకు శ్రోత యగును.

కేవలాం మనసో వృత్తిః పశ్యన్మన్తా మతే రజః।
విజ్ఞాతాఽలుప్తశక్తిత్వా త్తథా శాస్త్రం న హీత్యతః॥ ౩౭

తా॥ ఆత్మ వికారరహితుడై బహిఃప్రవృత్తము గాని విషయాకారమగు కేవలాంతఃకరణవృత్తి దర్శించుచు మతికి మన్త [మననకర్త] యగును. అకుంఠిత చైతన్యశక్తియుక్తుడగుటచే విజ్ఞాత యగును.

'విజ్ఞాత యొక్క విజ్ఞానమున కెన్నడును లోప ముండదు'- అని చెప్పెడి శ్రుతి యిచట ప్రమాణము.

వి :- న హి ద్రష్టు ర్దృష్టేః మొదలు- 'న హి విజ్ఞాతు ర్విజ్ఞాతే ర్విపరిలోపో విద్యతే'-బృ. ఉ. 4-3, 23-30.

'న దృష్టే ర్ద్రష్టారం పశ్యే ర్న శ్రుతేః శ్రోతారం'
బృ. ఉ. 3-4-2 ఇత్యాది శ్రుతులిట ఉదాహార్యములు.

ధ్యాయతీ త్యవికారిత్వం తథా లేలాయతీత్యపి।
అత్ర స్తేనేతి శుద్ధత్వం తథాఽనన్వాగతం శ్రుతేః॥ ౕ౭

తా॥ ఇట్లు ఆత్మకు ద్రష్టృత్వ శ్రోతృత్వాది వ్యపదేశ మున్నను, 'ధ్యాయతీవ లేలాయతీవ' అను శ్రుతి[బృ.ఉ.4-3-7] ఆత్మ ధ్యానించువానివలెను, చేష్టలు చేయువానివలెను భాసించుచుండు నని చెప్పుటచే ఆత్మ అవికారుడే యని సిద్ధ మగుచున్నది. 'అత్ర స్తేనోఽస్తేనో భవతి' [బృ. ఉ. 4-3-22]; 'అనన్వాగతం పుణ్యేనానన్వాగతం పాపేన' [4-3-22] ఈ దశయందు చోరు డచోరు డగును; పుణ్యాపాపరహితు డగును- ఇత్యాది శ్రుతులచే ఆత్మకు శుద్ధత్వము సిద్ధము.

శక్త్యలోపా త్సుషుప్తే జ్ఞ స్తథా బోధేఽవికారతః।
జ్ఞేయస్యైవ విశేష స్తు యత్రవేతి శ్రుతే ర్వచః॥ ౩౮

తా॥ శక్తికి విపరిలోపము లేదని శ్రుతి చెప్పుటచే సుషుప్తియందును ఆత్మ జ్ఞానస్వరూపుడే; అవికారి యగుటచే జాగ్రద్దశయందును నిర్వికార-జ్ఞానస్వరూపుడే. నిర్విశేష జ్ఞాన

శం. ర. 13-38

స్వరూపుడయ్యును, జ్ఞేయవస్తుగత విశేషముచే విశేషము భాసించుచుండును. 'యత్ర వా అన్యదివ స్యాత్ తత్రాన్యోఽన్య త్పశ్యేత్-(బృ,ఉ. 4-3-21);యత్ర త్వస్య సర్వమాత్మైవాభూత్ తత్కేన కం పశ్యేత్-(4-5-15) ఎచట అన్యవస్తువున్నట్లు భాసించునో, అచట అన్యుడై అన్యమును దర్శించును; ఎచట సర్వ మాత్మయే యగునో, యచట నెవడు దేనితో దేనిని దర్శించును-ఇత్యాది శ్రుతు లీ విషయమున ప్రమాణము.

వ్యవధానాద్ధిపారోక్ష్యం లోకదృష్టే రనాత్మనః।
దృష్టే రాత్మస్వరూపత్వా త్ప్రత్యక్షం బ్రహ్మ తత్
స్మృతిమ్॥ ౮౦

తా॥ అనాత్మలగు ఘటాదులను గ్రహించెడి లోకదృష్టికి-తద్గ్రాహక చక్షురాదిదృష్టికి-దేశకాలకృత్య వ్యవధానముండుటచే లోకదృష్టి పరోక్షము. ఆత్మదృష్టియే ఆత్మస్వరూపము; ఆత్మయే బ్రహ్మ. ఆత్మకు దృష్టికృతదేశకాలకృత్యవ్యవధానము లేదు. అందుచే బ్రహ్మవేత్తలు, బ్రహ్మ సర్వదా ప్రత్యక్ష మని చెప్పుదురు.

నహి దీపాంతరాపేక్షా యద్వ ద్దీపప్రకాశనే।
బోధస్యాత్మస్వరూపత్వా న్న బోధోఽన్య స్తదేష్యతే॥
౮౧

తా॥ దీపమును ప్రకాశింపజేయుటకు దీపాంతరాపేక్ష లేనట్లే, జ్ఞానమే యాత్మస్వరూప మగుటవలన జ్ఞానమును ప్రకాశింపజేయుటకు జ్ఞానాంతరాపేక్ష లేదు.

విషయత్వం వికారిత్వం నానాత్వం వా నహీష్యతే।
న హేయో నాప్యుపాదేయ ఆత్మా నాన్యేన వా తతః॥ ౭౨

తా॥ ఘటాది బాహ్యపదార్థముల వలె ఆత్మకు విషయత్వముగాని, వికారిత్వముగాని, నానాత్వముగాని యంగీకరింపబడదు. అందుచే ఆత్మ తనచేగాని, ఇతరులచేగాని గ్రాహ్యముగాని, త్యాజ్యముగాని కాదు.

సబాహ్యాభ్యంతరోఽజీర్ణో జన్మమృత్యుజరాతిగః।
అహమాత్మేతి యో వేత్తి కుతోఽన్యేన బిభేతి సః॥ ౭౩

తా॥ 'నేను బాహ్యాభ్యన్తరములయందు వ్యాపించియున్నాను; శైథిల్యము లేనివాడను; జన్మమృత్యుజరారహితుడను; ఆత్మను-అని యెవడు తెలియునో, యతడు దేనిని గూర్చి భయపడును?

ప్రాగేవైతద్విధేః కర్మ వర్జిత్వా దేహపోహనాత్।
తదస్థూలాదిశాస్త్రేభ్యః తత్త్వమేవేతి నిశ్చయాత్॥ ౭౪

తా॥ 'ఆత్మ స్థూలము గాదు; అణువుగాదు' - అని చెప్పిన శ్రుతుల వలన ఆత్మకు కర్మాధికారమునకు హేతుభూతము లయిన బ్రహ్మచర్యాదులు నిరాకృతములు. అందుచే తత్త్వమస్యాది వాక్యములచే బ్రహ్మాత్మైక్యజ్ఞానము గలుగుటకు పూర్వమే యావజ్జీవాగ్నిహోత్రప్రతిపాదక శాస్త్రవిహితకర్మల ననుష్ఠింపనగును.

పూర్వదేహపరిత్యాగే జాత్యాదీనాం ప్రహాణతః।
దేహస్యైవ తు జాత్యాది స్తస్యాప్యేవం హ్యనాత్మతా॥
౮౫

తా॥ పూర్వదేహత్యాగానంతరము పూర్వదేహమునకు సంబంధించిన జాత్యాదిధర్మములు త్యజింపబడుచున్నవి. నూతన దేహమునకు సంబంధించిన జాత్యాది ధర్మములు గ్రహింపబడుచున్నవి. ఈవిధముగా ఆగమాపాయి ధర్మములు గలవి యగుటచే జాత్యాదు లనాత్మ లెట్లగుచున్నవో, యట్లే దేహముగూడ అనాత్మస్వరూపమే యగుచున్నది.

మమాహం చేత్యతోఽవిద్యా శరీరాది ష్వనాత్మను।
ఆత్మజ్ఞానేన హేయా స్యా దసురాణా మితి స్మృతేః॥ ౮౬

తా॥ ఆగమాపాయి ధర్మము గల దేహాదు లనాత్మ లని నిశ్చిత మగుటచే నా దేహాదులందలి అహంతయు

మమతయు అవిద్యయే యగును. ఈ యవిద్యను ఆత్మజ్ఞాన ముచే నిర్మూలింపవలెను. ఈ దేహాత్మదృష్టిని ఆసురీదృష్టిగా నభివర్ణించెడి ఛాందోగ్యశ్రుతి ఇందుకు ప్రమాణము.

'అసురాణాం హ్యేషోపనిషత్'-ఛాం. ఉ. 8-8-5.

దశాహాశౌచకార్యాణాం పారివ్రాజ్యే నివర్తనమ్।
యథా జ్ఞానస్య సంప్రాప్తౌ తద్వ జ్జాత్యాదికర్మణామ్॥ ౨౭

తా॥ సన్న్యాసాశ్రమస్వీకారానన్తరము సాపిండ్యాభి మానము లేనందున సన్న్యాసికి దశహాశౌచాది కర్మానుష్ఠా నావశ్యకత లేనట్లే బ్రహ్మాత్మజ్ఞానము కలుగగనే, జాత్యాద్యభి మానము లేనందున జ్ఞానికి కర్మానుష్ఠానాభావము ప్రాప్తించును.

యత్కామ స్తత్క్రతు ర్భూత్వా కృతం త్వజ్ఞః ప్రపద్యతే।
యదా స్వాత్మదృశః కామాః ప్రముచ్యన్తేఽమృత స్తదా॥
౨౮

తా॥ దేహతాదాత్మ్యబుద్ధితో అజ్ఞాని తనకు గలుగు కోరికల కనుగుణముగ సంకల్పముల జేయుచు, తత్ఫలము నొందుచున్నాడు. బ్రహ్మాత్మజ్ఞానము కలుగుగనే కోరికలు నివర్తించి ముక్తు డగును. (చూ. భ. గీ. 4-20)

ఆత్మరూపవిధేః కార్యం క్రియాదిభ్యో నివర్తనమ్।
న సాధ్యం సాధనం వాఽత్మా నిత్యతృప్తః స్మృతే ర్మతః॥ ౪౯

తా॥ ఆత్మ సాధ్యము గాదు; సాధనము గాదు నిత్యతృప్తుడని స్మృతులు చెప్పినవి. ఈవిధముగా ఆత్మస్వరూపమును ప్రతిపాదించుటకు గల ప్రయోజనము కర్మాదులనుండి నివృత్తియే.

ఉత్పాద్యాప్యవికార్యాణి సంస్కార్యం చ క్రియాఫలమ్।
నాతోఽన్య త్కర్మణా కార్యం త్యజే త్తస్మా త్ససాధనమ్॥ ౫౦

తా॥ క్రియాఫలము ఉత్పాద్యము, ఆప్యము, వికార్యము, సంస్కార్యము-అని నాలుగు విధములు. ఇట్టి క్రియాఫలముతో ముముక్షువున కెట్టి ప్రయోజనము లేదు. అందుచే సాతడు సాధన సహిత కర్మత్యాగము చేయవలెను.

వి:-1. కుండను చేయుచున్నాడు-ఇచట క్రియాఫలమగు ఘటము ఉత్పాద్యము.

2. తండులములతో అన్నము వండుచున్నాడు—ఇట క్రియాఫలమగు అన్నము వికార్యము.

3. గ్రామమునుగూర్చి వెళ్ళుచున్నాడు—ఇట గమనక్రియాఫలమగు గ్రామము ఆప్యము.

4. అద్దమును శుద్ధి చేయుచున్నాడు—ఇట శుద్ధిక్రియాఫలము దర్పణము సంస్కార్యము.

ఆత్మయం దుత్పాద్యాదిగుణములు లేవు; అందుచే నే క్రియకును ఫలము (కర్మ) గాదు.

తాపాన్తత్వా దనిత్యత్వా దాత్మార్థత్వాచ్చ యా బహిః।
సంహృత్యాత్మని తాం ప్రీతిం సత్యార్థీ గురు మాశ్రయేత్॥
౫౧

తా॥ బాహ్య పుత్ర కళత్రాదుల యందలి ప్రీతి పరిణామమున దుఃఖరూపము, అసత్యము, స్వార్థప్రయుక్తము నగుటచే ఆ ప్రీతి నాత్మయందే ఉపసంహృతము గావించి నిత్యపురుషార్థి (సత్యార్థి) యై ముముక్షువు గురువు నాశ్రయింపవలెను.

వి :- సాధనసహిత కర్మత్యాగము మాత్రము చేతనే యాత్మజ్ఞానము సిద్ధింపదు. అందులకై గురూపసత్తి కర్తవ్యము.

శాన్తం ప్రాజ్ఞం తథా ముక్తం నిష్క్రియం బ్రహ్మణి స్థితమ్।
శ్రుతే రాచార్యవాన్ వేద తద్విద్ధీతి స్మృతే స్తథా॥౫౨

తా॥ 'ఆచార్యవాన్ పురుషో వేద'-(ఛాం.ఉ.6_14-2); 'తద్విద్ధి ప్రణిపాతేన'-(భ. గీ. 4_34) 'ఆచార్యు నాశ్రయించిన

పురుషునకే జ్ఞానము కలుగును'; 'ఆచార్యునకు ప్రణమిల్లి సేవించి యాత్మజ్ఞానము బడయుము'-ఇత్యాది శ్రుతి స్మృతి వచనముల ననుసరించి శాన్తుడు, మేధావి, ముక్తుడు, నిష్క్రియుడు, బ్రహ్మనిష్ఠుడు నగు గురువు నాశ్రయింపవలెను.

స గురు స్తారయే ద్యుక్తం శిష్యం శిష్యగుణాన్వితమ్।
బ్రహ్మవిద్యాప్లవేనాశు స్వాంతధ్వాంతమహోదధిమ్॥ ౫౩

తా॥ అట్టి గురువు శిష్యగుణాన్వితుడు, సమాహితచిత్తుడు నగు శిష్యుని బ్రహ్మ-విద్య యనెడి నౌకచే అంతఃకరణావృత అజ్ఞానసాగరము నుండి తరింపజేయును.

దృష్టిః స్పృష్టిః శ్రుతి ర్ఘ్రాతి ర్మతి ర్విజ్ఞాతి రేవ చ।
శక్తయోఽన్యాశ్చ భిద్యన్తే చిద్రూపత్వేఽప్యుపాధిభిః॥ ౫౪

తా॥ దర్శన-స్పర్శ-శ్రవణ-ఘ్రాణ-మనన-విజ్ఞానాది శక్తు లన్నియు చిద్రూపములే యైనను, భిన్నభిన్న-ఉపాధులు కారణముగా వానియందు భేదము కన్పట్టును.

అపాయోద్భూతిహీనాభి ర్నిత్యం దీప్యన్ రవి ర్యథా।
సర్వజ్ఞః సర్వదృక్ శుద్ధః సర్వం జానాతి సర్వదా॥ ౫౫

తా॥ జన్మవినాశరహితములైన కిరణములతో సూర్యుడు నిరంతరము వెలుగొందు విధముగా సర్వజ్ఞుడు, సర్వసాక్షి, శుద్ధ

స్వరూపుడు నగు ఆత్మ స్వస్వరూపభూత చిచ్ఛక్తి ద్వారా సర్వపదార్థముల దర్శించును.

అన్యదృష్టిః శరీరస్థ స్తావన్మాత్రో హ్యవిద్యయా।
జలేంద్వాద్యుపమాభిస్తు తద్ధర్మా చ విభావ్యతే॥ ౧౬

తా॥ శరీరస్థుడగు జీవుడు అనాత్మదృష్టి గలవాడగుటచే జలమున ప్రతిబింబించిన చంద్రునివలె అవిద్యావశుడై పరిచ్ఛిన్నుని వలె (శరీరపరిమాణమాత్రము గలవాని వలె) శారీరక ధర్మములతో నొప్పినవానివలె గన్పట్టును.

దృష్ట్వా బాహ్యం నిమీల్యాథ స్మృత్వా తత్త్వవిహాయ చ।
అథోన్మీల్యాత్మనో దృష్టిం బ్రహ్మ ప్రాప్నో త్యనధ్వగః॥

తా॥ బాహ్య జాగ్రత్ప్రపంచమును ప్రత్యక్షముగ దర్శించి ఘటాదులు మృత్తికాస్వరూపములే యగునట్లు విషయ జాతము నంతయు కారణమాత్రముగా దర్శించి కార్యజాతమును కారణమున లయింపజేయవలెను. వాసనామాత్రమగు స్వప్నప్రపంచమున (అనిర్వచనీయ) మిథ్యాస్వరూపముగా నెంచి సూక్ష్మ శరీరమును సయితము కారణచిదాభాస మాత్రముగ భావింపవలెను. పిదప సుషుప్త్యవస్థయందు బీజ మాత్రముగ నున్న అజ్ఞానమును అనిర్వచనీయముగా (సత్తస

గాని, అసత్తనిగాని, సదసత్తనిగాని నిర్వచింప శక్యము గాని దానినిగా) నెంచి, వివేకదృష్టితో బరిశీలించి, వచ్చుచు బోవుచు నుండెడి యీ మూడవస్థలకాధారమై, వానిని నిత్యము సాక్షియై దర్శించు ఉపాధిరహిత-ఆత్మస్వరూపమును దర్శించువాడు అర్చిరాది మార్గముల బొందక బ్రహ్మయే యయి విరాజిల్లును.

ప్రాణాద్యేవం త్రికం హిత్వా తీర్ణోఽజ్ఞానమహోదధిమ్।
స్వాత్మస్థో నిర్గుణః శుద్ధో బుద్ధో ముక్తః స్వతో హి సః॥
౫౮

తా॥ ఈ ప్రకారముగా ప్రాణ మనో బుద్ధు లనెడి త్రికమును, లేక జాగ్రత్ స్వప్న సుషుప్తులనెడి యవస్థాత్రయమును త్యాగము జేసి అజ్ఞానసాగరము నుండి యుత్తీర్ణుడైన పురుషుడు స్వయముగా ఆత్మనిష్ఠుడు, నిర్గుణుడు, శుద్ధుడు, బుద్ధుడు, ముక్తస్వరూపుడు నగును,

అజోఽహం చామరోఽమృత్యు రజరోఽభయ ఏవ చ।
సర్వజ్ఞః సర్వదృక్ శుద్ధ ఇతి బుద్ధో న జాయతే॥ ౫౯

తా॥ నేను జన్మరహితుడను, అమరుడను, మృత్యుశూన్యుడను, జరారహితుడను, భయరహితుడను, సర్వజ్ఞ

డను, సర్వసాక్షిని, శుద్ధుడను-అని యీరీతిగా నెఱిగిన జ్ఞాని మరల జన్మ నొందడు.

పూర్వోక్తం యత్తమోబీజం తన్నాస్తీతి వినిశ్చయః।
తదభావే కుతో జన్మ బ్రహ్మైకత్వం విజానతః॥ ౯౦

తా॥ పూర్వము ప్రతిపాదింపబడినట్లుగా సుషుప్తిరూప తమోబీజము లేదని విద్వాంసునకు నిశ్చయము గలుగును. ఆ యజ్ఞానము లేని కారణముగా బ్రహ్మాత్మైక్యజ్ఞానము గలవానికి పునర్జన్మ యెట్లు గలుగును?

క్షీరాత్ సర్పి ర్యథోద్ధృత్య క్షిప్తం తస్మి న్న పూర్వవత్।
బుద్ధ్యాదే ర్జ్ఞ స్తథాఽసత్యా న్న దేహీ పూర్వవద్భవేత్॥
౯౧

తా॥ పాలనుండి వెన్నను తీసి యా వెన్నను మరల పాలలో పడవైచిన, నది తిరిగి యథాపూర్వముగా పాలతో గలియదు. అట్లే, అసత్యం బుద్ధ్యాదిసంఘమునుండి వేఱుచేసి యాత్మ స్వరూపము నెఱిగి, 'అహం బ్రహ్మాస్మి' ఇత్యాది వాక్యములచే బ్రహ్మభావము నొందిన జ్ఞాని, దేహముతో జరించుచున్నను తిరిగి యథాపూర్వముగా దేహాదిసంఘాతమున తాదాత్మ్యాభిమానము గలిగి అజ్ఞానియై చరింపడు.

సత్యం జ్ఞాన మనన్తం చ రసాదేః పంచకాత్పరమ్।
స్యా మదృశ్యాది శాస్త్రోక్త మహం బ్రహ్మేతి నిశ్చయః॥
౯౨

తా॥ అదృశ్యాది శాస్త్రప్రతిపాదితమై అన్నమయాది పంచకోశముల కంటె అతీతమై సత్య-జ్ఞాన-అనంతస్వరూప మగు బ్రహ్మను నేను-అని తెలిసికొనిన జ్ఞాని నిర్భయు డగును.

వి :- 'సత్యం జ్ఞాన మనన్తం బ్రహ్మ......బ్రహ్మ పుచ్ఛం ప్రతిష్ఠా'—తై. ఉ. 2-5.

'అదృశ్యేఽనాత్మ్యేఽనిరుక్తేఽనిలయనేఽభయం ప్రతిష్ఠాం విందతే'—తై. ఉ. 2-7.

యస్మాద్భీతాః ప్రవర్తన్తే వాఙ్మనఃపావకాదయః।
తదాత్మానన్దతత్త్వజ్ఞో న బిభేతి కుతశ్చన॥ ౬౩

తా॥ ఎవనివలన భయపడినవారై అధ్యాత్మముగా వాక్-మనస్-పావకాదులు, అధిదైవముగా అగ్న్యాదులును భయపడి స్వ స్వ వ్యాపారములయందు ప్రవర్తింతురో, అట్టి ఆత్మానందతత్త్వము నెఱిగినవాడు ఎవరివలన భయపడును?

నామాదిభ్యః పరే భూమ్ని స్వారాజ్యే చేత్స్థితేఽద్వయే।
ప్రణమేత్ కం తదాత్మజ్ఞో న కార్యం కర్మణా తదా॥ ౬౪

తా॥ నామ-వాక్-మనస్సులు మున్నగునవి క్రమముగా ఒకదానికంటె నొకటి వ్యాపకము, అని చెప్పి, వీని యన్నిటి కంటే నతీతమై సర్వవ్యాపకమైనది భూమాఖ్య బ్రహ్మ యని

శ్రుతి ప్రతిపాదించినది. సర్వవ్యవహారాతీతము, అమృతము, సుఖరూపము, అద్వయము, స్వయంప్రకాశరూపమగు భూమాఖ్య బ్రహ్మను నేను-అని యాత్మనిష్ఠుడైన జ్ఞాని యెవనికి ప్రణామము జేయును? అట్టి దశయందు ఆ జ్ఞానికి కర్మ వలన ప్రయోజన మేమియు లేదు.

విరాడ్వైశ్వానరో బాహ్యః స్మరన్నన్తః ప్రజాపతిః।
ప్రవిలీనే తు సర్వస్మిన్ ప్రాజ్ఞోఽవ్యాకృత ముచ్యతే॥౬౫

తా॥ ఆ యాత్మతత్త్వము జాగ్రదవస్థయందు బహిః ప్రజ్ఞ గలవాడై వ్యష్టి-సమష్టిభేదముచే విశ్వ వైశ్వానరు లనియు, స్వప్నావస్థయందు వాసనామయ విషయముల దర్శించుచు తైజస హిరణ్యగర్భు లనియు, సుషుప్త్యవస్థయందు దృశ్యమగు సర్వము విలీనము కాగా, ప్రాజ్ఞ-అవ్యాకృత తత్త్వము (అవ్యాకృత మాయోపాధీశ్వరాఖ్యతత్త్వము) లనియు వ్యవహరింపబడుచుండును.

వాచారమ్భణమాత్రత్వాత్ సుషుప్తాది త్రికం త్వసత్।
సతోఽన్యోఽజ్ఞ శ్చాహ మిత్యేవం సత్యసంధో విముచ్యతే॥
౬౬

తా॥ పూర్వశ్లోకమున చెప్పబడినవిధముగా వ్యవహరింపబడుచున్నను,అవి వాచారమ్భణములు మాత్రమే యగుట

జేసి సుషుప్త్యాద్యవస్థలు మూడును మిథ్యయే (అసత్), వాని కంటె నతీతుడనై జ్ఞానస్వరూపుడగు ఆత్మను నేను-ఇట్టియాత్మ జ్ఞానము గల సత్యసంధుడగు పురుషుడు ముక్తుడగును.

వి :- వాచారమ్భణం వికారో నామధేయమ్, మృత్తికేత్యేవసత్యమ్-ఛా. ఉ. 6-1-4.

భానురూపత్వ ద్యథా భానో ర్నాహోరాత్రే తథైవ చ।
జ్ఞానాజ్ఞానే న మే స్యాతాం చిద్రూపత్వావిశేషతః॥ ౬౮

తా॥ నిత్యప్రకాశస్వరూపు డగుటచే సూర్యునకు అహోరాత్రములనెడి భేదమెట్లు లేదో, నిత్యచిద్రూపుడు (స్వప్రకాశస్వరూపుడు) అగుటచే ఆత్మకు జ్ఞానాజ్ఞానములు వాస్తవముగ లేవు. అవి ఆత్మయందారోపితములు మాత్రమే

వి:- ఇచట జ్ఞానమనగా వృత్తిజ్ఞానమని గ్రహించునది.

శాస్త్రస్యానతిశంక్యత్వాత్ బ్రహ్మైవ స్యా మహం సదా।
బ్రహ్మణో మే న హేయం స్యా ద్గ్రాహ్యం వేతి చ
సంస్మరేత్॥ ౬౯

తా॥ అతీంద్రియవిషయములలో శాస్త్రము ప్రమాణము. అట్టి శాస్త్రము విషయమున ఎట్టి శంకకు తావు లేదు. శాస్త్రప్రామాణ్యముచే నేను సదా బ్రహ్మస్వరూపుడను;

నాకు త్యాజ్యముగాని, గ్రాహ్యముగాని లేదు-అని యెల్లప్పుడు స్మరించుకొనుచుండవలెను.

అహమేవ చ భూతేషు సర్వేష్వేకో నభో యథా।
మయి సర్వాణి భూతాని పశ్యన్నేవం న జాయతే॥ ౬౯

తా॥ ఆకాశము వలె నేనొకడనే అన్ని భూతముల యందు వ్యాపించి యుంటిని. అన్ని భూతములు నాయందే యున్నవి-అని దర్శించువానికి పునర్జన్మ లేదు.

న బాహ్యం మధ్యతో వాఽన్తర్విద్యతేఽన్యత్ స్వతః క్వచిత్।
అబాహ్యాన్తః శ్రుతేః కించిత్తస్మాచ్ఛుద్ధః స్వయంప్రభః॥ ౭౦

తా॥ ఆత్మ బాహ్యాభ్యంతర రహితుడు—అని శ్రుతి చెప్పుటచే ఆత్మకంటె భిన్నముగ బాహ్యాభ్యంతరములయందు వస్తువేదియు లేదు. అందుచే ఆత్మ శుద్ధుడు; స్వయంప్రకాశుడు.

నేతి నేత్యాది శాస్త్రేభ్యః ప్రపంచోపశమోఽద్వయః।
అవిజ్ఞాతాదిశాస్త్రేభ్యశ్చ నైవ జ్ఞేయో హ్యతోఽన్యథా॥ ౭౧

తా॥ 'నేతి నేతి-(బృ. ఉ. 2-3-6)' ఇది కాదు; ఇది కాదు-అని సర్వప్రపంచమును నిషేధించు శాస్త్రముల వలన

ఆత్మ అద్వితీయుడని తెలియవలెను. దృశ్య ఘటాది పదార్థములు చిత్తాదింద్రియములకు గోచరమగునట్లు ఆత్మ ఇంద్రియగోచరుడు కాడు ప్రపంచసహితుడును కాడు.

'అన్యదేవ తద్విదితా దథో అవిదితా దధి'-కేన. ఉ. 1-3, 'యస్యామతంతస్యమతం మతంయస్య న వేద సః'-కేన.ఉ.2.3; 'అవిజ్ఞాతం విజ్ఞాతృ'-బృ.ఉ. 3-8-11.
ఇత్యాది శ్రుతులిచట ప్రమాణము.

సర్వస్యాత్మాహ మేవేతి బ్రహ్మ చే ద్విదితం పరమ్।
స ఆత్మా సర్వభూతానా మాత్మా హ్యేషా మితి శ్రుతేః॥ ౭౨

తా॥ నేను సర్వమునకు ఆత్మను-అని పరబ్రహ్మ విషయక జ్ఞానము గలిగినచో 'ఆత్మా హ్యేషాం స భవతి'—బృ. ఉ. 1-4-10-అనెడి శ్రుతివలన ఆ జ్ఞాని సర్వప్రాణులకు నాత్మ యగును.

జీవశ్చే త్పరమాత్మానం స్వాత్మానం దేవ మఞ్జసా।
దేవోపాస్యః స దేవానాం పశుత్వాచ్చ నివర్తతే॥ ౭౩

తా॥ జీవుడు ఆత్మస్వరూపుడగు పరమాత్మ దేవుని యపరోక్షముగా దెలిసికొనినచో నాతడు దేవతలకు నుపాస్యదేవుడగును; దేవతాపశుత్వము నుండియు నివృత్తుడగును.

అహమేవ సదాఽఽత్మజ్ఞః శూన్య స్త్వన్యై ర్యథాఽ
మ్బరమ్।
ఇత్యేవం సత్యసంధత్వా దసద్ధాతా న భిద్యతే॥ ౭౮

తా॥ నేనే సత్యస్వరూపుడు, చేతనుడు నగు ఆత్మను (తత్సత్యం స ఆత్మా- ఛాం. ఉ. 6-8-7) అని శ్రుతి. సజాతీయ విజాతీయ స్వగతభేదము లేనివాడను.(వాచారమ్భణం వికారో నామధేయమ్-ఛాం. ఉ. 6-1-4) అని శ్రుతి. ఆకాశము వలె దృశ్యవస్తుసంసర్గశూన్యుడను, సత్యసంధుడ నగుటచే అసత్యత్యాగము చేసిన పురుషుని (చోరుని) వలె బద్ధుడను గాను. (స యథా తత్ర న దాహ్యే తైతదాత్మ్య మిదం సర్వమ్— ఛాం. ఉ. 6-16-3) అను శ్రుతి

కృపణా స్తేఽన్యథై వాతో విదు ర్బ్రహ్మ పరం హి యే।
స్వరాడ్యోఽనన్యదృక్ స్వస్థ స్తస్య దేవా అసన్ వశే॥
౭౯

తా॥ ఎవరు బ్రహ్మను ఆత్మకంటె భిన్ననిగా తెలిసికొనుచున్నారో, వారు శోచ్యులు.ఎవడు బ్రహ్మను ఆత్మకంటె అభిన్ననిగా దర్శించునో, యతడు ఆత్మనిష్ఠు డగును. దేవగణమంతయు అతని యధీనమున నుండును.

వి :- య స్త్వేవం బ్రాహ్మణో విద్యాత్।
తస్య దేవా అసన్ వశే—తై. ఆ. 3-13.

హిత్వా జాత్యాదిసంబంధాన్ వాచోఽన్యాః సహకర్మభిః।
ఓమిత్యేవం సదాఽఽత్మానం సర్వం శుద్ధం ప్రపద్యథ॥
౨౬

తా॥ జాత్యాది సంబంధములను, కర్మలతోపాటు ఇతర వాక్కుల నన్నిటిని విడిచి ఎల్లపుడు అన్నిటికి నాధారభూతుడును, ఓంశబ్దవాచ్యుడునగు శుద్ధాత్మను శరణు బొందుము.(తమేవైకం జానథ ఆత్మాన మన్యా వాచో విముఞ్చథ'-ము. ఉ. 2-2-5)

సేతుం సర్వవ్యవస్థానాం అహోరాత్రాదివర్జితమ్।
తిర్యగూర్ధ్వ మధః సర్వం సకృజ్జ్యోతి రనామయమ్॥ ౨౭

తా॥ ఆత్మ, వర్ణాశ్రమాదిమర్యాద (వ్యవస్థ) లన్నిటికి సేతువు (విధారకుడు); అహోరాత్రాది విభాగము లేనివాడు; ఊర్ధ్వాధోభాగములు, ఇటునటు-అంతట వ్యాపించి యున్న వాడు; ఏకమాత్ర జ్యోతిఃస్వరూపుడు; అనామయుడు (నిర్దోషుడు).

వి:- 'అథ య ఆత్మా స సేతు ర్విధృతి రేషాం లోకానా మసంభేదాయ, నైతం సేతు మహోరాత్రే తరతః...... సకృద్విభాతో హ్యేవైష బ్రహ్మలోకః'— ఛా. 8, 4, 1-2

ధర్మాధర్మవినిర్ముక్తం భూతభవ్యాత్ కృతాకృతాత్।
స్వ మాత్మానం పరం విద్యా ద్విముక్తం సర్వబంధనైః॥
౨౮

తా॥ తన యాత్మస్వరూపము ధర్మాధర్మవర్జితము, భూత భవిష్యత్తులు, కార్యకారణములు-వీనికంటె భిన్నుడు, సర్వ బంధవిముక్తుడు-అని తెలియవలెను.

వి :- "అన్యత్ర ధర్మా దన్యత్రాధర్మా దన్యత్రాస్మత్ కృతాకృతాత్ ।అన్యత్ర భూతాచ్చ భవ్యాచ్చ యత్తత్పశ్యసి తద్వద— కఠ. ఉ. 2-14

అకుర్వ న్ సర్వకృచ్ఛుద్ధ స్తిష్ఠ న్నత్యేతి ధావతః।
మాయయా సర్వశక్తిత్వా దజః స న్ బహుధా మతః॥
౭౯

తా॥ ఆత్మ యేమియు చేయకయే సర్వము చేయువాడు; శుద్ధుడు; కదలకయుండియే పరుగిడుచు మనస్సు, ప్రాణము మొదలగువానికంటె ముందుగా బోవును; మాయద్వారా సర్వశక్తిసంపన్నుడై, వస్తుతః జన్మరహితుడయ్యు, అనేక ప్రకారముల జన్మలెత్తుచుండును.

వి:- 'అనేజదేకం మనసో జవీయః' – ఈశ. ఉ.4, 8, 4
'తద్ధావతోఽన్యా నత్యేతి తిష్ఠత్'—ఈశ. ఉ. 4
'అజాయమానో బహుధా విజాయతే'—తై. ఆ. 3-13

రాజవ త్సాక్షిమాత్రత్వాత్ సాంనిధ్యాత్ భ్రామకో యథా।
భ్రామయ న్ జగదాత్మాఽహం నిష్క్రియోఽకారకోఽ
ద్వయః॥ ౮౦

తా॥ అయస్కాంతము తన సాంనిధ్యమాత్రముననే లోహఖండమును భ్రమింపజేయు విధముగా జగత్తునంతయు భ్రమింపజేయుచునే ఆత్మ, రాజు వలె సాక్షిమాత్రుడుగా నుండుటవలన నిష్క్రియుడు, అకర్త, అద్వితీయుడు నగు చున్నాడు.

నిర్గుణం నిష్క్రియం నిత్యం నిర్ద్వన్ద్వం యన్నిరామయమ్।
శుద్ధం బుద్ధం తథా ముక్తం తద్బ్రహ్మాస్మీతి ధారయేత్॥
౮౧

తా॥ నిర్గుణము, నిష్క్రియము, నిత్యము, ద్వంద్వ రహితము, నిర్దోషము, శుద్ధ-బుద్ధ-ముక్తస్వరూపము నగు బ్రహ్మను నేనని నిశ్చయించవలెను.

బన్ధం మోక్షం చ సర్వం యత ఇద ముభయం హేయ
మేకం ద్వయం చ।
జ్ఞేయం జ్ఞేయాభ్యతీతం పర మధిగతం తత్త్వ మేకం
విశుద్ధమ్॥
విజ్ఞాయైత ద్యథావచ్ఛ్రుతిమునిగదితం శోకమోహా వతీతః
సర్వజ్ఞః సర్వకృత్స్యా ద్భవభయరహితో బ్రాహ్మణోఽ
వాప్తకృత్యః॥ ౮౨

తా॥ బంధమోక్షములకు గారణములైన అజ్ఞాన-జ్ఞాన స్వరూపముల నెఱిగి, కారణమును, జ్ఞేయము కార్యమునగు విషయజాతమును హేయము(బాధ్యము)గా దెలిసి, శ్రుతులచే మహర్షులచే ప్రతిపాదితమైన భోగ్యవిషయజాతము కంటె అతీతమైఏకమై, విశుద్ధమైన పరమ తత్త్వమును స్వానుభవము ద్వారా అన్నివిధముల దర్శించిన బ్రహ్మవేత్త శోకమోహా తీతుడు, సర్వజ్ఞుడు, సర్వకర్మకృత్, సంసారభయరహితుడు, కృతకృత్యుడు నగును.

న స్వయం స్వస్య నాన్యశ్చ నాన్యస్యాత్మా చ హేయగః।
ఉపాదేయో న చాప్యేవ మితి సమ్యఙ్మతిః స్మృతా॥ ౮౩

తా॥ఒకేదానియందు కర్తృత్వము,కర్మత్వము సంభవింపదు గాన, స్వయముగ ఆత్మ తనకు దాను త్యాజ్యుడు (హేయః) గాని, గ్రాహ్యుడు (ఉపాదేయుడు) గాని కాడు. అదేవిధముగ ఆత్మకంటె భిన్నముగ పరమార్థసత్త గల వస్తువేదియు లేనం దున, అన్యము గూడ ఆత్మకు హేయముగాని, ఉపాదేయము గాని కాదు. ఆత్మకంటె భిన్నముగ మఱియొక ఆత్మ లేనందున మఱియొకని ఆత్మయు హేయుడుగాని, ఉపాదేయుడుగాని గాడు. ఇట్టి నిష్ఠను 'సమ్యఙ్మతి' యని చెప్పుదురు.

ఆత్మప్రత్యాయికా హ్యేషా సర్వవేదాన్తగోచరా।
జ్ఞాత్వైతాం హి విముచ్యన్తే సర్వసంసారబన్ధనైః॥ ౮౪

తా॥ సర్వవేదాన్తవాక్య ప్రతిపాదితమైన యీ సమ్యజ్ఞతి ఆత్మయొక్క బ్రహ్మాత్వమును అనుభవగోచర మగునట్లు చేయునట్టిది. అట్టి యీ సమ్యజ్ఞతిని చక్కగా తెలిసికొనిన వారు సర్వవిధ సంసారబంధములనుండి విముక్తులగుదురు.

రహస్యం సర్వవేదానాం దేవానాం చాపి యత్పరమ్।
పవిత్రం పరమం హ్యేతత్ తదేత త్సంప్రకాశితమ్॥ ౮౫

తా॥ సర్వవేదరహస్యము, దేవతలకు సయిత మత్యంత రహస్యము, అత్యంతప్రియము నగు నీ పరమపవిత్ర తత్త్వజ్ఞానము ఈ ప్రకరణమున జక్కగా విశదీకరింపబడినది.

నైత ద్దేయ మశాన్తాయ రహస్యం జ్ఞాన ముత్తమమ్।
విరక్తాయ ప్రదాతవ్యం శిష్యాయానుగతాయ చ॥ ౮౬

తా॥ శ్రుతిరహస్యభూత మయిన యీ యుత్తమ జ్ఞానమును (విద్యను) అశాంతచిత్తున కీయరాదు; విరక్తుడు, అనుగతుడు నగు శిష్యునకే యొసగవలెను.

దదత శ్చాత్మనో జ్ఞానం నిష్క్రయోఽన్యో న విద్యతే।
జ్ఞాన మిచ్ఛం స్తరే త్తస్మా ద్యుక్తః శిష్యగణైః సదా॥
౮౭

తా॥ ఇట్టి యాత్మజ్ఞానము నుపదేశించు ఆచార్యుఁడు కృతకృత్యుఁడైనందున, ఎన్నఁడు లోభములకు లొంగి యుపదేశము చేయువాఁడు కానందున, కృపతో యాచార్యుఁ డుపదేశించు రీతిగా ఆత్మజ్ఞానమును బొందగోరు శిష్యుఁడు అమానిత్వాది శిష్యగుణయుక్తుఁడై తరించవలెను.

జ్ఞానం జ్ఞేయం తథా జ్ఞాతా యస్మా దన్య న్న విద్యతే।
సర్వజ్ఞః సర్వశక్తి ర్య స్తస్మై జ్ఞానాత్మనే నమః॥ ౦ ౦

తా॥ జ్ఞానము, జ్ఞేయము, జ్ఞాత—ఈ మూఁడు నెవనికంటె భిన్నములు గావో, యట్టి సర్వజ్ఞుఁడు, సర్వశక్తియు, జ్ఞానస్వరూపుఁడు నగు బ్రహ్మకు నమస్కారము.

విద్యయా తారితాః స్మో యై ర్జన్మమృత్యుమహోదధిమ్।
సర్వజ్ఞేభ్యో నమ స్తేభ్యో గురుభ్యోఽజ్ఞానసంకులమ్॥ [illegible]

తా॥ ఎవరు జ్ఞానముచే అజ్ఞానకల్లోలితము, జన్మమృత్యురూపము నగు సంసారసాగరమునుండి తరింపజేసిరో, యట్టి సర్వజ్ఞులగు గురుదేవులకు నమస్కారము.

— ౦ —

# తత్త్వమసి ప్రకరణము - 18

పూర్వ ప్రకరణమున మోక్షసాధనము బ్రహ్మాత్మ విషయము నగు అపరోక్షజ్ఞానము వేదాంతవాక్యముల వలన గలుగు నని చెప్పబడినది. అది యుక్తము గాదు. 'స్వర్గకామో యజేత'-ఇత్యాది వాక్యముల వలె వేదాంతములు గూడ పరోక్ష జ్ఞాన జనకములే గాని, యపరోక్ష జ్ఞాన జనకములు గావని కొందఱు వాదించుచున్నారు. ఆ మతమును నిరాకరించుచు శ్రుతిసమ్మతమైన పూర్వోక్తస్వసిద్ధాంతమును శ్రుతియుక్తులద్వారా స్ఫుటముగ నుపపాదించుటకయి యీ ప్రకరణ మారంభింపబడుచున్నది.

యేనాత్మనా విలీయన్తే ఉద్భవన్తి చ వృత్తయః।
నిత్యావగతయే తస్మై నమో ధీప్రత్యయాత్మనే॥ ౧

తా॥ ఏ యాత్మస్వరూపము వలన అంతఃకరణము యొక్క వృత్తులుదయించుచు నా స్వరూపము నందే లయము చెందుచు నుండునో బుద్ధివృత్తుల కధిష్ఠానభూతుడు నిత్యజ్ఞానస్వరూపుడు నగు ఆత్మకు నమస్కారము.

ప్రమథ్య వజ్రోపమ యుక్తిసంభృతైః
శ్రుతే రరాతీన్ శతశో వచోఽసిభిః।
రరక్ష వేదార్థనిధిం విశాలధీః
నమో యతీంద్రాయ గురో ర్గరీయసే॥ 2

తా॥ వజ్రతుల్య యుక్తులతో అభేద్యములై, సుసంఘటితములైన వేదాంతవాక్యము లనెడి ఖడ్గములతో భేదతత్త్వారణ్యవాసులు, అద్వైత రత్నాపహారు లైన శత్రువులను నిర్మూలించి వేదాంత మంజూషాగత మైన నిధిని - అద్వయ బ్రహ్మాత్మ తత్త్వమును - రక్షించిన మహాబుద్ధిశాలి, యతీంద్రుడు నగు పరమ గురుదేవునకు(శ్రీ గౌడపాదాచార్యునకు) నమస్కారము.

నిత్యముక్తః సదేవాస్మీ త్యేవం చే న్న భవే న్మతిః।
కిమర్థం శ్రావయ త్యేవం మాతృవ చ్ఛ్రుతి రాదృతా॥ 3

తా॥ నేనే సద్రూపుడను, నిత్యముక్తుడను - అని యీ విధముగా నపరోక్షజ్ఞానము వేదాంత వాక్యములచే గలుగనిచో హితైషిణి యగు తల్లి వలె శ్రుతి ఆదరముతో మరల మరల నీ విధముగా నెందుకు ఉపదేశించును?

వి :- పూర్వ శ్లోకమున నమస్కార వ్యాజముచే ప్రకరణార్థమును సంప్రదాయశుద్ధి చెప్పబడి, తత్త్వమస్యాది మహావాక్యముల చేతనే ఆత్మాపరోక్ష జ్ఞానము గలుగు నను ప్రకరణ సిద్ధాన్తము ఇట చెప్పబడుచున్నది.

సిద్ధా దేవాహ మిత్యస్మి ద్యుష్మద్ధర్మో నిషిధ్యతే।
రజ్జ్వా మివాహిధీ ర్యుక్త్యా తత్త్వ మిత్యాది శాసనైః॥౨

తా॥ రజ్జువు నందలి సర్పబుద్ధి ఆప్తవాక్యములచే నివృత్త మగునట్లు అహంపద - లక్ష్యమై అపరోక్షముగా స్వతఃసిద్ధమయిన ఆత్మయందు దోచు యుష్మద్ధర్మములు (అహంకారాది_ఆత్మధర్మములు) యుక్తిసహితములైన తత్త్వమస్యాది ఉపదేశములచే నిషేధము చేయబడి నివర్తించుచున్నవి.

శాస్త్రప్రామాణ్యతో జ్ఞేయా ధర్మాదే రస్తితా యథా।
విషాపోహో యథా ధ్యానాత్ పాప్మనతః స్యా త్పాప్మన
స్తథా॥ ౩

తా॥ శాస్త్రప్రామాణ్యముచే ధర్మాదుల యొక్క అస్తిత్వము తెలియబడు నటుల,గారుడాది మన్త్రి బీజ ధ్యానముచే విషము హరించు విధముగా వేదాంతవాక్యజన్య తత్త్వ జ్ఞానముచే అజ్ఞానరూప పాపము యొక్క నివృత్తి కలుగును.

సత్ప్రబ్రహ్మాహం కరోమీతి ప్రత్యయా వాత్మసాక్షికౌ।
తయో రజ్ఞానజస్యైవ త్యాగో యుక్తతరో మతః॥ ६

తా॥ "నేను సద్రూపబ్రహ్మను"-అను ప్రతీతి వలె "నేను చేయుచున్నాను"-అను ప్రతీతియు అనుభవ సిద్ధమే. ఆత్మసాక్షికము లగు నీ ప్రత్యయములలో అజ్ఞానజన్య మగు 'నేను చేయుచున్నాను' అను ప్రతీతికే బాధ చెప్పుట యుక్తతరము.

సదస్మీతి ప్రమాణోత్థా ధీ రన్యా తన్నిభోద్భవా।
ప్రత్యక్షాది నిభా వాఽపి బాధ్యతే దిగ్భ్రమాదివత్॥ २

తా॥ "నేను సద్రూపుడను" అను జ్ఞానము నిష్ప్ర ప్రమాణ జనితము; "నేను చేయుచున్నాను" అనెడి ప్రతీతి అవివేక దోష సహకృత ప్రమాణాభాస జాతము. అది ప్రత్యక్షాది ప్రమాణజన్య జ్ఞానసదృశ మయ్యును దిగ్భ్రమాది జ్ఞానము వలె బాధ్యమే యగును.

వి :- శ్రుతి-లిఙ్గ-వాక్య - ప్రకరణ-స్థాన - సమాఖ్యలారింటిలో పూర్వపూర్వము బలీయ మనెడి జైమినీయ సిద్ధాన్తము ననుసరించి లింగాదు లన్నిటికంటె శ్రుతి ప్రబలము. పూర్వప్రవృత్తమై యాగమునకు వినియోగము జెప్పు శ్రుతిచే పశ్చాత్ప్రవృత్తము లగు లింగాదులు ప్రాప్తములు కాకయే

బాధింపబడును. ఇట బాధక మగు శ్రుతి పూర్వప్రవృత్తము; బాధ్యము లగు లింగాదులు పశ్చాత్ప్రవృత్తములు. ప్రకృతివ ద్వికృతిః కర్తవ్యా-ప్రకృతి యాగము నందలి అంగములు వికృతి యాగమునం దతిదిష్టములై పూర్వప్రవృత్తము లైనను వికృతియాగమునం దుపదేశింపబడి పశ్చాత్ప్రవృత్తము లగు విశేషాంగములచే బాధింపబడును. ఇట బాధ్యము లగు ప్రకృతియాగాంగములు పూర్వ ప్రవృత్తములు. బాధకము లగు వికృతియాగ గత విశేషాంగములు పశ్చాత్ప్రవృత్తములు. ఇట్లు పూర్వ తంత్రమున బాధ్యబాధకముల పూర్వాపరీభావమునకు అనియమ మున్నను-ఇట ఆత్మజ్ఞానము బాధకము. నేను చేయుచున్నాను - అనెడి జ్ఞానము అవివేకమూలమై బాధ్యము. ఇట బాధ్య - బాధక భావము నియతము-అనియమము లేదు. అందుచే అట్లు బాధింపబడుట యుక్తతర మని శ్లోకమున జెప్పబడినది.

కర్తా భోక్తేతి యచ్ఛాస్త్రం లోకబుద్ధ్యనువాది తత్।
సదస్మీతి శ్రుతేర్జాతా బాధ్యతేఽన్యైతయైవ ధీః॥ ౮

తా॥ బ్రహ్మాస్మి - యను బుద్ధి వలె-సత్యంవద, ధర్మం చర, స హి కర్తా - ఇత్యాది - వచనములచే "కర్తను, భోక్తను" అనెడి బుద్ధియు శ్రుతిసిద్ధమే. అయ్యును శాస్త్ర పరిచయము లేని అజ్ఞానులకు సయితము కర్తృత్వ భోక్తృ

త్వాది బుద్ధి అనుభవసిద్ధము కదా! - అట్టి బుద్ధిని నూతనముగా శాస్త్రముపదేశింప నక్కఱ లేదు. అందుచే శ్రుతి అనుభవసిద్ధ మయిన కర్తృత్వాది బుద్ధిని యనువదించుచున్న దని యంగీకరింపవలెను. అన్యథాసిద్ధము గాని - తెలియని-హితకర మైన యర్థము నుపదేశించుటకే గదా శాస్త్రము ప్రవృత్తము.అందుచే అన్యథా సిద్ధము గాని-లోకానుభవసిద్ధము గాని-నిరవకాశ శ్రుతివాక్య సిద్ధ మైన-'అహం బ్రహ్మాస్మి' యనెడి బుద్ధిచే సావకాశ మగు "నేను కర్తను; భోక్తను" - అను బుద్ధి బాధింపబడును.

సదేవ త్వమసీత్యుక్తే నాత్మనో ముక్తతా స్థిరా।
ప్రవర్తతే ప్రసంఖ్యాన మతో యుక్త్యాఽనుచింతయేత్ ॥౯

తా॥ నీవు సద్రూప బ్రహ్మవు - అని చెప్పినంత మాత్రమున ఆత్మకు ముక్తి స్థిరము గాదు. అందుచే ప్రసంఖ్యానము (పునః పునః వాక్యానుచింతనము) ప్రసక్త మగును. కాన, యుక్తిపూర్వకముగా నిరంతరము వాక్యార్థవిచారము చేయవలెను.

సకృదుక్తం న గృహ్ణాతి వాక్యార్థజ్ఞోఽపి యో భవేత్।
అపేక్షతేఽత ఏవాన్య దవోచామ ద్వయం హి తత్॥
౧౦

తా॥ వాక్యార్థజ్ఞానము కలవాడయ్యు ఒకమారు మహా వాక్యమును చెప్పినంతనే దానిని గ్రహించజాలక పోయినచో అతనికి సహకారి సాధనముల యపేక్ష యుండును. కావుననే పూర్వశ్లోకమున - వాక్యానుచింతనము, యుక్తిపూర్వక విచారము - అను రెండు సాధనములను జెప్పితిమి.

నియోగోఽప్రతిపన్నత్వాత్ తస్మిన్ స యథా భవేత్ ।
అవిరుద్ధో భవేత్తావ ద్యావత్సంవేద్యతాఽదృఢా॥ ౧౧

తా॥ దృఢమైన జ్ఞానము కలుగునంత వఱకు స్వరూపోపలబ్ధి-అపరోక్షాత్మసాక్షాత్కారము సిద్ధింపని కారణముగా తత్సిద్ధికై యజ్ఞాది కర్మలకు వలె "నిదిధ్యాసేత్" ఇత్యాది విధులు నియామకము లగుట యుక్తమే యగును.

చేష్టితం చ యతో మిథ్యా స్వచ్ఛందః ప్రతిపద్యతే।
ప్రసంఖ్యాన మతః కార్యం యావదాత్మా[illegible]॥
౧౨

తా॥ విధితో నిమిత్తము లేకయే స్వచ్ఛందముగ వాక్యముచే స్వయముగ నెవడైన బ్రహ్మాత్మైక్య జ్ఞానమును పొంద జాలునో, అనుష్ఠేయమానములగు యమనియమాదులు సాధింపదగినది (ఉపకార్యము) లేనందున, మిథ్యయే యగును. అందుచే ఆత్మసాక్షాత్కార పర్యంతము విధి ననుసరించి ప్రసంఖ్యానమును (మనన నిదిధ్యాసలను) చేయవలెను.

సదస్మీతి చ విజ్ఞాన మక్షజో బాధతే ధ్రువమ్।
శబ్దోత్థం దృఢసంస్కారో దోషై శ్చాకృష్యతే బహిః॥ ౧౬

తా॥ మఱియు, 'నేను సత్స్వరూపుడను'—అనెడి శబ్ద జన్య విజ్ఞానము కలిగినను దానిని ఇంద్రియజన్య మగు "నేను కర్తను, భోక్తను" అనెడి చిరాభ్య స్త మగు ప్రత్యక్షజ్ఞానము అడ్డుకొనును. మఱియు, రాగాది దోషములు ముముక్షువును బహిర్ముఖుని జేసి యాకర్షించును. కాన నిట్టి దోషనివృత్తికై ప్రసంఖ్యాన మావశ్యకము.

శ్రుతానుమానజన్మానౌ సామాన్యవిషయౌ యతః।
ప్రత్యయా వక్షజోఽవశ్యం విశేషార్థో నివారయేత్॥ ౧౭

తా॥ శబ్దప్రమాణము చేత గాని, అనుమానప్రమాణముచే గాని గలుగు జ్ఞానము సామాన్యరూపము. అది భ్రాన్తి మూలము, వంచనాత్మకము గూడ గావచ్చును. ప్రత్యక్షజ్ఞాన మట్టిది గాదు. అందుచే విశేషార్థబోధక మగు ప్రత్యక్ష జ్ఞానము పై జ్ఞానమును - శబ్దజన్య బ్రహ్మాత్మ జ్ఞానమును బాధించును.

వి :- శబ్దముచే గాని, అనుమాన ప్రమాణముచే గాని గలుగు అగ్నివిషయక జ్ఞానము కంటె ప్రత్యక్షముగ జూచు

నపుడు గలుగు అగ్నిజ్ఞానము విశేషార్థ బోధకము. విశేషము సామాన్యము కంటె ప్రబలము. కాన, ప్రత్యక్షజ్ఞానము శాబ్దానుమాన జన్య సామాన్యజ్ఞానమునకు బాధకము.

వాక్యార్థప్రత్యయీ కశ్చి న్నిర్దుఃఖో నోపలభ్యతే।
యది వా దృశ్యతే కశ్చి ద్వాక్యార్థ శ్రుతిమాత్రతః॥ ౧౫

నిర్దుఃఖోఽతీతదేహేషు కృతభావో ఽనుమీయతే।
చర్యా నోఽశాస్త్రసంవేద్యా స్యా దనిష్టం తథాసతి॥ ౧౬

తా॥ కేవల వాక్యార్థ జ్ఞానముచే పురుషుడు దుఃఖరహితు డగుట నెచటను గాంచము. కేవలము వాక్యార్థ శ్రవణ మాత్రముచే దుఃఖరహితు డగువాడు శ్రుతి, పురాణాదుల యందు ఎవరేని కనబట్ట వచ్చును. అట్టి యతడు పూర్వ జన్మయందు ప్రసంఖ్యానాభ్యాసము చేసియుండు నని అనుమాన ప్రమాణముచే (నిర్దుఃఖత్వ లిఙ్గముచే) ఊహింప నగును. మఱియు కేవల వాక్యార్థశ్రవణము చేసి ప్రసంఖ్యానవిధి నంగీకరింపనిచో మా యీ సంన్యాస ధర్మాచరణము శాస్త్ర విహితము కాకపోవలసి వచ్చును. అట్లైచో అనిష్టము - యత్యాశ్రమచర్యాపరిత్యాగము చేసినను ఆరూఢపతితత్వ దోషము - ప్రసక్తము గావ నెడి యనిష్టము గలుగును.

సదసీతి ఫలం చోక్త్వా విధేయం సాధనం యతః।
న తదన్య త్ప్రసంఖ్యానా త్ప్రసిద్ధార్థ మిహేష్య తే॥ ౧౭

తా॥ సదసి-నీవు సద్రూపుఁడ వని ఫలము జెప్పి దానికి సాధనము తరువాత విధింపవలెను. స్వర్గకాముఁడు యజ్ఞము చేయవలె ననెడి విధి యున్నట్లు బ్రహ్మాత్మైక్యకాముఁడు ప్రసంఖ్యానము చేయవలె ననెడి సార్థకవిధి ప్రసక్త మగును. వేదాన్త ప్రసిద్ధార్థము నభివ్యక్తము జేయుటకు ప్రసంఖ్యానము కంటె వేఱు సాధన ముపయుక్తము గాదు.

తస్మా దనుభవాయైవ ప్రసంచక్షీత యత్నతః।
త్యజన్ సాధన తత్సాధ్య విరుద్ధం శమనాదిమాన్॥ ౧౮

తా॥ ఇందువలన శమదమాది సంపన్నపురుషుఁడు ప్రసంఖ్యాన సాధ్య మగు బ్రహ్మాత్మైక్య సాక్షాత్కారమునకు విరుద్ధ మగు కర్మనిష్ఠను త్యాగము జేసి ఆత్మానుభవమున కయి ప్రయత్నపూర్వకముగా ప్రసంఖ్యానాభ్యాసము జేయవలెను.

నైత దేవం, రహస్యానాం నేతినేత్యవసానతః।
క్రియాసాధ్యం పురా శ్రావ్యం స మోక్షో నిత్యసిద్ధతః॥౧౯

తా॥ ఇట్లు చెప్పుట సరి కాదు. వేదాంత వాక్యములు సాక్షాత్తు ప్రసంఖ్యానమును విధించుచున్న వనియెదరా? లేక- ఆత్మసాక్షాత్కార రూప ఫల మన్యథా సిద్ధించదు. కనుక తత్సిద్ధికై ప్రసంఖ్యాన విధి కల్ప్య మందురా? ఏదియును గాదు. నేతినేతీత్యాది వాక్యములచే జేయబడు దృశ్య నిషేధమున కవధిభూతమైన పరబ్రహ్మ తత్త్వమునందే వేదాంతవాక్యము తాత్పర్యము గాని ప్రసంఖ్యాన విధియందు గాదు. బ్రహ్మాత్మ సాక్షాత్కారము ఫల మనుటయు తగదు. క్రియాసాధ్యము గదా ఫలము! మోక్షము నిత్యసిద్ధ మగుట జేసి క్రియా సాధ్యము గాదు. అందుచే క్రియాసాధ్య ఫల వ్యవహారము పూర్వకాండ యందే - ఉత్తరకాండ (వేదాన్తము) యందు గాదు. ఇట్లు మోక్షము ఫలమే కాని యపుడు తత్సిద్ధికై ప్రసంఖ్యానవిధి కల్ప్యము గాదు.

పుత్రదుఃఖం యథాధ్యస్తం పిత్రాఽదుఃఖే స్వ ఆత్మని।
అహం కర్తా తథాఽధ్యస్తో నిత్యదుఃఖే స్వ ఆత్మని॥ ౨౦

తా॥ తండ్రి యే విధముగ జ్వరాది దుఃఖరహిత మైన తన యాత్మయందు నేను కర్తను, భోక్తను - అని యీ విధముగ కర్తృత్వ భోక్తృత్వాది ధర్మముల నారోపించుకొనును.

సోఽధ్యాసో నేతి నేతీతి ప్రాస్తవ త్ప్రతిషిధ్యతే।
భూయోఽధ్యాసవిధిః కశ్చి త్కుతశ్చి న్నోపపద్యతే॥ ౨౧

తా॥ శుక్తియందు రజతము వలె భ్రాంతివశమున ఆత్మ యందు అధ్యస్త మయిన యజ్ఞానము యదార్థముగ నున్నట్లు భాసించి నేతి నేతి - తత్త్వమసి - ఇత్యాది వాక్యములచే నిషేధింప బడుచున్నది. అట్లు నిషేధింప బడి నంతనే సుషుప్తి యందు వలె సర్వక్రియా రహితుడై ఆత్మ భాసించుటచే, తిరిగి అధ్యాస బీజము (అజ్ఞానము) లేనందున కృతకృత్యు డగు టచే ప్రసంఖ్యాన విధి యావశ్యకత లేదు.

ఆత్మనీహా యథాధ్యాసః ప్రతిషేధ స్తథైవ చ।
మలాధ్యాస నిషేధౌ ఖే క్రియేతే చ యథాఽబుధైః॥౨౨

తా॥ ఇంద్రియగోచర మైన(విషయమైన) శుక్తియందు లేక రజ్జువు నందు రజత సర్పాదుల అధ్యాస (ఆరోపము) యుక్తమే. ఇంద్రియ గోచరము గాని (అవిషయమైన) ఆత్మ యందు కర్తృత్వ భోక్తృత్వ దుఃఖిత్వాది ధర్మముల అధ్యాస యెట్లు ఉపపన్న మగును? ఈ వాదము సరి కాదు. దేహాతి రిక్తముగ ఆత్మ యున్న దని యంగీకరించెడి నైయాయిక మతమున ఆత్మయందు దేహధర్మము లగు జరామరణాదుల నెట్లధ్యసించి ప్రతిషేధము చేయుచున్నారో, శాస్త్రజ్ఞానము లేని పామరులు అవిషయమైన ఆకాశమున మాలిన్యాది ధర్మ ముల నారోపించి నిషేధము చేయుచున్నారో, యదే విధముగ

అవిషయమైన ప్రత్యగాత్మ యందును సంసారము యొక్క అధ్యాస జేసి నిషేధించుచున్నారు.

వి :- "ఆత్మనీహ తథాఽధ్యాసః" యనియు నిచట పాఠాన్తరము గలదు. ఆ పాఠమున ఉత్తరార్ధమును దృష్టాన్త పరముగను, పూర్వార్ధమును దార్ష్టాంతిక పరముగను యోజన చేయవలెను.

ప్రాప్తశ్చేత్ప్రతిషిధ్యేత మోక్షోఽనిత్యో భవేద్ధ్రువమ్,
అతోఽప్రాప్తనిషేధోఽయం దివ్యగ్నిచయనాదివత్॥

౨౩

తా॥ ఆత్మయందు ప్రాప్తమయియే సంసారబంధము నిషేధింపబడుచున్న దని యంగీకరించుచో నట్లు నషేధసిద్ధమయిన మోక్షమనిత్యమే కావలసి వచ్చును. అందుచే ఆకాశమునందు అగ్నిచయనము యొక్క నిషేధము వలె సంసార బంధ - నిషేధము గూడ అప్రాప్తనిషేధ మనియే యంగీకరింపవలెను.

వి :- ప్రాప్తమయిన బంధమునకే నేతినేతీతి వాక్యములచే నిషేధ మని చెప్పుచో, నిషేధము వలన ప్రాప్తించిన మోక్ష మాగంతుకము, సాదియు (ఉత్పత్తి గలది) నగుటచే

అనిత్యము కావలసి వచ్చును. బంధము సత్యమై వస్తుతః దానికి నిషేధము చెప్పుచో, ఆత్మకు అవస్థాంతరము ప్రాప్తించి వికారిత్వము - అందువలన అనిత్యత్వ మావశ్యక మగును. మఱియు అనాదిభావ రూప మగు బంధము సత్య మగుచో, దానికి నిషేధముచే నివృత్తియే పొసగదు. బంధము అనాది గాక సాదియే యందురా? అది యాత్మచే నుత్పన్నమై, నిషేధము చేయబడుచో నివృత్త బంధ సజాతీయమైన బంధము మరల నాత్మవలన నుత్పన్నమై మోక్ష మనిత్యము గావలసి వచ్చును. మఱియు ప్రాప్తమయిన దానికే నిషేధము(ప్రాప్త నిషేధము) అనియెడి నియమము లేదు. 'నాంతరిక్షే న దివ్యగ్ని శ్చేతవ్యః'(తై.సం. 5-2-7)-అంతరిక్షమున గాని, ఆకాశమున గాని అగ్నిచయనము చేయరాదు - అని శ్రుతివాక్యమున కర్థము. పృథివియందు వలె అంతరిక్షమున గాని, ఆకాశమున గాని అగ్నిచయనము ప్రాప్తము కానేకాదు. అందుచే అగ్ని చయనము నంతరిక్షాదుల యం దారోపించి అప్రాప్త మయిన దానినే శ్రుతి నిషేధించు చున్నదని యంగీకరింపవలెను.అట్లే సంసారబంధరహితమైన ఆత్మ యందే బంధారోప నిషేధము లని యంగీకరింపవలెను. అట్టి బంధము జ్ఞానముచే నివృత్త మగును గాన, ప్రసంఖ్యానము నిరర్థకము.

సంభావ్యో గోచరే శబ్దః ప్రత్యయో వా న చాన్యథా।
న సంభావ్యో తదాత్మత్వాత్ అహంకర్తు స్తథైవ చ॥ ౨౮

తా॥ శబ్ద ప్రమాణము గాని ప్రత్యక్ష - అనుమానాది ప్రమాణములు గాని వస్తువు గోచర మగునపుడే ప్రవర్తించి తద్వస్తు విషయక జ్ఞానము కలుగ జేయుచుండును; గోచరము గాని వస్తువు (అవిషయము) నందు ప్రవర్తింప నేరవు. ఆత్మ అవిషయ మగుటచే శబ్ద - అనుమానాది ప్రమాణములచే ఆత్మ విషయక జ్ఞానము కలుగ నేరదు. ప్రమాత(అహంకర్త) యగు జీవుడు ఆత్మయందు దధ్యస్తుడు (ఆరోపితుడు) అగుటచే తన కధిష్ఠానభూతు డగు బ్రహ్మను విషయముగా (తనకంటె భిన్నవస్తువుగా) (జీవుడు) తెలిసికొన నేరడు. కావున అధ్యస్త వస్తు నిషేధమే కాని ప్రాప్తనిషేధము గాదు.

అహంకర్త్రాత్మని న్యస్తం చైతన్యే కర్తృతాది యత్।
నేతి నేతీతి తత్సర్వం సాహంకర్త్రా నిషిధ్యతే॥ ౨౯

తా॥ అహంకర్త యగు ప్రమాతచే చైతన్యస్వరూపు డగు ఆత్మయందు అధ్యస్తము లయిన కర్తృత్వాది ధర్మములు అహంకర్తతోపాటు నేతినేతీత్యాది వాక్యములచే క్రమముగా నిషేధింపబడును.

ఉపలబ్ధిః స్వయం జ్యోతి ర్దృశిః ప్రత్యక్సదక్రియః।
సాక్షా త్సర్వాంతరః సాక్షీ చేతా నిత్యోఽగుణోఽద్వయః॥ ౨౬

తా॥ ఆత్మ జ్ఞానస్వరూపుడు,స్వయంప్రకాశుడు, చిత్స్వరూపుడు, ప్రత్యక్ (సర్వాంతరుడు), సద్రూపుడు, అక్రియుడు; అపరోక్షముగ సాక్షాత్కరించు వాడు, సర్వాంతర్యామి,సర్వద్రష్ట, చేతనుడు(సర్వమును వ్యాపారక్షమముగ జేయువాడు), కాలత్రయ బాధరహితుడై నిత్యముగ నుండు వాడు, నిర్గుణుడు, అద్వితీయుడు.

సంనిధౌ సర్వదా తస్య స్యా త్తదాభోఽభిమానకృత్।
ఆత్మాత్మీయం ద్వయం చాతః స్యా దహం మమ గోచరః॥ ౨౭

తా॥ ఎల్లప్పుడు ఆత్మయొక్క సంనిధియం దుండుటచే అహంకారము గూడ జడ మయ్యు చేతనము వలె భాసించుటచే 'అహం' అని ఆత్మభావమునకును, "మమ" అని ఆత్మీయ భావమునకును ప్రవృత్తిగలుగును.

జాతి కర్మాదిమత్త్వా ద్ధి తస్మిన్ శబ్దా స్త్వహం కృతి।
న కశ్చి ద్వర్తతే శబ్ద స్తదభావా త్స్వ ఆత్మని॥ ౨౮

తా॥ జాతి క్రియాది యుక్త మగుటచే అహంకారము శబ్దప్రమాణ గోచర మగును. జాతిక్రియాది రహితు డగుటచే ఆత్మ విషయమున నే శబ్దము ప్రవర్తింపదు.

ఆభాసో యత్ర తత్రైవ శబ్దాః ప్రత్యఙ్మశి స్థితాః।
లక్షయేయు ర్న సాక్షా త్తమభిదధ్యుః కథంచన॥ ౨౯

న హ్యజాత్యాదిమాన్ కశ్చి దర్థః శబ్దై ర్నిరూప్యతే॥ ౩౦

తా॥ స్వతఃసిద్ధ స్వరూపు డగు ఆత్మయందు ప్రవృత్తి నిమిత్తము లగు జాతి గుణ క్రియాదులు లేనందున నిర్విశేష స్వరూపు డగు ఆత్మవిషయమున నే శబ్దము ప్రవర్తింపనిచో ఆత్మకు వేదాంత వేద్యత్వము- "ఔపనిషదః పురుషః"-అను ప్రసిద్ధి యెట్లు ఉపపన్నమగును? నిర్విశేషాత్మస్వరూపమును శబ్దములు సాక్షాత్తు బోధింపజాలని మాట వాస్తవమే. ఎచట అహంకారాదుల యందు ఆభాసరూపమున చైతన్యప్రతిబింబ ముదయించునో, యచట అహం - ఆత్మాది శబ్దములు అంతః కరణ ప్రతిబిమ్బిత చైతన్యమునకు (జీవునకు) వాచకము (బోధకము) లగుచు బింబస్వరూపుడు, ప్రత్యగ్రూపుడు నగు ప్రత్యగాత్మను లక్షణావృత్తిచే లక్షింపజేయుచుండును. అంతియే కాని, యే విధముగను సాక్షాత్తుగ జాత్యాది విశేషణవిశిష్టునిగ ప్రతిపాదింపలేవు. జాత్యాది రహిత పదార్థమును శబ్దములచే

సాక్షాత్తు నిరూపించుటకు శక్యము గాదు కదా! అందుచే అట్లు వాచకములు కాక పోయినను లక్షింప జేయుటచే ఆత్మకు గల ఔపనిషదత్వ ప్రసిద్ధికి విరోధము లేదు.

ఆత్మాభాసో యథాఽహంకృ ద్దాత్మశబ్దై స్తథోచ్యతే।
ఉల్ముకాదా యథాగ్న్యర్థాః పదార్థత్వాన్న చాఞ్జసా॥ ౬౧

తా॥ ఆత్మశబ్దమునకు అహంకారాతిరిక్త మయిన ప్రత్యగాత్మను లక్షింప జేయుటయందే తాత్పర్య మగుచో ఆత్మశబ్దము లోకమున అహంకారాది వాచకముగ నెట్లు ప్రయుక్త మగుచున్నది? - అని యనవచ్చును.

దహించు ధర్మము అగ్నిదే యయినను, దాహకత్వ ధర్మమును కట్టెయం దారోపించి కొఱవి(ఉల్ముకము)దహించు చున్నది - అని లోకము వ్యవహరించుచున్నది.అదే విధముగా అహంకారము ఆత్మభాసమై - ఆత్మవలె ప్రతీయమానమై - ఆత్మవాచక శబ్దములచే ప్రతిపాదింప బడుచుండును.

ముఖా దన్యో ముఖాభాసో యథాఽఽదర్శానుకారతః।
ఆభాసా న్ముఖ మప్యేవ మాదర్శాననువర్తనాత్॥ ౬౨

తా॥ ముఖము యొక్క ప్రతిబింబము దర్పణానుసారి యగుటచే ముఖము కంటె భిన్న మగును. ముఖము దర్పణానువర్తి కాకపోవుటచే తన ప్రతిబింబము కంటె భిన్న మగును.

వి :- ఆభాస మనగా ప్రతిబింబము. అంతఃకరణ ప్రతిబింబిత చైతన్యము చిదాభాసుడు. ప్రతిబింబము సత్యమా? అసత్యమా? అను విషయమై వాదివిప్రతిపత్తి యుండుటచే ఆభాసుడు అనిర్వచనీయు డని నిరూపించుటకై దర్పణస్థ ముఖ బింబ దృష్టాంతము చూపబడినది. దర్పణ మున్నచో ప్రతిబింబము; లేనిచో లేదు; కనుక ప్రతిబింబము దర్పణానుసారి. దర్పణ మున్నను, లేకపోయినను ముఖము గ్రీవము (మెడ) యందుండును గనుక ముఖము దర్పణానుసారి కాదు. గ్రీవాస్థ ముఖము దర్పణస్థత్వ మను ధర్మముతో భాసించుటయే ఆభాసత్వము. ముఖసంబంధము లేని దర్పణమున గాని, అడ్డముగా లేక వెనుకకు త్రిప్పిన దర్పణమున గాని, ప్రతిబింబము కన్పట్టదు గాన, ప్రతిబింబము 'సత్యము' గాదు. దర్పణమున నున్నట్లు భాసించుటచే "అసత్" కాదు. కాన ఆభాస మనిర్వచనీయము (మిథ్య).

అహంకృత్యాత్మనిర్భాసో ముఖాభాసవ దిష్యతే।
ముఖవ త్స్మృత ఆత్మాన్యో ఒవివిక్తౌ తౌ తథైవ చ॥ 33

తా॥ అహంకారమున ప్రతిఫలించెడి ఆత్మప్రతిబింబము గూడ ముఖప్రతిబిమ్బముతో సమానము. ప్రతిబిమ్బము కంటె భిన్నుడగు ఆత్మ ముఖసదృశుడు; ఆత్మ కంటె భిన్న మగు ఆత్మప్రతిబిమ్బము ముఖప్రతిబిమ్బసమానము. మఱియు ముఖము కంటె ముఖాభాసము భిన్నముగా దోచునట్లు ఆత్మ కంటె, ఆత్మ - ప్రతిబిమ్బము విభిన్నముగా ప్రతీత మైనను, వస్తుతః, ఆత్మ కంటె భిన్నమై పరమార్థ సత్త కలిగిన దేదియు లేనందున, ఆత్మ - ఆత్మాభాసులకు గల భేదము పారమార్థికము గాదు.

సంసారీ చ స ఇత్యేక ఆభాసో య స్త్వహంకృతి।
వస్తుచ్ఛాయాస్మృతే రన్య న్మాధుర్యాది చ కారణమ్॥ ౯౭

తా॥ కొందఱు ఆత్మయొక్క ఆభాసరూప మగు అహంకారమును (అహంకారము నందు ప్రతిఫలించిన చైతన్యమును) సంసారి యగు జీవు డని చెప్పుదురు. స్మృతివచనానుసారము ఛాయయు భావరూప పదార్థమే (పరమార్థ వస్తువే) యగును. ఇది యథార్థవస్తు వనుటకు మాధుర్యాది గుణములు కారణము.

వి :- అంతఃకరణ ప్రతిబిమ్బిత చైతన్యము ఉపాధి సంబంధము వలన సంసారి యగు నని స్వమతమును జెప్పె

దానిని ధ్రువీకరించుటకై ఏకదేశి మతము నుపన్యసించి దూషించుచున్నారు.

ఇది ఏకదేశి మతము. వారు చిదాభాసుని సంసారి యగు జీవునిగా అంగీకరింతురు. కాని ఛాయవలె ఆత్మచ్ఛాయా రూప మగు ఆభాసము భావరూప వస్తువే - మిథ్యగాదు. ఇందుకు "నాక్రమేత్ కామత శ్ఛాయాం గుర్వాదేః"(మను. 4-130) ఇత్యాది స్మృతివచనములు ప్రమాణ మందురు. తెలిసి గురువుల యొక్కయు, పెద్దల యొక్కయు ఛాయ నతిక్రమింపరాదని పై స్మృతివచనమున కర్థము. ఛాయ భావపదార్థము కానిచో అతిక్రమింప రాదనెడి నిషేధ మెట్లు పొసగును? మఱియు ఛాయ యందున్నవాని మొగము ఆతప బాధ లేక మాధుర్య ప్రసన్నతాది గుణములతో నొప్పి శీతలతా సుఖ మనుభవించుచుండును. ఛాయ భావపదార్థము గానిచో నిట్టి సుఖానుభవ మెట్లు పొసగును? కాన, ఛాయ భావపదార్థమే(వస్తువే). ఛాయవలె ఆత్మచ్ఛాయారూప మగు అంతఃకరణ ప్రతిబింబిత చైతన్యము గూడ భావపదార్థమే - మిథ్య కాదు.

ఐకదేశ్యో వికారో వా తదాభాసాశ్రయః పరే।
అహంకర్తైవ సంసారీ స్వతంత్ర ఇతి కేచన॥ 39

తా॥ కొందఱు పరమాత్మ యొక్క ఏకదేశమే (అంశయే) సంసారి యగు జీవు డందురు. ఇందుకు "మమైవాంశో జీవలోకే జీవభూతః సనాతనః" (15-7) అను గీతా వచనము ప్రమాణము. "సర్వ ఏత ఆత్మానో వ్యుచ్చరన్తి" (బృ. ఉ. 2-1-20) - అగ్నినుండి విస్ఫులింగముల వలె పరమాత్మ నుండి సంసారు లగు జీవులు వెలువడుదురు - అని యర్థము. ఇట అగ్నివిస్ఫులింగ దృష్టాంతము చేత పరమాత్మ వికారమే సంసారి యగు జీవు డని మఱికొందఱు చెప్పుదురు. "తస్మనో దిశం దిశం పతిత్వా" (ఛాం.ఉ. 6-8-2) అను శ్రుతి వాక్యము ననుసరించి చిదాత్మాభాస విశిష్ట - అహంకారమే సంసారి యగు జీవుడు అని కొందఱి మతము. కేవల - అహంకర్తయే జీవుడు, స్వతంత్రుడు, పరమాత్మాంశాది రూపుడు గాడని కొందఱి (భాట్టాదిమతానుసారుల) అభిప్రాయము.

అహంకారాదిసంతానః సంసారీ నాన్యయీ పృథక్।
ఇత్యేవం సౌగతా ఆహు స్తత్ర న్యాయో విచార్యతామ్॥ ౩౬

తా॥ అహంకారాది - అవిచ్ఛిన్న క్షణిక విజ్ఞాన సంతతియే జీవుడు; సంసారి; విజ్ఞానోత్పత్తి వినాశములకు జీవుని కంటె వేఱుగా ద్రష్ట లేడు - అని బౌద్ధులు చెప్పుదురు. ఇట్లు జీవస్వరూప విషయమై వాదివిప్రతిపత్తి గలదు. పైన పేర్కొ

నిన పక్షము లన్నియు సిద్ధాన్తపక్షములే యనుచో, జీవ స్వరూప విషయమై వికల్పము గాని, సముచ్చయము గాని చెప్పవలసియుండును. జీవరూప వస్తు విషయమై వికల్ప సముచ్చయములు చెప్పుట న్యాయసంమతము గాదు. అందుచే మేము చెప్పునది సిద్ధాన్తమో? లేక, పీనిలో నేది సిద్ధాన్త పక్షమో, న్యాయసంమతముగా విచారణ చేయవలసి యున్నది.

సంసారిణాం కథా త్వాస్తాం ప్రకృతం త్వధునోచ్యతే।
ముఖాభాసో య ఆదర్శే ధర్మో నాన్యతరస్య సః।
ద్వయో రేకస్య చే ద్ధర్మో వియుక్తేఽన్యతరే భవేత్॥ 32

తా॥ ప్రాసంగికమైన సంసారిజీవకథ యటుండనిమ్ము. ప్రకృతమైన ఆభాసమును గూర్చి విచారింతము. దర్పణమున గన్పట్టు ముఖాభాసము ముఖదర్పణములలో నేదియో యొక దానియొక్క ధర్మ మందురా? అట్లు గాదు. అది యా రెంటిలో నేదియేని యొకదానియొక్కధర్మ మగుచో ముఖ వియుక్తదర్పణమున నా యాభాసము కన్పట్టవలెను; లేదా, దర్పణవియుక్తముఖమున ముఖగతరూపాదులువలె ఆభాసము గూడ గన్పట్టవలెను. అట్లు కన్పట్టుట లేదు. కావున, ఆభాసము అన్యతర ధర్మము గాదు.

ముఖేన వ్యపదేశా త్స ముఖస్యైవేతి చే న్మతమ్।
నాదర్శానువిధానాచ్చ ముఖే సత్యవిభావతః॥ ౩౮

తా॥ ఆ యాభాసమును ముఖాభాస మని వ్యవహరించుట జేసి యా యాభాసము ముఖము యొక్క ధర్మమే యని యందురేని, యట్లు గాదు. ఆభాసము ఆదర్శానుసారి గదా! ముఖధర్మ మెట్లగును? మఱియు ముఖ మున్నను దర్పణము లేనియపుడు ముఖమున ఆభాసమును దర్శింపము గదా! అది ముఖధర్మమే యగునెడల కన్పట్టును గదా! కాన, ఆభాసము ముఖధర్మము గాదు.

ద్వయో రేవేతి చే త్తన్న ద్వయో రేవాప్యదర్శనాత్।
అదృశ్యస్య సతో దృష్టిః స్యా ద్రాహో శ్చంద్ర
సూర్యయోః॥ ౩౯

తా॥ ఆభాసము ముఖదర్పణములు రెండిటియొక్క ధర్మ మనియెదరా! అదియును గాదు. ముఖదర్పణములు రెండును పరస్పరము వియుక్తము లైనపుడు ఆభాసము కన్పట్టుట లేదు. అవి సంయుక్తము లయినపు డాభాసము దృశ్యమగుటచే నది సంయుక్తధర్మ మని చెప్పుటకును గాదు. సంయుక్తధర్మ మగుచో నదియో రీతిని అవి సంయుక్తము లయినపుడును కన్పట్టవలెను. అట్లు కన్పట్టుట లేదు గాన, నది

రెండిటి ధర్మమును గాదు. అట్లయిన, ముఖదర్పణములు రెండిటికంటె విలక్షణమైన పరమార్థవస్త్వంతరమే యాభాసము. రాహువు వస్తుతః ఉండియు ఇంద్రియములకు గోచరుడు గాక, యప్పుడప్పుడు సూర్యచంద్ర-ఉపాధుల యందు కనబట్టు నట్లు ముఖసమ్ముఖ దర్పణోపాధియందాభాసము కనబట్టును. కాన, వస్త్వంతరమే-యని కొందఱనవచ్చును. అట్లు గాదు.

రాహోః ప్రాగేవ వస్తుత్వం సిద్ధం శాస్త్రప్రమాణతః।
ఛాయాపక్షే త్వవస్తుత్వం తస్య స్యాత్పూర్వయుక్తితః॥
౪౦

తా॥ సూర్య చంద్ర గ్రహణములకు పూర్వమే జ్యోతిః శాస్త్ర - పురాణాది శాస్త్రప్రామాణ్యము వలన రాహు వొక భావపదార్థము (వస్తువు) అగుట సిద్ధము. అట్లు నిశ్చయక ప్రమాణము ఆభాసవిషయమున లేదు. ముఖదర్పణ సంబంధమునకు పూర్వము గాని,తరువాత గాని, ముఖదర్పణముల కంటె విలక్షణమై ఆభాస మనెడి వస్తు వొకటి యున్నట్లు నిరూపించెడి ప్రమాణ మేదియు లేదు.మఱియు రాహు వనగా భూమ్యాదిచ్ఛాయయే యను పక్షమున, 'ముఖాభాసో య ఆదర్శే (18-38)' యను పూర్వశ్లోకముల యందు జూపబడిన యుక్తుల ననుసరించి ఛాయారూపి యగు రాహువునకు వస్తుత్వమే లేదు.

ఛాయాక్రాన్తేర్నిషేధోఽయం న తు వస్తుత్వసాధకః।
న హ్యర్థాన్తరనిష్ఠం స ద్వాక్య మర్థాన్తరం వదేత్॥ ౪౧

తా॥ గురువులు మున్నగు పెద్దల నీడ నతిక్రమింప రాద నెడి స్మృతి, ఛాయాలంఘనమును నిషేధించుచున్నదే గాని, ఛాయ యొక వస్తు వని ప్రతిపాదించుట లేదు. అట్లుగాక యీ స్మృతివచనము ఛాయాలంఘన నిషేధపర మయ్యును, ఛాయయొక్క వస్తుత్వమును గూడ ప్రతిపాదించు నన్నచో, నొకే వాక్యమున కుభయత్ర తాత్పర్యము జెప్పవలసి వాక్యభేదదోషము ప్రాప్తించును. వాక్యభేదదోషము వలన సాక్షాత్తు జెప్పకపోయినను వస్తుత్వము అర్థాత్ సిద్ధ మగుచున్నది - అని యందురేని, యట్లుగాదు. ఏది ప్రాప్తమో దానిని నిషేధించుటయే నిషేధస్వభావము. నిషేధింపబడు దానికి వస్తుత్వము లేనందున నిషేధమున కుపపత్తి లేదన చెప్పుట న్యాయసంమతము గాదు.

మాధుర్యాది చ యత్కార్య ముష్ణద్రవ్యాద్యసేవనాత్।
ఛాయాయా న త్వదృష్టత్వా దపా మేవ చ దర్శనాత్॥
౪౨

తా॥ మాధుర్యాదికార్యదర్శనము వలన ఛాయకు వస్తుత్వము జెప్పుటయు యుక్తము గాదు. అట్ల ఛాయయందు

ఉష్ణద్రవ్యాదులను సేవింపకపోవుట వలననే మాధుర్యాది గుణదర్శనము గాని, ఛాయ మూలమున గాదు. ఛాయకే అట్టి ధర్మమున్నచో సంతప్తశిలాచ్ఛాయ యందును గన్పట్టవలెను. అట్లు గన్పట్టుట లేదు. కేవల జలమునందే మాధుర్యాది ప్రతీతి గలుగు చున్నది.

వి :- శైత్యము జలస్వభావము. ఛాయయందు నెలకొను శైత్యమువలన గలుగు మాధుర్యాదిప్రతీతి ఛాయ యం దారోపింపబడు చుండును.

ఆత్మాభాసాశ్రయా శ్చైవం ముఖాభాసాశ్రయా యథా।
గమ్యన్తే శాస్త్రయుక్తిభ్యాం ఆభాసాసత్త్వ మేవ చ॥ ౪౩

తా॥ ఏవిధముగా ముఖము, ముఖాభాసము, ముఖాభాసాశ్రయము (అద్దము) - అని లోకవ్యవహారమున విభక్తములై మూడు భాసించుచున్నవో, యట్లే ఆత్మ, ఆత్మాభాసము (జీవుడు), ఆత్మాభాసాశ్రయము (మాయ)-అనియు వ్యవహారమున (పరస్పర విలక్షణములై) మూడు భాసించుచున్నవి. శాస్త్రయుక్తులతో బరిశీలించిన, వాస్తవముగ ఆభాసమునకు అసత్త్వమే సిద్ధించును.

వి:- ఆత్మ యనగా త్వం పద లక్ష్యచైతన్యము. అనాది యగు అవిద్యయందును, తత్కార్యమగు అంతఃకరణమందును

చైతన్యము ప్రతిబింబించుట జేసి ఉపాధిధర్మములతో నొప్పి యుండు జీవత్వ మాభాసము. అవిద్యాత్తత్కార్యోపాధి ఆశ్రయము. "రూపం రూపం ప్రతిరూపో బభూవ"- (బృ.ఉ. 2-5-19), "ఇంద్రో మాయాభిః పురురూప ఈయతే" — (బృ. ఉ. 2-5-19), "అనీశయా శోచతి ముహ్యమానః"— (ముం. ఉ. 3-1-2), "ఏకో వశీ సర్వభూతాన్తరాత్మైకం రూపం బహుధా యః కరోతి"— (కఠ. ఉ. 5-12) ఇత్యాది శ్రుతు లిందుకు ప్రమాణము. బుద్ధి దృశ్యము- ఆగమాపాయి (వచ్చుచు, బోవుచు నుండునట్టిది). అది యాత్మయం దధ్యస్తమయియే సత్తా - స్ఫురణలు గలిగియుండును; స్వాతంత్రముగ సత్తా-స్ఫురణలు దానికి లేవు. ఇట్లు యుక్తులచే గూడ ఆభాసమునకు అసత్త్వము, పారమార్థికసత్తయొక్క అభావము - గమ్యమాన మగును.

న దృశే రవికారిత్వా దాభాసస్యాప్యవస్తుతః।
నాచితిత్వా దహంకర్తుః కస్య సంసారితా భవేత్॥ ౭౭

తా॥ అవికారి యగుటచే సాక్షి యగు ఆత్మకు సంసారిత్వము లేదు; అసత్ (అవస్తు) అని నిశ్చిత మగుటచే ఆభాసమునకు సంసారిత్వ మొప్పదు; అచేతన (జడ) మగుటచే ఆభాసాశ్రయ మగు అహంకారమునకు సంసారిత్వము పొసగదు. ఇక జ్ఞాతృత్వ కర్తృత్వ భోక్తృత్వరూప మగు సంసారిత్వ మెవరికి? ఎవరికిని గాదనుట అనుభవవిరోధము గదా!

అవిద్యామాత్ర ఏవాతః సంసారోఽస్త్వవివేకతః।
కూటస్థేనాత్మనా నిత్య మాత్మవా నాత్మనీవ సః॥ ౪౫

తా॥ పైన చెప్పినయట్లు సంసార మోక్షముల కాశ్రయుడగు సంసారిని నిరూపించుటకు శక్యము కానందున, సంసారమవిద్యామాత్రమే - స్వప్నము వలె భ్రాన్తిమాత్రమే— యగును. ఆత్మస్వరూపవివేకము లేనందున కూటస్థ -ఆత్మ యొక్క సత్త(ఉనికి)చే సత్త గలది యగుచు సంసారము ఆత్మయందు ఆత్మధర్మమో యనునట్లెపుడును భాసించుచుండును.

రజ్జుసర్పో యథా రజ్జ్వా సాత్మకః ప్రాగ్వివేకతః।
అవస్తుసన్నపి హ్యేష కూటస్థేనాత్మనా తథా॥ ౪౬

తా॥ రజ్జుస్వరూపవివేకము లేనియపుడు రజ్జువునందు ప్రతీతమగు సర్పము రజ్జువు యొక్క సత్తచే సత్తాస్ఫురణలు గలది యగు విధముగా, సంసారము వాస్తవముగా లేనప్పటికి కూటస్థుడగు ఆత్మయొక్క సత్తచే సత్తాస్ఫురణలు గలిగి భాసించుచుండును.

ఆత్మాభాసాశ్రయ శ్చాత్మా ప్రత్యయైః స్వై ర్వికారవాన్।
సుఖీ దుఃఖీ చ సంసారీ నిత్య ఏవేతి కేచన॥ ౪౭

తా॥ ఆత్మయే ఆత్మాభాసమున కాశ్రయము - జీవత్వమున కాశ్రయము. ఆత్మయే స్వధర్మము లయిన వివిధ ప్రత్య

యనులతో వికారము జెందుచు సుఖి - దుఃఖి - యని యీ విధముగ భావించుచు సంసారియగుచున్నాడు! అని కొందఱి మతము.

వి:- సముద్రము స్వగత తరంగాదులచే వికారి యయ్యును స్థిరము; నిత్యము. అదేవిధముగ స్వధర్మములతో వికారి - సంసారి - యయ్యును ఆత్మ నిత్యుడే. మీ మతము ననుసరించి ఆత్మ- ఆత్మాభాసము- ఆత్మాభాసాశ్రయము -అని భేదకల్పన జేసి, యవివేక వశమున ఆత్మయందు సంసార కల్పన జేయుట కంటె ఆత్మయే సంసారి యని కల్పన జేయుట లాఘవము - అని కొందఱు తలచుచున్నారు.

ఆత్మాభాసాపరిజ్ఞానా ద్యథాత్మ్యేన విమోహితాః।
అహంకర్తార మాత్మేతి మన్యన్తే తే నిరాగమాః॥ ౭౮

తా॥ "సంభావ్యో గోచరే శబ్దః" (18-24)— ఇంద్రియాదిగోచరమగు వస్తువు (విషయము) నందే శబ్దము ప్రవర్తించును, అవిషయమున గాదు. అవిషయమైన ఆత్మయందు సంసారిత్వమును నిరూపించు ప్రమాణ మేదియు లేదు - అని పూర్వ ముదాహరించిన విషయమును విస్మరించరాదు. వీరి పూర్వపక్షము ఉత్ప్రేక్షామాత్రమే - ప్రమాణమూలకము గాదు. వీరు ఆత్మయొక్కయు ఆత్మాభాసము యొక్కయు

తత్త్వమును యథార్థముగా దెలిసికొనలేక మోహగ్రస్తులై అహంకారమే (సాభాసాంతఃకరణమే) యాత్మ యని తలచుచున్నారు. వీరు శ్రుతిసంప్రదాయమునకు దూరులు; శాస్త్రబాహ్యులు.

సంసారో వస్తుసంస్తేషాం కర్తృభోక్తృత్వలక్షణః।
ఆత్మాభాసాశ్రయాజ్ఞానాత్ సంసర త్యవివేకతః॥ ౭౯

తా॥ వారి మతమున సంసారము సత్యమే యగును. మఱియు 'నాసతో విద్యతే భావః నాభావో విద్యతేఽసతః'- అను గీతావచనము (2-16) ననుసరించి అవినాశి యగు సంసారమునకు విచ్ఛిత్తి లేనందున, మోక్షము సిద్ధింపదు. మోక్షము సిద్ధింప దను కారణముచే సంసారమున కసత్యత్వము (అవస్తుత్వము) నంగీకరించుచో ఆత్మ - ఆభాసము - ఆశ్రయము - వీని యాథార్థ్యము నెఱుగక అవివేకవశమున జన్మ జరా మరణరూప సంసారమును బొందుచుందు రనెడి మా మతము నాశ్రయించిన వా రగుదురు.

చైతన్యాభాసతా బుద్ధే రాత్మన స్తత్స్వరూపతా।
స్యాచ్ఛేత్తం జ్ఞానశబ్దైశ్చ వేదః శాస్త్రీతి యుజ్యతే॥౮౦

తా॥ బుద్ధియందు(అంతఃకరణమందు) చైతన్యాభాసము ఆత్మకు చైతన్యస్వరూపత్వము అంగీకరించుచో నపుడు ఆత్మను

సత్య - జ్ఞాన - అనంత - ఆనన్దాది నామములతో వేద ముప
దేశించుచున్నదని చెప్పుట యుక్తియుక్త మగును.

వి :- నిర్గుణము, నిర్ధర్మకము నగు ఆత్మయందు గాని, కేవల జడ మగు బుద్ధియందు గాని వేదశబ్దప్రవృత్తి యుప పన్నము గాదు. చైతన్యాభాసవిశిష్టబుద్ధియే వేదము యొక్క ఉపదేశమును గ్రహించును; తద్ద్వారా లక్షణావృత్తిచే వేద మాత్మస్వరూపము నుపదేశించునని చెప్పుట యుక్తియుక్తము.

ప్రకృతిప్రత్యయార్థౌ యౌ భిన్నా వేకాశ్రయౌ యథా।
కరోతి గచ్ఛతీత్యాదౌ దృష్టౌ లోకప్రసిద్ధితః॥ ౫౧

తా॥ కరోతి=చేయుచున్నాడు. గచ్ఛతి=వెళ్లుచున్నాడు. ఇట్టి క్రియాపదముల యందు ప్రకృత్యర్థము, [వ్యాపారము] ప్రత్యయార్థము[కర్తృత్వము]- రెండును పరస్పరము భిన్నము లైనను ఏకాశ్రయములై కన్పట్టు రీతిగా లోకప్రసిద్ధి నను సరించి జానాతి [తెలిసికొనుచున్నాడు] కరోతి— మున్నగు క్రియాపదములును ఆత్మైకాశ్రయములై ప్రవర్తించుట యుక్తమే.

వి :- ఆభాసము నంగీకరించుటచే వేద మాత్మ స్వరూపము నుపదేశించుట యుక్తియుక్తము గావచ్చును. కాని జానాతి [తెలసికొనుచున్నాడు] ఇత్యాది శబ్దము లాత్మ

యం దేట్లు ప్రవర్తించును? మఱియు - 'జ్ఞాయతే అనేనేతి జ్ఞాన'—మను వ్యుత్పత్తి ననుసరించి జ్ఞానపదము ముఖ్యవృత్తి చేతనే ఆత్మను బోధించును గదా! అట్లుగాక, జ్ఞానపదము ముఖ్యవృత్తిచే సాభాసబుద్ధివాచక మగుచు లక్షణావృత్తిచే ఆత్మబోధక మని యేల చెప్పవలెను? ప్రకృతిప్రత్యయార్థములు ఏకపదబోధ్యము లగుచు ఏకాశ్రయములై [ఒకే కర్తనాశ్రయించినవై] లోకమున దృష్టములు గదా! "జానాతి — కరోతీత్యాదులు నాత్మైకాశ్రయములే యగుట యుక్తము. ద్వ్యాశ్రయ మగుట యుక్తము గాదు.

నానయో ర్ద్వ్యాశ్రయత్వం చ లోకే దృష్టం స్మృతౌ తథా।
జానాత్యర్థేషు కో హేతు ర్ద్వ్యాశ్రయత్వే నిగద్యతామ్॥
౫౨

తా॥ ఈ ప్రకృతిప్రత్యయములకు ద్వ్యాశ్రయత్వము [ఇరువురి నాశ్రయించి యుండుట] లోకప్రయోగములందు గాని, వ్యాకరణశాస్త్రమున గాని ప్రసిద్ధము గాదు. అట్టియెడ జానాత్యర్థములు ద్వ్యాశ్రయము లగుటకు హేతు వేమియో చెప్పుడు.

ఆత్మాభాసస్తు తిజ్వాచ్యో ధాత్వర్థశ్చ ధియః క్రియా।
ఉభయం చావివేకేన జానాతీ త్యుచ్యతే మృషా॥ ౫౩

తా॥ మా మతమున ప్రకృతిప్రత్యయముల కేకాశ్రయత్వము సంగతము కాదనుట యుక్తము గాదు. జానాతీత్యాది పదములలో ఆత్మాభాసము "తిజ్" ప్రత్యయవాచ్యము. బుద్ధివృత్తిరూప మగు క్రియ ప్రకృతి [ధాతువు] యొక్క అర్థము. ఆత్మాభాసము, బుద్ధివృత్తియు ఆత్మకంటె భిన్నము లైనను అవివేకవశమున 'జానాతి'యని మిథ్యావ్యవహారము లోకమున చేయుచున్నారు.

న బుద్ధే రవబోధోఽస్తి నాత్మనో విద్యతే క్రియా।
అతో నాన్యతరస్యాపి జానాతీతి చ యుజ్యతే॥ ౫౪

తా॥ బుద్ధియందు జ్ఞానము [చిత్ప్రకాశము] లేదు. ఆత్మయందు క్రియ లేదు. అందుచే వీనిలో నేయొకదాని నుద్దేశించియు 'జానాతి' - యను నిర్దేశము సంగతము కాదు.

నాప్యతో భావశబ్దేన జ్ఞప్తి రిత్యపి యుజ్యతే।
న హ్యాత్మా విక్రియామాత్రో నిత్య ఆత్మేతి శాసనాత్॥ ౫౫

తా॥ జ్ఞప్తిః జ్ఞానమ్ - అను భావవ్యుత్పత్తి నాశ్రయించి ఆత్మవాచకముగా జ్ఞానశబ్ద ప్రయోగమును ఉపపన్నము గాదు. భావశబ్దము ధాత్వర్థ - సామాన్యవాచకము. ధాత్వర్థము -

క్రియ. అందుచే జ్ఞానము భావవ్యుత్పత్తిచే క్రియ యగును. క్రియ కర్తృపరాధీనము.ఆత్మ క్రియామాత్రస్వరూప మగుచో పారతంత్ర్యము వలన అనిత్యతాదోషము ప్రాప్తించును. ఆత్మ నిత్యు డని శ్రుతిశాసనము. అందుచే జ్ఞాన - శబ్దము భావ వ్యుత్పత్తిచే ఆత్మవాచక మగునని చెప్పరాదు.

న బుద్ధే ర్బుద్ధివాచ్యత్వం కరణం నహ్యకర్తృకమ్।
నాపి జ్ఞాయత ఇత్యేవం కర్మశబ్దై ర్నిరుచ్యతే॥ ౫౬

తా॥ బుధ్యతేఽనయేతి బుద్ధిః- అను కరణ వ్యుత్పత్తి ననుసరించి బుద్ధిశబ్దము అంతఃకరణమునకు వాచక మగును గాని, ఆత్మకు గాదు. ఏలన, పైన జూపిన కరణవ్యుత్పత్తి ననుసరించి ఆత్మయే కరణ (సాధన) మగుచో (ఆత్మకంటె) మఱియొక కర్త లేనందున, కరణము (ఆత్మ)కర్తృరహిత మగును. కర్త లేక కరణ మెచటను గన్పట్టదు. అట్లే 'జ్ఞాయతే ఇతి జ్ఞానమ్' - అను కర్మవ్యుత్పత్తి ననుసరించియు ఆత్మను నిర్వచింప శక్యము గాదు.

వి :- బుధ్యతేఽనయా ఇతి బుద్ధిః= దీనిచేత తెలియబడును. కనుక అంతఃకరణమునకు బుద్ధి యని పేరు.

జ్ఞాయతే ఇతి జ్ఞానమ్ - దేనిచేత దెలిసికొందుమో యా జ్ఞానసాధనమునకు జ్ఞాన మని పేరు.

న యేషా మేక ఏవాత్మా నిర్దుఃఖోఽవిక్రియః సదా।
తేషాం స్యా చ్ఛబ్దవాచ్యత్వం జ్ఞేయత్వం చాత్మనః సదా॥
౫౭

తా॥ ఎవరి మతమున దుఃఖరహితుడు, వికారరహితుడు అద్వితీయుడునగు ఆత్మ యంగీకరింపబడునో, యా మతమున ఆత్మకు శబ్ద -వాచ్యత్వము, జ్ఞేయత్వము ఉండదు. అట్లుగాక ఆత్మ దుఃఖియు,వికారియునై అద్వితీయుడు కానియెడల నా మతమున ఆత్మకు శబ్దవాచ్యత్వము, జ్ఞేయత్వము కలుగును.

వి :- వికారిత్వాది ధర్మము లంగీకరించినప్పుడు మాత్రమే 'జానాతీతి జ్ఞః, జ్ఞాయ తే ఇతి జ్ఞానమ్'- మొదలగు కర్తృ - కర్మాది వ్యుత్పత్తులు ఆత్మవిషయమై సంభవించును గాని, ఆత్మ దుఃఖరహితుడు, నిర్వికారుడు, అద్వితీయు డని చెప్పెడి శ్రౌతసంప్రదాయమున సంభవింపవు.

యదాఽహంక ర్తు రాత్మత్వం తదా శబ్దార్థముఖ్యతా।
నాశనాయాదిమత్త్వా త్తు శ్రుతౌ తస్యాత్మ తేష్య తే॥ ౫౮

తా॥ ఆత్మ, శబ్దవాచ్యు డని సాధించుటకై వికారిత్వాది ధర్మములు గల అహంకారమే యాత్మ యని చెప్పెద మన్న, నదియు సరికాదు.

"యోఽశనాయాపిపాసే శోకం మోహం జరాం మృత్యు మత్యేత్యేతం వై త మాత్మానం విదిత్వా" (బృ. ఉ.3-5-1) అనుచు శ్రుతి ఆత్మకు క్షుత్పిపాసలుగాని, శోకమోహములు, జరామరణములు గాని లేవని చెప్పినది.అందుచే శోకమోహాది ధర్మములు గల అహంకారము ఆత్మ యని చెప్పుట శ్రుతి సమ్మతము గాదు.

హన్త! తర్హి న ముఖ్యార్థో నాపి గౌణః కథంచన।
జానాతీత్యాది శబ్దస్య గతి ర్వాచ్యా తథాపి తు॥ ౫౯

తా॥ ఈ రీతిగా 'జానాతి'-మున్నగు శబ్దములకుముఖ్యవృత్తి గాని, గౌణవృత్తి గాని లేనియప్పుడీ జానాత్యాది శబ్దముల కేదేని గతి కల్పింపవలెను గదా?

శబ్దానాం మయథార్థత్వే వేదస్యా ప్యప్రమాణతా।
సా చ నేష్టా తతో గ్రాహ్యా గతి రస్య ప్రసిద్ధితః॥ ౬౦

తా॥ వేదశబ్దముల కేదేని గతి చెప్పనిచో నా శబ్దము లప్రమాణము లగును.శబ్దము లప్రమాణము లగుచో వేదము గూడ నప్రమాణమే యగును. వేద మప్రమాణ మగుట శిష్టజనసమ్మతము గాదు. వేదమునకు ప్రామాణ్యము చెప్పవలెను గనుక, ప్రసిద్ధి ననుసరించి యీ శబ్దములకుగతి చెప్పవలెను

ప్రసిద్ధి ర్మాఘలోకస్య యది గ్రాహ్య నిరాత్మతా।
లోకాయతికసిద్ధాన్తః స చానిష్టః ప్రసజ్యతే॥ ౬౧

తా॥ ప్రాకృతజనప్రసిద్ధి ననుసరించి ఆత్మాదిశబ్దములకు గతి కల్పించుచో "దేహమే యాత్మ; దేహము కంటె నతిరిక్తముగ ఆత్మ లే" డనెడి చార్వాకసమ్మత మగు నాస్తికవాదము సంభవించును. అట్లు చెప్పుట ఆస్తికులకు సమ్మతము గాదు.

అభియుక్తప్రసిద్ధి శ్చే త్పూర్వవ ద్దుర్వివేకతా।
గతిశూన్యం న వేదోఽయం ప్రమాణం సంవదత్యత॥
౬౨

తా॥ అట్లుగాక, మహర్షిలోకప్రసిద్ధి ననుసరించినచో బుద్ధికి గాని, ఆత్మకు గాని జ్ఞాతృత్వము నిరూపింప శక్యము గాదనెడి పూర్వము చెప్పిన దోషము అనివార్య మగును. వేదము ప్రమాణ మగుచునే గతిలేని యటుల [ఆత్మయొక్క జ్ఞాతృత్వమును] అనువాదము చేయుచున్న దనియు చెప్ప దగదు. అందుచే ఆత్మ యొక్క జ్ఞాతృత్వమున కన్యథా ఉపపత్తి చూపి ప్రమాణభూత వేదశబ్దముల సార్థకత దర్శింపవలెను.

ఆదర్శే ముఖసామాన్యం ముఖస్యేష్టం హి మానవైః।
ముఖస్య ప్రతిబిమ్బో హి ముఖాకారేణ దృశ్యతే॥ ౬౩

తా॥ జను లద్దము నందు ప్రతిబింబించిన ముఖమునకును, తమ ముఖమునకును సమానధర్మ ముండుటచే ముఖప్రతిబింబమును జూచి 'యిది నా ముఖమే' యను భావించునట్లు, అంతఃకరణప్రతిబింబిత చైతన్యమును – జీవుని – ఆత్మగా తలతురు.

యత్ర యస్యావభాసస్తు తయో రేవావివేకతః।
జానాతీతి క్రియాం సర్వో లోకో వక్తి స్వభావతః॥ ౬౪

తా॥ ముఖ ప్రతిబింబము దర్పణమున బడును. కాని, దర్పణము వేఱు, ముఖము వేఱు అను వివేకము లేక దర్పణగత మాలిన్యాది ధర్మములను ముఖమునం దారోపింతురు. అట్లే యంతఃకరణ ప్రతిబింబిత చైతన్యమునందు [చిదాభాసుని యందు] అంతఃకరణగత కర్తృత్వాది ధర్మముల నారోపించి క్రియల నన్నిటిని స్వాభావికముగా ఆత్మ తెలిసికొనుచుండు నని లోకము చెప్పుచుండును. అనగా – ఆత్మకు జ్ఞాతృత్వము స్వాభావిక మని లోకప్రసిద్ధి గలిగినది.

బుద్ధేః కర్తృత్వ మధ్యస్య జానాతీతి జ్ఞ ఉచ్యతే।
తథా చైతన్య మధ్యస్య జ్ఞత్వం బుద్ధే రిహోచ్యతే॥ ౬౫

తా॥ బుద్ధియొక్క కర్తృత్వము నాత్మయం దారోపించుటచేత ఆత్మకు జ్ఞాత [జానాతీతి జ్ఞః – తెలిసికొనువాడు]

అను వ్యవహారము గలిగెను. అట్లే బుద్ధియందు ఆత్మచైతన్యము నారోపించుటచే బుద్ధికి జ్ఞానవత్త్వ వ్యవహారము గలిగినది - బుద్ధ్యాత్మలకు తాదాత్మ్యాధ్యాస గలిగి అన్యోన్యధర్మ సంస్కారము వలన "ఆత్మా జానాతి; అహం జానామి" అను వ్యవహార మేర్పడుచున్న దను భావము.

స్వరూపం చాత్మనో జ్ఞానం నిత్యం జ్యోతిః శ్రుతే ర్యతః।
న బుద్ధ్యా క్రియతే తస్మా న్నాత్మనాఽన్యేన వా సదా॥

౬౬

తా॥ బుద్ధీంద్రియాదులచే ఆత్మయందు చైతన్యము గలుగుచుండును; కనుక ఆత్మయందు చైతన్య మాగంతుకమే కాని, స్వాభావికము గాదు. అట్టియెడ ఆత్మచైతన్యమును బుద్ధియం దధ్యాస చేయుట యెట్లు? ఈ ప్రశ్న సరికాదు. "తద్దేవా జ్యోతిషాం జ్యోతిః [బృ. ఉ. 4-4-16]; 'ఆత్మైవాస్య జ్యోతిః' [బృ. ఉ. 4-3-6]; 'అత్రాయం పురుషః స్వయంజ్యోతిః (బృ. ఉ. 4-3-9); "సాక్షీ చేతా" (శ్వే. ఉ. 6-11) - ఇత్యాది శ్రుతిప్రామాణ్యముచే జ్ఞాన మాత్మస్వరూపమే కాని, యాగంతుకము గాదు—బుద్ధి చేతగాని, లేక ఇంద్రియాదులచే గాని, ఆత్మచే గాని చైతన్య ముత్పన్నము గాదు.

దేహోఽహంప్రత్యయో యద్వ జ్జానాతీతి చ లౌకికాః।
వదన్తి జ్ఞానకర్తృత్వం తద్వద్బుద్ధే స్తథాఽఽత్మనః॥ ౬౭

తా॥ బుద్ధ్యాత్మలకు అన్యోన్యాధ్యాసచేతనే జ్ఞాతృత్వాది వ్యవహార మేర్పడుచున్న దను విషయమున ప్రత్యక్షదృష్టాన్త మొకటి చెప్పబడుచున్నది. రూపాది గుణములు గలిగిన ఘట పటాదులు "అహం" (నేను) అను ప్రతీతికి యోగ్యములు గావు. అట్లే దేహము గూడ అహంప్రత్యయ యోగ్యము కాదు. అయినను, సాధారణజనులకు దేహమునందు "అహం" ప్రత్యయము గలిగి "అహం స్థూలః, కృశః" (నేను స్థూల ముగా నున్నాను; కృశించితిని) అని యీ రీతిగ తమ్ము వ్యవ హరించుకొనుచున్నారు. అట్లేబుద్ధ్యాత్మలకు తాదాత్మ్యాధ్యాస జేసి – "దేవదత్తో జానాతి; మనుతే" (దేవదత్తుడు తెలిసి కొనుచున్నాడు, తలచుచున్నాడు) అను వ్యవహారముచే బుద్ధికి జ్ఞానకర్తృత్వమును, బుద్ధిగతమైన కర్తృత్వమును ఆత్మయం దారోపించిఆత్మకు జ్ఞానాశ్రయత్వమును,వికారిత్వమును చెప్పు చున్నారు.

బౌద్ధైస్తు ప్రత్యయై రేవం క్రియమాణైశ్చ చిన్నిభైః।
మోహితాః క్రియతే జ్ఞాన మిత్యాహు స్తార్కికా జనాః॥ ౬౮

తా॥అంతఃకరణవృత్తులచేతనము లయ్యును చైతన్యప్రకాశ వ్యాప్తములై చేతనములవలె భాసించుటచే, ఘటజ్ఞానము,

పటజ్ఞానము - అని యీ రీతిగ వృత్తిజ్ఞానము లుదయించు చుండును. ఈ వృత్తిజ్ఞానములయొక్క ఉత్పత్తి వినాశముల జూచి భ్రాంతులై - "జ్ఞానమాత్మచే ఉత్పన్న మగుచున్నది" - యని తార్కికులు చెప్పుదురు.

తస్మాద్ జ్ఞాభాసబుద్ధీనా మవివేకా త్ప్రవర్తితాః।
జానాతీత్యాది శబ్దశ్చ ప్రత్యయో యా చ తత్స్మృతిః॥ ౬౯

తా॥ ఆత్మకు కూటస్థత్వము[అవికారిత్వము] ప్రామాణిక ము; వికారిత్వము గాదు. జ్ఞానమాత్మస్వరూపము గాన నిత్యమే; దేనిచేతను ఉత్పన్నము గాదు. సుషుప్తియం దాత్మకు జ్ఞాతృత్వ మనుభూయమాన మగుట లేదు. కాన, బుద్ధితో సంబంధము లేక ఆత్మకు జ్ఞాతృత్వ ముపలభ్యమానము కాదు. ఆత్మ, బుద్ధి, బుద్ధిప్రతిఫలిత చైతన్యము (చిదాభాసుడు)-వీని గూర్చిన వివేకము లేనందున బుద్ధ్యాత్మల కేకత్వమును గ్రహించి "జానాతి" మున్నగు వ్యవహారము అనగా- జానాతి (తెలిసికొనుచున్నాడు) అను శబ్దము, తద్విషయజ్ఞానము, తత్సంస్కారము వలన గలిగెడి స్మృతి - అనియు లోకమున ప్రవర్తిల్లుచున్నవి.

ఆదర్శానువిధాయిత్వం ఛాయాయా అస్యతే ముఖే।
బుద్ధిధర్మానుకారిత్వం జ్ఞాభాసస్య తథేష్యతే॥ ౭౦

తా॥ ముఖప్రతిబింబము దర్పణము ననుకరించుటచే దర్పణగత మాలిన్యాదికము ముఖమునం దారోపింపబడును. అట్లే చిదాభాసుడు (బుద్ధియందు ప్రతిఫలించు చైతన్యము) బుద్ధి ననుకరించుటచే బుద్ధిగత శోకమోహాదులు - కర్తృత్వాదిధర్మములు - చైతన్యమునం దారోపింప బడుచుండును. (అస్యతే = అధ్యస్యతే)

బుద్ధేస్తు ప్రత్యయా స్తస్మా దాత్మాభాసేన దీపితాః।
గ్రాహకా ఇవ భాస న్తే దహ న్తీవోల్ముకాదయః॥ ౭౧

తా॥ కట్టెకు స్వయముగ దాహకత్వశక్తి లేదు. కాని, అగ్నివిశిష్టమై అగ్నిసాన్నిధ్యముచే దాహకత్వశక్తి గలవి వలె కొఱవులు ప్రకాశించుచుండును. అట్లే బుద్ధివృత్తులు సహజముగా జడములు; వానికి గ్రాహకశక్తి లేదు. అయ్యును, చిదాభాసునిచే భాసింపజేయబడినవై చేతనములవలె నొప్పుచు గ్రాహకముల వలె భాసించుచుండును.

స్వయమేవావభాస్య న్తే గ్రాహకాః స్వయమేవ చ।
ఇత్యేవం గ్రాహకా స్తిత్వం ప్రతిషేధన్తి సౌగతాః॥ ౭౨

తా॥ బుద్ధివృత్తులను ప్రకాశింపజేయునది యేదియు లేదు. అవి స్వయముగనే భాసించి ఘటపటాది విషయముల గ్రహించు నని బౌద్ధులు చెప్పెదరు.

యద్యేవం నాన్యదృశ్యా స్తే కిం తద్వారణ ముచ్యతామ్।
భావాభావౌ హి తేషాం యా నాన్యగ్రాహ్యా సతా
యది॥ 23

తా॥ బుద్ధివృత్తులు ఘటపటాదుల వలె వేనిచేతను ప్రకాశింపజేయబడవు; వేనిచేతను చూడబడవు (దృశ్యములు గావు) – అని చెప్పెడి బౌద్ధుల యొక్క మతమును వారించుట యెట్లు? అని శిష్యుని ప్రశ్నింప, శిష్యు డిట్లు సమాధానము చెప్పుచున్నాడు.

ఆ బుద్ధివృత్తుల యొక్క ఉత్పత్తివినాశములు వేని యందు కలుగుచున్నవో ఆ వస్తువు నేనే యని ప్రత్యభిజ్ఞ గలుగుటచే నా బుద్ధివృత్తుల ఉత్పత్తివినాశముల గ్రహించెడి స్థాయి యగు ఆత్మ సిద్ధించును.ఇక స్థాయి యగు నాత్మకంటె నతిరిక్తముగా చిదాభాసుని యేల నంగీకరింపవలె నని బౌద్ధుల వాదము గావచ్చును.

అన్వయీ గ్రాహక స్తేషా మిత్యేత దపి తత్సమమ్।
అచితిత్వస్య తుల్యత్వా దన్యస్మిన్ గ్రాహకే సతి॥ 24

తా॥ శిష్యు డిట్లు చెప్పగా నంతమాత్రముచే బౌద్ధుని నిరాకరింప శక్యము గాదని ఆచార్యు డిట్లు చెప్పుచున్నాడు.

ప్రత్యయములను (బుద్ధివృత్తులను) గ్రహించు స్థాయి యగు గ్రాహకము కలదని యంగీకరించినను, ఆ గ్రాహకమును గ్రహించెడి మఱియొక గ్రాహక మున్నచో నదియు ప్రత్యయముల తోపాటు జడమే కావలసివచ్చును.

అధ్యక్షస్య సమీపే తు సిద్ధిః స్యా దితి చే న్మతమ్।
నాధ్యక్షేఽనుపకారిత్వా దన్యత్రాపి ప్రసజ్యతః॥ ౭౫

తా॥ చిదాభాసుని యంగీకరింప నేల? చేతన సాక్షి సన్నిధానము మాత్రము చేతనే బుద్ధివృత్తులు (ప్రత్యయములు) ప్రకాశించును - ఇట్లు చెప్పుటయు సరికాదు. సాక్షి కూటస్థుడు - నిర్వికారుడు. అట్టి సాక్షివలన నెట్టి యుపకారము సంభవము గాదు. ఒకవేళ సంభవ మగునేని, సాక్షిచేతన సాన్నిధ్యము అన్నిటికీ సమాన మగుటచే - బుద్ధివృత్తులే గాక-కాష్ఠలోష్ఠాదుల ప్రత్యయములను గూడ ప్రకాశింపజేయునది యని చెప్పవలసివచ్చును.

అర్థీ దుఃఖీ చ యః శ్రోతా స త్వధ్యక్షోఽథవేతరః।
అధ్యక్షస్య చ దుఃఖిత్వ మర్థిత్వం చ న తే మతమ్॥ ౭౬

తా॥ సంసారదుఃఖముచే దుఃఖి యగుచు మోక్షమును గోరి గురూపదేశశ్రవణము జేయునది బుద్ధియా? సాక్షియా?

లేక యన్యమా? సాక్షికి దుఃఖిత్వము, ముముక్షుత్వము సంగీకరించుట సమ్మతముగాదు కదా!

కర్తాఽధ్యక్షః సదస్మీతి నైవ సద్గ్రహ మృచ్ఛతి।
సదేవాసీతి మిథ్యోక్తిః శ్రుతేరపి న యుజ్యతే॥ ౭౭

తా॥ మోక్షార్థి యగు శ్రోత వేఱు; సాక్షి వేఱు — అని భేదపక్ష మవలంబించుచో - కర్తృత్వాది ధర్మములు గలిగి వికారి యగు శ్రోత విరుద్ధధర్మములు గలిగి యుండుటచే 'సద్రూపు డగు బ్రహ్మను నేను (సద్బ్రహ్మాహ మస్మి)' అను యథార్థ జ్ఞానమును బొందుట కర్హుడు గాడు. "సద్రూపు డగు బ్రహ్మవు నీవు (సదేవాసి)" అను శ్రుతివచనము గూడ యుక్తము గాక అసత్యవచనమే కావలసివచ్చును.

అవివిచ్యోభయం వక్తి శ్రుతిశ్చే త్స్యాద్గ్రహ స్తథా।
అస్మదస్తు వివిచ్యైవ త్వమేవేతి వదేద్యది।
ప్రత్యయాన్వయినిష్ఠత్వ ముక్తదోషః ప్రసజ్యతే॥ ౭౮

తా॥ అంతఃకరణమున చిదాభాసు డుదయించి, అంతఃకరణగత కర్తృత్వదుఃఖిత్వాది ధర్మముల నధ్యాస చేయుట వలన ఆత్మ - అహంకారముల వివేకము గోల్పోయి అవివిక్తమైన యహంకారము గల ఆత్మయే దుఃఖిత్వ - అర్థిత్వాది

ధర్మములు గలిగి మోక్షార్థి యగును. అట్టివాని నుద్దేశించి - దుఃఖిత్వాదు లధ్యస్తములు; యథార్థములు గావు. వస్తుతః నీవు సద్రూపు డగు బ్రహ్మవు - అని బ్రహ్మాత్మైక్యమును శ్రుతి బోధించుట యుక్త మగును.

అహంకారమే శ్రోత; చిదాభాసుడు గాడు. చిదాభాస కల్పన మేల? అను సాంఖ్యవాదము సరికాదు. ప్రత్యక్ చైతన్యము నుండి అహంకారమును వేఱుచేసి శ్రోత యగు అహంకారము నుద్దేశించి - నీవు సద్రూపబ్రహ్మవు - అని శ్రుతి యుపదేశించిన దగుచో, శ్రుతి మిథ్యావచనముల నుప దేశించుచున్నది యనెడి పూర్వోక్తదోషమే ఉపస్థిత మగును.

త్వమిత్యధ్యక్షనిష్ఠ శ్చే దహ మధ్యక్షయోః కథమ్।
సంబంధో వాచ్య ఏవాత్ర యేన త్వమితి లక్షయేత్॥ ౭౯

తా॥ 'త్వం' పదము అహంకారవాచక మయ్యు, సాక్షిని (అధ్యక్షుని) లక్షింపజేయు ననియు చెప్పదగదు. అహంకారమునకును, సాక్షికిని గల సంబంధము దెలియక, తత్త్వమసి మహావాక్యార్థ ముపపన్నము గాదు. అందుచే ఏ సంబంధమును పురస్కరించుకొని 'త్వం' పదము సాక్షిని లక్షింపజేయునో యా సంబంధము చెప్పవలెను. ఆ సంబంధ మెట్లు చెప్ప నగును?

ద్రష్టృదృశ్యత్వ సంబంధో౽య ద్యధ్యక్షే౽క్రియే కథమ్॥
౮౦

తా॥ సాక్షి ద్రష్ట; అహంకారము దృశ్యము. కాన దృష్టృదృశ్యత్వ సంబంధము చెప్పెద మన్న,నదియు సరిగాదు. జడ మగుటచే అహంకారమునకు సంబంధగ్రహణ ముప పన్నము గాదు. నిష్క్రియుడు, నిర్వికారుడు నగుటచే సాక్షి కిని సంబంధగ్రహణ కర్తృత్వము సంగతము గాదు.

అక్రియత్వే౽పి తాదాత్మ్య మధ్యక్షస్య భవే ద్యది।
ఆత్మాధ్యక్షో మమా స్తీతి సంబంధాగ్రహణే న ధీః॥ ౮౧

తా॥ సంబంధగ్రహణ ముపపన్నము గాక పోవచ్చును. 'తత్త్వమసి' యను మహావాక్యముచే శ్రుతి, సాక్షి - అహం కారములకు తాదాత్మ్యోపదేశము చేయుచున్నది-యని చెప్పు టయు సరిగాదు.

ఘటస్య శౌక్ల్యమ్ — అను వాక్యము వలన ఘటమున కును శుక్లత్వమునకును గల సంబంధము తెలియక "ఘటః శుక్లః" (ఘటము తెల్లనిది)యను వాక్యము వలన ఘటశుక్ల వర్ణములకు గల తాదాత్మ్యము అవగతము గాదు. అట్లే "మమాత్మా అధ్యక్షః" - అను వాక్యము వలన సాక్షి -

అహంకారముల యొక్క సంబంధము దెలియక పై శ్రుతి వాక్యము వలన తాదాత్మ్యబుద్ధి యుదయించదు.

సంబంధగ్రహణం శాస్త్రా దితి చే న్మన్యసే స హి।
పూర్వోక్తాః స్యు స్త్రిధా దోషా గ్రహో వా స్యా న్మమేతి చ॥ ౯౨

తా॥ "ఏష మ ఆత్మాంత ర్హృదయే అణీయాన్; ఏష మ ఆత్మాంత ర్హృదయే ఏత ద్బ్రహ్మ"—(ఛాం.ఉ. 3-14-3, 4)అను శ్రుతివాక్యముల వలన సాక్ష్యహంకారముల సంబంధ గ్రహణ ముపపన్న మగు ననుటయు సరిగాదు.అట్లు చెప్పిచో పైన చెప్పబడిన మూడు దోషములు ప్రసక్తము లగును.

1] జడ మగుటచే అహంకారము సంబంధగ్రహీత కాజాలదు.

2] నిష్క్రియుడు, నిర్వికారుడు నగుటచే సాక్షికి సంబంధగ్రహణ కర్తృత్వము సంగతము గాదు.

3] అహంకారమే శ్రోత యగుచో నా యహంకారము జడము గాన, జడ మగు నహంకారము నుద్దేశించి శ్రుతి బోధ చేయుట యసంగత మగును.

ఒకవేళ నెట్లో సంబంధగ్రహణమును కల్పించినను, "మమాధ్యక్షోఽస్తి"(నాకు సాక్షి[అధ్యక్షుడు] ఉన్నాడు)అని

సంబంధగ్రహణము కలుగును గాని, సాక్షి అహంకారములకు తాదాత్మ్యాధ్యాస అంగీకరింపలేదు గాన, "అహమేవాధ్యక్షోఽస్మి" (నేనే సాక్షిని)యని సంబంధగ్రహణము కలుగదు. అహంకారము జడము గాన 'మమాధ్యక్షః' అనియు సంబంధగ్రహణ ముపపన్నము గాదు.

అదృశి ర్దృశిరూపేణ భాతి బుద్ధి ర్యదా తదా।
ప్రత్యయా అపి తస్యాః స్యు స్తప్తాయోవిస్ఫులిఙ్గవత్॥
౮-3

తా॥ ఇట్లు పరపక్షమున ఆత్మ- అనాత్మలకు సంబంధాసిద్ధిని చెప్పి, స్వపక్షమున మిథ్యాతాదాత్మ్య సంబంధమును వివరించుచున్నారు—

దాహకశక్తి అగ్నికే గాని, యినుమునకు లేదు. అయినను, అగ్నియొక్క ధర్మము నినుమునం దారోపించి యినుము కాలుచున్నది— అని లోకవ్యవహారము. అట్లే చేతనము గాని బుద్ధి, చేతనము వోలె సదా భాసించుచుండు నని యంగీకరించుచో, బుద్ధివృత్తులును చేతనరూపములై భాసించుచుండు నని యంగీకరింపవలెను.

ఆభాస స్తదభావశ్చ దృశేః సీమ్నో న చాన్యథా।
లోకస్య యుక్తితః స్యాతాం తద్గ్రహాశ్చ తథా సతి॥ ౮౮

తా॥ నేతి నేతీత్యాది వాక్యములచే సర్వమును నిషేధింపగా నిషేధావధిభూతుడై తుదకు శేషించునది (సీమ) ఆత్మ. ఈ యాత్మకు నిషేధము లేదు. లోకము యొక్క ఆభాసము (ప్రకాశము) గాని, తదభావము గాని, రెండును బుద్ధివృత్తిరూపములు. ఈ బుద్ధివృత్తులు జడ మగు బుద్ధికి విషయములు (గోచరములు) గావు; నిర్వికారు డగుటచే ఆత్మకును విషయములు గావు. అందుచే ఆభాస - తదభావములు సిద్ధించుటకై చిదాభాసు నంగీకరింపవలెను. చిదాభాసుని ద్వారా ఆత్మ, బుద్ధివృత్తులకు సాక్షి యన నొప్పును. మఱియు 'అహమస్మి'—(నేనున్నాను) యని విశేషరూపమున ఆత్మసత్తాస్ఫూర్తియు గలుగును.

నన్వేవం దృశిసంక్రాన్తి రయఃపిండేఽగ్నివద్భవేత్।
ముఖాభాసవ దిత్యేత దాదర్శే తన్నిరాకృతమ్॥ ౮౯

తా॥ ఇట్లు చెప్పుచో లోహపిండమునం దగ్నివలె బుద్ధియం దాత్మ సంక్రమించు నని చెప్పవలెను గదా! యన్న నట్లు గాదు. అద్దమున ముఖము ప్రతిఫలించునట్లు బుద్ధియం

దాత్మ ప్రతిఫలించును గాని, సంక్రమింపదు. కాన, ముఖప్రతి బింబ దృష్టాన్తముచే లోహపిండదృష్టాంతము నిరాకృతము.

కృష్ణా యో లోహితాభాస ఇత్యేత ద్దృష్ట ముచ్యతే।
దృష్టదార్ష్టాంతతుల్యత్వం నతు సర్వాత్మనా క్వచిత్ ॥౮౩

తా॥ తప్తలోహ విస్ఫులింగములు వికారులు గదా; వానిని దృష్టాంతముగా గ్రహింప వీలులేదు. అట్టియెడ నిది దృష్టాంతముగా నెట్లు గ్రహింపబడినది?

జడ మగు బుద్ధికి చేతనాభాసము వలె నల్లని యినుమున లోహితవర్ణ మాభాసము – ఇంతవఱకే దృష్టాంతము. దృష్టాంత దార్ష్టాంతికములకు సంపూర్ణ- సమానత్వ మెచటను దృష్టచరము గాదు కదా!

తథైవ చేతనాభాసం చిత్తం చైతన్యవ ద్భవేత్।
ముఖాభాసో యథాఽఽదర్శే ఆభాస శ్చోదితో మృషా॥
౮౭

తా॥ ఆ విధముగ చిదాభాసవిశిష్ట మగు చిత్తము చేతనము వోలె భాసించును. ఆదర్శము నందలి ముఖప్రతి బింబము వలె చిదాభాసుడు గూడ మిథ్యయే యని చెప్ప బడును.

చిత్తం చేతన మిత్యేత చ్ఛాస్త్ర యుక్తి వివర్జితమ్।
దేహస్యాపి ప్రసఙ్గః స్యా చ్చక్షురాదే స్తథైవ చ॥ ౮౮

తా॥ చిదాభాసవ్యాప్తిచే చిత్తము చేతనము వలె భాసించు నని యేల చెప్పవలెను, చిత్తము స్వయముగా చేతన మని యేల చెప్పరాదు? ఈ శంక తగదు. చిత్తము చేతన మనుటకు శాస్త్రప్రామాణ్యము లేదు, యుక్తిసహమును గాదు. ఉత్పత్తివినాశములు గలిగి దృశ్యమై వికారియైన చిత్తము చేతన మగుచో, దేహేంద్రియాదులును చేతనము లేలకారాదు- అను ప్రసక్తియు వచ్చును.

తదప్యస్త్వితి చే త్తన్న లోకాయతికసంగతేః।
న చ ధీ ర్దృశి రస్మీతి యద్యాభాసో న చేతసి॥ ౮౯

తా॥ దేహేంద్రియాదులును చేతనములే కానిండు — అనుచో నిట అవైదిక - చార్వాకమతము ప్రసక్త మగును. మఱియు చిదాభాసు నంగీకరింపనిచో - కేవలచిత్తము జడ మగుట వలనను, చిన్మాత్రస్వరూపు డగు ఆత్మ నిర్వికారు డగుటచేతను - "అహం బ్రహ్మాస్మి" - యను మహావాక్య జన్య - ఆగంతుక - బ్రహ్మాత్మైక్యజ్ఞానము సిద్ధింపదు.

సదస్మీతి ధియోఽభావే వ్యర్థం స్యా త్తత్త్వమస్యపి।
యుష్మదస్మ ద్విభాగజ్ఞే స్యా దర్థవ దిదం వచః॥ ౯౦

తా॥ "సదస్మి" (నేను సద్రూపుడను) అను బుద్ధివృత్తి యుదయించనిచో "తత్త్వమసి" - యను మహావాక్యమును వ్యర్థమే యగును. ఈ వాక్యము యుష్మత్పదవాచ్యము, జడము నగు అహంకారము యొక్కయు, అస్మత్పదలక్ష్య మగు ఆత్మయొక్కయు వివేకము గల పురుషుని యెడ సార్థక మగును.

వి :_ సదస్మి - యను బుద్ధివృత్తి యుదయించనిచో బ్రహ్మాత్మైక్య బోధక తత్త్వమసి - మహావాక్య మప్రమాణమే యగును. "అధికారిణః ప్రమితిజనకో వేదః"— అను న్యాయము ననుసరించి ఆత్మానాత్మవివేకజ్ఞానము గల యధికారియెడ మాత్రమే ఈ వాక్య మర్థవంత మగును గాని, యందఱకును గాదు. అధికారివిషయమై యర్థవంతము, ప్రమాణము నగు నీ మహావాక్యము నప్రమాణ మనుట సంగతము గాదు.

మమేదం ప్రత్యయా జ్ఞేయా యుష్మద్యేవ న సంశయః।
అహ మిత్యస్మదీష్టః స్యా దయ మస్మీతి చోభయోః॥౬౧

యుష్మదస్మ ద్వివేకము (ఆత్మానాత్మవివేకము) వివేచింప బడుచున్నది.

తా॥ ఏ పదార్థముల విషయమై "ఇదం"(ఇది) 'మమ' (నాది) అను జ్ఞానము కలుగునో యని నిఃసంశయముగా

యుష్మత్పదవాక్యములు. "అహం" అను ప్రత్యయము చిదాభాసుని ద్వారా ఆత్మభూతుడు, వ్యావహారిక - అహంకర్త-యునగు ఆత్మయందు కలుగుట అభిమతము. "అయం" అను ప్రత్యయము ఆత్మానాత్మలు రెండిటి యందును కలుగును. ఉదా॥ అయం దేహః = ఇది దేహము (అనాత్మ); అయమస్మి = నేనున్నాను (ఆత్మ).

అన్యోన్యాపేక్షయా తేషాం ప్రధానగుణతేష్యతే।
విశేషణవిశేష్యత్వం తథా గ్రాహ్యం హి యుక్తితః॥ ౬౨

తా॥ ఆత్మ- అనాత్మలను గూర్చిన జ్ఞానములలో పరస్పరాపేక్ష జేసి ప్రాధాన్యాప్రాధాన్యములు, తదనుగుణముగ యుక్తిసిద్ధ మగు విశేషణ విశేష్యభావము గ్రహింపబడు చుండును.

మమేదం ద్వయమప్యేతత్స్మర్థ్యమస్య విశేషణమ్।
ధనీ గోమాన్ యథా తద్వద్దేహోఽహంకర్తరేవ చ॥ ౬౩

తా॥ "మమ, ఇదం" - ఈ రెండును పూర్వశ్లోక(91) మధ్యమున నిర్దిష్టమగు అహమర్థమునకు విశేషణములు. ధనము కారణముగా మనుష్యులకు "ధనీ"(ధనముగలవాడు)యనియు, గోవులు కారణముగా 'గోమాన్'(గోవులు కలవాడు) అనియు

వ్యవహారము సిద్ధించి, యివి మనుష్యులకు విశేషణము లగు చున్నవి. అదేవిధముగా దేహము కారణముగా "దేహీ" అని వ్యవహార మేర్పడి యిది అహంకర్తకు విశేషణమగుచున్నది.

విశే :- ఆత్మానాత్మవివేకము గలవారు బాహ్య - అనాత్మ - వస్తువులకంటె క్రమముగ ఆంతర వస్తువులకు ప్రాధాన్య మిచ్చెదరు. ఏది ప్రధానమో, అది విశేష్యము; అప్రధానము విశేషణము. అన్నిటికంటె ఆత్మ ప్రధానము, ఆంతరతమము; అందుచే ఆత్మ అన్నిటికి విశేష్యము.

బుద్ధ్యారూఢం సదా సర్వం సాహంకర్త్రా చ సాక్షిణః।
తస్మాత్సర్వావభాసో జ్ఞః కించి దప్యస్పృశఙ్ సదా॥ ౬౪

తా॥ బుద్ధివృత్తికి విషయీభూత మగు దేహ-తత్సంబంధి విషయజాత మంతయు సాక్షియం దధ్యస్తమై సాక్షి యను గ్రహముచే సత్తాస్ఫూర్తులు గలిగి ప్రకాశించుచుండును.కనుక నీ విషయజాత మంతయు సాక్షికి విశేషణము. అట్లే అహంకార సహిత సూక్ష్మ విషయజాత మంతయు సాక్షికి విశేషణమే. ఏమియు స్పృశింపకయే యిట్లుచిదాభాసుని ద్వారా సర్వమును భాసింపజేయుటచే 'సర్వావభాసః' అనియు, జ్ఞానస్వరూపు డగుటచే సదాత్మ "జ్ఞః" అనియు వ్యవహరింపబడును. ఇట్లు ఆత్మా నాత్మవివేకము దెలియునది.

ప్రతిలోమ మిదం సర్వం యథోక్తం లోకబుద్ధితః।
అవివేకధియా మస్తి నాస్తి సర్వం వివేకినామ్॥ ౯౫

తా॥ లోకదృష్టి ననుసరించి యీ విశేషణ విశేష్య భావము పైన జెప్పినదానికంటె విపరీతముగా నుండును. వస్తుతః, ఈ విశేషణ విశేష్యభావము అవివేకజనుల దృష్ట్యా చెప్పబడినది; వివేకజనుల దృష్టిలో నిది యంతయు వాస్తవ ముగా లేదు.

విశే :- ఈ విశేషణ విశేష్యభావము "ఆత్మానాత్మలు రెండును స్వతంత్రసత్తగలవి,అనాత్మకంటె ఆత్మ ప్రధానము"- అనువారి దృష్టి ననుసరించి చెప్పబడినది. తత్త్వజ్ఞానుల దృష్టిలో ఆత్మకంటె భిన్నముగ స్వతంత్ర సత్త గలిగినవస్తువు లేదు. అందుచే వారి దృష్టిలో విశేషణ విశేష్యభావప్రసక్తి లేదు. సంసారి యగు పురుషుడు శరీరాది అనాత్మలను ప్రధా నములుగా నెంచును. అందుచే వారి దృష్టిలో ఆత్మయే అనా త్మకు విశేషణము.

అన్వయవ్యతిరేకౌ హి పదార్థస్య పదస్య చ।
స్యా దేత దహ మిత్యత్ర యుక్తి రేవావధారణే॥ ౯౬

తా॥ ఆత్మానాత్మరూప పదార్థముల యొక్కయు, పద ముల యొక్కయు అన్వయవ్యతిరేకముల చేతనే 'అహం'

పదార్థ - ఆత్మస్వరూప- వివేకము గలుగుచుండ, తత్త్వమసి-వాక్యము వలన ప్రయోజన మేమి? ఇట్లనుట తగదు. ఆత్మ స్వరూపము దెలియుట కన్వయ వ్యతిరేకములు యుక్తి మాత్రమే. ఆ యుక్తివలన దేహాదులకంటె విలక్షణుడైన యాత్మయొక్క స్వరూపము దెలిసినను, నే నెవడను? అను జిజ్ఞాస అనువృత్తమగుచునే యుండును. అట్టియెడ నీ వాక్యము జిజ్ఞాసిత - ఆత్మస్వరూప విశేషమును దెలియజేయుటకై యావశ్యకము.

విశే :- పద - పదార్థాన్వయ వ్యతిరేకములు :-

ఆత్మ సర్వద్రష్ట, సాక్షి; ఎప్పుడును దృశ్యము గాని, సాక్షి భాస్యము గాని కాదు; స్వయంప్రకాశము. అహంకారాది విషయములు సాక్షిభాస్యములు; అందుచే నప్రధానములు; ఆత్మకు విశేషణములు.

పదములయొక్క అన్వయవ్యతిరేకములు :

బ్రహ్మ, చైతన్యము మొదలగు శబ్దములు శుద్ధాత్మ బోధకములు; అందుచే నవి విశేషణములు గాక, తద్విశిష్ట వస్తువుల వేనిని బోధింపవు. కర్త, భోక్త మున్నగు శబ్దములు

దేహేంద్రియాదివిశిష్ట మగు ఆత్మకు వాచకములు; శుద్ధా త్మకు గావు.

నాద్రాక్ష మహ మిత్యస్మిన్ సుషుప్తేఽన్య న్మనాగపి।
న వారయతి దృష్టిం స్వాం; ప్రత్యయం తు నిషేధతి॥ ౯౭

తా॥ "ఈ సుషుప్తి దశలో నేను మఱియొక వస్తువును దేనిని చూడలేదు"-ఇట్టి యీ యనుభవము ప్రమాత-ప్రమాణము - ప్రమేయము - అను త్రిపుటిని నిషేధించును గాని, స్వదృష్టిని గాదు.

స్వయం జ్యోతి ర్న హి ద్రష్టు రిత్యేవం సంవిదోఽ స్తితామ్।
కౌటస్థ్యం చ తథా తస్యాః ప్రత్యయస్య తు లుప్తతామ్॥
స్వయమేవాబ్రవీచ్ఛాస్త్రం ప్రత్యయావగతీ పృథక్॥౯౮

తా॥ "అత్రాయం పురుషః స్వయం జ్యోతిః" (ఈ సుషుప్తిదశలో నీ పురుషుడు స్వయంప్రకాశస్వరూపుడు), 'న హి ద్రష్టు ర్దృష్టే ర్విపరిలోపో వర్తతే' (ద్రష్ట యగు ఆత్మ యొక్క దృష్టికి లోప ముండదు)- అని యీ రీతిగా శ్రుతులు స్వయముగా సుషుప్తిదశయందు చైతన్యము యొక్క అస్తిత్వమును, కూటస్థమును గూర్చియు, త్రిపుటీజ్ఞానము యొక్క

లోపమును గూర్చియు "న తు తద్ద్వితీయ మస్తి తతో உన్య ద్విభక్తమ్" (బృ.ఉ. 4,3,23-30) అసంకీర్ణముగ- స్పష్టముగ- దెలిపినది.

ఏవం విజ్ఞాతవాక్యార్థే శ్రుతి లోకప్రసిద్ధితః।
శ్రుతి స్తత్త్వమసీత్యాహ శ్రోతు ర్మోహాపనుత్తయే॥ ౯౯

తా॥ ఈ ప్రకారము శ్రుతి, లోకప్రసిద్ధి (అన్వయ వ్యతిరేకముల ద్వారా)- వీని ననుసరించి యెవనికి వాక్యార్థ జ్ఞానము కలుగునో యా పురుషుని మోహనివృత్తికొఱకై శ్రుతి 'తత్త్వమసి' - యని యుపదేశము చేయుచున్నది.

బ్రహ్మా దాశరథే ర్యద్వ దుక్త్యైవాపానుద త్తమః।
తస్య విష్ణుత్వసంబోధే న యత్నాంతర మూచివాన్॥
౧౦౦

తా॥ "రామా, నీవు దశరథపుత్రమాత్రుడవు కావు; విష్ణుమూర్తివి" అను వాక్యముల చేతనే బ్రహ్మ, సంకల్ప మాత్రకృతము, విష్ణుత్వాచ్ఛాదనరూపమైన శ్రీరాముని యజ్ఞానమును బోగొట్టెను. శ్రీరామునియొక్క విష్ణుత్వమును బోధించుటకై బ్రహ్మ పైన జెప్పిన వాక్యార్థోపదేశము తప్ప మఱియే యితరప్రయత్నమును జేయలేదు.

అహం శబ్దస్య నిష్ఠా యా జ్యోతిషి ప్రత్యగాత్మని।
సైవోక్తా సదసీ త్యేవం ఫలం తత్ర విముక్తతా॥ ౧౦౧

తా॥ దాశరథి యగు శ్రీరాముడు మహామహిమ సంపన్నుడు గాన, వాక్యోపదేశ మాత్రము చేతనే ఆయన అజ్ఞానము తొలగి "విష్ణురహ మస్మి"—యని బోధ కలుగ వచ్చును. ఇతరుల కట్లు అజ్ఞానము తొలగి "అహం బ్రహ్మాస్మి" యను జ్ఞానము సంభావితమగునా?

"త్వం" పదార్థశోధన జేసిన పురుషునకు అహంశబ్దముచే స్వయంప్రకాశుడు, సర్వసాక్షియునగు పరబ్రహ్మ లక్షితుడగుచుండును. పరబ్రహ్మబోధనము నందు "అహం" శబ్దమునకు గల నిష్ఠయే "త్వం సదసి" (నీవు సద్రూపబ్రహ్మవు)- అను వాక్యముచే ఉపదేశము చేయబడుచున్నది. ఆ యుపదేశమునకు ఫలము మోక్షము.

శ్రుతమాత్రేణ చేన్న స్యా త్కార్యం తత్ర భవే
ద్ధ్రువమ్।
వ్యవహారా త్పురాప్యేష సద్భావః స్వయ మాత్మనః॥
౧౦౨

తా॥ మహావాక్యశ్రవణము మాత్రము చేతనే జ్ఞానము (ఫలము) కలుగనిచో అర్థవాదాది - వాక్యములకు వలె

స్వార్థమున ప్రామాణ్యము సిద్ధింపదు గనుక, ప్రామాణ్య సిద్ధికై యవశ్య మేదియో యొక కార్యము కల్పితము కావలెను. కాని, యిచట ఫలము అధికారి యగు పురుషునకు వెంటనే కలుగుచున్నందున, కల్ప్య మగు కార్య మేదియు లేదు. మఱియు వాక్యోపదేశమునకు బూర్వమే ఆత్మకు సద్భావము (బాధకము లేనందున) గలదు. యథావస్థిత — ఆత్మస్వరూపమును గూర్చియే శ్రుతి యుపదేశము. కావున నప్రామాణ్యము లేదు.

విశే :- తత్త్వజ్ఞానోత్పత్తి విషయమున మహావాక్య శ్రవణము ప్రమాణము కాదనుచో నా యప్రామాణ్య మెట్టిది? అప్రామాణికత నాలుగు విధములు. 1) విపర్యాస రూపము 2) నిష్ఫలత్వరూపము 3) సంశయలక్షణము 4) అనుత్పత్తి రూపము.

పై శ్లోకము యొక్క యుత్తరార్థముచే విపర్యాసరూప- అప్రమాణికత ఖండింపబడుచున్నది. తాత్పర్య మేమన — వాక్యోపదేశమునకు బూర్వమే చిత్స్వరూపు డగు ఆత్మ గలడు. అందుచే వాక్యోపదేశముచే అజ్ఞానము తొలగి జ్ఞానోదయ మగును. కాన, శుక్తిరజత జ్ఞానమునకు వలె అప్రామాణ్యము లేదు.

అశనాయాది నిర్ముక్త్యై తత్కాలా జాయతే ప్రమా।
తత్త్వమస్యాది వాక్యార్థే త్రిషు కాలే ష్వసంశయః॥ ౧౦౩

తా॥ ఇందు పూర్వార్థముచే నిష్ఫలత్వరూప మగు రెండవ అప్రామాణ్యము, ఉత్తరార్ధముచే సంశయలక్షణ - అప్రామాణ్యము - నిరాకరింపబడుచున్నది. ఆప్తవాక్య శ్రవణ కాలమున గలుగు తత్త్వజ్ఞానము క్షుత్పిపాసాదిరూప సంసారనివృత్తికి గారణ మగుట విద్వదనుభవసిద్ధము. కాన, వాక్యోపదేశము నిష్ఫలము గాదు.

అట్లే తత్త్వమస్యాది వాక్యబోధితార్థ విషయమై త్రికాలములయందు సంశయము లేదు. కాన, సంశయలక్షణా- అప్రామాణ్యము లేదు.

ప్రతిబంధవిహీనత్వాత్ స్వయం చానుభవాత్మనః।
జాయేతైవ ప్రమా తత్ర స్వాత్మన్యేవ న సంశయః॥ ౧౦౪

తా॥ వాక్యార్థజ్ఞానమునకు పదార్థజ్ఞానము కారణము. అట్టి పదార్థజ్ఞానము లేకపోవుట వాక్యార్థజ్ఞానమునకు ప్రతిబంధకము. అట్టి ప్రతిబంధము లేనందున పదార్థజ్ఞానము నెఱిగిన పురుషునకు ఆ మహావాక్య శ్రవణ కాలముననే ఆత్మ విషయమై ప్రమ (జ్ఞానము) కలుగనే కలుగును; సంశయము లేదు. ఆకాశపుష్ప మున్నది - మున్నగు వాక్యార్థముల వలె

నిదియు అనుభవయోగ్యము గాని యర్థము కాదా? యను శంకకు తావులేదు. నే నున్నాను; నే నున్నాను — అని యీ రీతిగా ఆత్మ అనుభవస్వరూపుడు గాన, 'నేను లేను' అని తన్ను దానెవడు ప్రత్యాఖ్యానించుకొనును? కాన, ఆకాశ పుష్పముల వలె ఆత్మ అనుభవాయోగ్యపదార్థము గాదు.

అందుచే వాక్యార్థోపదేశమాత్రముచే తత్త్వజ్ఞానము కలుగునో, లేదో, యను సంశయమునకు దావు లేదు. అందువలన అనుత్పత్తిరూప - అప్రామాణ్యమును లేదు.

కిం సదేవాహమస్మీతి కిం వాఽన్యత్ప్రతిపద్యతే।
సదేవ చే దహం శబ్దః సతా ముఖ్యార్థ ఇష్యతామ్॥౧౦౫

తా॥ తత్త్వమసి - వాక్యార్థశ్రవణానంతరము కలిగెడి "అహ మస్మి" అను జ్ఞానముచే సద్రూప - ఆత్మప్రతీతి కలుగునా? లేక యేదేని మఱియొకటి ప్రతీత మగునా? సద్రూపప్రతీతియే కలుగుచో 'అహం' శబ్దమునకు సచ్ఛబ్దార్థమే ముఖ్యార్థముగా గ్రహించుట యుక్తము. అపుడు సచ్ఛబ్ద-అహంశబ్దములు ఏకార్థబోధయందే తాత్పర్యము గలవి యగుటచే ఐకాత్మ్యమే వాక్యార్థము; సంసర్గము కాదు. అందుచే అపరోక్షజ్ఞానసిద్ధి కలుగును.

అన్యచ్చే త్స దహంగ్రాహ్యప్రతిపత్తి ర్మృషైవ సా।
తస్మా న్ముఖ్యగ్రహే నాస్తి వారణావగతే రిహ॥ ౧౦౬

తా॥ సత్ అనునది ప్రత్యగాత్మ కంటె భిన్నమైన మఱియొక వస్తు వగుచో [నే ననెడి జ్ఞానము] అహంగ్రాహప్రతిపత్తి మిథ్యయే యగును;అందుచే 'అహం బ్రహ్మాస్మి' యను మహావాక్యమున కప్రామాణ్యము ప్రసక్త మగును.సద్రూపముఖ్యార్థమును గ్రహించుచో, యథార్థానుభవమున కెట్టి నిషేధ ముండదు. అపుడే యీ వాక్యార్థము సంసారదుఃఖపీడితు డగు ముముక్షువు విషయమై సార్థక మగును. కావున ప్రమాణ ప్రమేయ స్వభావ పర్యాలోచన జేసినచో మహావాక్యముల వలననే సఫల - ఆత్మతత్త్వవిజ్ఞానము నిష్పన్న మగును.

ప్రత్యయీ ప్రత్యయ శ్చైవ యదాభాసౌ తదర్థతా।
తయో రచితిమత్త్వాచ్చ చైతన్యే కల్ప్యతే ఫలమ్॥ ౧౦౭

తా॥ ఆత్మ కూటస్థుడు, నిర్వికారు డగుటచే జ్ఞాత కాడు. కాన జ్ఞాతృత్వరూప ఫలసంబంధము సయిత మాత్మ కుపపన్నము గాదు - అనెడి నిషేధము (వారణము) కలదు గదా! యన నట్లు గాదు.

అంతఃకరణము [ప్రత్యయి], తద్వృత్తులు [ప్రత్యయములు] - రెండును ఏ చిదాత్మయొక్క ఆభాసము [చిదాభాసుని]తో గూడి విలసిల్లుచుండునో, ఆ యాత్మ కవి, శేషభూతములు గాన, స్వతంత్రములు గావు. మఱియు, ఈ

రెండును జడములు గాన, వానికి ఫలసంబంధ ముపపన్నము గాదు. అందుచే ఫలమును చిదాభాసుని ద్వారా ఆత్మకే చెప్పవలెను.

కూటస్థేఽపి ఫలం యోగ్యం రాజనీవ జయాదికమ్।
తదనాత్మత్వ హేతుభ్యాం క్రియాయాః ప్రత్యయస్య చ॥ ౧౦౮

(తదన్యాత్మత్వ హేతుభ్యాం—అని ఆనందగిరిపాఠము)

తా॥ క్రియ యనగా అహంకారము. ప్రత్యయ మనగా అంతఃకరణ ప్రతిఫలిత చైతన్యము— జీవుడు. కూటస్థు డధిష్ఠానము (ఆధారము). ఆధేయము కూటస్థునియందు కల్పితు డగు జీవుడు. జడ మగుటచే అహంకారమునకు ఫలసంబంధము లేదు. మిథ్యాభూతు డగుటచే చిదాభాసునకును ఫలము కలుగదు. అందుచే సేనలు సాధించిన విజయము (ఫలము) స్వామి యగు రాజునం దారోపిత మగునట్లు అంతఃకరణ,చిదాభాసులు సాధించిన ఫలము కూటస్థుడైనను ఆత్మయందే యారోపిత మగు ననుట యుక్తము.

ఆదర్శస్తు యదాభాసో ముఖాకారః స ఏవ సః।
యద్వైవం ప్రత్యయాదర్శో యదాభాస స్తదాప్యహమ్॥ ౧౦౯

తా॥ ఏ ముఖము [బింబము] యొక్క ప్రతిబింబము [ఆభాసము] చే అద్దము ముఖాకారముగ భాసించునో, ఆ యద్దము నందలి ముఖము [ప్రతిబింబము] మెడయం దున్న ముఖము [బింబము] కంటె భిన్నము గాదు. బింబ ప్రతిబింబ ముల కైక్యము ప్రసిద్ధము. అట్లే యే చిదాత్మయొక్క ఆభా సము [ప్రతిబింబము] చే అంతఃకరణము చిదాకారముగ భాసించునో, ఆ యంతఃకరణ ప్రతిఫలిత చిదాభాసుడు చిద్రూ పుడే (పరమాత్మయే) కాని, భిన్నుడు కాడు. కావున "అహం బ్రహ్మ" యను వాక్యార్థబోధచే ఆత్మయం దధ్యస్తమైన జీవత్వభ్రమ తొలగి ఫలము చిదాత్మయందు పర్యవసించుట యుక్తమే యగును.

ఇత్యేవం ప్రతిపత్తిః స్యా త్సదస్మీతి చ నాన్యథా।
తత్త్వ మిత్యుపదేశోఽపి ద్వారాభావా దనర్థకః॥ ౧౧౦

తా॥ ఈవిధముగా చిదాభాసు నంగీకరించిననే 'స దహ మస్మి; అహం సదస్మి' అని అహమాకార - సదాకార - ప్రతిపత్తి గలుగును. అట్లుగాక, శుద్ధాత్మకు గాని, అహంకార మునకు గాని ప్రమాతృత్వము సంగీకరించుచో 'తత్త్వమసి' - యను ఉపదేశము నిరర్థక మగును. ఎట్లన, మహావాక్య మున "త్వం" పదముచే ప్రమాత [జీవుడు] పరామర్శింపబడి యా జీవునకు బ్రహ్మాభేద ముపదిష్ట మగుచున్నది. చిదాభాసు

వంగీకరింపనిచో నీ యుపదేశము శుద్ధాత్మకా? అహంకారము నకా? శుద్ధాత్మ నిర్వికారుడు. అహంకారము జడము. కాన, నీ రెండు పక్షములు చెల్లవు. అందుచే ఉపదేశయోగ్యుడు, ప్రమాతయు నగు చిదాభాసు నంగీకరించిన గాని, యుపదేశము సార్థకము గాదు.

శ్రోతుః స్యా దుపదేశ శ్చే దర్థవత్త్వం తథా భవేత్।
అధ్యక్షస్య న చే దిష్టం శ్రోతృత్వం కస్య తద్భవేత్॥
౧౧౧

తా॥ మహావాక్యోపదేశము శ్రోతకు జేయబడుచో నా యుపదేశము సార్థక మగును. చిదాభాసు నంగీకరింపని పక్షమున నీ యుపదేశ మధ్యక్షునకా [సాక్షికా]? కూటస్థుడు గాన, సాక్షి శ్రోత గానేరడు. కాన, ఉపదేశము సంగతము కాదు. అధ్యక్షునకు ఉపదేశార్థమైన శ్రోతృత్వ ముపపన్నము గానిచో నిక శ్రోతృత్వ మెవరికి?

అధ్యక్షస్య సమీపే స్యా ద్బుద్ధే రేవేతి చే న్మతమ్।
న తత్కృతోపకారోఽస్తి కాష్ఠా ద్యద్వ న్న కల్ప్యతే॥
౧౧౨

తా॥ అధ్యక్షునకు శ్రోతృత్వము సంగతము కాకపోయి నను, వాక్యోపదేశమునకు నైరర్థ్యము లేదు. అధ్యక్షుని

సంనిధియందున్నంతమాత్రము చేతనే బుద్ధికి శ్రోతృత్వము సిద్ధించును-ఈ వాదము సరికాదు.కాష్ఠాదుల సన్నిధిమాత్రము చేత బుద్ధియందెట్టి యతిశయము కన్పింపని యట్లు నిర్వికార సాక్షి సంనిధి సత్తామాత్రము చేతను బుద్ధియందెట్టి యతిశయము కలుగదు. కాన, అధ్యక్షసాంనిధ్యము చేతనే బుద్ధికి శ్రోతృత్వము సిద్ధించు ననుట సరికాదు.

బుద్ధౌ చేత్ తత్కృతః కశ్చి న్న న్వేవం పరిణామితా।
ఆభాసేఽపి చ కో దోషః సతి శ్రుత్యాద్యనుగ్రహే॥
౧౧౩

తా॥ అట్లుగాక, బుద్ధియందు అధ్యక్షసాంనిధ్యము వలన నేదేని యతిశయము(ఉపకారము)కలుగు నని చెప్పుచో, అధ్యక్షునకు పరిణామిత్వము ప్రసక్త మగును. కాన నట్లు చెప్పరాదు. అందుచే - 'రూపం రూపం ప్రతిరూపో బభూవ' (బృ. ఉ. 2-5.19); 'ఏకధా బహుధా చైవ దృశ్యతే జల చంద్రవత్' [బ్రహ్మబిం. ఉ. 12; మోక్షధర్మ]- అని యీ రీతిగా శ్రుతిస్మృతులయందు బ్రతిపాదింపబడి ప్రమాణసిద్ధమై నిర్దుష్టమైన ఆభాసపక్షమును గ్రహించుటలో దోషమేమి?

ఆభాసే పరిణామ శ్చే న్న రజ్జ్వాదినిభత్వవత్।
సర్పాదే శ్చ తథాఽపోచ మాదర్శే చ ముఖత్వవత్॥
౧౧౪

తా॥ఆభాసపక్షమున, ఆత్మకుపరిణామిత్వము ప్రాప్తము కాదా? కాదు. అజ్ఞానముచే- భ్రాంతిచే - రజ్జువునందు కల్పితమైన సర్పమువలెను, దర్పణమున దోచు ముఖప్రతిబిమ్బము వలెను ఆభాసము మిథ్య యని పూర్వము [18_80] చెప్పబడినది. మిథ్యాసర్పముచే అధిష్ఠానరజ్జువునం దెట్టి వికారము నుండదు. అట్లే మిథ్యాభూత - ఆభాసరూపముచే అధిష్ఠానభూతుడగు ఆత్మయం దెట్టి పరిణామము నుండదు.

విశే :-చేతనము గాని బుద్ధి చేతనము వలె దోచుట [చిన్నిభత్వం] మిథ్య. అభోక్తృస్వరూపు డగు ఆత్మయొక్క భోక్తృత్వాభాసము మిథ్య. దర్పణమునందు భాసించు ముఖ ప్రతిబింబము మిథ్య. ఆ ప్రతిబింబముచే ముఖమునకెట్టి వికారము నుండదు. అట్లే మిథ్యాభూత చిదాభాసునిచే ఆత్మ యందును వికారముండ దని పూర్వము చెప్పబడినది.

నాత్మాభాసత్వసిద్ధి శ్చే దాత్మనో గ్రహణాత్ పృథక్।
ముఖాదేశ్చ పృథక్ సిద్ధి రిహాత్వన్యోన్యసంశ్రయః॥౧౧౩॥

తా॥ ఆత్మగ్రహణము కంటె వేఱుగా ఆత్మాభాస (చిదాభాస) సిద్ధి లేనిచో, ఆత్మస్ఫూర్తియు లేకపోవలెను. అట్లైని,అన్యోన్యాశ్రయదోషము ప్రసక్త మగునుగదా! యన, నట్లుగాదు. ముఖప్రతిబిమ్బ దృష్టాన్తమున, దర్పణగత ప్రతి

బిమ్బముకంటె వేఱుగా గ్రీవాస్థ ముఖసిద్ధి యున్నది గాన, అన్యోన్యాశ్రయము లేదు, అట్లే చిదాభాసుని కంటె వేఱుగా చిదాత్మ సిద్ధమై యుండుటజేసి యన్యోన్యాశ్రయ దోష ముండదు.

అధ్యక్షస్య పృథక్ సిద్ధా ఆభాసస్య తదీయతా।
ఆభాసస్య తదీయత్వే హ్యధ్యక్షవ్యతిరిక్తతా॥ ౧౧౩

తా॥ పూర్వపక్షి అన్యోన్యాశ్రయదోషమును వివరించు చున్నాడు.

సాక్షి వేఱుగా సిద్ధించి నపుడే ఆభాసమునకు సాక్షితో సంబంధము; సాక్షితోడి సంబంధము సిద్ధించిన గాని, ఆభాసము కంటె వేఱుగా సాక్షి సిద్ధింపడు. ఇట్లు సాక్షి, తదాభాసముల కన్యోన్యాశ్రయ దోషము ప్రసక్తించును. ఇట్లు చిదాభాససిద్ధి లేనందువలన చేతనాత్మ అహంకారాత్మకమే యనదగును.

నైవం స్వప్నే పృథక్ సిద్ధేః ప్రత్యయస్య దృశే స్తథా।
రథాదే స్తత్ర శూన్యత్వా త్ప్రత్యయస్యాత్మనా గ్రహః॥
౧౧౪

తా॥ ఇట్లు చెప్పుట తగదు. స్వప్నావస్థయందు అన్యోన్యాశ్రయము లేకయే ముఖ - తత్ప్రతిబింబముల వలె

ఆత్మాంతఃకరణములు రెండును వేర్వేఱుగా భాసించుచుండును. 'న తత్ర రథాన రథాదియోగాః'(బృ.ఉ. 4-3-10) "స్వప్నమున వస్తుతః రథములు గాని, రథమార్గములు గాని లే" వని శ్రుతి చెప్పుచున్నది. అంతఃకరణమే స్వప్నమున దృశ్యరథ - రథమార్గాదిరూపమున భాసించి సాక్షిభాస్యమగునని శ్రుతితాత్పర్యము. కాన, అంతఃకరణసంసర్గ వినిర్ముక్తుడై స్వయంప్రకాశుడైన ఆత్మ రథాదివిషయాకారముల దాల్చెడి యంతఃకరణమునకు సాక్షియై వేఱుగా స్వప్నమున భాసించుటజేసి యన్యోన్యాశ్రయదోషము లేదు .

అవగత్యా హి సంవ్యాప్తః ప్రత్యయో విషయాకృతిః।
జాయతే స యదాకారః స బాహ్యో విషయో మతః॥
౧౧౮

తా॥ స్వప్నదశాపర్యాలోచన ద్వారా అంతఃకరణ వివిక్త చిదాత్మస్వరూపమును దర్శింపజేసి, జాగ్రద్దశాపర్యాలోచనవలన నీ విషయము తేటపడు నని వివరించుచున్నారు.

చిదాభాసవిశిష్ట బుద్ధివృత్తి ఇంద్రియప్రణాలీద్వారా ఘటాది విషయదేశము జేరి,యట నా విషయమును వ్యాపించి తదాకారము (ఘటపటాద్యాకారము) గలది యగును. అంతఃకరణమునందలి విషయాకారమే బాహ్యవిషయము.

కర్మేప్సితతమత్వాత్స తద్వాక్ కార్యే నియుజ్యతే।
ఆకారో యత్ర చార్థ్యేత కరణం తదిహోచ్యతే॥ ౧౧౯

తా॥ ఆ విషయము కర్త కత్యంత మిష్టమగుట జేసి కర్మ యగును.(కర్తురీప్సితతమం కర్మ - పా.సూ.)ఆ ఘటాది విషయమైన యిచ్ఛగల పురుషుడు "అది చేయుము; ఇది చేయు" మని - ఆ యా కార్యముల యందు ప్రేరితు డగును. తత్తద్విషయాకారముగా బరిణతి జెందు బుద్ధివృత్తి బాహ్య విషయజ్ఞానమునకు కరణము.

యదాభాసేన సంవ్యాప్తః స జ్ఞాతేతి నిగద్యతే।
త్రయ మేత ద్వివిచ్యాఽత్ర యో జానాతి స ఆత్మవిత్॥
౧౨౦

తా॥ ఈ విధముగా విషయ - కరణములను నిరూపించి, యిపుడు కర్తను నిరూపించుచున్నారు.

అంతఃకరణ మెప్పుడు చిదాభాసునిచే వ్యాప్త మగునో, యప్పుడది జ్ఞాత యగును.ఇట్లు జ్ఞాత, జ్ఞానము, జ్ఞేయము - అను త్రిపుటిని బాగుగా వివేచన జేసి సాక్షి యగు ఆత్మయొక్క స్వరూప మెవడు తెలిసికొనునో, యతడే'త్వం'పదలక్ష్య మగు ఆత్మవేత్త.

వి :- "త్రితయం తత్ర యో వేద స ఆత్మా స్వాశ్రయాశ్రయః"—శ్రీమద్భాగవతమ్ 2-10-9.

సమ్యక్సంశయమిథ్యోక్తాః ప్రత్యయా వ్యభిచారిణః।
ఏకైవావగతి స్తేషు భేదస్తు ప్రత్యయార్పితః॥ ౧౨౧

తా॥ వివేక ప్రకార మిట విశదము చేయబడుచున్నది.

సమ్యక్ (యథార్థ) సంశయ - మిథ్యారూపార్థముల బోధించు ప్రత్యయములు వ్యభిచార (అనియత, లేక ఆగమాపాయ) ధర్మము గలవి. ప్రత్యయము (వృత్తు)లనియతములయినను వానియందు అనుగత మగు జ్ఞాన మేకరూపము. జ్ఞానగతభేదము అనియత (వ్యావృత్త) ప్రత్యయభేదకృతము.

ఆధిభేదా ద్యథా భేదో మణే రవగతే స్తథా।
అశుద్ధిః పరిణామశ్చ సర్వం ప్రత్యయసంశ్రయాత్॥
౧౨౨

తా॥ జపాకుసుమా ద్యుపాధిభేదముచే స్ఫటికాదిమణుల యందు భేదము భాసించు నట్లే, అహంకార - చిదాభాస సంబంధము కారణముగా అశుద్ధి, పరిణామము - సర్వము

జ్ఞానమునందు భాసించును. వస్తుతః జ్ఞానమునందు భేదముగాని వికారము గాని, యెవ్వియును లేవు.

ప్రథనం గ్రహణం సిద్ధిః ప్రత్యయానా మిహాన్యతః।
అపరోక్షాత్తదేవోక్త మనుమానం ప్రదీపవత్॥ ౧౩

తా॥ జడములు, బాహ్యములు నగు ఘటపటాదిపదార్థముల యొక్క (ప్రథనం) స్ఫూర్తి, గ్రహణము (స్థితి లేక వ్యవహారము), స్వరూపలాభము (సిద్ధి) దీపాదులచే సిద్ధించునట్లు, జడము లగుటచే బుద్ధివృత్తులు సయితము వేఱొక స్వయంప్రకాశవస్తువుచే ప్రకాశితము లగుచుండును. దేనిచే నవి ప్రకాశితము లగునో, యదియే స్వయంప్రకాశి - ఆత్మ. ఈ ప్రత్యయము లన్నియు నా యాత్మయందే అధ్యస్తము లైనవి. ఈ ప్రత్యయముల యొక్క సత్త(ఉనికి) ఆత్మ- సత్తాధీనము. కావున నీ ప్రత్యయములు స్వతంత్రసత్త లేనివి; మిథ్యాభూతములు. ఇట, ప్రదీపదృష్టాంతముచే అనుమానము చేయబడినది.

విశే :- అనుమాన ప్రకారము:- విమతాః ప్రత్యయాః స్వవిలక్షణాన్యాధీనగ్రహణ సిద్ధికాః, అచిత్స్వభావత్వాత్; ప్రదీపాదివత్.

కిమస్య గ్రాహయేత్కశ్చిత్ ప్రమాణేన తు కేన చిత్।
వినైవ తు ప్రమాణేన నివృత్త్యాఽన్యస్య శేషతః॥ ౧౪

తా॥ ఇట్లు అనుమానప్రమాణము ద్వారా విధిముఖముగా ఆత్మసిద్ధిని చూపి, కేవల నిషేధముఖప్రమాణము చేతనే యాత్మసిద్ధిగలుగు ననెడివారి వాదమును ఖండించుటకై యిట్లు వికల్పము చేయుచున్నారు.

అన్య - అనాత్మ పదార్థ నిషేధము చేసి అవశిష్టపదార్థరూపముగ ఆత్మయొక్క సిద్ధిని ఏదియేని ప్రమాణము ద్వారా చేయుదురా? లేక ప్రమాణము లేకయే చేయుదురా?

అవ :- ఆత్మతత్త్వము ప్రమాణసాధ్య మని చెప్పుచో, విధిముఖముగానే ప్రమాణప్రవృత్తి సిద్ధించును. నిషేధముఖమున గాదు. కాన, వాది కిష్టహాని (ఆత్మయొక్క యసిద్ధి) యగుట స్పష్టమే యని తలచి రెండవపక్షమును నిరాకరించుచున్నారు.

శబ్దేనైవ ప్రమాణేన నివృత్తి శ్చే దిహోచ్యతే।
అధ్యక్షస్యాప్రసిద్ధత్వా చ్ఛూన్యతైవ ప్రసజ్యతే॥ ౧౩౪

తా॥ ఇచట 'నేతి నేతి' యను శబ్దప్రమాణము చేతనే అనాత్మవస్తునిషేధము చేయబడుచో, అధ్యక్షుని [ఆత్మ] యొక్క సద్భావము శబ్దప్రమాణము కంటె నితరమగు మఱే దేనివలనను ప్రసిద్ధము గానందున, నిషేధము చేయగా, పరిశేష్టవస్తువు ఆత్మ యని పరిశేషన్యాయముచే నిరూపింప శక్యము

గాదు. అందుచే అవశిష్టమగునది శూన్యమే - ఆత్మ కాక పోవలసివచ్చును.

చేతనత్త్వం కథం దేహా ఇతి చేన్నాప్రసిద్ధితః।
చేతనస్యాన్యతః సిద్ధా వేవం స్యా దన్యహానతః॥ ౧౭౬

తా॥ చేతనము, అచేతనము - రెండును పరస్పర విరుద్ధ స్వభావము గలవి. అందు అనాత్మ - అచేతనవస్తు నిషేధము చేయుచో, పరిశేషన్యాయముచే తద్విరుద్ధ చేతనవస్తువు పరిశేషించును. కాన, శూన్యతాప్రసంగము లేదు- అనెడి శంకకు పరిహారము చెప్పబడుచున్నది.నీవు చేతన- ఆత్మస్వరూపుడవు; దేహా మెట్లగుదువు? అని చెప్పుచో,చేతనత్త్వప్రసిద్ధి యుండవలెను. శబ్దాతిరిక్తమగు నే ప్రమాణముచేతను చేతనత్త్వ మొకటి యున్నదని సిద్ధింపనందున నిట్లు చెప్పరాదు.ఏదియేని యన్యప్రమాణముచే చేతనత్త్వము సిద్ధించుచో నపుడు అనాత్మనిషేధము వలన పరిశేషన్యాయముచే చేతనత్త్వము శేషించునని చెప్పవలనుపడును.

విశే :- నిషేధమునకు నిషేధ్య ప్రతియోగిప్రసిద్ధి యుండవలెను. ఘటము ప్రసిద్ధ మగుచో పటమును జూచి యిది ఘటము కాదని నిషేధింపవచ్చును. ఘటప్రసిద్ధియే లేనపుడు ఘటనిషేధ మెట్లు పొసగును?అట్లే ఆత్మప్రసిద్ధియు లేనపుడు దేహమును జూచి ఇది యాత్మ కాదు; అనాత్మ యను

నిషేధ మెట్లు పొసగును? ఆత్మప్రసిద్ధి యున్నచో, అనాత్మ నిషేధము; అనాత్మనిషేధముచే ఆత్మప్రసిద్ధి- ఇట్లు అన్యోన్యాశ్రయదోషము ప్రసక్త మగును.

అధ్యక్షః స్వయమ స్త్యేవ చేతనస్యాప్రరోక్షతః।
తుల్య ఏవం ప్రబోధః స్యాదన్యస్యాసత్త్వవాదినా॥౧౨౮

తా॥ ఆత్మ అత్యంత సుప్రసిద్ధుడు కాడు. అపరోక్షమగుట వలన సాక్షి స్వయంసిద్ధుడు గదా!—అని యందురేని, ఇట్లు చెప్పుట ఆత్మ శూన్యరూపు డని చెప్పు బౌద్ధుల మతమునను గలదు. వారును శూన్యము స్వతఃసిద్ధ మని తలతురు.

అహ మజ్ఞాసిషం చేద మితి లోకస్మృతే రిహా।
కరణం కర్మ కర్తా చ సిద్ధాస్త్వేకక్షణే కిల॥ ౧౨౯

తా॥ అహ మిద మజ్ఞాసిషం=నేను దీనిని ఎఱుగుదును. లోకమున నిట్టి స్మృతి కలదు. స్మృతి అనుభవపూర్వకము. అనుభూత విషయములు లేనిదే వానిని గూర్చిన స్మృతి కలుగదు. ఈ స్మృతి ననుసరించి లోకవ్యవహారమున కర్త, కర్మ, కరణములు మూడు నొకే క్షణమున నొక్కసారిగా పూర్వమెవరివలన సిద్ధము లగుచున్నవో యతడే స్వయంసిద్ధుడు, చేతనుడు, సాక్షి యని తెలియును. కనుక, మఱిదేనిచేతను ఆత్మప్రసిద్ధి కలుగ దనుట యుక్తము గాదు.

ప్రామాణ్యేఽపి స్మృతేః శైఘ్ర్యా ద్యౌగపద్యం విభావ్యతే।
క్రమేణ గ్రహణం పూర్వం స్మృతేః పశ్చా త్తథైవ చ॥ ౧౨౯

తా॥ పై వాదము సరికాదు. అనుభూతవిషయమునకు గమక మగుటచే స్మృతి ప్రమాణము. కాని, స్మృతి యొక్క మూరుగా కర్తృ, కర్మ, కరణత్రితయసిద్ధికి గమకము గాదు. ఏ క్రమము ననుసరించి పూర్వము కర్తృకర్మాదుల యనుభవము గలిగినదో, యా క్రమము ననుసరించియే తరువాత స్మృతి కలుగును. అయితే, యా జ్ఞానము శీఘ్రముగా గలుగుట వలన, విలమ్బము ప్రతీయమానము కానందున, యౌగపద్యము భాసించును. కాన, యౌగపద్యప్రతీతి వాస్తవము గాదు; మిథ్యయే.

విశే :- కర్త ఆంతరవస్తువు. క్రియాకర్మభూత మగు విషయము బాహ్యము. అందుచే వీని యనుభవ మొకేసారి యొకే క్షణములో గలుగుట యసంభవము. పదార్థానుభవమున నే క్రమమో, స్మృతియందు నదే క్రమము. కాన, యౌగపద్యానుభూతి శీఘ్రతానిబంధనము - వాస్తవము కాదు.

అజ్ఞాసిష మిదం మాం చే త్యపేక్షా జాయతే ధ్రువమ్।
విశేషోఽపేక్ష్యతే యత్ర తత్ర నైవైకకాలతా॥ ౧౩౦

తా॥ "అజ్ఞాసిష మిదం మాం చ"—నేను దీనిని, నన్ను గూడ నెఱుగుదును. ఇట 'ఇది' యనునది ఇదంవృత్తివిష యము. 'మాం' (నన్ను) అనునది అహంవృత్తి విషయము ఇట్టి జ్ఞానమున నిశ్చయముగా పౌర్వాపర్యాపేక్ష యుండును. ఎచట అన్యసాపేక్షమైన విశేషముయొక్క స్ఫూర్తి యుండునో యచట ఏకకాలత (యౌగపద్యము)సంభవము కాదు. ఇదం-(ఇది) జ్ఞానము అహంవృత్తిసాపేక్షము. అహం - జ్ఞానము 'ఇదం' జ్ఞానసాపేక్షము. పరస్పరసాపేక్ష యుండుటచే యౌగ పద్యము సంభవము కాదు.

ఆత్మనో గ్రహణే చాపి త్రయాణా మిహ సంభవాత్।
ఆత్మన్యాసక్తకర్తృత్వం న స్యాత్కారణకర్మణోః॥ ౧౩౧

తా॥ విషయగ్రహణము నందు వలెనే ప్రమాత (ఆత్మ) ప్రమేయము, ప్రమ — వీనియొక్క గ్రహణ మందును కర్తృ కర్మకరణములు మూడింటియొక్క అపేక్ష యుండును. ఆత్మ (ప్రమాత) విషయమై చరితార్థ మయిన కరణము కర్మసిద్ధి విషయమై కారణము గాదు.

విశే :- క్రియాసిద్ధికి సాధనము లావశ్యకములు. సాధన ప్రయోగమున స్వాతంత్ర్యము గలవాడే కర్త. అతడే కర్మాది కారకప్రయోక్త. కర్తృసిద్ధి మొదట, కర్మాదికారకసిద్ధి తరు

వాత. అందుచే కర్తృ-కర్మ-కరణముల సత్త ఒకేసారి సిద్ధమగుట సంభవము గాదు. అందు క్రమ మావశ్యకము.

వ్యాప్తు మిష్టం చ యత్కర్తుః క్రియయా కర్మ తత్స్మృతమ్।
అతో హి కర్తృతన్త్రత్వం తస్యేష్టం నాన్యతంత్రతా॥ ౧౩౨

తా॥ కర్త్రాదులకు యుగపత్సిద్ధి జెప్పిన, వ్యాకరణ విరోధము ప్రాప్త మగును. "కర్తు రీప్సితతమం కర్మ" (పా. సూ.) 'కర్తుః క్రియయా వ్యాప్తు మిష్టతమం కారకం కర్మ'. కర్త తన క్రియచేత బొందుటకు అత్యంత మిష్టమైన కారకము (క్రియాజనకము) కర్మ యనబడును. కర్మాది సకల కారక ప్రయోక్త కర్త. కాన, కర్మ కర్త యధీనము; అన్యాధీనము గాదు. అందుచే కర్త, కర్మలకు పౌర్వాపర్యము ఆవశ్యకము.

శబ్దా ద్వా ఽనుమితేర్వాఽపి ప్రమాణాద్వా తతోఽన్యతః।
సిద్ధిః సర్వపదార్థానాం స్యా దజ్ఞం ప్రతి నాన్యథా॥ ౧౩౩

తా॥ పైన జూపిన కారణముల వలన విధిరూపమున ప్రవృత్తములగు శబ్దప్రమాణము, లేక అనుమానప్రమాణ

ముచే ఆత్మతత్త్వము సిద్ధించు ననుట యుక్తము. ఏల యనగా శబ్ద - అనుమానప్రమాణముల చేతనే సర్వపదార్థసిద్ధి కలుగును. తద్భిన్న ప్రత్యక్షాది ప్రమాణములచే అజ్ఞానులకు పదార్థసిద్ధి కలుగును; మఱియొక రీతిగా గాదు—

అధ్యక్షస్యాపి సిద్ధిః స్యాత్ప్రమాణేన వినైవ వా।
వినా స్వస్య ప్రసిద్ధిస్తు నాజ్ఞం ప్రత్యుపయుజ్యతే॥ ౧౩౪

తా॥ అజ్ఞులకు గలుగు సాక్షిసిద్ధి ప్రమాణాధీనమా? కాదా? ప్రమాణాధీనము గాని ఆత్మజ్ఞానము వలన అజ్ఞుల కెట్టి యుపయోగము లేదు.

వి శే:- ఆత్మ స్వయంప్రకాశుఁడు. జడవస్తుసిద్ధి ప్రమాణాధీనముగాని, స్వయంప్రకాశ - ఆత్మసిద్ధి ప్రమాణాధీనము గాదని యందురా?— ఈ విషయమై సమాధాన మిట్లు చెప్పనగును.

స్వరూపభూత మగు నాత్మచైతన్యము ప్రమాణము లేకయే సిద్ధించినను, ఆత్మకు గల సాక్షిత్వము మాత్రము ప్రమాణాధీనము.

శం. ర. 13–51

తస్యైవాజ్ఞత్వ మిష్టం చేద్ జ్ఞానత్వేఽన్యా మతి ర్భవేత్।
అన్యస్యైవాజ్ఞతాయాం చ తద్విజ్ఞానే ధ్రువా భవేత్॥ ౧౩౫

తా॥ అజ్ఞత్వ మధ్యక్షునకా? అహంకారమునకా? అధ్యక్షునకే అజ్ఞత్వ మభిమత మగుచో నా యధ్యక్షుని చేత నత్వము విషయమై ప్రమాణసిద్ధమైన మతి యపేక్షితము. అట్లుగాక, అహంకారమునకే అజ్ఞత్వ మిష్ట మగుచో నా యహంకారస్వరూపము, అధ్యక్షస్వరూపము దెలియుటకై ప్రమాణజన్యజ్ఞాన మావశ్యకము. ఎట్లైనను అధ్యక్షసిద్ధి విధి ముఖ ప్రమాణాధీనము.

జ్ఞాతతా స్వాత్మలాభో వా సిద్ధిః స్యా దన్యదేవ వా।
జ్ఞాతత్వేఽనంతరోక్తా త్వం పక్షౌ సంస్మర్తు మర్హసి॥ ౧౩౬

తా॥ అధ్యక్షుడు [సాక్షి] సిద్ధస్వరూపుడు గాన, తత్సిద్ధికై ప్రమాణాపేక్ష లేదు - అనుచో సిద్ధిశబ్దముయొక్క యర్థమేమి? జ్ఞానమా? స్వరూపలాభమా? లేక మఱియొక టియా?

సిద్ధిశబ్దమునకు జ్ఞానమునందే తాత్పర్య మగుచో,— "తస్యైవాజ్ఞత్వ మిష్టం చేత్"— అనెడి పూర్వశ్లోకమున

జెప్పబడిన పక్షద్వయమును, తత్ప్రమాణప్రకారమును స్మరించునది.

సిద్ధిః స్యాత్ స్వాత్మలాభ శ్చే ద్యత్న స్తత్ర నిరర్థకః।
సర్వలోకప్రసిద్ధత్వాత్ స్వహేతుభ్యస్తు వస్తునః॥ ౧౩౭

తా॥ సిద్ధిశబ్దమునకు స్వరూపలాభమే యర్థ మగుచో నన్ని వస్తువులకును వాని వాని సాధనములచే స్వరూపలాభము కలుగుచునే యుండుట సర్వలోకప్రసిద్ధము. అందుచే నా విషయమున ప్రమాతృప్రమాణ ప్రయాసము వ్యర్థ మగును.

జ్ఞానజ్ఞేయాదివాదేఽతః సిద్ధి ర్జ్ఞాతత్వ ముచ్యతే।
అధ్యక్షాధ్యక్షయోః సిద్ధి ర్జ్ఞేయత్వం నాత్మలాభతా॥౧౩౮

తా॥ కావున ఏ మతమున జ్ఞాత, జ్ఞానము, జ్ఞేయము— వీనిని గూర్చిన విచారము చేయబడునో, యా మతమున సిద్ధి యన జ్ఞాతత్వమే. అందుచే సాక్షి, సాక్ష్యముల యొక్క జ్ఞేయత్వమే వానియొక్క సిద్ధి యగును; స్వరూపలాభము గాదు.

విశే :- జడము గానిమ్ము, చేతనము గానిమ్ము, వాని యొక్క స్థితియే (సత్తయే) సిద్ధిగాదు. ప్రమాణముల ద్వారా ప్రమాతకు విషయ మగుటయే వస్తువుయొక్క సిద్ధి.

పురుషునకే జ్ఞానము కలుగును'; 'ఆచార్యునకు ప్రణమిల్లి సేవించి యాత్మజ్ఞానము బడయును'-ఇత్యాది శ్రుతి స్మృతి వచనముల ననుసరించి శాన్తుడు, మేధావి, ముక్తుడు, నిష్క్రియుడు, బ్రహ్మనిష్ఠుడు నగు గురువు నాశ్రయింపవలెను.

స గురు స్తారయే ద్యుక్తం శిష్యం శిష్యగుణాన్వితమ్।
బ్రహ్మవిద్యాప్లవేనాశు స్వాంతధ్వాంతమహోదధిమ్॥ ౧౩

తా॥ అట్టి గురువు శిష్యగుణాన్వితుడు, సమాహిత చిత్తుడు నగు శిష్యుని బ్రహ్మ-విద్య యనెడి నౌకచే అంతఃకరణావృత అజ్ఞానసాగరము నుండి తరింపజేయును.

దృష్టిః స్పృష్టిః శ్రుతి ర్ఘ్రాతి ర్మతి ర్విజ్ఞాతి రేవ చ।
శక్తయోఽన్యాశ్చ భిద్యన్తే చిద్రూపత్వేఽప్యుపాధిభిః॥ ౧౪

తా॥ దర్శన-స్పర్శ-శ్రవణ-ఘ్రాణ-మనన-విజ్ఞానాది శక్తు లన్నియు చిద్రూపములే యైనను, భిన్నభిన్న-ఉపాధులు కారణముగా వానియందు భేదము కన్పట్టును.

అపాయోద్భూతిహీనాభి ర్నిత్యం దీప్యేత రవి ర్యథా।
సర్వజ్ఞః సర్వదృక్ శుద్ధః సర్వం జానాతి సర్వదా॥ ౧౫

తా॥ జన్మవినాశరహితములైన కిరణములతో సూర్యుడు నిరంతరము వెలుగొందు విధముగా సర్వజ్ఞుడు, సర్వసాక్షి, శుద్ధ

ముగ కర్త్రాదులకు ప్రాకట్యరూప మయిన స్ఫుటత యుండు నని చెప్పుట సంమత మగునేని, కర్త్రాదులకంటె విలక్షణు డయిన యధ్యక్షునకే ద్రష్టృత్వ మంగీకరించవలెను. ప్రకాశ పరపర్యాయమైన స్ఫుటత కర్మాదిరూప మయిన జడమునకు సిద్ధింపదు గాన,స్ఫుటత సిద్ధిశబ్దార్థము గాదు; జ్ఞానవిషయత్వమే (జ్ఞానము కలుగుటయే) యని చెప్పవలెను. కాన, కర్తృ కర్మాది సంఘమును బ్రకాశింపజేయు చిద్రూపుడగు ఆత్మ విధిముఖముగనే ప్రదీపము వలె స్వయంప్రకాశుడు, సర్వ ప్రకాశకు డని దృష్టాంతానుమానాది ప్రమాణములచే దెలియదగినవాడు.

అనుభూతేః కిమన్యస్మిన్ స్యాత్ త్వపేక్షయా వద।
అనుభవితరీష్టా స్యాత్ సోఽప్యనుభూతిరేవ నః॥ ౧౪౧

కర్తృకర్మహీన మగు జ్ఞానమే స్వమహిమచే భాసించు నని విజ్ఞానవాది యగు బౌద్ధుడు శంకించుచున్నాడు.

తా॥ స్వప్రకాశ మగు అనుభూతి అన్యమగు కర్త్రా దికము నపేక్షింపదు. అనుభూతి కాశ్రయము అనుభవిత (అనుభవించువాడు). అనుభవితయైన కర్తయం దనుభూతి యుండు నందువేని, ఓ బౌద్ధుడా! మా మతమున అనుభూతి కంటె వేఱుగా అనుభవిత లేడు. మీరు చెప్పెడి అనుభవిత మా వేదాంత దర్శనమున అనుభూతియే కాని అన్యము కాదు

వి :- "స్వయమేవానుభూతిత్వా ద్విద్యతే నానుభావ్యతా"— పంచదశి. పంచకోశవివేక-13

"అభిన్నోఽపి హి బుద్ధ్యాత్మా విపర్యాసితదర్శనైః।
గ్రాహ్యగ్రాహకసంవిత్తి భేదవా నివ లక్ష్యతే"॥ ౧౪౨

తా॥ అట్లగుచో, అనుభూతి - అనుభవిత (కర్త),— అనుభావ్యము (కర్మ-అనుభవింపదగినది) అను భేదదర్శన మెట్లు పొసగును?

బుద్ధ్యుపాధి స్వభావము గల ఆత్మ యొకడైనను భ్రాంతి బుద్ధి గల పురుషులచే గ్రహణము, (సంవిత్తి) గ్రాహ్యము, గ్రాహకము అను భేదము గలవానివలె భాసించును.

"భూతి ర్యేషాం క్రియా సైవ కారకం సైవ చోచ్యతే।
సత్త్వం నాశిత్వ మస్యా శ్చేత్ సకర్తృత్వం తథేష్యతామ్॥
౧౪౩

తా॥ బుద్ధి కారకము కానందున, కర్త్రాద్యపేక్ష లేదు- అని చెప్పబడుచున్నది. అనుభూతియే క్రియ, కారకముగూడ. అందుచే స్వవ్యతిరిక్త కర్త్రపేక్ష లేదు అనుచో, అది సరి కాదు. అనుభూతికి సత్తా - నాశనముల నంగీకరించుచో నా యనుభూతికి కర్త యొకడుండు ననియు అంగీకరించవలెను. (చూ. 23శ్లో-16 అ.)

న కశ్చి చ్ఛేష్యతే ధర్మ ఇతి చేత్ప్రక్షహానతా।
నన్వస్తిత్వాదయో ధర్మా నాస్తిత్వాదినివృత్తయః।
న భూతే స్తర్హి నాశిత్వం స్వాలక్షణ్యం మతం హి తే॥
౧౪౪

తా॥ అనుభూతికి క్షణిక సత్తానాశము లను ధర్మముల నంగీకరింపము. మా మతమున క్షణికత్వాదు లనగా, అక్షణికత్వ నాస్తిత్వాది నిషేధరూపములే-అని యందురేని, మీ క్షణ భంగురవాదమునకే హాని కల్గును- అనగా, ధర్మము లన్నియు క్షణికము లనెడి మీ వాదము నిలువదు. మీ మతమున సత్తానాశములు, ధర్మములు కావనినచో నవి యుండ వనియే చెప్పవలెను. అట్లు చెప్పుచో, అనుభూతి నశించునది కాకపోవలెను. "సర్వం స్వలక్షణం"— అను మీ వాదము ననుసరించి అనుభూతి స్వలక్షణము గాన, నశింపదు. (స్వలక్షణము = స్వయంసత్తాకము, స్వయంజ్ఞాతము.)

స్వలక్షణావధి ర్నాశో నాశోఽనాశనివృత్తితా।
అగో రసత్వం గోత్వం తే న తు తద్గోత్వలక్షణమ్॥౧౪౫

తా॥ నాశమునకు స్వలక్షణమైన ప్రకృతి యుండవలెను. కంకణకేయూరాది వస్తువులు కరుగగా, ప్రకృతి యగు సువర్ణమే యగును. నాశ మనగా, అనాశిత్వ నివృత్తియే - గోవు

అనగా - గోవుకంటె అన్యములగు అశ్వాదులకంటె భిన్నము- అని మీ మతము ననుసరించి చెప్పవలెను. అశ్వము కానిది గోవు - అనుచో - గోవుకానిది అశ్వము - అని మీ మత మున జెప్పవలెను. ఇది అన్యోన్యాశ్రయ దోషము. కావున, నది గోలక్షణము కానేరదు.మఱియు, నాశ మనగా అనాశము లేకపోవుట యని చెప్పుచో,నాశము కలుగునపుడు దానికివిరుద్ధ మయిన అనాశముండదు. అనాశము లేదేని, నివృత్తియు పొసగదు.

క్షణవాద్యేఽపి యోఽర్థః స్యాత్ సోఽప్యన్యాభావ
ఏవ తే॥ ౧౪౬

తా॥ మీ మతమున క్షణిక మనుచో, క్షణికము కాని దానికంటె భిన్న మని చెప్పవలెను. అప్పుడు క్షణికము కాని స్థిరపదార్థమును గూడ మీ రంగీకరింపవలసియుండును.ఇదియు మీ మతమున దోషము.

భేదాభావేఽప్యభావస్య భేదో నామభి రిష్యతే।
నామభేదై రనేకత్వ మేకస్య స్యాత్ కథం తవ॥ ౧౪౭

తా॥ అభావస్వరూపమున భేదము లేదు. అయినను- అశ్వము కానిది గోవు; గోవు కానిది అశ్వము - అని నామ మాత్రమున భేదము - అని చెప్పుటయు సరికాదు. విభాగ

రహితము, స్వరూపరహితము నగు అభావమునకు నామము లచే భేద మెట్లు సిద్ధించునో చెప్పుము.

అపోహో యది భిన్నానాం వ్యావృత్తి స్తస్య కథం గవి।
నాభావా భేదకాః సర్వే విశేషా వా కథంచన॥ ౧౪౮

తా॥ అపోహ యన, అది కాదని చెప్పుట. వ్యావృత్తి యన, అన్యమునుండి మరల్చుట. గోభేదమునకు గోవు ప్రతియోగి. గోవనగా గోభిన్నముల కంటె భిన్న మని కదా మీరు చెప్పునది. గోభిన్న వస్తువు లనేకములు. ఆ ప్రతియోగివస్తువు లన్నియు తెలియకక వాని యపోహము (అవి కాదు అను జ్ఞానము) గోవు నం దెట్లు సంభవించును? అనేకపదార్థాపోహము సంభవము గానందున, గోవు – అను వ్యవహారము సిద్ధింపదు. ఏవియో కొలది పదార్థముల అపోహముతో వ్యవహారసిద్ధిని కల్గించుద మన్న,ఆ పదార్థముల విషయమై వ్యవస్థ లేక, వ్యవహార నియమము లేకపోవును.కనుక, భిన్నవస్తువుల కపోహము సిద్ధింపదు. అభావములు అన్నియు భేదకములు గావు. ఖండముండత్వాది విశేషములును భేదకములు గావు. భేద్య భేదకములకు భేదమే మీ మతమున సిద్ధింపదు.

నామజాత్యాదయో యద్వ త్సంవిద స్తేఽవిశేషతః॥ ౧౪౯

తా॥ నీ మతమున జ్ఞానము (సంవిత్) నిర్విశేషము గనుక, ఆ జ్ఞానములో నామజాత్యాదులు విశేషణములు గావు. అట్లే గోవు మున్నగు వానికి గోభిన్నాదికము కంటె వ్యావృత్తి గాని,ఖండముండత్వాదికము గాని, భేదకము (విశేషణము) గాజాలదు. ఇట్లు విశిష్టవ్యవహారమే లేనపుడు మీ వాదము నిలువదు.

ప్రత్యక్ష మనుమానం వా వ్యవహారే యదీచ్ఛసి।
క్రియాకారకభేదైస్తదభ్యుపేయం ధ్రువం భవేత్ । ౧౫౦

తా॥ ["భూతి ర్యేషాం క్రియా సైవ"[18-143]అను శ్లోకమున]జ్ఞానమునకు క్రియాకారక భేదాపేక్ష లేదని చెప్పుట యుక్తము గాదు. వ్యవహారదశయందు ప్రత్యక్షమును గాని, అనుమానమును గాని ప్రమాణముగ నీ వంగీకరించుచో, ఆ ప్రమాణములు క్రియాకారక భేదసహితము లనియే యంగీకరింపవలెను.

తస్మా న్నీలం తథా పీతం ఘటాది ర్వా విశేషణమ్।
సంవిద స్తదుపేయం స్యా ద్వేన చాప్యనుభూయతే॥౧౫౧

తా॥ సంవేదనము [జ్ఞానము] కంటె అన్య మగు వేద్యము గాని, వేత్త గాని మీకు సంమతము గాకపోయినను

నీల - పీతాది విశేషణములను, ఘటాదివస్తువులను దర్శించు-అనుభవించు - జ్ఞాత యొకడు గలడని తప్పక యొప్పుకొనవలెను.

రూపాదీనాం యథాఽన్యః స్యా ద్గ్రాహ్యత్వా ద్గ్రాహక స్తథా।
ప్రత్యయస్య తథాఽన్యః స్యా ద్వ్యంజకత్వా త్ప్రదీపవత్॥ ౧౨

తా॥ రూపాదికము తనకంటె భిన్న మగు నేత్రాదికముచే గ్రహింపబడునట్లు గ్రాహ్యము[ఘటాదికము] తనకంటె నితరముచే గ్రహింపబడును. అందుచే సంవిత్తు ఇతరముచే గ్రహింపబడును. ఇది బౌద్ధునిగూర్చి చేయవలసిన ప్రయోగము. ప్రదీపము తనచే భాస్యములగు ఘటాదులకంటె భిన్నముగాన, అవభాసకము అవభాస్యము కంటె భిన్నము. అందుచే గ్రాహ్య మగు రూపాదికము కంటె గ్రాహక మగు ఆత్మ యన్య మని యంగీకరింపవలెను. (ఇది ఆస్తికుల గూర్చి చేయవలసిన ప్రయోగము.)

అధ్యక్షస్యేదృశేః కీదృక్ సంబంధః సంభవిష్యతి।
అధ్యక్షేణ తు దృశ్యేన ముక్త్వాఽన్యో ద్రష్టృదృశ్యతామ్॥ ౧౩

అధ్యక్షేణ కృతా దృష్టి ర్దృశ్యం వ్యాప్నోత్యథాఽపి వా।
నిత్యాధ్యక్షకృతః కశ్చి దుపకారో భవే ద్ధియామ్॥ ౧౫౪

తా॥ జ్ఞాతకును, జ్ఞాతమునకునుగల సంబంధము వాస్తవమా? అపారమార్థికమా? [మాయికమా?] దృశ్యము కంటె భిన్నుడయ్యును అధ్యక్షుడు దృశ్యమును వ్యాపించునా? లేక అధ్యక్షకృత దృష్టియే దృశ్యమును వ్యాపించునా?

జ్ఞాతృ జ్ఞానసంబంధము వాస్తవ మగుచో ద్రష్ట యగు ఆత్మ సావయవము, పరిణామి యనెడి దోషములు సంభవించును. కనుక నీ సంబంధము వాస్తవము గాదు; మాయికము. మాయిక మగుచో ధీవృత్తులకు అధ్యక్ష (సాక్షి) కృతమైన యుపకార ముండవలెను - అనగా - ధీవృత్తులకు అధ్యక్షకృతోపకారము సాక్షాత్తు [పైనజూపిన కారణముల వలన] కలుగనందున. ఆభాసుని అంగీకరింపవలెను.

నచోక్త స్తన్నిభత్వం ప్రాక్ సంవ్యాప్తిశ్చ ఘటాదిషు।
యథా లోకాదిసంవ్యాప్తి ర్వ్యంజకత్వా ద్ధియ స్తథా॥
౧౫౫

తా॥ బుద్ధికి నిత్యాధ్యక్షకృతమైన యుపకారము (జడమగు బుద్ధియందు ప్రతిబింబించిన ఆభాసద్వారముగ కలుగు నుపకారము) పూర్వము (శ్లో. 87) ముఖప్రతిబిమ్బదృష్టా

_స్తము చేతన, ఆత్మసాన్నిధ్యముచే జడ మగు బుద్ధి చేతనము వలె భాసించుట యని చెప్పబడినది. ఆలోకము ప్రకాశకము. ఇది ఘటాదికమును వ్యాపించు నట్లు పదార్థములను భాసింప జేయు ఆభాసయుక్త మగు ధీవృత్తి ఆ యా పదార్థములను భాసింపజేయును.

ఆలోకస్థో ఘటో యద్వ ద్బుద్ధ్యారూఢో భవే త్తథా।
ధీవ్యాప్తిః స్యాద్ఘటారోహో ధియో వ్యాప్తౌ క్రమో భవేత్॥ ౧౫౬

తా॥ ఆలోకము [కాంతి] నందు భాసించు ఘటము అలోకారూఢ మని చెప్పబడునట్లు, బుద్ధియందు భాసించు ఘటాదికము బుద్ధ్యారూఢ మగును. ఆరూఢత్వ మనగా పురుషు డశ్వము నారోహించునట్లు ఘటాదికము బుద్ధి నారోహించుట గాదు. ఘటాది పదార్థజాతమును బుద్ధి వ్యాపించుటయే.

అట్లయిన, బుద్ధికిని ఆత్మకును గల సంబంధ మేమి? ఆత్మ అన్ని విషయములను క్రమాపేక్ష లేకయే వ్యాపించును. పూర్వోక్త ముఖప్రతిబిమ్బ దృష్టాన్తముచే బుద్ధి చేతన-ఆత్మ సంనిభమయ్యును, స్వవిషయములను ఒక క్రమము ననుసరించి ప్రకాశింపజేయును.

పూర్వం స్యాత్ప్రత్యయవ్యాప్తి స్తతోఽనుగ్రహో ఆత్మనః।
కృత్స్నాధ్యక్షస్య నో యుక్తః కాలకాశాదివ త్క్రమః॥ ౧౫౭

తా॥ బుద్ధి, మొదట స్వవిషయమును వ్యాపించును. విషయాకారముగ పరిణతి జెందిన బుద్ధియందు ఆత్మ ప్రతిఫలించి, ఘటాదివిషయములను భాసింపజేయును. ఈ విధముగ క్రమ ద్రష్ట యగు బుద్ధి, ఆత్మకు శేషము (అంగము - అప్రధానము) అగును. ఆత్మ శేషి, అనగా దేనికి శేషము గాదు. ఇట్లు విషయాకార పరిణత మగుచు పదార్థములను భాసింపజేయు బుద్ధికే క్రమభేదము గలదు. కాల - ఆకాశాదుల వలె సర్వవ్యాపకుడు, సకలాధ్యక్షుడు, అపరిచ్ఛిన్నుడు, సర్వ విశేషాస్పదుడు నగు ఆత్మకు పరిచ్ఛిన్న బుద్ధికి వలె క్రమ వ్యాప్తితో బనిలేదు.

విషయగ్రహణం యస్య కారకాపేక్షయా భవేత్।
సత్యేవ గ్రాహ్యశేషే చ పరిణామీ స చిత్తవత్॥ ౧౫౮

తా॥ కర్త్రాది కారకాపేక్ష గలిగి, కొంత విషయజాతమును వ్యాపింపగా, మఱికొంత విషయజాతము వ్యాపింపబడక యున్నపుడు చిత్తము వలె ఆత్మ పరిణామశీలుడగును. అపరి

చ్ఛిన్నుడగు ఆత్మ తనయం దధ్యస్తమైన ప్రపంచము నంతయు నొక్కసారిగ భాసింపజేయుచు గ్రహించును గాన, పరిణామి కాడు.

అధ్యక్షోఽహ మితి జ్ఞానం బుద్ధే రేవ వినిశ్చయః।
నాధ్యక్షస్యావిశేషత్వా న్న తస్యాస్తి పరో యతః॥౧౫౯

తా॥ తత్త్వమస్యాది వాక్యములచే గలుగు "అహం బ్రహ్మాస్మి" యనెడి జ్ఞానము (బ్రహ్మాకారవృత్తి) పరిణామి యగు బుద్ధికి గలుగును గాని, నిర్వికారుడు, నిరవయవుడు, అసంగుడు నగు ఆత్మకు గలుగదు. పరిణామశీలమగు బుద్ధికి సాక్షి ఆత్మ. పరిణామరహితుడగు ఆత్మకు సాక్షి లేడు. ఉన్నాడన్నచో, నాతనికి మఱి యొక సాక్షి - ఈ తీరుగా అనవస్థా దోషము ప్రాప్తించును. కనుక, అధ్యక్షుడగు నాత్మకు తన వలన గాని, మఱియొకరివలన గాని భేదము కలుగదు. అందుచే బ్రహ్మాకారవృత్తిరూప పరిణామము బుద్ధికే కలుగును.

కర్త్రా చేదహ మిత్యేవ మనుభూయేత ముక్తతా।
సుఖదుఃఖవినిర్మోకో నాహం కర్తరి యుజ్యతే॥ ౧౬౦

తా॥ వికారి యగు కర్తకు "నేను ముక్తుడను" అని ముక్త్యనుభవము కలిగెనేని, "నేను కర్తను గాను" - అని

కర్తృత్వము బాధింపబడవలెను. కర్తృత్వము బాధితమైనపుడు "నేను సుఖదుఃఖముల ననుభవించుచున్నాను" అనెడి యనుభూతి కలుగరాదు. కలుగుచో, విరోధము ప్రాప్తించును. కనుక, సుఖదుఃఖానుభవము పొందు అహంకారకర్తకు సుఖదుఃఖ సంబంధము నుండి విముక్తి చెప్పుట తగదు.

బాధ్యతే ప్రత్యయేనేహ వివేకేనావివేకవాన్।
దేహాదా వభిమానోత్థో దుఃఖీతి ప్రత్యయో ధ్రువమ్।
కుండలీ ప్రత్యయో యద్వత్ప్రత్యగాత్మాభిమానినా॥౧౬౧

విపర్యాసేఽసదర్థం స్యాత్ ప్రమాణస్యాప్రమాణతః॥
౧౬౨

తా॥ "నేను కుండలినీ - అకుండలినీ, సుఖిని- దుఃఖిని, కృశుడను - స్థూలుడను"— ఇట్టి వ్యవహారము దేహాభిమానము లేనిదే కలుగదు; దేహాదికమునం దాత్మాభిమానము వలననే కలుగును. దేహాభిమానకృతమగు నీ వ్యవహారము ప్రత్యగాత్మయే నేననెడి వివేకజ్ఞానము వలన బాధింపబడును.

అవివేకజ్ఞానముచే వివేకప్రత్యయ మేల బాధింపబడదు? ఇట్లు చెప్పుచో, ప్రమాణమునకప్రామాణ్యము గలిగి ప్రామాణికమైన యర్థము లేనందున, ప్రపంచప్రతిభాసము నిరాలంబ

నమై "నేతి నేతి" వాక్యములచే గలుగు బాధకు అవధి లేక, బాధ నిరవధికమై శూన్యతాంతప్రసంగము గలుగును.

దాహచ్ఛేదవినాశేషు దుఃఖిత్వం నాన్యథాఽఽత్మనః।
నైవ హ్యన్యస్య దాహాదావన్యో దుఃఖీ భవేత్క్వచిత్॥

తా॥ దాహచ్ఛేదాదుల వలన దేహమునకే దేని బాధ కలుగునపుడు దుఃఖము కలుగును. లేనిచో, లేదు. ఆ దుఃఖము దేహాభిమానమూలము. కానిచో, సుషుప్తియందును కలుగవలెను. ఆత్మ దేహేంద్రియాదులకంటె భిన్నుడని శ్రుత్యనుభవ ప్రమాణ సిద్ధము. అన్యగత దాహాదులచే అన్యులకు దుఃఖము కలుగు ననుట యుక్తము గాదు. కాన, "నేను దుఃఖిని" అను జ్ఞానము అధ్యాసమూలము.

అస్పర్శత్వాదదేహత్వాన్నాహం దాహ్యో యతః సదా।
తస్మాన్మిథ్యాభిమానోత్థం మృతే పుత్రే మృతిర్యథా॥౧౬౪

తా॥ ఆత్మ దేహము గాదు; స్పర్శాది గుణరహితుడు. కాన, దహింపబడడు. అందుచే "నేను దుఃఖిని" అను జ్ఞానమునకు అధ్యాసయే కారణము. పుత్రుడు మరణించుచో, తానే మరణించినట్లు భావించును. కాన, దుఃఖము మిథ్యాభిమానమూలము.

కుండల్యహ మితి హ్యేత ద్బాధ్యే త్యేవ వివేకినా।
దుఃఖీతి ప్రత్యయ స్తద్వ త్కేవలాహంధియా సహ॥ ౧౬౫

తా॥ "నేను కుండలిని" అను జ్ఞానము దేహాత్మబుద్ధి వలననే కలిగి, "నేను దేహము కంటె భిన్నుడను" అను యథార్థ జ్ఞానముచేత బాధింపబడునట్లు, "నేను దుఃఖిని" అను జ్ఞానము "నేను బ్రహ్మను" అను వృత్తిజ్ఞానముతో పాటు తొలగును.

సిద్ధే దుఃఖిత్వ ఇష్టం స్యా త్తచ్ఛక్తి శ్ఛందసాఽఽత్మనః।
మిథ్యాభిమానతో దుఃఖీ తేనార్థాపాదనక్షమః॥ ౧౬౬

తా॥ ఆత్మకు దుఃఖము ఆగంతుకము గాదు, సహజమే. సుషుప్తియందు లేకున్నను, స్వప్న జాగ్రద్దుఃఖములకు బీజ మైన శక్తి సుషుప్తియందెవరును లేదనరు కదా! ఈ వాదము సరి కాదు.

ఏ యవస్థ యందైనను కేవలాత్మకు దుఃఖము ప్రమాణ సిద్ధ మగుచో, ఆ శక్తి నంగీకరింతుము. అట్లుగాక, దుఃఖ దర్శన మన్యథాసిద్ధ మగుచున్నది. మనస్సు ఉన్నపుడు దుఃఖము లేనపుడు, దుఃఖము లేకపోవుట అనుభవ సిద్ధము. ఇట్టి అన్వయ వ్యతిరేకముల వలనను, శ్రుతిప్రమాణముల చేతను దుఃఖము ఆత్మకు మిథ్యాభిమానము వలన గల్గునని యంగీకరింపవలెను.

మిథ్యాభిమానము వలన ఆత్మకు గలుగు దుఃఖము సయితము మిథ్యయే. సహజము గాదు.

అస్పర్శోఽపి యథా స్పర్శ మచల శ్చలనాది చ।
అవివేకా త్తథా దుఃఖం మానసం చాత్మనీక్ష్యతే॥ ౧౬౭

తా॥ నిరవయవుడు, పరిపూర్ణుడు నగు ఆత్మకు స్పర్శ - చలన - ఆసన శయనాది క్రియలు,స్థూలదేహ తాదాత్మ్యాభి, మానవశమున నెట్లు కలుగునో, పరిచ్ఛిన్నత్వాభిమానము, మనః కల్పితమగు దుఃఖము సూక్ష్మదేహ తాదాత్మ్యాభిమానము వలన గలుగును.

వివేకాత్మధియా దుఃఖం నుద్యతే చలనాదివత్।
అవివేకస్వభావేన మనో గచ్ఛత్యనిచ్ఛతః॥ ౧౬౮

తా॥ స్థూలదేహ వివేకాత్మజ్ఞానముచే మిథ్యాభిమానముచే అధ్యస్తమైన స్థూలదేహసంబంధి చలనాదిక్రియలు ఎట్లు ఆత్మయందు నివర్తింపబడునో, యట్లే సూక్ష్మదేహావివేక నిమిత్తమయిన దుఃఖము బ్రహ్మాత్మజ్ఞానముచే సమూలముగా నివర్తింపబడును. ఇష్టము లేకపోయినను, అవివేక స్వభావము వలననే మనస్సు సదా చలించుచుండును.

తదా తు దృశ్యతే దుఃఖం నైశ్చల్యే నైవ తస్య తత్।
ప్రత్యగాత్మని తస్మా త్తద్దుఃఖం నైవోపపద్యతే॥ ౧౬౯

తా॥ మనస్సు చంచలముగా నున్నపు డాత్మకు దుఃఖము; నిశ్చల మయినపుడు లేదు. కాన, దుఃఖము మానసము. ప్రత్యగాత్మకు దుఃఖము లేదు.

త్వం సతో స్తుల్యనీడత్వా న్నీలాశ్వవ దిదం భవేత్॥

తా॥ "నీలాశ్వ" మనునపుడు నీలత్వ - అశ్వత్వము లనెడి రెండు ధర్మము లొకే ద్రవ్యము (అశ్వము) న నుండు నట్లు "త్వం" పద లక్ష్యార్థ మగు కూటస్థుడును, "తత్"పద లక్ష్యార్థమగు బ్రహ్మమును ఒకే చిద్ర్వ్యనిష్ఠము లని భావించిన, నీ యపరోక్షజ్ఞానము కలుగును.

వి:- పూర్వము యుక్తులచేత ప్రత్యగాత్మ నిర్దుఃఖ స్వభావు డని నిరూపించి మహావాక్యము చేతనే యపరోక్ష జ్ఞానము కలుగునని యిట వివరింపబడినది.

నిర్దుఃఖవాచినా యోగాత్ త్వం శబ్దస్య తదర్థతా।
ప్రత్యగాత్మాభిధానేన తచ్ఛబ్దస్య యుతే స్తథా॥ ౧౭౧

తా॥ నిర్దుఃఖవాచకమగు తచ్ఛబ్దసంబంధముచే త్వం శబ్దము 'తత్' పదార్థ మగును. ప్రత్యగాత్మబోధకమగు 'త్వం' శబ్ద సామానాధికరణ్యముచే తచ్ఛబ్దలక్ష్యార్థమగు పరమాత్మయు అపరోక్ష మగును.

దశమ స్త్వమసీ త్యేవం వాక్యం స్యాత్ ప్రత్యగాత్మని॥

తా॥ 'దశమ స్త్వమసి' [నీవు పదియవ వాడవు] అను వాక్య మపరోక్షముగ దశమ జ్ఞానమును కల్గించునట్లు 'తత్త్వమసి' యను వాక్య మపరోక్షముగ బ్రహ్మాత్మైక్య జ్ఞానమును బోధించును. (చూ. శ్లో. 3, 12 అధ్యా)

స్వార్థస్య హ్యప్రహాణేన విశిష్టార్థసమర్పకౌ।
ప్రత్యగాత్మావగత్యన్తౌ నాన్యోఽర్థోఽర్థా ద్విరోధ్యతః॥

తా॥ 'తత్' పదమునకు వాచ్యార్థము సర్వజ్ఞత్వాది గుణవిశిష్టుడగు ఈశ్వరుడు - అనగా, మాయా ప్రతిబిమ్బిత చైతన్యము. 'త్వం' పదమునకు వాచ్యార్థము కించిద్‌జ్ఞత్వాది గుణవిశిష్టుడగు జీవుడు. అనగా, అవిద్యా (బుద్ధి) ప్రతిఫలిత చైతన్యము.'తత్ త్వం' పదముల వాచ్యార్థములకు పరస్పర విరోధముండుటచే శ్రుతితాత్పర్యసిద్ధ సామానాధికరణ్యము పొసగదు. సామానాధికరణ్యము సిద్ధించుటకై జహదజహల్లక్షణ(భాగత్యాగ లక్షణ)చే కల్పిత సర్వజ్ఞత్వ-కించిద్‌జ్ఞత్వరూప విశేషణాంశములను త్యాగము చేసి విశేష్యాంశమైన కేవల చైతన్యమును గ్రహింపవలె నని చెప్పుదురు. లక్షణచే 'తత్ - త్వం' పదములు రెండును కేవల చైతన్యమునే బోధించువో, 'ఘటః ఘటః'- అను రీతిని పర్యాయ పదముల ప్రయోగించుట యగును.అట్లు పర్యాయపదసహప్రయోగము చేయుట వాక్యశాస్త్ర సంమతము గాదు కదా! ఈ వాదము సరికాదు.

'త్వం-తత్' శబ్దములు వాచ్యార్థములను - అనగా - జీవేశ్వరు లనెడి ముఖ్యార్థములను - విడువకయే ప్రత్యగాత్మ పరమాత్మలను బోధించుటచే పర్యాయపదములు గావు. పైన చెప్పిన రీతిని విశేషణాంశత్యాగము వలన సామానాధికరణ్యము సిద్ధించును. 'సోఽయం దేవదత్తః' ఇత్యాది స్థలము లందు వలె సామానాధికరణ్యముచే అఖండార్థమును బోధించుటయే శ్రుతిసంమతము. అట్లుగాక, మఱి యేరీతిని సామానాధికరణ్యము చెప్పినను, శ్రుతివిరోధము వాటిల్లును. ఎట్లన :-

"అన్యత్రాస్మాత్ కృతాకృతాత్" (కఠ. ఉ. 2-14) ఆత్మ, లేక బ్రహ్మ కార్యకారణముల కతీతమైనదని శ్రుతి చెప్పుటచే సువర్ణకుండలములకు వలె "తత్-త్వం" పదములకు కార్యకారణభావసంసర్గము పొసగదు. 'నిష్కలం నిష్క్రియం' [శ్వే. ఉ. 6-19] నిరవయవుడు, నిష్క్రియుడని చెప్పబడుట చేత అంశాంశిభావము గాని, నిర్గుణత్వాది శ్రుతివిరోధము వలన నీలోత్పలములకు వలె గుణగుణి భావము గాని, ఏకమేవాద్వితీయం'(ఛాం. ఉ. 6-2-18) 'అసఙ్గో హ్యయం పురుషః" (బృ. ఉ. 4-3-15, 16) ఇత్యాది శ్రుతిప్రామాణ్యము ననుసరించి జాతి వ్యక్తి విశిష్టసత్వాది సంసర్గము చెప్పదగదు. ప్రయోగము— 'విమతం అఖండార్థనిష్ఠమ్, ఉపాధిపరామర్శమంతరేణ అవిభావ్యమాన భేదవస్తునిష్ఠత్వాత్, సోఽయం దేవదత్తః, ఖం ఛిద్రమ్ ఇత్యాది వాక్యవత్'.

నవబుధ్యపహోరాద్ధి స్వాత్మానం దశపూరణమ్।
అపశ్యన్ జ్ఞాతు మేవేచ్ఛేత్ స్వమాత్మానం జన స్తథా॥

తా॥ తాను పదియవ వాడయ్యును, మేము తొమ్మండ్రమే యను భ్రాంతివశమున పదియవ వానినే యాతడు తెలియగోరును గాని, యితర మేదియు దెలియగోరడు. అట్లే, ముముక్షువు అవిద్యాకల్పిత భ్రాంతిచే మఱచిన యాత్మను దెలియగోరునే గాని, యన్యమును గోరడు.

అవిద్యాబద్ధచక్షుష్ట్వాత్ కామాపహృతధీః సదా।
వివిక్తం దృశి మాత్మానం నేక్షతే దశమం యథా॥ ౧౭౫

తా॥ పదియవవాడు అజ్ఞానావృతుడై తొమ్మిదిమంది యందు మాత్రమే బుద్ధిని నిలిపి, తనను పదియవవానిగ దెలియని విధమున, పామరు డజ్ఞానావృతుడై వివేకము గోల్పోయి కామక్రోధాదివశుడై దృశ్యజాతము కంటె భిన్నుడైన దృగ్రూపుడగు ఆత్మను నేను—అని తెలియజాలడు.

దశమ స్త్వమసీత్యేవం తత్త్వమస్యాదివాక్యతః।
స్వమాత్మానం విజానాతి కృత్స్నాంతఃకరణేక్షణమ్॥ ౧౭౬

తా॥ లెక్కింపబడు తొమ్మండ్రకంటె భిన్నుడవు, తత్సాక్షియైన పదియనవాడవు నీవే (దశమ స్త్వమసి) యని సత్పురుషునిచే దెలియబడునట్లు అంతఃకరణ - తద్వృత్తులకంటె

భిన్నుడు, ఆ వృత్తుల యొక్క గమనాగమనములకు సాక్షి యైన ఆత్మవు నీవే యని తత్త్వమస్యాది మహావాక్యములచే దెలియబడును.

ఇదం పూర్వ మిదం పశ్చాత్ పదం వాక్యం భవే దితి।
అన్వయవ్యతిరేకాభ్యాం తతో వాక్యార్థబోధనమ్॥ ౧౭౭

తా॥ ఉద్దేశ్యము మొదట, విధేయము తరువాత నిర్దేశింపబడవలె నను నియమము ననుసరించి విధేయమగు 'త్వం' పదము మొదట, ఉద్దేశ్యమగు 'తత్' పదము తరువాత నిర్దేశింపబడవలెను. మఱియు, 'ప్రసిద్ధ ముద్దిశ్యాఽనూద్యాప్రసిద్ధో బోధ్యతే' ప్రసిద్ధము నుద్దేశించి యప్రసిద్ధార్థము బోధింపబడును - అను న్యాయము ననుసరించి ప్రసిద్ధములగు 'త్వం' 'అహం' పదములు మొదటను 'తత్, సత్' అను అప్రసిద్ధార్థక పదములు తరువాతను వేదమున ప్రయోగింపబడినను, వాక్యార్థము కలుగును గదా! కలుగవచ్చును. కాని, 'పాఠక్రమా దర్థక్రమో బలీయాన్'— పాఠక్రమము కంటె అన్వయ వ్యతిరేకసిద్ధమైన యర్థక్రమము బలవత్తరము— అను న్యాయము ననుసరించి 'త్వం' పదార్థమగు జీవుడు వాస్తవముగ 'తత్' పదార్థ మగు పరమాత్మయే యను నర్థ మిట గ్రాహ్యము.

వాక్యే హి శ్రూయమాణానాం పదానా మర్థసంస్మృతిః।
నియమో నైవ వేదేఽస్తి పదసాంగత్య మర్థతః॥ ౧౭౮

తా॥ ఈ పదమును ముందు ప్రయోగింపవలెను; ఇది తరువాత - అను నియమము లేకయే, వేదమున అర్థక్రమము ననుసరించి పదసంగతి కలుగును. వేదవాక్యములందుండెడి పదములకు అన్వయవ్యతిరేకములచే అర్థము - అర్థక్రమము స్మరింపబడును.

యదా నిత్యేషు వాక్యేషు పదార్థస్తు వివిచ్యతే।
వాక్యార్థజ్ఞానసంక్రాన్త్యై తదా ప్రశ్నో న యుజ్యతే॥౧౭॥

తా॥ నిత్యములు, అర్థాంతరరహితములు, అవ్యభిచరితార్థబోధకములగు వేదవాక్యముల యందు పదార్థజ్ఞానముచే వాక్యార్థమును దర్శించునపుడు ప్రశ్నాపేక్ష లేదు.

అన్వయవ్యతిరేకోక్తిః పదార్థస్మరణాయ తు।
స్మృత్యభావే న వాక్యార్థో జ్ఞాతుం శక్యో హి కేనచిత్॥

తా॥ వాక్యార్థస్మృతికి పదార్థస్మృతి మూలము. పదార్థస్మృతి నిమిత్తమయియే అన్వయవ్యతిరేకములు చెప్పబడినవి.

తత్త్వమస్యాదివాక్యేషు త్వంపదార్థావివేకతః।
వ్యజ్యతే నైవ వాక్యార్థో నిత్యముక్తోఽహమిత్యతః॥౧౮॥

తా॥ తత్త్వమస్యాది వాక్యములయందు త్వంపదార్థ

పరిశోధనము చక్కగా చేయనిదే, నిత్యముక్తుడను మహా వాక్యార్థము స్ఫురింపదు.

అన్వయవ్యతిరేకోక్తి స్తద్వివేకాయ నాన్యథా।
త్వంపదార్థవివేకే హి పాణౌ న్యస్తబిల్వవత్॥ ౧౮-౨

వాక్యార్థో వ్యజ్యతే చైవం కేవలోఽహం పదార్థతః।
దుఃఖీత్యేత దపోహేన ప్రత్యగాత్మని నిశ్చయాత్॥ ౧౮-౩

తా॥ ఇట్లు "త్వం" పదార్థ పరిశోధనము వలన ప్రయోజన మేమి?

"త్వం" పదార్థపరిశోధన కయియే అన్వయ వ్యతిరేకములు చెప్పబడినవి. "త్వం" పదమునకు ముఖ్యార్థము చిదాభాసుడగు జీవుడు - బుద్ధియందు ప్రతిఫలించిన చైతన్య ప్రతిబింబము.బుద్ధి దర్పణము వంటిది. దర్పణము లేని సమయమున ప్రతిబింబము బింబరూప ముఖమున లీనమగు నట్లే బుద్ధి, స్వకారణమున లీన మయ్యెడి సుషుప్త్యవస్థయందు చిత్ప్రతిబింబము బింబరూపచైతన్యమున లీన మగును.అందుచే ముఖప్రతిబింబము వలె చిత్ప్రతిబింబము వాస్తవము కాదు. "త్వం" పద ముఖ్యార్థమయిన జీవాంశ త్యాగము చేసి జహదజహల్లక్షణచే 'త్వం' పదలక్ష్యార్థ మయిన కేవల చైతన్యమును గ్రహించుచో, 'అహం బ్రహ్మాస్మి' యను మహావాక్య

ముచే కేవల చైతన్యమే బోధితమై వాక్యార్థము హస్తగత బిల్వము వలె స్పష్ట మగును. దేహతాదాత్మ్యాభిమానమూలకమైన 'అహం దుఃఖీ' యను వాక్యములోని 'అహం'పదముచే అభిమానమూలక దుఃఖాంశత్యాగముచే ప్రత్యగాత్మ భాసించును. (చూ. చిత్రదీపము-పంచదశి)

తత్త్రైవం సంభవత్యర్థే శ్రుతహానాశ్రుతార్థధీః।
నైవ కల్పయితుం యుక్తా పదవాక్యార్థకోవిదైః॥ ౧౮౪

తా॥ ఇట్లు న్యాయబద్ధముగ పదవాక్యార్థము భాసించుచుండ, శ్రుతిసమ్మతమైన యర్థమును విడిచి, యశ్రుతార్థమును జెప్పుట యుక్తము గాదు.

ప్రత్యక్షాదీని బాధేరన్ కృష్ణలాదిషు పాకవత్।
అక్షజాదినిషేధే కైః కథం స్యా ద్వాక్యబాధనమ్॥౧౮౫

తా॥ 'కృష్ణలాన్ శ్రపయేత్' = సువర్ణశకలములను వండవలె నని శ్రుతి విధించినను, వానియందు పాకము సంభవము గాదు గనుక, ప్రత్యక్షప్రమాణముచే శ్రుతి బాధింపబడును. అదృష్టార్థముచే వానికిపాక సంస్కారము చేయబడును. జీవేశ్వరుల భేదముగూడ ప్రత్యక్షసిద్ధము గాన, మహావాక్యముల కఖాండార్థత్వము ప్రత్యక్షాది ప్రమాణబాధితమై పూర్ణత్వము దృష్టము గాదు గాన, ప్రసంఖ్యానము వలన ఆ వాక్య

ములు ఆత్మసంస్కారకములు మాత్రమే యగును— ఈ వాదము సరి కాదు.

అధ్యస్తమైన అహంకారాది సంబంధము లేక, ఆత్మ యందు సహజముగా దుఃఖిత్వాది సంబంధము లేదని పూర్వము నిరాకరింపబడుట వలన, ఆత్మయందు కర్తృత్వాదులు భాసించుట ప్రత్యక్షాది ప్రమాణసిద్ధ మనుట యుక్తము గాదు. అది ఆభాసము మాత్రమే. ప్రత్యక్షాభాసములచేత ప్రమాణభూత వాక్యార్థము బాధింపబడనేరదు. 'ప్రయాజే కృష్ణలం జుహోతి' యని పాకసంస్కృతములైన కృష్ణలములకు అన్యత్ర వినియోగము చెప్పబడినట్లు బ్రహ్మజ్ఞాన సంస్కృతమైన యాత్మకు అన్యత్ర వినియోగము లేదు. కాన, మహావాక్యము లాత్మసంస్కారార్థములు గావు. మహావాక్యముచే వెంటనే బ్రహ్మాత్మానుభవము కలుగకపోవుటకు కారణము పదార్థవిషయమైన చిత్తదార్ఢ్యము లేకపోవుటయే.

దుఃఖ్యస్మీతి సతి జ్ఞానే నిర్దుఃఖీతి న జాయతే।
ప్రత్యక్షాదినిభత్వేఽపి వాక్యాస్న వ్యభిచారతః॥ ౧౮౬

తా॥ ప్రత్యక్షప్రమాణముచే వాక్యార్థమునకు బాధ లేకపోయినను, ప్రత్యక్షముగా దుఃఖానుభవము గలవాడు సుఖానుభవము పొందడు గదా? విరోధము లేని ప్రత్యక్ష

దుఃఖానుభవము పూర్వసిద్ధమై ప్రబలమగుటచేత మహా వాక్యముచే సుఖానుభవము కలుగదు. ఇట్లు చెప్పుట సరి కాదు. అధ్యాసకాలమున దుఃఖము ప్రత్యక్షమయ్యెను, జ్ఞానము కలిగినప్పు డాదుఃఖ ముండుట లేదు. ఇట్లు వ్యభిచరిత మగుటనే నా ప్రత్యక్ష మాభాసమే కాని, యథార్థము కాదు.

స్వప్నే దుఃఖ్యహ మధ్యాసం దాహచ్ఛేదాది హేతుతః।
తత్కాలభావిభి ర్వాక్యైః న బాధః క్రియతే యది॥

తా॥ స్వప్నమున దహింపబడినట్లును, శరీరావయవము ఛేదింపబడినట్లును దుఃఖించితిని. అపుడొక యాప్తుని వచన ములచే అధ్యస్తమైన దుఃఖము తొలగినది. కాన, దుఃఖ మంతః కరణధర్మమే గాని, యాత్మధర్మము గాదు. ఒకవేళ యపు డాప్తవాక్యముల వలన బాధ తొలగలేదని యందురా?

సమాప్తే స్త్వర్థి దుఃఖస్య ప్రాక్చ తద్బాధ ఇష్యతామ్।
స హి దుఃఖస్య సంతానో భ్రాంతేర్వా దృశ్యతే క్వచిత్॥

తా॥ స్వప్నమున అనుభూతమైన దుఃఖము స్వప్నము ననే పూర్వాపరదశలయందు గానరాక బాధితమగుటచే మధ్యయందును శుక్తిరజతము వలె నా దుఃఖము మిథ్యయే యగును. స్వప్నదుఃఖము తత్కాలముననే యున్నది. ఆత్మ, జాగ్రత్సుషుప్తులయందును గలదు. కాని, యా దుఃఖము లేదు.

ఆగంతుక మగుటచేసి దుఃఖము నిర్వికారాత్మకు సహజ ధర్మము గాదు. శుక్తికయొక్క యథార్థజ్ఞానము ఆరోపిత మిథ్యారజతజ్ఞానముచే బాధింపబడునట్లు ప్రమాణభూతజ్ఞానము ఆగంతుక దుఃఖత్వాది జ్ఞానమును బాధించుచునే తత్త్వమస్యాది మహావాక్యముల వలన గలుగును.

ప్రత్యగాత్మని ఆత్మత్వం దుఃఖ్యస్మీత్యస్య బాధయా।
దశమం నవమస్యేవ వేద చేదవిరుద్ధతా॥ ౧౮౯

తా॥ లెక్కపెట్టబడుచున్న తొమ్మండ్రకంటె లెక్కించెడి పదియవవాడు వేఱగునట్లు భ్రాంతిచే గలిగిన దుఃఖత్వాదికము స్వాత్మబోధచే బాధింపబడగా, బాధ్యమగు దేహాదికమునకు ప్రత్యగాత్మ సాక్షి యని తెలిసికొనుచో విరోధమేమియు నుండదు.

నిత్యముక్తత్వవిజ్ఞానం వాక్యాద్భవతి నాన్యతః।
వాక్యార్థస్యాపి విజ్ఞానం పదార్థస్మృతిపూర్వకమ్॥ ౧౯౦

అన్వయవ్యతిరేకాభ్యాం పదార్థః స్మర్యతే ధ్రువమ్।
ఏవం నిర్దుఃఖ మాత్మాన మక్రియం ప్రతిపద్యతే॥ ౧౯౧

సదేవేతి వాక్యేభ్యః ప్రమా స్ఫుటతరా భవేత్।
దశమస్త్వమసీత్యస్మా ద్యథైవం ప్రత్యగాత్మని॥ ౧౯౨

ప్రబోధేన యథా స్వప్నం సర్వదుఃఖం నివర్తతే।
ప్రత్యగాత్మధియా తద్వద్దుఃఖిత్వం సర్వదాఽఽత్మనః॥

తా॥ "తత్త్వమసి" వాక్యము వలననే నిత్య శుద్ధ బుద్ధ ముక్తస్వభావుడ ననెడి విజ్ఞానము గలుగును. మఱి దేనివల నను గలుగదు. ఆ వాక్యార్థజ్ఞానము పదార్థస్మృతిపూర్వకము. పదార్థస్మృతి అన్వయ వ్యతిరేకముల వలన సిద్ధించును. ఇట్లు దుఃఖరహితము, అక్రియము నగు ఆత్మస్వరూపమును దెలియ గలరు. ఈ జ్ఞానము సకల పదార్థసాక్షివి నీవే యని చెప్పెడి "సదేవ సౌమ్యేద మగ్ర ఆసీత్" ఇత్యాది శ్రుతివాక్యముల వలన మిక్కిలి స్ఫుటమగును. దశమస్త్వమసీత్యాది వాక్యములచే లెక్కింపబడు తొమ్మండ్రకు సాక్షియై లెక్కించు పదియవవాడవు నీవే యని తెలియునట్లు దేహాదిసంఘాతమునకు సాక్షి యగు ప్రత్యగాత్మను నేను – అను జ్ఞాన ముదయింప గనే, మెలకువ రాగానే స్వప్నానుభూతదుఃఖము నివర్తించునట్లు ఆత్మగత దుఃఖిత్వాదిక మంతయు నివర్తించును.

కృష్ణలాదౌ ప్రమాజన్మ తదన్యార్థా మృదుత్వతః।
తత్త్వమస్యాదివాక్యేషు న త్వేవ మవిరోధతః॥ ౧౬౨

తా॥ కృష్ణలము లనగా సువర్ణశకలములు. అవి కఠిన ములు; పచనార్హములు గావు. కావున "కృష్ణలాన్ శ్రపయేత్" = కృష్ణలములను పచనము జేయవలెను – అను

ప్రత్యక్ష శ్రుతికి బాధ కలిగెను. తత్త్వమస్యాది వాక్యములలో నట్టి విరోధము లేదు.

వాక్యే తత్త్వమసీత్యస్మిన్ జ్ఞాతార్థం త్వదసిద్వయమ్।
తమర్థే సత్యసాహాయ్యా ద్వాక్యం నోత్పాదయే త్ప్రమామ్॥

తా॥ "తత్త్వమసి" యను మహావాక్యములలో 'తత్ - అసి' [బ్రహ్మ అయి ఉన్నావు] అను రెండు పదములయొక్క యర్థము స్పష్టము. కాని "త్వం" పదము యొక్క అర్థము సహాయహీనమై స్పష్టముగ దెలియబడక యీ మహావాక్యము నిశ్చయముగ అపరోక్షజ్ఞానమును గలిగింప జాలదు. (చూ. శ్లో 18-181)

తత్త్వమో స్తుల్యనీడార్థ మసీత్యేత దపదం భవేత్॥ ౧౮౬

తా॥ "తత్ - త్వం" అనియే చెప్పి 'అసి' యని చెప్పనిచో - కురు [చేయుము], చింతయ (ఆలోచించుము), అని యీ రీతిగా అన్యవ్యాపారముల గూర్చిన యాకాంక్ష గలుగును. 'అసి' యని చెప్పుటచే 'నీవు ఆ బ్రహ్మవే' యని 'తత్ - త్వం' పదముల సామానాధికరణ్యము బోధింపబడును.

తచ్ఛబ్దః ప్రత్యగాత్మార్థః తచ్ఛబ్దార్థ స్త్వమ స్తథా।
దుఃఖిత్వాప్రత్యగాత్మత్వం వారయేతా ముభావపి॥ ౧౮౭

తా॥ అన్యాకాంక్ష లేక, సామానాధికరణ్య ముండిన సామానాధికరణ్య మనగా ఏకార్థపర్యవసాయి యగు విభక్తి గల పదద్వయము - ఇట 'త్వం' పద నాధికరణ్యముచే తచ్ఛబ్దము ప్రత్యగాత్మవాచకము; సామానాధికరణ్యముచే త్వం పదము తచ్ఛబ్దార్థకము. చెప్పుటచే త్వమర్థమగు ఆత్మకు దుఃఖిత్వాంశము, బ్దార్థమగు ఈశ్వరునకు అనాత్మత్వము, పరోక్షత్వము ంబడును.

ం చ నేతినేత్యర్థం గమయేతాం పరస్పరమ్॥ ౧౬౮

తా॥ ఇట్లు సామానాధికరణ్యము చేత భాగత్యాగలక్షణ తత్ - త్వం' పదములు సమానార్థకములై ఐక్యము గా, 'తత్ - త్వం' పదములచేత 'నేతినేతి' శ్రుత్యర్థమే పబడును. 'నేతినేతి' శ్రుతి మిథ్యాభూత-ఆరోపిత నామ పరిహారము చేసి సత్యమగు అధిష్ఠానచైతన్యము శేషించు ోధించును.

వం తత్త్వమసీత్యస్య గమ్యమానే ఫలే కథమ్।
ప్రమాణత్వ మస్యోక్తా(క్త్వా) క్రియాపేక్షత్వ ముచ్యతే॥

తా॥ ఇట్లు తత్త్వమసి మహావాక్యములో 'త్వం' పదము ఃఖిత్వాభావము, 'తత్' పదమునకు పరోక్షత్వాభావము

సిద్ధించుచుండ, మహావాక్యమునకు ప్రత్యక్ష శ్రుతివిరోధముచే అప్రామాణ్యము, అందుచే క్రియాంతరాపేక్ష చెప్పుట యెట్లు? అట్లు చెప్పుచో, శ్రుతిహాని, అశ్రుతకల్పన యను దోష ద్వయము కలుగును. కాన, వాక్యాంతరాపేక్ష లేకయే మహావాక్యము స్వతఃప్రమాణము.

తస్మా దాద్యంతమధ్యేషు కుర్విత్యేత ద్విరోధతః।
న కల్ప్యమోఽశ్రుతత్వాచ్చ శ్రుతత్యాగోఽప్యనర్థకః॥

తా॥ "తత్త్వమసి" యని ప్రథమోపదేశకాలమునను, తత్త్వంపదార్థ పరిశోధనరూప మధ్యకాలమునను, సంశయ రహితముగ బ్రహ్మానుభవకాలమునను - "తత్" శబ్దార్థ విరోధి యగుటచే - "కురు"- పదాధ్యాహారము చేసి, యను ష్ఠానమును కల్పింపము. 'అసి'- పదము 'తత్-త్వం' పదముల సామానాధికరణ్యము బోధించి యనుష్ఠానాదికమును నివారించుటచే అనుష్ఠానము శ్రుతిసిద్ధార్థము గాదు. ఇంతే కాదు.

అప్రాప్తమగు "తత్-త్వం" పదార్థచింతనము విధింపదగదు. తత్త్వం పదార్థైక్యము పరిశోధనవలననే కాని, అనుష్ఠానాధికముచే సిద్ధింపదు. ఒకవేళ యెట్టకేలకు విధి నంగీకరించినను, చింత్యమాన బ్రహ్మసాక్షాత్కారము ప్రమాణముగాదు గాన,అవిద్యానివృత్తిరూప ఫలము సిద్ధింపదు.అందుచే ప్రసంఖ్యానవిధి నిరర్థక మగును.

యథాఽనుభూయతే తృప్తిర్భుజే ర్వాక్యాన్న గమ్యతే।
వాక్యస్య విధృతి స్తద్వద్గోశకృత్పాయసీ క్రియా॥ ౨౦౧

తా॥ భోజనము వలన గలుగు తృప్తి భుజియించిననే గలుగును గాని, "భోజనము వలన తృప్తి కలుగును"—అను వాక్యము విన్నంత మాత్రాన గలుగదు. అట్లే 'తత్త్వమసి' వాక్యముచే జీవేశ్వరాభేదము సిద్ధించదు. సిద్ధించుననుటకు జూపెడి హేతువు గోమయపాయసీ న్యాయము వలె ఆభాసమే యగును. గోమయము గవ్యమైనను, పాయసక్రియ కుపయోగపడనియట్లు వాక్యార్థజ్ఞానము వాక్యార్థాపరోక్ష సాధనము గాదు.

న్యాయప్రయోగము :- 'గోమయం పాయసం, గవ్యత్వాత్, ఉభయసిద్ధ పాయసవత్'. (చూ. యో. సూ. భాష్య 1-32; సర్వదర్శనసంగ్రహ-బౌద్ధదర్శనమ్)

సత్యమేవ మనాత్మార్థవాక్యాత్ పారోక్ష్యబోధనమ్।
ప్రత్యగాత్మని న త్వేవం సంఖ్యాప్రాప్తివ ద్ధ్రువమ్॥ ౨౦౨

తా॥ వాక్యార్థజ్ఞానము సామాన్యముగ అపరోక్ష జ్ఞానమును గలిగింప జాలదనుట సత్యమే. ఇట్లు కలుగకపోవుట ఆత్మేతర వాక్యవిషయము. 'దశమ స్త్వమసి' యను వాక్యముచే నపరోక్షముగ 'దశమ' జ్ఞానము గలుగునట్లు 'తత్త్వ

మసి' వాక్యముచే నిఃసంశయముగ సర్వపదార్థసాక్షి, ద్రష్ట యగు పరమాత్మను నేనే యని యపరోక్షానుభవము గలుగును.

స్వయంవేద్యత్వపర్యాయః స్వప్రమాణక ఇష్యతామ్।
నివృత్తా వహమసిద్ధః స్వాత్మనోఽనుభవశ్చ నః॥ ౨౦౩

తా॥ ఇక్కడ మాత్ర మిట్లు చెప్పటేల? యని యన వచ్చును. స్వయంవేద్యుడు, స్వయంప్రకాశుడు నగు ఆత్మను గూర్చి ప్రమాణాంతరముచే దెలియ శక్యము గాదు. మహా వాక్యార్థజ్ఞానముచే అహంకారము నివర్తించి 'తత్-త్వం'పదార్థముల కభేదము సిద్ధించి స్వాత్మానుభవము గలుగును. లెక్క పెట్టునట్టి తానే దశము డైనట్లు, పరోక్షముగ భాసించు ప్రత్యగాత్మ తానే యగును. కావున, మహావాక్యవిషయమున నిట్లే చెప్పవలెను.

బుద్ధీనాం విషయో దుఃఖం నో యస్య విషయా మతాః।
కుతోఽస్య దుఃఖసంబన్ధో దృశేః స్యాత్ ప్రత్యగాత్మనః॥

తా॥'నేను దుఃఖిని' అని భావించు బుద్ధివృత్త్యాశ్రయ-అహంకర్తకే దుఃఖము విషయ మగును. బుద్ధివృత్త్యాశ్రయ-అహంకర్తకు సాక్షియైన ఆత్మకు దుఃఖము సహజ ధర్మము గాదు.

దృశిరేవానుభూయేత స్వేనైవానుభవాత్మనా।
తదాభాసతయా జన్మ ధియోఽస్యానుభవః స్మృతః॥ ౨౦౫

తా॥ సాక్షి, ద్రష్ట యగు ఆత్మ అనుభవస్వరూపుడగుటచే అనుభవైకవేద్యుడే, ఆ యాత్మానుభవవిషయమున ఇతరానుభవాపేక్ష లేదు. చిదాభాసవ్యాప్తమైన బుద్ధివృత్తియే ఆత్మకు ఆగంతుకమైన అనుభవమని చెప్పుదురు.

అశనాయాది నిర్ముక్తః సిద్ధో మోక్ష స్త్వమేవ సః।
శ్రోతవ్యాది తవేత్యేత ద్విరుద్ధం కథ ముచ్యతే॥ ౨౦౬

తా॥ అశనాయ = ఆకలి; పిపాస = దప్పిక. అశనాయాపిపాసలు ప్రాణధర్మములు. శోకమోహము లంతఃకరణధర్మములు. జననమరణములు దేహధర్మములు. ఈ యాఱును ఆత్మకు లేవు. ఇట్లు సర్వధర్మవినిర్ముక్తుడు, నిత్యసిద్ధుడునగు బ్రహ్మవు నీవే యని యాచార్యు డుపదేశింపగా, ముక్తుడవై నిష్క్రియుడవైన నీకు శ్రవణమననాది కర్తవ్యోపదేశ మెట్లు పొసగును? బ్రహ్మ నిర్వికారము; కర్తగాదు. కర్తృత్వముండెనేని, దుఃఖిత్వ భోక్తృత్వాదిక ముండవలసివచ్చును. కాన, ముక్తుడవైన నీకు కర్తవ్యోపదేశ మెట్లు సంగత మగును?

నేత్యుక్తేత్యేవ చే త్తత్ స్యా చ్ఛ్రవణాది తదా భవేత్।
మోక్షస్యానిత్యతైవం స్యాత్ విరోధే నాన్యథా వచః॥

తా॥ బ్రహ్మ స్వయంసిద్ధము, నిత్యము గాన, శ్రవణ మననాది సాధ్యము గాదు. సాధ్య మనుచో, సాధ్యమగు బ్రహ్మ అనిత్య మగును. కావున, శ్రవణ మననాదులచే బ్రహ్మ సిద్ధించును (సేత్స్యతి) అని కర్తవ్యోపదేశమున కన్యథా విపరిణామము తగదు.

శ్రోతృశ్రోతవ్యయో ర్భేదో యదీష్టః స్యా ద్భవే దిదమ్।
ఇష్టార్థకోప ఏవం స్యా న్న యుక్తం సర్వథా వచః॥

తా॥ శ్రోతకు (వినువానికి) శ్రోతవ్యమునకు (వినదగిన దానికి) భేద ముండునేని, యపుడు ప్రసంఖ్యానము (విధి) సంగత మగును. కర్తృ కర్మభేద మున్నపుడే కార్యము; భేదము లేనిచో కార్య ముండదు. భేదము నంగీకరించుచో, జీవబ్రహ్మైక్యమను నిష్టార్థమునకు వ్యాకోపము గలుగును. దీనింబట్టియు ప్రసంఖ్యానవాదము తగదు.

సిద్ధో మోక్షోఽహమిత్యేవ జ్ఞాత్వాఽఽత్మానం భవేద్యది।
చికీర్షుర్యః స మూఢాత్మా శాస్త్రం చోద్ఘాటయత్యపి॥

తా॥ బ్రహ్మ (మోక్షము) సిద్ధమే గాని, సాధ్యము గాదని తెలిసియు నెవడు కర్మ చేయగోరునో, యతడు మూఢుడు; శాస్త్రమును గూడ న్యాయసంమతమైన స్వార్థము నుండి దూరము చేయును.

న హి సిద్ధస్య కర్తవ్యం సకార్యస్య న సిద్ధతా।
ఉభయాలంబనం కుర్వ న్నాత్మానం వంచయత్యపి॥ ౨౧౦

తా॥ సిద్ధ వస్తువును గూర్చి చేయదగిన దేదియు లేదు. కర్మ సాధ్యము; సిద్ధము గాదు. ఈ విరుద్ధ ధర్మము లొకే వస్తువున సంభవింపవు. రెంటి నాలంబనముగా గొనువా డాత్మ వంచకుడు-పురుషార్థమునకు దూరు డగును.

సిద్ధో మోక్ష స్త్వ మిత్యేత ద్వస్తుమాత్రం ప్రదర్శయేత్।
శ్రోతు స్తన్నాత్మవిజ్ఞానే ప్రవృత్తిః స్యా త్కథం త్వితి॥

తా॥ ముముక్షువున కాత్మవిజ్ఞానమున బ్రవృత్తి కలుగుటకై "సిద్ధమైన మోక్షము (బ్రహ్మ) నీవే" యని వస్తుమాత్ర కథనపరమే యీ మహావాక్యము; తత్త్వార్థకథనపరము గాదు.

కర్తా దుఃఖ్యహ మస్మీతి ప్రత్యక్షేణానుభూయతే।
కర్తా దుఃఖీ చ మాభూవ మితి యత్నో భవే త్తతః॥

తా॥ నేను కర్తను; దుఃఖిని — అని ప్రత్యక్షముగ కర్తృత్వ-దుఃఖిత్వాదిక మనుభవింపబడుచుండుటచే అకర్తను, దుఃఖము లేనివాడ నని తెలియుటకై ప్రయత్నించవలెను.

తద్విజ్ఞానాయ యుక్త్యాదికర్తవ్యం శ్రుతి రబ్రవీత్।
కర్తృత్వాద్యనువాదేన సిద్ధత్వానుభవాయ తు॥ ౨౧౩

తా॥ కర్తృత్వాదికము ననువదించుచు "జీవుడవగు నీవు ప్రజ్ఞానఘనరూపి యగు బ్రహ్మవు". కావున, నా సత్యము నెఱుగుటకై యత్నించు మని శ్రుతి సాదరముగ "మంతవ్యః" అనుచు ఉపదేశించినది. కాన, ప్రయత్నరూప కర్తవ్యము శ్రుతిసంమతము.

నిర్దుఃఖో నిష్క్రియోఽకామః సిద్ధో మోక్షోఽహ మిత్యపి।
గృహీత్వైవ విరుద్ధార్థ మాదధ్యా త్కథమేవ సః॥

తా॥ పై వాదము సరికాదు. నేను దుఃఖరహితుడను, నిష్క్రియుడను, అకాముడను, సిద్ధరూపుడగు బ్రహ్మను— అని తెలిసికొనినపుడు తద్విరుద్ధమగు నర్థము నెట్లు గ్రహించును?

సకామః సక్రియోఽసిద్ధ ఇతి మేఽనుభవః కథమ్।
అతో మే విపరీతస్య తద్భావా న్వక్తు మర్హతి॥ ౨౧౫

తా॥ 'నాకిది కావలెను; నేనిది చేయవలెను; నాకిది సిద్ధించలేదు'— అను నీ విపరీత వృత్తులు బ్రహ్మస్వరూపుడ నగు నా కెట్లు గలుగునో చెప్పుము.

ఇహైవ ఘటతే ప్రశ్నో న ముక్తత్వానుభూతయే।
ప్రమాణేన విరోధీ యః సోఽత్రార్థః ప్రశ్న మర్హతి॥

తా॥ కర్తనగు నేను అకర్త యగు బ్రహ్మ నెట్లగుదును?— అనెడి ప్రశ్న సకృచ్ఛ్రవణము చేసినవానికి గలుగవచ్చును. ఆరూఢజ్ఞానము గలవానికి తన యనుభూతిని గూర్చిన ప్రశ్నయే యుదయింపదు.

అహం నిర్ముక్త ఇత్యేవ సదసీత్యన్యమానజః।
ప్రత్యక్షాభాసజన్యత్వా ద్దుఃఖిత్వం ప్రశ్న మర్హతి॥౨౧౩

తా॥ అజ్ఞాతజ్ఞాపకమై ప్రమాణభూతమైన 'సదసి'యను శ్రుతివాక్యము వలన 'నీవు సద్రూప బ్రహ్మవు' అను నర్థము నిష్పన్నమైనది. ప్రత్యక్షాభాసముచే గలిగెడి 'నేను దుఃఖిని' అను జ్ఞానము తద్విరుద్ధము. కాన, నీ జ్ఞానము ప్రశ్నార్హము.

వి :- వాస్తవముగాని యర్థమును వాస్తవమైనదానినిగా దర్శింపజేయుటచే ప్రత్యక్షము ఆభాసము. ఆభాసమనగా అది కాకున్నను, దానివలె భాసించుట.

పృష్ట మాకాంక్షితం వాచ్యం దుఃఖాభావ మభీప్సితమ్॥

తా॥ శిష్యుడు జిజ్ఞాసతో నడిగిన యంశమును గురువు వివేచన జేసి చెప్పి యాతని సందియమును దీర్చవలెను. దుఃఖాభావము-అనగా-బ్రహ్మరూపమోక్షలక్షణము గూర్చి శిష్యుని ప్రశ్న. దానికి సమాధానముగా గురూపదిష్టమైన వాక్యమున

కదియే తాత్పర్యముగ గ్రహించవలెను. కనుక, శ్లో 212 లో జేసిన ప్రశ్న కవకాశము లేదు.

కథం హీదం నివర్తేత దుఃఖం సర్వాత్మనా మమ।
ఇతి ప్రశ్నానురూపం యద్వాచ్యం దుఃఖనివర్తకమ్॥

తా॥ సంపూర్ణముగ నాకీ దుఃఖ మెట్లు నివర్తించును? అనెడి శిష్యుని ప్రశ్న కనుగుణముగా దుఃఖనివర్తక వాక్యమును గురువు బోధింపవలెను.

శ్రుతేః స్వాత్మని నాశంకా ప్రామాణ్యే సతి విద్యతే।
తస్మా దాత్మవిముక్తత్వం ప్రత్యాయయతి తద్వచః।
వక్తవ్యం తత్తథాఽర్థం స్యా ద్విరోధేఽసతి కేనచిత్॥

తా॥ స్వప్రతిపాద్యమైన ఆత్మను గూర్చి బోధించు సామర్థ్యము శ్రుతికి గలదా? యని సంశయింప బని లేదు. శ్రుతి స్వతఃప్రమాణము; ఆత్మ స్వరూపమును బోధించు సామర్థ్యము గలది. శ్రుతివాక్యములు ఆత్మ సర్వవినిర్ముక్తుడని బోధించుచున్నవి. శ్రుతిజన్యజ్ఞానమున కన్యప్రమాణజన్య జ్ఞానముతో విరోధము లేదని పూర్వము నిరూపింపబడినందున, శ్రుతివాక్యముల కర్థ మట్లే గ్రహింపవలెను.

ఇతోఽన్యోఽనుభవః కశ్చి దాత్మనో నోపపద్యతే।
అవిజ్ఞాతం విజానతాం విజ్ఞాతార మితి శ్రుతేః॥ ౨-౨౧

తా॥ కనుక, ఆత్మానుభవమును గూర్చి భిన్నముగ నెట్లు చెప్పినను, ప్రమాణభూత శ్రుతితో విరోధము సంభవించును గనుక, ఉపపన్నము గాదు. ఆత్మను దెలిసికొంటినని చెప్పువాని కాత్మను గూర్చి తెలియదు; సర్వము నెవడు తెలిసికొనునో, యట్టి విజ్ఞాత నెవడు దెలిసికొనును?అని శ్రుతి బోధించుచున్నది. (కేన. ఉ. 11; బృ. ఉ. 2-4-14)

త్వం పదార్థవివేకాయ సంన్యాసః సర్వకర్మణామ్।
సాధనత్వం వ్రజత్యేవ శాంతో దాంతానుశాసనాత్॥

తా॥ ఆత్మతత్త్వమును గూర్చి యొకమాఱు విన్నంత మాత్రముననే విహిత కర్మలను మానరాదు. మానిన యెడల, సంన్యాసాశ్రమ ధర్మములను బోధించెడి శాస్త్రము వ్యర్థమగును; ఆశ్రమకర్మపరిత్యాగముచే నారూఢపతితుడు గూడ గాగలడను దోషము పూర్వము (18-16) వివరింపబడినది. తత్త్వమస్యాది వాక్యశ్రవణము చేసినంతమాత్రాన యతి, విహితకర్మముల మానరాదు.

"శాంతో దాన్త ఉపరత స్తితిక్షుః సమాహితో భూత్వాఽఽత్మన్యేవాఽఽత్మానం పశ్యతి"[బృ. ఉ. 4-4-23] యనుచు శ్రుతి 'ఉపరతి' శబ్దముచే నిర్దిష్టమైన సంన్యాసమును ఆత్మజ్ఞానమునకు సాధనముగా విధించుటచే త్వంపదార్థమైన ఆత్మయొక్క వివేకము కొఱకు సర్వకర్మ సంన్యాసము

సాధనమే యగును. పదార్థావధారణపర్యంతమే సాధకుడైన యతికి ఆశ్రమధర్మానుష్ఠానము కర్తవ్యము. ఆరూఢజ్ఞానము గలిగిన యతికి"దీని నిమిత్తమై దీనిని జేయవలె" ననెడి ప్రయోజనబుద్ధి ఉదయింపనందున, ఆశ్రమధర్మములతో బనిలేదు. కాని, సాధకావస్థయందభ్యస్తమైన జ్ఞానమునకు విరోధి కాని సంస్కారము అనువృత్త మగుచుండుటచే యథేష్టాప్రవృత్తి కవకాశ ముండదు.

(మూ. సూతసంహితా తాత్పర్యదీపికా- 3. 5.28-30)

త్వమర్థం ప్రత్యగాత్మానం పశ్యే దాత్మాన మాత్మని।
వాక్యార్థం తత ఆత్మానం సర్వం పశ్యతి కేవలమ్॥ ౨౨౩

తా॥ శాంత్యాది సాధనసంపత్తి గలిగినవాడు చిదాభాసవ్యాప్తమైన స్వకార్యకారణసంఘాతమున 'త్వం' పదలక్ష్యార్థమైన ప్రత్యగాత్మను దర్శింపవలెను. ఇట్లు శోధితమైన ప్రత్యగాత్మను సర్వవ్యాపక బ్రహ్మగా దర్శింపవలెను.

సర్వ మాత్మేతి వాక్యార్థే విజ్ఞాతేఽస్య ప్రమాణతః।
అసత్త్వే హ్యన్యమానస్య విధి స్తం యోజయేత్ కథమ్॥

తా॥ ప్రమాణభూత వాక్యార్థజ్ఞానముచే సర్వము చిన్మాత్రస్వరూపముగా - బ్రహ్మగా - గోచరించు జ్ఞానికి శ్రుతిచోదిత విధినిషేధములతో బని యేమి? ప్రమాతృభావము నశించుటచే విధినిషేధము లాతనియెడ బ్రవర్తింపవు.

తస్మా ద్వాక్యార్థవిజ్ఞానా న్నోర్ధ్వం కర్మవిధి ర్భవేత్।
న హి బ్రహ్మాస్మి కర్తేతి విరుద్ధే భవతో ధియౌ॥ ౨౨౫

తా॥ "అహం బ్రహ్మాస్మి"; "కర్తాస్మి"— అను నీ జ్ఞానములు పరస్పర విరుద్ధములు. ఇవి యొకే కాలమున నొకే పురుషునియందు ప్రవర్తింపవు. అందుచే వాక్యార్థవిజ్ఞానానంతర మీ కర్మవిధికి ప్రవృత్తి లేదు.

బ్రహ్మాస్మీతి చ విద్యేయం నైవ కర్తేతి బాధ్యతే।
సకామో బద్ధ ఇత్యేవం ప్రమాణాభాసజాతయా॥ ౨౨౬

తా॥ "బ్రహ్మాస్మి" యనునది యథార్థజ్ఞానము. ఇది ప్రమాణాభాస జన్యమైన కర్తను, బద్ధుడను, కోరికలు గలవాడను—అను ప్రత్యక్షభేద జ్ఞానముచే బాధింపబడదు.

వి :- భేదప్రత్యక్షము చంద్రప్రాదేశప్రమాణ ప్రత్యక్షము వలె ఆభాసమే గాని, వాస్తవము గాదు. (ప్రాదేశము= లొడితెడు)

శాస్త్రాద్బ్రహ్మాస్మి నాన్యోఽహ మితి బుద్ధిర్భవే ద్దృఢా।
యదాఽయుక్తా తదైవంధీ ర్యథా దేహాత్మధీ రితి॥ ౨౨౭

తా॥ మహావాక్యార్థవిచారము వలన "బ్రహ్మాస్మి" యను బుద్ధి దృఢ మగునపుడు "నేను కర్తను" అను బుద్ధి

అయుక్త మగును. శాస్త్రము వలన నాత్మతత్త్వము దెలిసిన వానికి "నేను మనుష్యుడను" అను దేహాత్మబుద్ధి యెటుల గలుగదో, యట్లే కర్తృత్వబుద్ధియు గలుగదు.

స భయా దభయం ప్రాప్తః తదర్థం యతతే చ యః।
స పునః సభయం గన్తుం స్వతన్త్రో శ్చే న్నహీచ్ఛతి॥

తా॥ భయస్థానము నుండి నిర్భయప్రదేశము జేరిన వాడు మరల భయస్థానమును జేరుటకు యత్నింపడు. స్వతంత్రుడగుచో, నా భయస్థానము వైపు పోనేపోడు. అట్లే, భయస్థానమైనజననమరణప్రవాహరూప సంసారమునుండి విముక్తుడై అభయ బ్రహ్మపదమును జేరినవాడు సంసారమునకు తిరిగి రా యత్నింపడు; రానే రాడు.

యథేష్టాచరణప్రాప్తిః సంన్యాసాదివిధౌ కుతః।
పదార్థాజ్ఞానబుద్ధస్య వాక్యార్థానుభవార్థినః॥ ౨౨౯

తా॥ సంన్యసించి శ్రవణమననాదుల ద్వారా మహావాక్యపదార్థస్వరూప పర్యాలోచన జేసి జ్ఞానియై దేహాద్యభిమానశూన్యుడై అపరోక్ష-ఆత్మానందానుభవమున నిమగ్నుడైనవానికి మిథ్యాజ్ఞానలేశము గూడ లేనందున, యథేష్టాచరణప్రాప్తి యెల కలుగును? కలుగదు.

అతః సర్వ మిదం సిద్ధం యత్తాపగస్మాభి రీరితమ్॥ ౨౩౦

తా॥ పై కారణముల వలన పూర్వము మేము ప్రతిపాదించిన దంతయు న్యాయోపబృంహితమై యుపపన్నమగుచు సిద్ధ మగును.

యో హి యస్మా ద్విర క్తః స్యా న్నాసౌ తస్మై
ప్రవర్తతే।
లోకత్రయా ద్విర క్తత్వా న్ముముక్షుః కిమితీహతే॥ ౨౩౧

తా॥ ఎవనికి దేనియందు విరక్తి గలుగునో, యతడు దానికై యత్నింపడు. లోకత్రయమునందు విరక్తి జెందిన ముముక్షువు ఏ ప్రయోజనము నుద్దేశించి దేనికై ప్రయత్నించును? దేనిని కోరును?

క్షుధయా పీడ్యమానోఽపి న విషం హ్యత్తు మిచ్ఛతి।
మృష్టాన్నధ్వస్తతృడ్ జానన్ నాముూఢ స్తజ్జిఘత్సతి॥

తా॥ ఎంతటి యాకలితో బాధపడుచున్నను, విషమును దినుట కెవ డిచ్ఛగించును? ఆకలి తీరునట్లు మృష్టాన్నమును భుజించిన వివేకి యెవడును తెలిసి తెలిసి విషపదార్థముల భుజించుటకు పూనుకొనడు. అట్లే అపరోక్షానందానుభవముచే దృప్తి జెందిన జ్ఞాని విషతుల్యములుగా భావించి విడిచిన సాంసారిక విషయములయందు బ్రవర్తించడు. సంస్కారవశమున జ్ఞాననిష్ఠకు భంగకరములు గాని, శరీరస్థితికి మాత్ర

మాలంబనములైన భిక్షాటనాదులయందు ప్రవర్తించుట దోషము గాదు.

వేదాంతవాక్యపుష్పేభ్యో జ్ఞానామృతమధూత్తమమ్।
ఉజ్జహారాలివ ద్యోన స్తస్మై శ్రీ గురవే నమః॥ 233

తా॥ తుమ్మెద వలె వేదాంతవాక్యము లనెడి పుష్పముల నుండి జ్ఞానామృత మనెడి దివ్య మకరందమును సంగ్రహించి మాకు బ్రసాదించిన దేశికవర్యులకు నమస్కారము.

వి :- తత్త్వజ్ఞానసంపన్నునకు కర్తవ్య మెద్దియు లేదు. అయినను, శాస్త్రము, గురువు పూజనీయులే యని శిష్యులకుపదేశించుటకై గురువుయొక్క ప్రామాణ్యము నుద్బోధించు గురునమస్కార మిట జేయబడినది.

ఓం తత్ సత్

ఇది తత్త్వమసి ప్రకరణము.

— ㅇ —

# భేషజ ప్రయోగ ప్రకరణమ్ - 19

ప్రయుజ్య తృష్ణాజ్వర నాశకారణం చికిత్సితం జ్ఞానవిరాగ భేషజమ్।

న యాతి కామజ్వర సన్నిపాతజాం శరీరమాలాం శతయోగ దుఃఖితామ్॥ ౧

తా॥ ప్రకరణ ప్రయోజన మిటు మొదటి శ్లోకమున వివరింపబడుచున్నది.

---

ఇది ఆత్మమనఃసంవాదరూప మగుటచే 'ఆత్మమనః సంవాద ప్రకరణ' మనియు, తృష్ణాజ్వర నాశకారణవివరణరూప మగుటచే 'తృష్ణాజ్వర నాశక ప్రకరణ'మనియు, సంసారదుఃఖ సంతప్త మనోవ్యాధి నిర్మూలనకై భేషజ(ఔషధ) ప్రయోగ ప్రకార ముపదేశింప బడుటచే 'భేషజప్రయోగ ప్రకరణ' మనియు దీనిని వ్యాఖ్యాతలు వివరించిరి. అన్నింటి తాత్పర్య మొకటియే.

శం. ర. 13-57

తృష్ణాజ్వరమును శాంతింపజేసెడి జ్ఞానవైరాగ్యము లనెడి చికిత్సితములను (ఔషధములను) ఉపయోగించుచో, కామజ్వరము వలన గలుగు ఆత్మానాత్మ వివేక శూన్యత, దానిచే గలుగు మోహము, దానివలన శరీరపరంపరాశత సంబంధముచే గలుగు జనన మరణ రూప దుఃఖము ననుభవింపరు.

వి:- జ్ఞానము= ఆత్మానాత్మ వివేకము; వైరాగ్యము = దుఃఖప్రదములైన సాంసారిక విషయములయం దాసక్తిని పెంపొందించు మనోవృత్తులయం దనాసక్తి; తృష్ణ= పేరాశ.

అహం మమేతి త్వ మనర్థ మీహసే పరార్థ మిచ్ఛ త్వ తవాన్య ఈహితమ్।
న తేఽర్థబోధో న హి మేఽస్తి చార్థితా తతశ్చ యుక్తః శమ ఏవ తే మనః॥ ౨

తా॥ ఓ మనస్సా! నేను; ఇది నాది; ఇది నాకు గావలెను— అని తలచుట యనర్థహేతువు. కాని యా యనర్థమును గూర్చియే వ్యర్థముగ తలపోయుచుందువు. నా యీ చేష్టలు - వ్యవహార మంతయు నీ కొఱకే గదా! అని యందు వేమో! అట్లు చెప్పుట సాంఖ్యులకు దగును. పురుషుడు నిఃసంగుడు. పురుషుని భోగాపవర్గార్థమే ప్రకృతి ప్రవర్తించును అని సాంఖ్యులు చెప్పువరు. మా వేదాంతసిద్ధాంతమున అట్లు

చెప్పుట తగదు. మఱియు, ఆలోచింపగా నీ యీ కోరిక వ్యర్థము. జడ మగుటచే నీ కర్తృబోధ కలుగదు. నాకు(ఆత్మకు) భోగేచ్ఛ లేనందున నా యీ భోగముల సమకూర్చు మని కోరను. కాన, నీకు శమమే (లయమే) యుక్తము.

యతో న చాన్యః పరమాత్ సనాతనాత్
సదైవ తృప్తోఽహ మతో న మేఽర్థితా।
సదైవ తృప్తశ్చ న కామయే హితం
యతస్వ చేతః ప్రశమాయ తే హితమ్॥ 3

తా॥ నిర్వికారుడు, పూర్ణానందస్వరూపుడు నగు పరమాత్మకంటె భిన్నుడను కాను. నిత్యతృప్తుడను గాన, నిన్ను గోరవలసిన దేదియు లేదు. కావున నే, కోరదగిన హిత మేదియు లేదు. కావున, ఓ మనస్సా! శమించుటకై యత్నింపుము.

షడూర్మిమాలాభ్యతివృత్త ఏవ యః
స ఏవ చాత్మా జగత శ్చ నః శ్రుతేః।
ప్రమాణత శ్చాపి మయా ప్రవేద్యతే
ముధైవ తస్మాచ్చ మన స్తవేహితమ్॥ ४

తా॥ అశనాయా పిపాసలు (ఆకలిదప్పులు) ప్రాణధర్మములు; శోకమోహములు మనోధర్మములు; జరామరణములు దేహధర్మములు. ఇవి ఊర్ముల (తరంగముల) వలె ఆవిర్భావ

తిరోభావములు చెందుచుండుటచే షడూర్మ్ములనబడును. అవిచ్ఛిన్న షడూర్మిపరంపరల కతీతుడై నిష్ప్రపంచ స్వభావుడైన వాడు సర్వజగత్తున కాత్మ- యని శ్రుతి చెప్పుచున్నది. "యత్ సాక్షా దపరోక్షా ద్బ్రహ్మ" (బృ. ఉ. 3-4-1). "అహ మాత్మా గుడాకేశ సర్వభూతాశయస్థితః" (భ. గీ. 10-20) అని గీతయు చెప్పుచున్నది. కాని, నీకును (మనస్సునకును) నే నాత్మను.కార్యకారణోపాధి వశమున దప్ప ఆత్మకు స్వతఃసిద్ధభేదము లేదు— మున్నగు న్యాయములచేతను, విద్వదనుభవముల చేతను ఈ విషయమును పర్యాలోచన జేసి చెప్పుచున్నాను. కాన, మనస్సా! వ్యర్థపు కోరికలను విడిచి శాంతించుము.

త్వయి ప్రశాంతే న హి చాస్తి భేదధీః
  యతో జగ న్మోహ ముపైతి మాయయా।
గ్రహో హి మాయాప్రభవస్య కారణం
  గ్రహో ద్వమోకే న హి సాఽస్తి కస్యచిత్॥ ౫

తా॥ ఓ మనస్సా! సుషుప్తి యందు నీవు లయము చెందినపుడు భేదజ్ఞాన ముండుట లేదు. మాయాకల్పిత భేదజ్ఞానము వలననే ప్రాణిజాతము మోహపరవశమై వ్యాకులము జెందుచున్నది.భేదబుద్ధిని కలిగించు మాయకు నీవే కారణము. నీవు శాంతించినచో సుషుప్తి మూవర్చాఛస్థల యందు వలె మాయామోహములు తొలగును.

న మేఽస్తి మోహ స్తవ చేష్టితేన హి
ప్రబుద్ధతత్త్వ స్త్వసితో హ్యవిక్రియః।
న పూర్వతత్త్వోత్తర భేదతా హి నో
వృథైవ తస్మాచ్చ మన స్తవేహితమ్॥ ౬

తా॥ ఓ చిత్తమా! తత్త్వజ్ఞానికి బంధము గాని, వికారము గాని లేదు. సిద్ధమైన తత్త్వమునకు పూర్వోత్తర కాల కృత భేదము లేవియు నుండవు. అట్టి నాకు (ఆత్మకు) నీ చేష్టితముల వలన మోహ మేమియు లేదు. కాన, నీ వ్యాపారము వ్యర్థము. ఇక శాంతించుము. (అసితః = బంధరహితుడు. షిఞ్ బంధనే.)

యతశ్చ నిత్యోఽహ మతో నచాన్యథా
వికారయోగే హి భవే దనిత్యతా।
సదా ప్రభాతోఽహ మతో హి చాద్వయో
వికల్పితం చాప్యస దిత్యవస్థితమ్॥ ౭

తా॥ వికారము గలిగినచో, నది యనిత్యమే యగును. నాకు జనన మరణాది రూప వికారములు గాని, పరిణామ పరిస్పందాది వికారములు గాని, సదా ప్రకాశించుచుండువాడ నగుటచే ప్రకాశము - అప్రకాశము అనెడి భేదము గాని లేదు. నేను నిత్యుడను.దృశ్యములై యనేకవస్తువులు కన్పట్టు

చున్నను నవి అసత్తు - మిథ్య యని నిరూపింపబడి వ్యవస్థ చేయబడినది. కాన, సిద్ధుడను; అద్వితీయుడను.

చూ. "సకృ ద్విభాతో హ్యేవైష బ్రహ్మలోకః"— ఛాం. ఉ. 8-4-2

"పశ్యన్ వై తన్న పశ్యతి"—బృ. ఉ. 4-3-23

అభావరూపం త్వమసీహ హే మనో
నిరీక్ష్యమాణే న హి యుక్తితోఽస్తితా।
సతో హ్యనాశా దసతోఽప్యజన్మతో
ద్వయం చ చేత స్తవ నాస్తితేష్యతే॥ ౮

తా॥ ద్వితీయవస్తువును నేను(మనస్సు) ఉండగా అద్వితీయుడ వెట్లగుదువు? అని ప్రశ్నించెద వేమో! అది సరి కాదు.జన్మనాశము లనెడి వికారములు గలిగిన వస్తువు అసత్తు-మిథ్యాపదార్థము. అసత్తునకు పరమార్థసత్త (వాస్తవమైన ఉనికి) లేదు. జన్మ నాశ రూప వికారములు రెండును నీకు గలవు. కాన, నీవు అసద్రూపము - వాస్తవమున అభావ రూపము గలదానివి. నేను నిత్య సిద్ధుడను; నాకు జన్మ లేదు, సద్వస్తువునకు నాశము లేదు. నేను సద్రూపుడను; నాకు నాశము లేదు. ఇట్లు యుక్తులతో విమర్శింపగా నీ కస్తిత్వమే లేదు గనుక అద్వితీయుడను. చూ. "నాసతో విద్యతే భావో నాభావో విద్యతే సతః" భ. గీ. 2-16

ద్రష్టా చ దృశ్యం చ తథాచ దర్శనం
భ్రమ స్తు సర్వ స్తన కల్పితో హి సః।
దృశే శ్చ భిన్నం న హి దృశ్య మిష్యతే
స్వపన్ ప్రబోధేన తథా న భిద్యతే॥ 6

తా॥ ద్రష్ట - దర్శనము - దృశ్యము - అనెడి యీ త్రిపుటి - ఈ భ్రమ యంతయు - నీవు కల్పించినదే. నీవు జడము - అచేతనము - అగుటచే స్వతః ప్రకాశించు శక్తి లేదు. స్వతఃప్రకాశము లేని వస్తువునకు సత్త్వము (ఉనికి) ఉన్న దనుటలో ప్రమాణము లేదు. నేను చేతనుడను;స్వయం ప్రకాశము గల దృగ్రూపుడను - అనగా ద్రష్టను. ద్రష్ట కంటె ద్రష్టచే ప్రకాశింపజేయబడు దృశ్యము భిన్నము గాదు. అనగా - ద్రష్టకంటె భిన్న మయిన స్వతంత్ర సత్త దృశ్యమునకు నీకు (మనస్సునకు) లేదు.

"సలిల ఏకో ద్రష్టాఽద్వైతో భవతి"— (బృ. ఉ. **4-3-32**)ఇత్యాది శ్రుతులు సుషుప్తియందు భేదదర్శనమును గలిగించు నీవు (మనసు - అవిద్య) లయము చెందుటచే ద్రష్ట యగు నేను (ఆత్మ) స్వయంజ్యోతిరూపుడనై, అద్వితీయుడనై ప్రకాశించుచుందు నని చెప్పుచున్నవి. అద్వితీయు డెప్పుడును నద్వితీయుడే. స్వాపావస్థయం దున్నవాని కంటె జాగ్రద్దశయం దున్నవాడు భిన్నుడు కానందున, స్వాపావస్థ యందు వలెనే జాగ్రద్దశయందును నే నద్వితీయుడను.

వి :- చూ. 'అథాస్మిన్ ప్రాణ ఏకధా భవతి తద్వైనం వాక్ సర్వై ర్నామభిః సహాప్యేతి' కౌషీ. ఉ. 3-3

వికల్పనా వాపి తథాఽద్వయా భవే
దవస్తుయోగా త్తదలాతచక్రవత్।
న శక్తిభేదోఽస్తి యతో న చాత్మనాం
తతోఽద్వయత్వం శ్రుతితోఽవసీయతే॥ ౧౦

తా॥ అలాత మనగా కొఱవి. అలాతమును వేగముగా త్రిప్పినపుడు చక్రాకారము భాసించును. కాని, యా చక్రము కొఱవి కంటె భిన్నము గాదు. వికల్పము మాత్రమే. భ్రమ (తిరుగుట; భ్రాన్తి) తగ్గగనే యా చక్రాకార వికల్పమున కధిష్ఠానమై యద్వితీయమైన యలాతము మాత్రమే యుండును. ఇట్లు పెక్కు వికల్పములు (వాస్తవములు కాని పదార్థములు) స్వప్నమున దోచినను నవి యధిష్ఠాన మగు ఆత్మ కంటె భిన్నములు గానందున, ఆత్మ అద్వితీయుడు. భ్రమ వలననే ఆత్మ యందు పెక్కు వికల్పములు గానవచ్చును.

దర్శన శ్రవణ మనన స్పర్శాది శక్తులు ఆ యా యింద్రియరూప - ఉపాధిభేదము వలన గలిగినవే కాని, ఆత్మ భేదము వలన గలిగినవి కావు. "అకృత్స్నో హి సః, ప్రాణన్నేవ ప్రాణో భవతి, వదన్ వాక్, పశ్యం శ్చక్షుః, శృణ్వన్ శ్రోత్రం, మన్వానో మనః, తాన్యస్యైతాని కర్మనామ

ధేయాని"—బృ.ఉ. 1-4-7;"ఏకో దేవో బహుధా నివిష్టః"-తై. ఆ. 3_14; "ఏకం స న్తం బహుధా కల్పయ న్తి"— ఋ. 10_114-5; "ఏక స్తథా సర్వభూ తా న్తరాత్మా"— కఠ. ఉ. ఇత్యాది శ్రుతు లాత్మ అద్వితీయు డని యేకకంఠముగా జెప్పు చున్నవి. కాన, ఆ యా ఇంద్రియ సంబంధము వలననే ఆత్మ పలువిధములుగ దోచును గాని, యది సత్యము కాదు.

మిథశ్చ భిన్నా యది తే హి చేతనాః
　　క్షయ స్తు తేషాం పరిమాణ యోగతః।
ధ్రువో భవే ద్భేదవతాం హి దృష్టితో
　　జగత్ క్షయ శ్చాపి సమ స్త మోక్షతః॥ ౧౧

తా॥ ఆత్మలు అనేకములు; పరస్పరభిన్నము లని కొందఱు చెప్పుదురు గదా! ఆత్మ అద్వితీయు డని చెప్పుట యెట్లు? ఈ వాదము సరికాదు. ఆ యాత్మలు పరస్పరము భిన్నము లగుచో,— "ఏవి భిన్నములో యవి పరిమితులు గలవి"- యను న్యాయము ననుసరించి ఆత్మలకు పరిమితత్వము ప్రాప్తించును. ఏవి పరిమితములో యవి నశించు స్వభావము గలవి - కాన,పరిమితములైన మూలాంకురములకు వలె ఆత్మలకు నాశము ప్రాప్తించును. మఱియు పరస్పరము భిన్నము లగుటచే - పరస్పరము భిన్నము లైన ఘట పటాదులకు వలె

నాశము ప్రాప్తించును. ఇంతే కాదు. భేదపక్షమున ఒక్కొక్క కల్పమున నొక్కొక్క యాత్మకు ముక్తి లభించినను గతకల్పములం దనేక జీవులకు ముక్తి వచ్చుటచే-క్రమముగా సమస్త జీవులకు ముక్తి వచ్చుటచేత భోగ్యపదార్థముల ననుభవించు భోక్తలే కఱవైనందున భోగ్యపదార్థములకు, జగత్తునకు క్షయమే సంభవించును. కనుక, ఆత్మ నానాత్వ వాదము యుక్తిసహము గాదు.

న మేఽస్తి కశ్చిన్న చ సోఽస్మి కస్యచిత్
యతో ఽద్వయోఽహం న హి చాస్తి కల్పితమ్।
అకల్పిత శ్చాస్మి పురా ప్రసిద్ధితో
వికల్పనాయా ద్వయ మేవ కల్పితమ్॥ ౧౨

తా॥ నే నద్వితీయుడ నగుటచే నాకంటె దక్కువవారు గాని, అధికులు గాని, సమానులు గాని లేరు. నా కెవరును లేరు; ఎవరికిని సంబంధించిన వాడను కాను. జగత్తు కల్పిత మగుటచే వాస్తవముగ నదియు లేదు. కల్పిత వస్తువునకు పరమార్థసత్త ప్రమాణ-సిద్ధము గానందున నాయందు కల్పితమైన జీవేశ్వర జగద్భేదము గూడ వాస్తవము గాదు; తత్కాలాలంకారము మాత్రమే.

పదార్థము లన్నియు కల్పితము లందురు కదా! ద్వైతము వలె అద్వైతము కూడ నొక పదార్థమే గాన, అదియు కల్పి

తేమే గావలెను-అని యందు వేమో! అది సరి కాదు. ఏ కల్పన కైనను నొక యాధారము - అధిష్ఠాన ముండవలెను. నిరధి ష్ఠానమైన కల్పన యుండదు; కూడదు. ప్రమాణజన్య జ్ఞాన ముచే కల్పనలు బాధితము లైనపుడు బాధకు ఒక అవధి యుండవలెను. నిరవధికమైన బాధ యుండదు. ఈ యవధి - అధిష్ఠానము - సర్వకల్పనలకు పూర్వమే సిద్ధము; ఈ యధి ష్ఠానమే సర్వ కల్పనాబాధకు సాక్షి. ఇట్లు సర్వకల్పనలకు బూర్వమే సిద్ధమై, సర్వకల్పనా బాధ కవధిభూతమైసాక్షియై, శేషించు వస్తువు కల్పితము గానేరదు; స్వతః సిద్ధము. జగదాది సర్వకల్పనలు నశించినను శేషించెడి ఆత్మ కల్పితము గాక, అద్వయ శబ్దముచే(అతద్వ్యావృత్తి రూపముగ) జెప్పబడును. అద్వైత మనగా ద్వైతము కాని దని యర్థము. అంతియే కాని, అద్వైత మొక పదార్థ మని చెప్పుటయు యుక్తము కాదు. ఇట్లు సర్వ కల్పనలకు బూర్వమే సిద్ధమై, తరువాత మధ్యకాలమున సర్వకల్పనలకు సాక్షియై, తుదకు సర్వకల్పనా బాధకు సాక్షియై అధిష్ఠాన రూపుడనై విలసిల్లు నేను కల్పి తుడను గాను. పరిశేష న్యాయముచే సాపేక్షమైన- అనగా, అవధిరూప సాక్షి సాపేక్షమైన - యా ద్వయమే కల్పితము.

వి :- చూ. 8-4; 1-17; 216-49— "అధిష్ఠానావ శేషో హి నాశః కల్పితవస్తునః"—సూతసంహితా. 4-2-8.

వికల్పనా చాస్యభవే న విద్యతే
సదన్య దిత్యేవ మతో న నాస్తితా।
యతః ప్రవృత్తా తవ చాపి కల్పనా
పురా ప్రసిద్ధే ర్న చ తద్ధి కల్పితమ్॥ ౧౩

తా॥ పుట్టుక లేని యాత్మయందు (సత్పదార్థము కంటె భిన్నమైన) అసత్పదార్థకల్పనయు లేదు. ఆత్మ నిత్యుడు; కాన, ఆత్మకు నాస్తిత్వము లేదు.మనస్సు లేనిదే ఆత్మయందు సంకల్పము దయించదు; మనస్సు ఆగంతుకము (ఉత్పత్తి కలది) గాన స్వరూపసత్త లేదు. అట్టి సంకల్ప వికల్పాత్మక మగు మనస్సు ఏ యాత్మయందు కల్పితమో, ఆ యాత్మ వికల్పనార్హము గాదు.

అసద్ద్వయం తేఽపి హి యద్యదీక్ష్యతే
న దృష్ట మిత్యేవ నచైవ నాస్తితా।
యతః ప్రవృత్తా సదసద్వికల్పనా
విచారవద్వాఽపి తథాఽ ద్వయం చ సత్॥ ౧౪

తా॥ ఏది కంటికి గోచరించునో, యది ఉన్నది; గోచరింపనిది లేదు. గోచరించునది ద్వైతము. కాన ఉన్నది. గోచరింపక పోవుట వలన అద్వైతము లేదు— ఓ మనస్సా! ఇట్టి నీ యాశంక సరియైనది కాదు. ఉన్న దనుటకును, లేదనుటకును దర్శనమే కారణము కాదు. రూపరహితమై కంటికి

గనుబడని యంతమాత్రాన వాయువు లేదని చెప్ప నగునా! మేఘాచ్ఛాదితుడై కనుబడని సూర్యుడు లేడనవచ్చునా? వస్తువున్నను దర్శనసామర్థ్యము లేకయో, దర్శనయోగ్యత లేనందుననో గోచరింపదు. గోచరించినంత మాత్రమున ద్వైతము సత్యము గాదు. స్వప్నము నందు వలె దృష్టమై నష్ట మగుట వలన అసత్తే యగును. అద్వైతము దృష్టము కాకపోయినను ఉన్నది(సత్), లేదు(అసత్) అను వివాదాస్పద ద్వైతమున కాలంబనమై, సర్వకల్పనలకు అధిష్ఠానరూపమై, స్వతః సిద్ధమై యున్నదని యంగీకరింపవలెను. మఱియు, విచారము నిర్ణయము లేక ముగియదు. కాన, వివాదాస్పదమైన ద్వైత మద్వైతమున గాని విశ్రమింపదు. ఇది సర్పమా? జలధారయా? మాలికయా? అను విమర్శయందు అనుస్యూతమై వికల్పనాధిష్ఠానమైన రజ్జుజ్ఞాన మవధిభూత మైనట్లు, ఇది కార్యమా? కారణమా? యను ద్వైత వికల్పనాపరంపరల కధిష్ఠానమై అద్వైత బ్రహ్మవస్తువు సకల నిషేధావధిభూతమై విరాజిల్లు నని యంగీకరింపవలెను.

స దభ్యుపేతం భవతోపకల్పితం
విచారహేతో ర్యది తస్య నాస్తితా।
విచారహానాచ్చ తథైవ సంస్థితం
న చేత్తదిష్టం నితరాం స దిష్యతే॥ ౧౫

తా॥ దర్శన మాత్రముననే వస్తువు యొక్క సత్త్వము (ఉనికి) గాని, అసత్త్వము (లేకుండుట) గాని నిశ్చితముగాదు. కాన, విచారము జేసి నిర్ణయించుట యావశ్యకము. ప్రమాణ వ్యాపారముచే పర్యవసితమైన ఫల మిది యని నిశ్చయించెడి హేతురూప తర్కమే విచారము. రెండు వస్తువుల గూర్చిన సంశయము లేనిదే విచారము ప్రవర్తించదు. ఓ మనస్వీ! సద్వస్తువు లేదు – అని చెప్పు నీవు తన్నిర్ణయమునకై విచారము నంగీకరింతువా? లేదా? అంగీకరించుచో, సంశయము లేక విచారము ప్రవర్తించదు గాన, సంశయ సిద్ధికై వలసిన రెండవ యంశముగా, ప్రమేయముగా సద్వస్తు వున్నదని నీ వంగీకరించినట్లే యగును. విచారమునకు విచారయోగ్య ప్రమేయ ముండవలెను. ప్రమేయము లేనిదే విచారము ప్రవర్తింపదు. ప్రమాణసిద్ధమే ప్రమేయము. ప్రమాణసిద్ధమైన ప్రమేయమునకు బాధ యెట్లు? కాన, విచారసిద్ధికై సద్వస్తువును మీ రంగీకరించి నట్లే యగుచున్నది. అట్లుగాక, విచార సిద్ధికై సద్వస్తువు నంగీకరించ నందువా? సద్వస్తురూప ప్రమేయమే లేనందున, విచారమే ప్రవర్తించదు. విచారరూప తర్కము లేక సద్వస్తువు లేదని నీవు నిర్ణయించుటకు శక్యము గాదు. కాన, సద్వస్తువు యథాపూర్వము సిద్ధము. అట్లుగాక, విచారము విడిచి పెట్టుట కిష్టము లేనిచో, విచారమున కాలంబనమై సాక్షియైన సద్వస్తువు నంగీకరింపవలెను.

మఱియొక వ్యాఖ్యానము :-

సంశయము లేనిదే విచారము ప్రవర్తించదు గాన, ప్రమాణసిద్ధము గాక పోయినను, విచారనిమిత్తమై నీచేత కల్పితమైన ద్వైతమును రెండవ యంశముగా గ్రహించితిమి. ఆ ద్వైతమే లేనిచో, జగత్తుకు శూన్యత్వము ప్రాప్తించును. శూన్యమై ప్రమేయమే లేనందున విచారము చేయుట కవకాశము లేదు. విచారము చేయ నందువలన తత్త్వనిర్ణయమే జరుగక తత్త్వ మవిచారితమై, అనిర్ణీతమై యుండిపోవును. అందువలన పురుషార్థము సిద్ధింపదు. అట్లు తత్త్వ మనిర్ణీతమై యుండుట యుక్తము గాదందువా? విచారము చేసి నిర్ణయించినపుడు ద్వైత మంతయు సద్వస్తువు నందే పర్యవసించుట జేసి, సర్వవికల్పనాధిష్ఠానమై, సర్వమున కవధిభూతమై సద్వస్తువు సిద్ధించును. ఇట్లు సద్వస్తువే సత్యము; కల్పిత ద్వైతరూప విశేషాకార మసత్య మనియు నిర్ణీత మగును.

అసత్సమం చైవ సదిత్యపీతి చేత్
అనర్థవత్వా న్నరశృఙ్గ తుల్యతః।
అనర్థవత్వం త్వసతి హ్యకారణం
న చైవ తస్మా న్న విపర్యయేఽన్యథా॥ ౧౬

తా॥ "శ్రౌతం సత్ - అసత్సమం- అర్థక్రియా శూన్యత్వాత్ - నరశృంగవత్" ఏది ఆ యా క్రియలను నిర్వ

ర్తించుటకు కుపయోగపడునో, యది యర్థక్రియాకారి. ఏది అర్థక్రియాకారియో, యది సత్తు (ఉన్నది). ఏది కాదో; యది యసత్తు (లేనిది). నరశృంగ మర్థక్రియాకారి కాదు. కావున, అసత్తు. అట్లే శ్రుతిసిద్ధమైన సత్పదార్థ ముదాసీనమై యర్థక్రియాకారి కాదు; కాన, అసత్తు - ఓ మనస్వా! నీ యీ బౌద్ధవాదము సరికాదు. సద్రూపవస్తు వర్థక్రియాకారి కాకపోయినను, స్వభావసిద్ధముగా నున్నది అసత్ ఎట్లగును? మఱియు, అర్థక్రియాకారి యైన దెల్ల సద్రూపమే యను నియమము లేదు. కంటకాద్యభావము అడుగిడి ధారాళముగా నడుచుటకు గారణమై యర్థక్రియాకారి యగుచున్నది. అర్థక్రియాకారియైన కంటకాదుల అభావము సత్ [భావరూపము] కాదు గదా! ఇంతే కాదు. అర్థక్రియాకారిత్వము లేనిచోట అసత్త్వమే యను నియమమును లేదు. అర్థక్రియా నిర్వహణమునకు బూర్వ ముదాసీనవస్తువును దర్శించుచున్నాము కదా! అర్థక్రియకు బూర్వ ముదాసీన పదార్థ మున్నను, దానికి అర్థక్రియాకారిత్వము లేనందున, సత్త్వము లేదందువా? సత్త్వము లేనిది అసత్ అగును. అసత్తుచే అర్థక్రియా నిర్వహణము పొసగదు. అందుచే అర్థక్రియాకారిత్వ హేతువుచే ఉదాసీన వస్తువు నందు సత్త్వము - సత్త్వముచే అర్థక్రియాకారిత్వము - అని యీ రీతిగ అన్యోన్యాశ్రయ దోష మేర్పడును. కావున, అర్థక్రియాకారిత్వము వస్తువు యొక్క సత్త్వాసత్త్వములను నిర్ణయించ జాలదు.

అసిద్ధత శ్చాపి విచారకారణాత్
ద్వయం చ తస్మాత్ ప్రసృతం చ మాయయా।
శ్రుతేః స్మృతే శ్చాపి తథా హి యుక్తితః।
ప్రసిద్ధ్యతీత్థం న తు యుజ్యతే ఽన్యథా॥ ౧౭

తా॥ ఓ మనస్సా! ఆత్మ అర్థక్రియాకారి కానందున, అర్థక్రియాకారిత్వాభావ మను హేతువుచే ఆత్మయందు అసత్త్వమును సాధించుట న్యాయవిరుద్ధము. విచారప్రవృత్తికి గారణమై యాత్మ యర్థక్రియాకారి యగుచున్నాడు. ఇంతే కాదు.

"మాయాం తు ప్రకృతిం విద్యాత్ మాయినం తు మహేశ్వరమ్"— శ్వేత. ఉ. 4-10.

"మయాధ్యక్షేణ ప్రకృతిః సూయతే సచరాచరమ్"—
భ. గీ. 9-10

అని యీ రీతిగా శ్రుతిస్మృతులు ఆత్మ, లేక బ్రహ్మ మాయా సాహాయ్యముతో ద్వైతశబ్దవాచ్య భేదప్రపంచవ్యాప్తికి గారణమై అర్థక్రియాకారి యని చెప్పుచున్నవి. "తదనన్యత్వ మారంభణ శబ్దాదిభ్యః— (బ్ర. సూ. 2-1-14)అను బ్రహ్మసూత్రమున మాయాకల్పిత ద్వైతప్రపంచము బ్రహ్మకంటె అభిన్నము; వాచారంభణము మాత్రమే; పరమార్థసత్త కలది శం. ర. 13-59

గాదు; కారణమే సత్యము—అని న్యాయపూర్వకముగ నిరూపింపబడినది. ఇట్లు కూటస్థుడైనను మాయాసంబంధముచే జగద్ధేతువై ఆత్మ అర్థక్రియాకారి యగుటచే అర్థక్రియాకారిత్వాభావ మను హేతువు ఆత్మయందు దసిద్ధము(పక్షే హేత్వభావః); కాన, దుష్టము.

వికల్పనా చ్చాపి విధర్మకం శ్రుతేః
పురా ప్రసిద్ధే శ్చ వికల్పతోఽద్వయమ్।
నచేతి నేతీతి యదా వికల్పితం
నిషిధ్యతేఽత్రా ప్యవిశేషసిద్ధయే॥ ౧౮

తా॥ సర్వవికల్ప కారణ మగుటచే అద్వయు డగు ఆత్మ సర్వ వికల్ప యుక్తుడు కాడా? కాడు. అద్వయు డగు ఆత్మ సర్వవికల్ప కారణ మైనను, వికల్పాత్మక జగత్తు కంటె విరుద్ధస్వభావుడు, నిర్వికల్పుడు— అని "నేతి నేతి" (బృ.ఉ. **2-3-6**), "నేదం యదిద ముపాసతే"(కేన. ఉ. 4) ఇత్యాది శ్రుతివాక్యములు చెప్పుచున్నవి. నేతినేతీత్యాది వాక్యములు నిర్విశేష బ్రహ్మస్వరూపసిద్ధి కొఱకై సర్వవికల్పములను నిషేధించినవి. అద్వయాత్మను నిషేధించ లేదు.

అకల్పితే ఽప్యేవ మజేఽద్వయేఽక్షరే
వికల్పయన్తః సదసచ్చ జన్మభిః।

స్వచిత్త వాయాప్రభవం చ తే భవం
జరాం చ మృత్యుం చ నియాన్తి సంతతమ్॥ ౧౬

తా॥ శ్రుతిప్రసిద్ధుడై భేదవికార సంసర్గశూన్యుడు, అజుడు, అద్వయుడు, అక్షరుడు నయిన ఆత్మవిషయమై అస్తి (ఉన్నాడు), నాస్తి (లేడు) అనియు, కర్త యగునా? కాడా? కర్త యగుచో, సవిశేషుడా? నిర్విశేషుడా? అని యీ రీతిగా మూఢులై స్వచిత్తమాయాప్రభావ వశు లగుచు వికల్పించు వారు జన్మ, జరా, మరణాది ప్రవాహరూప సంసారమున బడి భ్రమించుచుందురు. ముక్తులు గారు.

భవాభవత్వం తు స చేదవస్థితి
ర్న చాస్య చాన్యస్థితిజన్మ నాన్యథా।
సతో హ్యసత్త్వా దసతశ్చ సత్త్వతో
న చ క్రియాకారక మిత్యతోఽప్యజమ్॥ ౧౭

తా॥ ఆత్మ అద్వయుడు, కూటస్థుడు - వికల్పములు బుద్ధిభ్రమ జనితములు - అను విషయము శ్రుతిసిద్ధ మగుటయే కాదు; న్యాయసిద్ధము గూడ.

ద్వైతమునకు భవత్వము (ఉత్పత్తి), అభవత్వము (అనుత్పత్తి) అను రెండును సంభవించు ననెదవేని యొక వస్తువునకు బరస్పర విరుద్ధ ధర్మద్వయము సంభవింపదు. కాన, యుక్తము గాదు. అందుచే ద్వైతమునకు భవత్వమే యని

చెప్పెదువా? అట్లైన ద్వైతమునకు తననుండి జన్మ సంభవింపదు గాన, అన్యము నుండి జన్మ నంగీకరింపవలెను. అన్యవస్తువు సత్పదార్థమా? లేక అసత్తా? సత్పదార్థ ముపాదాన కారణ మగు నేని,యది వికారము గలదియై అసత్తే యగును. అసత్తు ఉపాదానకారణ మందువా?ఉపాదానకారణమై అసత్తు ఉన్నదని యంగీకరించుటచే నది సత్తే యగును.మఱియు,ఘటోఽస్తిపటోఽస్తి-అని యీ రీతిగా కార్యములందు సత్పదార్థమే యనుగత మగుచుండుట జేసియు, అసత్- అనగా- శూన్యమనువర్తించక పోవుట వలనను, అసత్తు ఉపాదానకారణము కాజాలదు. స్వభావవైపరీత్యము లేనందున సత్పదార్థము ద్వైతముగా బరిణమించదు. అసత్తు నుండి భావపదార్థము (సత్)పుట్టదు గనుక, అసత్తు ద్వైతమునకు గారణము గాదు. కాన, భవత్వము (ఉత్పత్తి పక్షము) నిరూపింప శక్యము గాదు. ద్వైతమునకు అభవత్వము జెప్పెద మన్న, నిత్యము గావలసివచ్చును. ఇట్లు కార్య మగు జగత్తుకును,కారణ మగు ఆత్మకును గల స్వభావమును పరిశీలించుట జేసి, ఉత్పత్తి క్రియాకారకభావము (కార్యకారణభావము) బ్రహ్మకు జెప్ప వలను పడదు; మఱియు, న్యాయపరిశీలనము వలనను బ్రహ్మ జన్మరహిత మని తెలియును.

అకుర్వ ద్దిష్టం యది వాఽస్య కారకం
న కించి దన్య న్నను నాస్త్యకారకమ్।

సతో ఽవిశేషా దసత శ్చ సచ్ఛ్యుతౌ
తులాంతయో ర్యద్వ దనిశ్చయా న్న హి॥ ౨౧

తా॥ ద్వైత ప్రపంచోత్పత్తికి ఏది కారకమో (కారణమో) యది నిర్వ్యాపారమా? సవ్యాపారమా? నిర్వ్యాపారమందువా? సర్వము సర్వమునకు గారకము గావలసివచ్చును. సవ్యాపారమే యనుటయు పొసగదు. అక్రియము క్రియాసహితము గానేరదు. క్రియాసహిత మనుచో, నది నిత్యము గాన, సర్వదా కార్యప్రసక్తి యుండును. అనిత్య మనుచో, దానికి క్రియాసహిత కారకాంతరాపేక్ష, దానికి మరల నట్లే క్రియాసహిత కారకాంతరాపేక్ష— ఈ రీతిగా అనవస్థాదోషము సంక్రమించును. మఱియు, అక్రియ మగు బ్రహ్మ సత్తయి ద్వైతమునకు కారకమగు నందువా? కారణ మగు బ్రహ్మ నిర్విశేషము గాన, ద్వైతమున, విశేషములు లేక పోవలసి వచ్చును. అసత్ అయి కారక మగు ననినను, అసత్తు నిర్విశేషము గాన, ద్వైతమున విశేషములు లేక పోవలసి వచ్చును. మఱియు, కారకము అసత్తయినచో, తద్వ్యాపారము గూడ అసత్తే యగును! కారకము సత్పదార్థ మయి సవ్యాపారమయినపుడే కార్యోత్పత్తి యని సిద్ధాంతము. కాన, త్రాసు దండెము యొక్క చివరి భాగములు పైకి పోవుటకును, క్రిందికి పోవుటకును కార్యకారణభావము దుర్నిరూప్య మయినట్లు

అద్వయ బ్రహ్మకును, ద్వైతప్రపంచమునకును కార్యకారణ భావము నిశ్చయింప శక్యము గాదు.

న చేత్స ఇష్టః [illegible] ద్వ[illegible]యః
కథం భవః [illegible] వ్యవస్థితౌ।
విభక్త మేత ద్ద్వయ మవ్యవస్థితం
న జన్మ తస్మాచ్చ మనో హి కస్యచిత్॥ ౨౨

తా॥ ఒక వస్తువున కవస్థాంతరప్రాప్తి పరిణామవాదమున జెల్లును. అట్టి ప[illegible]మము పైన జూపిన దోషముల వలన సత్పదార్థమునకు గాని, అసత్పదార్థమునకు గాని పొసగదు. సద్వస్తు వెప్పుడును సద్వస్తువే; అసద్వస్తు వెప్పుడును అసద్వస్తువే యను వ్యవస్థ యున్నందున నీ రెండును విభక్తములయి పరస్పర సంసర్గ శూన్యములయి యెట్టి సంబంధము లేక యుండును. అట్టితరి ఓ మనస్సా! ద్వైతసంసారమునకు గాని, దేనికి గాని సృష్టి లేక పోవలసి వచ్చును.

అథాభ్యుపేత్యాపి భవం తవేచ్ఛతో
బ్రవీమి నార్థ స్తవ చేష్టితేన మే।
న హానివృద్ధీ న యతః స్వతోఽసతో
భవో ఽన్యతో వా యది వాఽస్తితా తయోః॥ ౨౩

తా॥ ఓ మనస్సా! అఖండము, అద్వయము నగు ఆత్మకు సహజముగ హానివృద్ధు లెవ్వియును లేవు. అద్వితీయ

మగుటచే నన్యము వలనను సంభవింపవు. ఒకవేళ ఆత్మ కున్న వని యంగీకరించినను, నా హానివృద్ధు లాత్మయందు సిద్ధము లయియే యున్నందున, నీ చేష్టితముల వలన బ్రహ్మభూతుడ నగు నాకు క్షతి గాని, వృద్ధి గాని యేదియు లేదు.

ధ్రువా హ్యనిత్యాశ్చ న చాన్యయోగినో
మిథశ్చ కార్యం న చ తేషు యుజ్యతే।
అథో న కస్యాపి హి కించి దిష్యతే
స్వయం చ తత్త్వం న నిరుక్తిగోచరమ్॥ ౨౪

తా॥ ధ్రువము లనగా స్థిరములు; కూటస్థములు, అనిత్యము లస్థిరములు. స్థిరములు నిర్వికారములు గాన, వాని కన్యముతో సంబంధము పొసగదు. అస్థిరములు క్షణికములు. వాని కన్య సంబంధ కాలపర్యంతము స్థితి యుండదు గాన, వాని కన్య సంబంధ ముండదు. కావుననే, వానికి పరస్పరము సంబంధము గూడ నుండదు. అందువలన వానియం దేకార్యము గలుగ నేరదు; ఏదియు దేనితో వాస్తవసంబంధము గలిగి యుండదు. వేదాంతవాక్య ప్రమాణసిద్ధమై ప్రమేయమైన ఆత్మకు అన్య సంబంధాభావ మెట్లు? అని ప్రశ్నించుటయు తగదు. జాతి గుణ క్రియాది ధర్మములు గల ఘట పటాది రూప ప్రమేయ ములనే శబ్దము బోధించును. జాతి గుణ క్రియాదులు శబ్ద ప్రవృత్తినిమిత్త ధర్మములు. నిరుపాధికమైన యాత్మతత్త్వము

నిర్విశేషము - అనగా జాతి గుణ క్రియాది ధర్మరహితము. కాన, శబ్దము ముఖ్యవృత్తి చేత ఆత్మతత్త్వమును బోధింపజాలదు. కాని, వెనుక నిరూపించినట్లు భాగత్యాగ లక్షణచే బోధించును. కాన, వేదాంతవాక్య ప్రమేయము ఆత్మతత్త్వమని యంగీకరించుటలో విరోధ మేమియు లేదు. ప్రమేయమయ్యును, ఆత్మకు అన్యసంబంధము లేదని చెప్పుటలోను విరోధము లేదు.

సమం తు తస్మాత్పతతం విభాతవత్
 ద్వయాద్విముక్తం సదసద్వికల్పితాత్।
నిరీక్ష్య యుక్త్యా శ్రుతితస్తు బుద్ధిమాన్
 అశేష నిర్వాణ ముపైతి దీపవత్॥ ౬౩

తా॥ ద్వైతప్రపంచము వాస్తవము గాదు. కాన, సద్రూపము గాజాలదు. ఉన్న యట్లు భాసించుట చేత కేవల మసద్రూపము గాదు. ఒకే వస్తువున పరస్పర విరుద్ధ ధర్మద్వయ ముండదు. కాన, సదసద్రూపమును గాదు. అందుచే సదసద్విలక్షణమై, అనిర్వచనీయమై యాభాసరూపము. అట్టి ద్వైతప్రపంచమునకు సాక్షియై అద్వయుడు, అసంగుడు, ఆనందరూపుడు, సదా స్వయంప్రకాశ స్వరూపుడు నగు ఆత్మ యొక్క సాక్షాత్కారము గలిగినంతనే, దీపము వెలిగినంతనే చీకటులు తొలగునట్లు, అవిద్యాంధకారము తొలగి వెంటనే మోక్షము (నిర్వాణము) సిద్ధించును.

అవేద్య మేకం య దనన్యవేదినాం
కుతార్కికాణాం చ సువేద్య మన్యథా।
నిరీక్ష్య చేత్థం త్వగుణగ్రహో ఽగుణం
న యాతి మోహం గ్రహదోష ముక్తితః॥ ౨౬

తా॥ ఆత్మతత్త్వము చక్షురాదులకు విషయము(గోచరమగునది) కాదు. సర్వసాక్షి యగు ప్రత్యగాత్మ అద్వయ బ్రహ్మకంటె భిన్నము గాదని యెవరు తెలిసికొందురో, వారి కాత్మతత్త్వ మవిషయ మయియే భాసించును. ఎవరు భేద దృష్టితో ఆత్మతత్త్వమును దర్శింతురో, యట్టి కుతార్కికులకు తమ తమ బుద్ధివైభవము కొలది, ఆ యాత్మతత్త్వము పరిచ్ఛిన్నముగ వేద్య (విషయ) మగుచుండును. వారికి శాస్త్రము (వేదము) ను గాని, అందు జూపబడిన యుక్తులను గాని బరిశీలించెడి ప్రయాస యుండదు. సత్త్వ రజ స్తమో గుణముల యందు గాని, తత్కార్యము లగు దేహాదికార్యము లందు గాని యభిమానము లేనివాడు— "ఆత్మతత్త్వము చక్షురాదులకు గోచర మయ్యెడి విషయము గాదు; అవిషయమే"-యని శ్రవణ మననాదుల ద్వారా పరిశోధించి తెలిసికొని అపరోక్షముగా ఆత్మసాక్షాత్కారమును బొంది - మోహకారణమగు అజ్ఞానము, తత్కార్యజాతము బాధింప బడుటచే - ఆనంద స్వరూపమున మగ్నుడై యుండును.

వి :- గ్రహదోషముక్తిః = కార్యసహితమగు అజ్ఞానము నుండి ముక్తి.

అతోఽన్యథా న గ్రహనాశ ఇష్యతే
విమోహబుద్ధే ర్గ్రహ ఏవ కారణమ్।
గ్రహోఽప్యహేతు స్త్వనల స్త్వనింధనో
యథా ప్రశాంతిం పరమాం తథా వ్రజేత్॥ ౨౭

తా॥ పూర్వము వివరింపబడిన విధముగా మిథ్యాజ్ఞాననివృత్తి (గ్రహనాశః) కి ఆత్మజ్ఞానము కంటె నతిరిక్తముగా మఱియొక హేతువు గాని, ప్రకారాంతరము గాని లేదు. 'నాన్యః పంథా విద్యతేఽయనాయ'— (శ్వే. ఉ. 3-8; 6-15) అనుచు శ్రుతి యీ విషయమునే బోధించుచున్నది. మిథ్యాజ్ఞాన మున్న నేమిః? అని యందురా? అదియే సర్వానర్థములకు మూలము. అవిద్యామూలకే మిథ్యాజ్ఞాన మున్నంతకాలము శరీరమునందు 'అహం' అనియు, గ్రహాదుల యందు 'మమ' అనియు నభినివేశము నివర్తింపదు. అయిన, నీ మిథ్యాజ్ఞాన మెట్లు నివర్తించు నందురా? జ్ఞానము అజ్ఞానమునకు నివర్తకము. మిథ్యాజ్ఞానమున కజ్ఞానము ఉపాదాన [మూల] కారణము. ప్రజ్వలనమునకు మూలకారణము లయిన కట్టెలు మొ॥ లేనియపుడు అగ్ని దానియంతట అదియే శాంతించు విధముగా మూలకారణ మయిన అజ్ఞానము నశించినంతనే మిథ్యాజ్ఞానము

దాని యంతట అదియే శాంతించును. ఇదియే పరమ శాంతి. ఇదియే ముక్తి. ACC NO 16

విమథ్య వేదోదధితః సముద్ధృతం
సురై ర్మహాబ్ధేస్తు యథా మహాత్మభిః।
తథాఽమృతం జ్ఞాన మిదం హి యైః పురా
నమో గురుభ్యః పర మీక్షితం చ యైః॥ ౨౮

Rs. 35=00

ఇతి శ్రీ పరమహంస పరివ్రాజకాచార్య
శ్రీ శంకరభగవత్పాదకృతౌ 181.482 SHA
సకల వేదోపనిషత్సారోపదేశసాహస్ర్యాం V-13
పద్యప్రబంధః సమాప్తః

తా॥ మహాత్ములగు దేవతలు పూర్వము క్షీరసాగరమును మథించి అమృతమును వెలికి దీసినట్లుగానే మహాత్ములు వేదసాగరమును మథించి యీ జ్ఞానామృతము నుద్ధరించి యపరోక్షముగా ఆత్మతత్త్వ సాక్షాత్కారము నొంది తరించిరో యట్టి గురువర్యులకు నమస్కారము. మఱియు నే మహాత్ముల యనుగ్రహము వలన వేదసాగరమును మథించి ఉపదేశ సాహస్రియను నీ జ్ఞానామృతమును వెలికి దీసి పరమార్థతత్త్వ సాక్షాత్కారమును బొందితినో, యట్టి గురువర్యులకు నమస్కారము.

వి :- గ్రహదోషముక్తిః = కార్యసహితమగు అజ్ఞానము నుండి ముక్తి.

అతోఽన్యథా న గ్రహనాశ ఇష్యతే
విమోహబుద్ధే ర్గ్రహ ఏవ కారణమ్।
గ్రహోఽప్యహేతు స్త్వనల స్త్వనింధనో
యథా ప్రశాంతిం పరమాం తథా వ్రజేత్॥ ౨౭

తా॥ పూర్వము వివరింపబడిన విధముగా మిథ్యాజ్ఞాననివృత్తి (గ్రహనాశః) కి ఆత్మజ్ఞానము కంటె నతిరిక్తముగా మఱియొక హేతువు గాని, ప్రకారాంతరము గాని లేదు. 'నాన్యః పంథా విద్యతేఽయనాయ'— (శ్వే. ఉ. 3-8; 6-15) అనుచు శ్రుతి యీ విషయమునే బోధించుచున్నది. మిథ్యాజ్ఞాన మున్న నేమి? అని యందురా? అదియే సర్వానర్థములకు మూలము. అవిద్యామూలక మిథ్యాజ్ఞాన మున్నంతకాలము శరీరమునందు 'అహం' అనియు, గ్రహాదుల యందు 'మమ' అనియు నభినివేశము నివర్తింపదు. అయిన, నీ మిథ్యాజ్ఞాన మెట్లు నివర్తించు నందురా? జ్ఞానము అజ్ఞానమునకు నివర్తకము. మిథ్యాజ్ఞానమున కజ్ఞానము ఉపాదాన [మూల] కారణము. ప్రజ్వలనమునకు మూలకారణము లయిన కట్టెలు మొ॥ లేనియపుడు అగ్ని దానియంతట అదియే శాంతించు విధముగా మూలకారణ మయిన అజ్ఞానము నశించినంతనే మిథ్యాజ్ఞానము

దాని యంతట అదియే శాంతించును. ఇదియే పరమ శాంతి. ఇదియే ముక్తి. Acc NO 16

విమథ్య వేదోదధితః సముద్ధృతం
సురై ర్మహాబ్ధేస్తు యథా మహాత్మభిః।
తథాఽమృతం జ్ఞాన మిదం హి యైః పురా
నమో గురుభ్యః పర మీక్షితం చ యైః॥ ౨౮

Ch. 35=00

ఇతి శ్రీ పరమహంస పరివ్రాజకాచార్య
శ్రీ శంకరభగవత్పాదకృతౌ 181.482 SHA
సకల వేదోపనిషత్సారోపదేశసాహస్ర్యాం V-13
పద్యప్రబంధః సమాప్తః

తా॥ మహాత్ములగు దేవతలు పూర్వము క్షీరసాగరమును మథించి అమృతమును వెలికి దీసినట్లుగానే మహాత్ములు వేదసాగరమును మథించి యీ జ్ఞానామృతము నుద్ధరించి యపరోక్షముగా ఆత్మతత్త్వ సాక్షాత్కారము నొంది తరించిరో యట్టి గురువర్యులకు నమస్కారము. మఱియు నే మహాత్ముల యనుగ్రహము వలన వేదసాగరమును మథించి ఉపదేశ సాహస్రియను నీ జ్ఞానామృతమును వెలికి దీసి పరమార్థతత్త్వ సాక్షాత్కారమును బొందితినో, యట్టి గురువర్యులకు నమస్కారము.

శ్రుతిమహితాం శ్రుతిసుభగాం
శంకర దేశికేంద్ర సంగీతాం।

సాహస్రీ మాంధ్రపద్యై
ర్వివృతాం తనోతు హైమవతీ॥

శ్రీ పరమహంస పరివ్రాజకాచార్య
శ్రీ శంకరభగవత్పాద విరచిత
ఉపదేశసాహస్రి యందు పద్యప్రబంధమునకు
ఆంధ్రవివృతి సమాప్తము.



## శంకర గ్రంథ రత్నావళి

1. ప్రథమ సంపుటము 40 ప్రకరణ గ్రంథములు — రు. 7-00
   అనువాదకులు : శ్రీ నిర్వికల్పానందస్వామి

2. ద్వితీయ సంపుటము : 5 ప్రకరణ గ్రంథములు. — రు. 8-00
   అనువాదకులు : శతావధానులు : శ్రీ వేలూరి శివరామశాస్త్రి.

3. తృతీయ సంపుటము : 5 ప్రకరణ గ్రంథములు — రు. 20-00
   అనువాదకులు : శ్రీహరి సాంబశివశాస్త్రి, యం. ఏ.

4. చతుర్థ సంపుటము : సర్వవేదాంత సిద్ధాంతసార (అచ్చులో)
   సంగ్రహము. 1,000 శ్లోకములు
   అనువాదకులు : శ్రీ సర్వా శివరామకృష్ణశాస్త్రి

5. పంచమ సంపుటము : సౌందర్యలహరి (అచ్చులో)
   ఆనందలహరి వివరణ 100 యంత్రములతో
   అనువాదకులు : శ్రీ ఈశ్వర సత్యనారాయణశర్మ

6. షష్ఠ సంపుటము : వివేకచూడామణి — రు. 15-00
   అనువాదకులు : శ్రీ వేమూరి సీతారామశాస్త్రి

7. సప్తమసంపుటము : విష్ణుసహస్రనామ స్తోత్రము, భాష్యముతో — రు. 20-00
   అనువాదకులు : బాలవ్యాస : శ్రీ వారణాసి సుబ్రహ్మణ్యశాస్త్రి

8. అష్టమ సంపుటము : శంకరుల స్తోత్రములు 31 — రు. 8-00
   అనువాదకులు : శ్రీ తాడేపల్లి రాఘవనారాయణశాస్త్రి

9. నవమ సంపుటము : శంకరుల స్తోత్రములు 30 — రు. 12-00
   అనువాదకులు : శ్రీ తాడేపల్లి రాఘవనారాయణశాస్త్రి

10. దశమ సంపుటము : శివానందలహరి, కనకదుర్గానందలహరి
    అనువాదకులు : డా॥ పోతుకూచి సుబ్రహ్మణ్యశాస్త్రి — రు. 8-00

11. ఏకాదశ సంపుటము : శంకరుల స్తోత్రములు-8 — రు. 12-00
    అనువాదకులు : శ్రీ తాడేపల్లి రాఘవనారాయణశాస్త్రి

---

సాధన గ్రంథ మండలి, తెనాలి - 522 201